# కర్మసిద్ధాంతము





రచయిత :

'కీర్తనకంఠీరవ' 'కవివతంస' 'కవితిలక' 'కథాభారతి'

'భక్తరత్న' 'గద్యసింహ' బిరుదాంకితులు, శ్రీలక్ష్మీనృసింహోపాసకులు

**కోట సుబ్బరాయగుప్తా భాగవతార్**

మూల్యము : రు. **130-00**

శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి ప్రియశిష్యులు



సాత్త్విక హృదయులు

శ్రీ కోట లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు

పెదకొండాయపాలెము.

# మాతా పితృ పితామహ ప్రణామములు

నన్ను కన్న జననీజనకులు ప్రేమహృదయులు, పరిపూర్ణ కరుణా స్వరూపులు, నాకు స్వేచ్ఛా స్వాతంత్రముల నిచ్చి కాపాడిన దైవ సమానులైన శ్రీమతి వేంకమాంబ, శ్రీ లక్ష్మీనారాయణులకు భక్తిపూర్వక శత సహస్ర ప్రణామము లర్పించుచున్నాడను.

మాకు ఆస్థిని, అందస్తును, గౌరవ మర్యాదలను ప్రసాదించి ముద్దుల మనుమనిగ తీర్చిదిద్దిన పెద్దలు, యుక్తి, శక్తి, భక్తి జనవశీకరణశక్తిగలిగి పెద్దకొండాయపాలెములో పురపౌరుల ప్రేమకుపాత్రులై తొంబదేడులు జీవించిన నా తాతగారైన శ్రీ కోట రామయ్యశ్రేష్ఠిగారికి భక్తిపూర్వక శతసహస్ర ప్రణామము లర్పించుచున్నాడను.

రచయిత

కోట సుబ్బరాయఃగుప్త

భాగవతార్

# శ్రీ సద్గురుస్వామివారి ప్రార్థన

శా॥ యోగానంద నృసింహా సద్గురు పదిన్
యోజించి ధ్యానించెదన్
భోగాసక్త విషణ్ణమానసములన్ పూరించు
ఓం శబ్ద వి
ద్యాగంభిర ఝరీసరిత్తరగలన్ వ్యావృత్తి
సద్వైత సే
వాగాధా పరివాహ సంచలన దీవ్యత్ప్రౌ
ఢీ సేపారగన్

రచన : సంయమీంద్ర



# శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి ప్రార్థన

ఓంకారాత్మక! విశ్వదీపక! మహాయోగీంద్ర హృన్మందిరా!
శ్రీంకారాయత! భక్తరక్షణకళా శ్రీనిత్య సంశోభితా!
హ్రీంకారోద్ధృతగర్జనాకులిత దైత్యేంద్రా! ఉపేంద్రా! హరీ!
ఐంకారప్రియ సంసృతీహరణ విద్యారణ్యపంచాననా!
క్లీంకారాశ్రయ సర్వమోహన జగల్లీలా వినోదప్రియా!
హ్రౌంకారస్థిత! మట్టపల్లి వనవాసా! నారసింహప్రభూ!

శ్రీ కేశవ తీర్థస్వామి
పిడుగురాళ్ళ, రామతీర్థ సేవాశ్రమము.



శ్రీ లక్ష్మీనృసింహకళావతారమూర్తి

శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారు

కపిలగిరి.

మార్కాపుర సమీపము :: ప్రకాశముజిల్లా

# కర్మ సంగ్రహః

దర్శనాచార్య, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, శాస్త్రవిశారద,
లాక్షణికశిరోమణి, విద్యా, భాషాప్రవీణ,

## శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గారు - గుంటూరు

1. శ్రీమాన్ జయతు ధీమాన్యః కర్మసిద్ధాంత గౌరవః
   వక్తా శ్రోతా కథాగుప్తః కథా కథన తత్పరః
2. సోయం జయతు యోగాత్మా యోగానంద రసాంతరః
   యోగి యోగానుభూత్యై చ జయతు కర్మసంగ్రహః
3. ఆణవ మల సంభిన్నం కార్మిక మల సంశ్రయం
   మాయీయ, మల, సంశ్లిష్టం జీవ మజీవ మాశ్రయె
4. కర్మప్రభావ ఆఖ్యాతః దైవలీలా విలాసితా
   అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం
5. గ్రహాణాం వక్రతాం సిద్ధాం పరివర్తయితుం వ్రతీ
   వ్యక్తి శక్తి సమాశ్లిష్టః శివశక్తి రతో భవేత్
6. ధర్మశక్తి స్వరూపస్య పరిజ్ఞానం నిరంతరం
   దుఃఖం నాశయతిత్యేవం ధర్మశాసన ముచ్యతే
7. ప్రశాంతినిలయం గచ్ఛ! శాంతాత్మా యది మానవ!
   ప్రయత్నఫల మాశ్రిత్య వ్రతీ భవ! సుఖీ భవ!
8. ఆప్తవాక్యం ప్రమాణం స్యాదనాప్త వచనం త్యజ
   ఆప్తానాప్తౌ కథం జ్ఞేయే? గుణాగుణ వివేకతః
9. శ్రీ కోట సుబ్బరాయేణ జ్ఞానాజ్ఞాన వివేకినా
   యోగ ప్రజ్ఞాను సారేణ రచితః కర్మ సంగ్రహః

ఇట్లు
జమ్ములమడక మాధవరామశర్మ
17—8—81

# విషయసూచిక

— గ్రంథ విషయ వివరము —

# గుప్తతత్త్వము

వేదవేదాంగముల సారాంశము, శ్రీ సద్గురుస్వామి జీవితానుభవము, మహాభక్తమణుల మనుగడ మహోన్నతమై వెలుగొందుటకు కారణము ఆదర్శ కవిపుంగవుల కవితావైభవమునకు నాంది. బ్రాహ్మణత్వమునకు పునాది. భారతీయుల సంస్కృతికి ప్రథమ సోపానము, మతముల ముఖ్యోద్దేశము మహాప్రవక్తలధ్యేయము, పరమ భాగవతులందరికి ప్రాణము. పంచభూతాత్మకమైన ప్రకృతికాధారము మాయను నిర్జించెడి మార్గము, మహాపాప భంజనమునకుపాయము. మానవుని మానసాహ్లాదమునకు ముఖ్యసాధనము. వివిధ శాస్త్రాధ్యయన ప్రయోజనము, ఆర్యపదసార్థకత, శ్రీ నరహరి నామస్మరణ, ధ్యాన, భజన,తపో, పారాయణాది కర్మలకాదర్శము. యజ్ఞ, దాన, తీర్థయాత్రా పర్యటనాది విధుల పరిణామ స్వరూపశక్తి, దేహ, మనో, రోగ, చింతావిముక్తి, సతి, సుత, బంధు, మిత్రాది వర్గప్రేమ పాశ బంధాల నిష్క్రమణము. కామినీ, కాంచన, కీర్తి, దాహశాంతి, ద్వైతదృష్టి పలాయనమంత్రము, బహుబంధలతాలవిత్రము మొదలైన మహాకర్మల నిర్వహణములయొక్క ధ్యేయము మూలము, గుప్తతత్త్వరహస్యమును గుర్తించి దర్శించి తదనుభూతి చెందుటకేనని పాఠకోత్తములకు మనవి.

గుప్తమై-భద్రమై అవ్యయమై అనంతమై త్రికాలసత్యమై నిత్య నిర్వికార పరబ్రహ్మానుభూతితో భాసిల్లెడి తత్త్వమైన దేవుని నరుడు దర్శించి తాదాత్మ్యమొందుటకు, ఈ కర్మసిద్ధాంతములలోని సారాంశమును తెలిసి చరించి జన్మరాహిత్యమునొందవలెనని గుప్త తత్త్వ రహస్యసందేశ సారాంశసూక్తి.

రచయిత

సోమవారము
17-8-81

శ్రీ కోట సుబ్బరాయ గుప్త
భాగవతుడు

# శ్రీ లక్ష్మీనృసింహోపాసకులు



రచయిత

కోట సుబ్బరాయగుప్త భాగవతుడు

# అంకితము

సకల చరాచర జీవకోటి హృదయాంతరములయందేకమై, నిత్య సత్య నిర్వికార స్వరూపమై, వేదములకు మూలమై, భూ, నభోంతరాళములందెల్లడలనిండినదై, ప్రణవస్వరూపమై, ప్రకృతి కతీతమై, ఆదికాదియై, యనాదికి పునాదియై, సత్యమునకు మూలమై, చలనశక్తికి శక్తియై, వెలుగునకు వెలుగై, యాద్యంతములులేని నిరాకార నిర్గుణ నిత్యానందస్వరూపమై, సకలలోకసదాశ్రయమై, సర్వమత ప్రవక్తల ధ్యేయాకారమై, సమస్తమునకాధారమై, సృష్టిస్థితిలయకర్తలకు కర్తయై. స్వయంవ్యక్తమై, యఖండ మండలాకారమై, శిష్టజనోద్ధరణమునకై పరమశాంతిస్థానమైన, అహోబలమహాక్షేత్రమున దానవ సార్వభౌముని దర్బారునందున్న యుక్కుస్తంభము నందావిర్భవించిన శ్రీ శ్రీ శ్రీ నృసింహస్వామివారి, దివ్య భవ్య నవ్య కళావతార సంపన్నులు, యోగసమాధి నిష్ఠాగరిష్ఠాత్ములు, కరుణాస్వరూపులు, ధర్మరక్షకులు, గోపరిపాలనాదక్షులు, జీవుల జన్మాంతర భవితవ్య స్థితి గతి మతి స్వరూప స్వభావాదులను యథాతథముగ సువ్యక్తమొనర్చి సర్వుల సర్వసంశయరహితులనొనర్చెడి మహామహిమాన్వితులు, దివ్యావ్యయ మహాయోగసమాధిస్థితియందుండి స్వయంశక్తిప్రభావముతో, తన భక్తులను, కవచమురీతి సదారక్షించుచు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ భాండాంతర మహీమండల భరతఖండాంతర్గత శ్రీ కపిలగిరి మహాక్షేత్ర పాలకులై సహస్రకోటిమణికాంతిపుంజ ప్రభావిరాజితులైన మద్గురు, సద్గురు శ్రీ శ్రీ శ్రీ యోగానంద నరసింహస్వామివారి దివ్య పద సరోజద్వయమునకు భవబంధవిముక్తికై భక్తితో నే నీ పొత్తము నంకితమొసంగి సర్వదోషసంస్కరణమునొంది మనఃపూర్వక ప్రణామములర్పించుచున్నాడను................

శిష్టజనవిధేయుడు

కోట సుబ్బరాయగుప్తభాగవతుడు.

# అమృతం-విషం!

అనంత విశ్వనియంతనైన నేను అందరికీ అంతరాత్మను (గీత 10/20) నేను ప్రాణుల గుండెలలో ఉండటానే గతస్మృతి-వస్తు-విషయపరిజ్ఞానం-ముందరి ఊహ-ఇవికలుగుతున్నై (గీత 15/15) నేను అందరికీ కనుపించనుసుమా! దానికి కారణం నా యోగమాయ. (ప్రకృతిద్వయం-గీత 8/25) అపరాప్రకృతి పరాప్రకృతి ఈ రెండే నా మేలిముసుగులు. నేల-నీరు-నిప్పు-గాలి-ఆకాశము-మనస్సు-బుద్ధి-అహంకారం. ఈ మొత్తం నా అష్టవిధ అపరాప్రకృతి (గీత 7/4). ఈ జగత్తుకు ఆధారమైన జీవ (అణు) శక్తి నా పరాప్రకృతి (గీత 7/5) ఈ రెండే ప్రపంచానికి కర్మ ప్రవృత్తిహేతువులు. ఈ ప్రపంచానికి ప్రభవప్రలయాలు రెండూ నేనే (గీత 7/6) ఈ ప్రకృతిద్వయగుణగణం వల్లనే పరవశంగా 'కర్మ' అంతాజరుగుతున్నది. అందుకే ఒక్కక్షణంకూడా 'కర్మ' చేయకుండా ఏ ప్రాణీ ఉండదు-ఉండజాలదు కూడా (గీత 3/5) ఇదే కర్మసిద్ధాంత సారాంశం; ఇదే ఈ గ్రంథ ముఖచిత్రం!

ఓ మనిషి! నీకు! కర్మ చేసేహక్కుమాత్రమే ఉన్నది. ఎంతమాత్రం, ఫలితంమీద హక్కులేదు- వద్దుకూడా(గీత 2/47) అందుకే నియమంగా నిస్స్వార్థంగా చేయతగిన 'కర్మ' ను చేస్తూనే ఉండు (గీత 3/8) మంచి, చెడు - ఈ రెంటిలో నీకేదికావాలో అదేచేయ్, మంచికిమంచే చెడుకుచెడే ఫలితం (గీత 8/63) ఈ కర్మసిద్ధాంత రహస్యాన్ని ఈ గ్రంథాధ్యయనం ద్వారా గమనించి ప్రవర్తించు !!

ఉపాస్యదైవంగా-నారసింహంగా ఈ సుబ్బరాయాఖ్య రచయిత హృదయంలో ఉన్న నాప్రేరణతోనే ఈ గ్రంథస్థమైన భావవాహిని పొర్లి ప్రవహించింది. ''సర్వే జనాః సుఖినోభవంతు'' అందరూబాగుండాలి అనే ప్రధానలక్ష్యంతో వెలువడిన ఈ కర్మసిద్ధాంత మహా గ్రంథంలో ప్రతిపలుకూ మంచివారికి అమృతం, చెడ్డవారికి మహావిషం ఔతుంది. ఈ కృతి తరతరాల నరజాతికి హితహేతువు కావాలనే నా కుతూహలం !!!—

- నీ అంతరాత్మ -

- ఈ పైి సమీక్షా - సందేశదాత రచయిత -

శ్రీమాన్ డాక్టర్. ధనకుధరం లక్ష్మీనరసింహాచార్యులు
సంపాదకులు :- శ్రీ వాణీ గ్రంథమాల-తెనాలి.



శ్రీ కోట సుబ్బరాయగుప్తగారు హరికథకులు-భక్తులు. ఆస్తిక్యభావముతో ప్రేరితులై తన కలవడిన అనర్గళమైన భాషలో భిన్నభిన్న విషయములకు సంబంధించిన వ్యాసావళిని కర్మసిద్ధాంతము పేరుతో ప్రచురించి పాఠకులకందచేయుచున్నారు. పాఠకులు చదివి ఆనందింతురుగాక. ప్రణతార్తిహరుడైన పరమేశ్వరుడు వీరికి వీరి కుటుంబమునకు సర్వశుభములు చేకూర్చుగాక! --

కూచిపూడి
ది. 19-4-81

గోపదేవ్



"కళాప్రపూర్ణ"
డా॥ శ్రీ దివాకర్ల వేంకటావధాని
ఎం. ఏ (ఆనర్సు) పి. హెచ్ డి.

శ్రీ కోట సుబ్బరాయగుప్తభాగవతార్ రచించిన కర్మసిద్ధాంతము అను గ్రంథమును చదివి యానందించితిని. ఈ గుప్తగారు యోగశక్తిస్వరూపులైన సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామివారి భక్తులు. ఆ సద్గురుభక్తి ఈ గ్రంథమున సర్వాంతర్యామియై గోచరించును. గురుభక్తి యఖండ ప్రభావసంపన్నమైనది. దైవభక్తికిని గురుభక్తికిని భేదములేదు. "భక్తిః కిం న కరోత్యహో వన చరో భక్తావతంసాయతే" యని శ్రీ జగద్గురు శంకరభగవత్పాదులసూక్తి.

కర్మ చాలబలీయమైనది దానివలననే పాపపుణ్యములు, నరకమోక్షములు, భయాభయములు, ఆపత్సంపదలు కలుగుచుండును. "నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృ" త్తని భగవంతుడు గీతలో చెప్పియుండెను. అతడు గీతలోకర్మల అనారంభమును, సన్యాసమును బోధించియుండలేదు. ఫలాసక్తిలేకుండా కర్మముల నాచరింపవలయుననియే ఆయన ప్రబోధము. "కర్మమె దేవతజనులకు, కర్మమె సుఖదుఃఖములకు, గారణ" మని పోతన కూడ చెప్పియుండెను.

శ్రీ భాగవతార్ గ్రంథమునకు కర్మసిద్ధాంతమని పేరుపెట్టినను ఇందు జ్ఞానము, భక్తి, ధర్మము, ధ్యానము మున్నగువిషయములన్నింటిని వివరించియుండిరి. గ్రంథము చదివిన తరువాత కర్మబలము నెఱింగి సత్కర్మపరాయణులు కానివారుండరు. ఈ గ్రంథరచయిత గుప్తగారి లోకానుభవమపారమైనది. ఆ యనుభవమున కక్షరరూప మీ గ్రంథము. వారిందాస్తికులయు నాస్తికులయు, భక్తులయు రక్తులయు, వివిధ మతానుసారులయు సిద్ధాంతములను చక్కగా పరామర్శించియుండిరి. ఈ గ్రంథము, సద్గ్రంథముల పఠనమువలనను, పెద్దల సేవలవలనను, స్వానుభవమువలనను వీరు సంపాదించిన జ్ఞాన విజ్ఞానములకు నిధానమైయున్నది. ''పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడన'' మ్మను సర్వసద్గ్రంధసారమును వీరిందు నిదర్శనముగా నిరూపించియుండిరి''

ఈ గ్రంథములో వీరచ్చటచ్చట నిచ్చిన మహనీయుల చరిత్రలు, బోధలు, దృష్టాంతములు చదవరుల మనస్సులకెంతో ఆహ్లాదమును కలిగించి విషయము వారి హృదయములందు గాఢముగా హత్తుకొను నట్లొనర్చుననుటలో సందేహములేదు. వీరెందరోకవుల సూక్తులను, సామెతలను, లోకోక్తులను, జాతీయములను ఇందు సందర్భానుగుణముగా చేర్చియుండిరి. విరామము లొసంగిన వారికందఱికి వీరీగ్రంథము నందజేయుదురు కావున నిది సర్వాంధ్రదేశవ్యాప్తినిపొంది బహుళప్రచారమునకు రాగలదు. అందువలన కలుగుమేలు వేఱుగా చెప్పనవసరములేదు. సద్గ్రంథము సన్మిత్రునివంటిది కదా!

ఈ గ్రంథమునందలి భాష సరళమును, ధారాళమును, విషయవ్యక్తీకరణ దక్షమునై యున్నది. శ్రీ భాగవతార్‌గారనేక విషయములు తెలిసినవారగుటచే వానినెల్ల నిందు చక్కగా వివరించిరి.

ఇంతచక్కని గ్రంథము నింత విపులముగను సర్వసుబోధముగను రచించిన శ్రీ భాగవతార్‌గారి నభినందించుచున్నాను--

హైద్రాబాద్,
23-4-81

దివాకర్ల వేంకటావధాని

డా॥ శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య
M. A , P. H. D., R. M. P. (H)
14-38-2 రాధామాధవమ్, ముప్పిడికాలని
విశాఖపట్నము-530 002 ఆంధ్రప్రదేశ్ ది. 30-4-81

# అభిప్రాయము

పండిత ప్రకాండులు, సూక్ష్మదృష్టి, లోకోద్ధరణ కారణోపాయాన్వేషణా వ్యగ్రులు అగు శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతార్ రచించిన "కర్మసిద్ధాంతము" అనబడు ఉద్గ్రంథమును పరిశీలించితిని. ఆమూలాగ్రము ప్రాచీనసాంప్రదాయ గురువుల మార్గములను చక్కగా సంతరించి ఇచ్చిన ఈ గ్రంథము అమూల్య విషయములతో విరాజిల్లుచున్నది. పెద్దల వివిధమార్గముల సమన్వయముకొరకై వేదాంత మహారణ్యవీధులలో వీరుచేసిన సుదీర్ఘసంచారము మెచ్చదగినది. ధర్మము యొక్క ప్రాముఖ్యము, ధర్మచ్యుతివలన కల్గుదుఃఖము, దైవకృపకు ధర్మాచరణ యొక్క ఆవశ్యకత మున్నగువిషయములు వివరముగా అక్షరస్వరూపముదాల్చినవి. మనస్సు, మాయ, మాధవుడు, క్షేత్రము, పాత్రత, మున్నగునవి వివిధ గురు-శిష్య సంప్రదాయ సారాంశములు, ఈ గ్రంథ రచనయందు వీరుచూపిన ఓర్పు, పెద్దల వాక్యములకూర్పు, వస్తుగౌరవమునుగూర్చి వేనోళ్ళ చాటుచుండుటయేకాక వీరికి ఆ వస్తువునందుగల గౌరవమెట్టిదో అనువిషయమునుగూడ నుద్ఘోషించుచున్నవి. శ్రీరామకృష్ణపరమహంసగారు చెప్పిన నాల్గురకముల మానవుల వివరణము, దేవుడున్నాడా? లేడా? అనువిషయమునకై వీరుచూపిన యుక్తులు, దేవుడు నిర్గుణుడా? నిరాకారుడా అను విషయమును చర్చించిన విధానము, సగుణము సాధకునకు సోపానమగునని నచ్చచెప్పిన విధానము మిగుల రమ్యముగా శాస్త్రసమ్మతముగా నున్నవి.

అన్నిటికన్న పరమపవిత్రమైన విశేషమేమనగా, పోతనభాగవతము మున్నగు సజీవ తేజోరూపములగు గ్రంథములనుండి చక్కనిపద్యముల నుదహరించి వానికి ప్రసక్తి కల్పించుట —

మానవుడు సత్కార్మాచరణాసక్తివలన భక్తియోగముపొందగలడు. ఎంత కాలము సత్కార్మాచరణాసక్తియుండునో, అంతకాలము జీవులయందు, దేవునిసజీవ విగ్రహములను సాధకుడుచూచి యుపాసించును --

కర్మ, జ్ఞాన, భక్తి యోగములు, చక్కెర తయారుచేయుట, దీనిని తయారు చేయు విధము, వీనిముఖ్యార్థములవలె అవినాభావసంబంధములు ఒకదానిని విడచి మిగిలిన రెండును ఉండవు. --

''అభ్యాసమువలనజ్ఞానము,జ్ఞానమువలనధ్యానము,దానివలన కర్మఫలత్యాగము దానివలన శాంతియు కలుగును 'అని భక్తియోగమున శ్రీకృష్ణభగవానుడుపదేశించెను ఈ శాంతి అనంతరమైనపుడు కలుగునదే శ్రేయస్సు. అనంతరమనగా, కర్మజ్ఞాన భక్తిమార్గముల నడుమ అంతరములేనిది.

ఈ విధమైన సద్విషయములతో నిండియున్న ఈ బృహద్గ్రంథము, జిజ్ఞాసువులకు ఆత్మసాధనరంగమై చక్కని పరిశ్రమచేయుటకై పనికివచ్చుననుటలో సందేహములేదు.

భావనామయమైన వీరిభావ పరిపాకమునుండి మధురములై అనేకములైన భక్ష్యములవంటి గ్రంథములు ఇంకను వెలువడి చదవరుల జిహ్వలకు రుచికలిగించు చుండవలెనని దీనికితగిన దేహపటుత్వము, మానసికపటుత్వము ఆయురారోగ్యైశ్వర్య ములు వీరికిని వీరియాశ్రితులకును భగవంతుడు ప్రసాదించుగాకయని ఆశంసనము చేయుచున్నాను —.

ఇట్లు

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

---

అవధానిశేఖర, ఆశుకవికేసరి, ప్రౌఢభారతి, కవితాసుధాకర,
సాహితీప్రవక్త, 'సరస్వతీకంఠాభరణ'

డా॥ ప్రసాదరాయకులపతి — హిందూకళాశాల
అధ్యక్షులు - రచయితల సహకారసంఘము, — గుంటూరు
తంత్ర విజ్ఞాన పరిషత్. — ది. 12-5-81

## సిద్ధాంత దర్శనము

శ్రీ కోట సుబ్బరాయగుప్తగారు చిరకాలముగా నాకు తెలిసినవారు, హరికథా ప్రవచనమున రాటుదేలిన మేటిభాగవతులు. మనోవాక్కాయ కర్మలయందు పరిశుద్ధ

మైన స్థితిగలవారు. శ్రీ నృసింహదేవతారాధన తత్పరులు. అటువంటివారు గనుకనే ఇటువంటి గ్రంథమును రచింప తలపెట్టి కృతకృత్యులైరి.

గ్రంథ రచయిత జననీజనకులు శ్రీ కోట వెంకమాంబా లక్ష్మీనారాయణ మూర్తులిర్వురు తిరుపతి వేంకటేశ్వరుని భక్తులు. ఎవరికే ఆపదవచ్చినను వెంటనే పూజామందిరముకడకేగి ఆశ్రితావనుడైన ఆ జగత్పతిని మనఃపూర్వకముగా ప్రార్థించెడివారు ఆ ప్రార్థనల ఫలితముగా ఆ కష్టములు తీరిన సంఘటనలనేకములు.

శ్రీ సద్గురుయోగానంద నరసింహస్వామి వీరి కుటుంబ గురువు. సుబ్బరాయ గుప్తగారును వారి ఆశీర్వాదముతో తెలుగుదేశములందలి మహాక్షేత్రములన్నింటి యందును భక్త ప్రహ్లాదచరిత్ర కథాగానముచేసి విజ్ఞులకు ఆనందానుభూతి కలిగించి నారు. అట్టి పరమ భాగవతుని రచన యిది.

లోకమున పాపముచేసినవారు దాని ఫలితమననుభవింపక తప్పదనియు పశ్చాత్తప్తులై పరిశుద్ధులుగానివారిని దేవుడుగాని, దేవునికుమారుడుగాని రక్షింపరనియు గుప్తగారు పలికినారు అదేవిధముగా కాళిదాసువలె కవిత్వముచెప్పినను, త్యాగరాజు వలె గానమొనర్చినను, శంకరులవలె తత్త్వప్రచారముచేసినను కామినీ-కాంచనకీర్తి దాహములతో తపించినవాడు సుఖశాంతులను బడయజాలడను సత్యమును వారందించినారు.

ఈనాడు తండోపతండములుగా సమాజమున విరజిమ్మబడుచున్న పనికిమాలిన పుస్తకములను గురించి వీరు చర్చించినారు. ఆస్తిక నాస్తికజనుల తత్త్వములను వివరించినారు. ప్రాచీనములైన పురాణకథలకు లోకములో చేయబడెడి బహువిధములైన వ్యాఖ్యానముల స్వరూపమును సంధానించినారు. ఇది యది యననేల ప్రపంచములోని బహువిషయములను ప్రవచించినారు.

హిందూమతములో ప్రతికథకు వేదాంతపరమైన అన్వయముచేయుటకు కావలసిన వాఙ్మయమున్నది. ఒక్కొక్క పదమునకు వివిధార్థములను ప్రతిపాదించగల భాషలున్నవి. అందులో తెనుగుభాష అగ్రగణ్యము. అనన్యమైన ఈ శక్తివల్ల తెనుగు కవి చక్రవర్తులు దేవుని దేవునిగుణశక్తులను ప్రబోధించుటకు మహత్తర సాహిత్యము సృష్టించిరని గుప్తగారు స్థాపించుచున్నారు.

వీరీవిధముగా ఎన్నో అద్భుతమైన విశేషములను తమ స్వానుభవము నుండి లోకదర్శనమునుండి భావించి వానికొక రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దాకారము

కల్పించి భారతీయతాత్త్విక ప్రతిభచే ప్రాణముపోసి మనకందించినారు. సూక్ష్మముగా చెప్పవలెనన్న ఈ గ్రంథమొక చక్కని తత్త్వదర్శనమని నిశ్చయముగా చెప్పవచ్చు. ఇట్టి రచననందించిన సుబ్బరాయగుప్తగారు బహువిధముల ప్రశంసార్హులు –

ఇట్లు

డా॥ ప్రసాదరాయకులపతి

---

# మన గ్రంథములు యేమిచెప్పుచున్నవి

తత్కాలమునగాని, భవిష్యత్కాలమునగాని సుఖమువచ్చునని ఆశతో నరులేపనులు చేయరాదు. తత్కాలమున సుఖము కలుగునంతమాత్రమున విధివిహితమైన కర్మలను వదలివేయరాదు. తత్కాలమునందు యెంత కష్టము నష్టము కల్గినను విధివిహితమైన కర్మలను వదలివేయరాదు. విధివిహితముగాని కర్మలు తత్కాలము లందును కాలాంతరములందును సుఖమిచ్చువానివలె కన్పించినను ప్రయత్నముచేసి వానిని వదలివేయవలెను.

ఈ విధముల్తైన కర్మవిధులను విధానములను. వానిఫలములను యథాతథముగ విపులముగ విశేషముగ గ్రంథకర్తగారీ గ్రంథమును పొందుపరచిరి.

తనకు యైహిక సుఖములనిచ్చెడి సతిసుతాది బంధువర్గములనే ప్రేమించలేనివాడు ప్రత్యక్షములోలేని దేవుని యెట్లు ప్రేమించగలడు?

ఏవిధమైన ప్రతిఫలాపేక్షలేక నరుడు ప్రేమించుట భక్తియనెదరు. భక్తి జ్ఞాన వైరాగ్య తత్త్వములకు సైతము నరుడొనర్చెడి కర్మయే పునాది.

నరుడు తన జన్మచే అనగా జన్మించినది మొదలు తానెట్టి కర్మ చేయుటకు పుట్టియున్నాడో, ఆ యా కర్మలు చేయుచుండును. స్వధర్మమును వీడి పరధర్మములను నరులొనర్చకూడదు. ఎంతగొప్ప ఫలితములు, సుఖములను చేకూర్చునని తోచినను యా పరధర్మములు భయావహములు. అని మన కర్మసిద్ధాంతము బోధించుచున్నది.

మానవుడొనర్చిన కర్మయే వివిధరూపములందు భాసిల్లుచున్నది. ఒకే ప్రేమ! భార్యను తనవలె ప్రేమించెడివానిది కామము. తనకంటే భార్యను యెక్కువగానెంచి

తాను లోబడినవాని ప్రేమను మోహమని తెలియవలెను. ఎదుటివాని సుఖమును పరిగణింపక తన మోహమును తీర్చుకొనువాని ప్రేమ రాక్షసప్రేమ యనవలెను. తనకు యెట్టిలాభము లేకున్నను పరులశ్రేయస్సుకొరకై జీవించువాని ప్రేమ త్యాగ మనబడును.

ఇట్టి త్యాగదృష్టితో గురుహరిభక్తి శక్తితో "కర్మసిద్ధాంతము" అనెడీ రచన మును గుప్తాగారు సంపూర్తిచేసి మిక్కిలి కృషితో భక్తజనులయొద్ద ధనసేకరణ మొనర్చి ముద్రణము చేయించి పాఠకలోకమున కందించుటెంతయో ముదావహము.

హరిద్వారమునందలి గంగాప్రవాహమువలె నడచిన గుప్తగారి కర్మసిద్ధాంత మును నేను వారుచదువగా విన్నాను. ఫలితములు భయంకరములై కన్పించెడి, స్వార్థపరత్వము, దంభము, ద్వేషము, మూర్ఖత్వములతో, స్త్రీ, ధన, కీర్తులపైగల దురాశతో గణించిన కీర్తి, ధనము, అధికారము యెంత నిష్ప్రయోజనములో చక్కగా సర్వులకు బోధపడెడి రీతిలో రచనమును యొనర్చి లోకోపకారమొనర్చిరి. ధర్మప్రబోధమువలన లోకమునకు మేలు గలుగగలదని ఆసించుట ధర్మమేగదా!

కాలక్రమమున ఈ గ్రంథమును పఠించినవారు వక్రమార్గములనువీడి సక్రమ మార్గములందు నడచినయెడల, మన జన్మములు ధన్యవంతములగునని గ్రంథకర్త భావించుటయును సమంజసము సహజము.

జగద్ధితముగ రచనజేయబడిన యీ గ్రంథము ప్రసిద్ధమై లోకమునకు మేలు చేకూరుగాక యని నే కోరుచున్నాను....

ఈ గ్రంథరచయిత శ్రీ కోట సుబ్బరాయగుప్తాభాగవతులు గారొనర్చిన శ్రీ హరికథాగానమును ది. 19-7-80న తెనాలిలోగల శ్రీ వాసవీ కల్యాణమందిరము నందు విని, ఆనందావేశములను నేను పొందిన మధుర మహాపర్వ శుభసమయము నందులేచి గుప్తాగారి భక్తిపారవశ్యపరమైన మధురప్రవచనమును సాహితీ సౌందర్య శక్తిని వివిధ వేదాంతరహస్యవివరములను నచ్చచెప్పిన విధానమును, ఆ మేధాశక్తి కచ్చెరువొంది మహాజనసమక్షమున, "భక్తరత్న" అనెడి బిరుదమును వీరికి వాగ్దేవి మహాప్రేరణతో ప్రసాదించి యాత్మానందమునొందితిని.—

శ్లో॥ జయన్తితే సుకృతినో
రససిద్ధా కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే
జరామరణజం భయం॥

తెనాలి

19-7-80

ఆచార్య, పుచ్చా వేంకట్రామయ్య

# శ్రీ నరహరికృపాశక్తి

శ్రీ కోట సుబ్బరాయగుప్తాభాగవతులుగారు కోదాడులో శ్రీ అఖిలాంధ్ర సాధు పరిషత్సభలలో ది. 9-1-81 న నాకు సమాగమమైరి. ఆ సాధు సభలలో నన్ను జూచి శ్రీ సద్గురు నృసింహా! యని భక్తి ప్రణామములొనర్చిరి. ఆ పరిచయ భాగ్యముతో ది. 13-5-81 న, అంగలకుదురు దాసకుటి లో "శ్రీ సీతాయజ్ఞము"నందు వీరి రచన "కర్మసిద్ధాంతము" నా కొసంగిరి.

ఈ "కర్మసిద్ధాంతము" గ్రంథమును సాంగోపాంగముగ పఠించి పరమానందమును పొందితిని. గుప్తమైన ఆత్మతత్త్వమును సర్వులకు వ్యక్తముచేయ సంకల్పించి గుప్తగారీ రచనా వ్యాసాంగమునకు పూనుకొనిరి.

ఈ గుప్తగారికి సద్గురు శ్రీ యోగానందనరసింహస్వామివారియెడ అపారభక్తి చిన్నవయస్సునందే సద్గురుకృపకు పాత్రులై అష్టాక్షరీ మహామంత్రోపదేశమును పొంది యహరహము మంత్రధ్యానమొనర్చిరి. ఆ మంత్రమహిమతో కవులై కధకులై సత్యరచనాశక్తిని కరతలామలక మొనర్చుకొనిరి

బాల్యమాదిగ కవి పండిత గాయకులగు పెద్దలయెడ భక్తి గటిగట్టి కావ్యములను చదివెడి యాసక్తి శ్రీ ప్రహ్లాదుని కథయందురక్తి వీరికి పట్టుబడినవి. శ్రీ లక్ష్మీనృసింహాభగవానుని ఆరాధ్యదైవముగా యెన్నుకొని సర్వదేవతామూర్తులందును ఆ స్వామినే భావించి తదనుభూతినే పొందుచుండిరి.

లౌకికమందాసక్తిలేక యధార్థమగు సత్యదృష్టితో ప్రతివిషయమును సమన్వయము చేసుకొను నభ్యాసము కలవారు. శ్రీ హరికథా కధనము, కవిత్వము సర్వమును ప్రసాదించిన స్వామి శ్రీ యోగానందనరసింహస్వామియేనని నమ్మి చరించుచుందురు.

శ్రీ గురునరహరి కృపతో శ్రీ ప్రహ్లాద జీవితచరిత్రమును, ఆంధ్రదేశమునందనేక దేవాలయములలో కవి పండిత సాధు విద్వన్మణులు గల సభలలో వందలాది సారులు గానమొనర్చి పెద్దలమెప్పును వడసి సత్కీర్తిచంద్రికలతో వెలుగొందసాగిరి.

శ్రీ నరహరిపాదభక్తుడైన సుబ్బరాయగుప్తభాగవతుని కవిత్వసారము ద్రాక్షపాకముగానున్నది. వీరి శయ్యాశక్తియు సుఖముగాయున్నది. ఎక్కువ వచనరచనా గ్రంథములేవ్రాసి లోకమునకు ధర్మ కర్మ సిద్ధాంతరహస్యముల నెన్నింటినో బోధించి మహోపకారమొనర్చిరి.

ఇట్టి లోకోపకార మహాకర్మనిర్వహణ మొనర్చిన విజ్ఞానసంపన్నులైన శ్రీ గుప్తగారికి వారికుటుంబమునకు శ్రీ నృసింహభగవానుని కృపాకటాక్షము సర్వ కాలములందు చేకూరుగాత యని మదిష్టదైవమగు శ్రీ రామచంద్ర ప్రభువునకు నమస్సు లొనర్చెద —

శా॥ శ్రీ రంజిల్లెడు మోముతో వెడదయై చెన్నారువక్షంబుతో
సారోదారకృపాభి వర్షములతో సంపత్ప్రభుండైన మా
శ్రీరామప్రభు డెల్ల వేళల- దయన్-శ్రీమంతుగా వించు-సు
బ్బరాయున్ కవిపండిత ప్రియుని-దీవ్యద్భక్తు-నిన్ నిత్యమున్.

శా॥ ఔరా! యంచని పెద్దలందరు మనం-బందుల్ల సంబంధగా
సారజ్ఞుల్ దలలూప శ్రీహరికథల్ సందర్భశుద్ధంబుగా
ధీరత్వంబున చెప్పి మెప్పుగొను చెం-తే నుందువా-కోట సు
బ్బరాయాప్త సుగుప్త నీకు శుభముల్-ప్రాప్తించుగా కెల్లదన్.

ప్రకటిత నారసింహపద భావనసేయుచు దన్మనోజ్ఞ ది
వ్య కథను గానమున్ సలుపు చందము శ్రోతల మెచ్చు లెచ్చగా
న కలుషభక్తిc జెప్పెదవహా! కథకావళిముఖ్య! విష్ణుసే
వకు వెటనేని ధన్యులు ప్రపంచమునన్ శతధా సహస్రధా.

చ॥ కలుగునుగాక మీ కఖిల-కాలములందు నృసింహభక్తియున్
మెలగునుగాక నాత్మబలమెంతయు సత్సభలో జయంబునున్
మలగునుగాక కష్టములు-మాధవు సత్కృపచేత నెప్పుడున్
దొలగునుగాక నాపదలు-తోరపు శ్రీహరికీర్తనంబులన్.

కం॥ శ్రీమన్నరహరి కరుణా!
భూమ కటాక్షములు మీ క-పూర్వమహశ్రీ
ధామ ముఖ సుఖములగు శ్రీ
రామానుగ్రహము-గలుగు-రమ్యతరముగన్.

ఇట్లు

"భక్తకవిశేఖర" శ్రీమాన్ నరహరి గోపాలాచార్యులు
తమ్మర (పోస్టు.) హుజూర్‌నగర్ తాలూకా,
నల్గొండ జిల్లా.

# ప్రసన్న పునరుక్తి

విద్వాన్ శ్రీ బేర్నిడి ప్రసన్నకవి

సఖుఁడొకండు దొల్లి సంగీతము మరగి
బేర సారములను వీడెనంట
మరగినావు నీవు పరమసాహితిని నీ
బేరమిక వికుంఠ వీథులంటు

అనుగున్ నెయ్యుఁడ! సుబ్బరాయవరగుప్తా! గీతకంఠీరవా
జననీగర్భమునందు నింద్రుని చెఱన్ సన్మౌన్యుపన్యాస గుం
ఫనచే- స్థాపితమైన మాధవసుత ప్రాహ్లాద భక్త్యర్థ మె
ట్లనుకూలించెను నీకు నీ కలిమహత్త్వాసాధ్యకాలంబునన్?

ఏ యది మార్గము? ప్రశ్న చ
ణా! యోగానంద బోధనా రచయిత! వేం
కాయంబా లక్ష్మీ నా
రాయణ సుత। కోట సుబ్బరాడ్భాగవతా!

సిరులొల్కు నీ నగుమొగము
మురుపు నరసి నీ కళగల బొజ్జనరసి నీ
విరచిత వచనా రచనల
నరసి మురుయుచు నిదివఱకె యన్నానుగదా?

తమి నీ పొత్తముఁగంటి నిందలి సుశబ్దస్తోమ సద్భావ పుం
గుమితో ధార ఘుమంఘుమార్భటములన్ ఘూర్ణిల్లుకొంచల్లనన్
సముదుత్తుంగ తరంగ సంగతులతో స్వర్లోకగంగాభవా
ని మహీసీమకు డిగ్గుచున్నయటులుండెన్। సుబ్బరాయాగ్రణీ!

తొలి రారాజుల మన్ననల్ గొనిన ఛందోబద్ధ సవ్యాకృతీ
విలసత్పద్య కవిత్వరీతులు మహాభీలోరగా। శ్లేష శృం
ఖలులంచున్ సులభంబులన్ వలచు నీ కాలంబునందిట్టి ప్రా
తలె జాత్యున్నతికిన్। యశోధృతికి నత్యంతంబు నావశ్యముల్ !!

పొందువహించి యెల్ల జనముల్ సుఖియింప నశాంతిదేశ మం
దెందెటులన్ దలెత్త కొననీని వపే మన భారత ప్రధా
నీందిరగాంధ్యమూల్యముల ఖిర్వదిసూత్రములందు లెస్స వె
ల్గొందుచు శీర్ష శీర్షమున నుంట వినూత్న మహావిశేషమౌ!

కాలము మాఱిపోయినది కన్నకలల్ ఫలియింపకింక పో
జాలవు దివ్యమౌ మన ప్రజా పరిపాలనమందు స్వర్గ మీ
నేలకు డిగ్గగావలయు నివ్వటిలన్ వలె నీ కలాన పే
వేలుగ వ్యాసముల్! తెలుగుఁ వెల్గులు విశ్వము నేలగావలెన్॥

అనుచే నాడిన పద్యవాగ్ఝరి వృథావ్యర్థంబుగాబోక వె
చ్చని యూహల్ హృదిరేగి పండితులు మెచ్చన్ కర్మసిద్ధాంతమన్
ఘన వేదాంత రసైకధోరణి బృహద్గ్రంథంబునే వ్రాసి నా
వనుమానింప కి కన్ లిఖింతు విటులెన్నైనన్ మహాగ్రంథముల్॥

అవుఁ గానీ మనలోనిమాట రసగుప్తా కొంతలో గొంతయున్
గవితా ఛందము లంబతింపవు లసత్కావ్యాలజాడే యెఱుం
గవు నీ నేర్చిన విద్యయున్ గొలదియే! కావింతు వెట్లీ సుధా
సవ వృత్తాంత కృతుల్? కనుంగొన మహాశ్చర్యంబు నీవై ఖరుల్.

వినుకొండ

25-5-81

విద్వాన్ బిర్రీడ ప్రసన్న
రిటైర్డు తెలుగు పండిట్



'హరికథా విశారద' 'వాగ్గేయకారకమణి'
యక్షగాన, నాటకరచయిత
దండిబొట్ల వేంకటశాస్త్రి

వడాలి పోస్టు
(వయా) ముదినేపల్లి, కృష్ణాజిల్లా
22-5-81

శ్రీయుతులు శ్రీ నరహరిభక్తులు మిత్రులు కోట సుబ్బరాయగుప్తా భాగవతులు గారికి శుభాభినందనములతో—

మీ కర్మసిద్ధాంతము చూచి సంతసించినాను. శ్రేష్ఠులుగా, సద్గురుశ్రేష్ఠులుగా, భక్తశ్రేష్ఠులుగా భాగవత శ్రేష్ఠులుగా మీరు తరించి లోకమును తరింపజేయు మీ కృషి

ప్రశంసాపాత్రము. ఆత్మానందామృతపానమత్తులై, నరహరి సంకీర్తనానందచిత్తులై పరవశించి పలికిన మీ కర్మసిద్ధాంతము హిందూధర్మమూల సిద్ధాంతము. మీ గ్రంథము చూచి పఠించగ ''విటుడు యతికాకపోవునే? వెనమదీయ కావ్య వైరాగ్య వర్ణనాకర్ణన మున'' అను పూర్వ కవిసూక్తిస్ఫురించినది. మీ ప్రయత్నము విజయవంతమగుగాక!!

ఇట్లు

దండిబొట్ల వేంకటశాస్త్రి

---

''ఉభయభాషాప్రవీణ'' ''వేదాంతపారీణ" ''కవిశేఖర'' ''విద్యానాధ''

ఇత్యాది బిరుదాంకితులు, బ్రహ్మశ్రీ మిన్నికంటి గురునాథశర్మ

బ్రాడీపేట 6వలైను, 15 వ అడ్డరోడ్డు, గుంటూరు-2. ది. 15-5-81

కీర్తనకంఠీరవ, శ్రీ సుబ్బరాయగుప్తాగారు 'కర్మసిద్ధాంత' మిచ్చి ఆశీర్వదింప గోరిరి. నేనా పేరు జూచి ప్రారబ్ధ ''కర్మవిచారము'' వ్రాసిన వాఁడను గాన ఆశ్చర్యపడి కుతూహలముతో పుటలు తిరుగవేసితిని.

అదృష్టవశమున వీరు నిత్యనైమిత్తిక కామ్యముల నెత్తికొనలేదు. జ్ఞానము కంటె కర్మయే కైవల్యమిచ్చుననలేదు. వీరావైదికమార్గమున పయనింపలేదు. లౌకిక కర్మలనే యెత్తుకొనిరి.

హరికథకులుగాన 'దేశాటనం పండితమిత్రతాచ' కలవారు గాన, స్వానుభూతిం బురస్కరించుకొని లోకములోని పోకడలనెల్ల నాకళించుకొని ఉపన్యసించు ధోరణిలోనే దీనిని వ్రాసిరి. చక్కని పాండితి చక్కని గురుభక్తి కలదు గాన ఆ ధోరణి సమాస భూయిష్టమై, సాలంకారమైయున్నది. దొర్లినచో ఉపమలు మాలకలే పొర్లినచో భావము లబ్ధితరంగములే. ఆ యుత్సాహావేశములతో పునరుక్తు లెగిరెగిరి పడుచుండును.

అందఱు చదివి తమ వర్తనమును చక్క చేసికొనవలసిన విషయము లిందుఁగలవు.

ఆ॥ వె॥ కోట సుబ్బరాయగుప్త భాగవతుండు
మాటతీరు తియ్యపాట సౌరు
తేటయైన బత్తి యూటలూరఁగ పొత్త
మాటవోలె వ్రాసి మేటియయ్యె.

## శ్రీ హయాస్యాయ నమః

మహారాజశ్రీ కోట సుబ్బరాయగుప్త-భాగవతార్ గారు రచించిన 'కర్మసిద్ధాంతము' అను గ్రంథమును-అచ్చటచ్చటఁగొంతకుఁగొంత చదివిచూచితిని. ఈ గ్రంథమును జూడ మొదలిడినపుడిందు-కర్మభేదములు-తత్పరిణామములుండును. 'గహనాకర్మణాం గతిః-అని గీతాశాస్త్రమే? దీనిని వీరెట్లు వ్రాసిరి? అనిచూచితిని-కాని-శ్రీ హరిదాసు గారు-కర్మమీమాంస-గాక-కేవల కర్మ పరిణామమునుగూర్చి వ్రాసి, అకర్తయైన యీశ్వరుడు సర్వాంతర్యామియై యేకముగనుండెననియు, ఉపాధిగతమైన జీవకర్మ సిద్ధాంతమిది అని సిద్ధాంతీకరించి ప్రాచీనార్ష మతప్రమ్యుతి గలుగకుండ వ్రాసి పండిత పామరామోదకరముగ దీనిని రచించిరి. ఇందలి విషయములవగహించుకొని స్వేతి వృత్తమును సత్పథనమున లోకము నడుచుకోగలదనియు. ఇట్టి సద్గ్రంథముల నను భవముతో శ్రీ హరిదాసుగారు వ్రాసి లోకమునకు మేలు చేయవలయుననియు-అందులకు శ్రీ కోట సుబ్బరాయగుప్తగారిని భగవంతు డాయురారోగ్యములతో రక్షించుగాతయని నా యాశయము —

## ప్రశంసాభిభాషణములు

శ్లో॥ శ్రీ కోట వంశాబ్ధిజ సుబ్బరాయ
గుప్తాఖ్య మిందుం బుధతోషకం త్విమం
పాయాద్ధరేర్గుణకథా కథన ప్రవీణం
హరిర్నృసింహో వరదో రమాధవః.

శ్లో॥ శ్రీ సుబ్బరారయ్యా భవత్కృతో, యం
గ్రంథో, హమద్రాక్ష మమంద దృష్ట్యా
నాస్త్యేకదోషో పివిచారితే, స్మి—
హ్యారీచ స్త్వం ప్రథితాగమాధ్వనా

శ్లో॥ ఏవమాది సుగమార్థ బోధకాన్
గ్రంధాన్విరచ్యాఖిల ధర్మరక్షకాః
శాస్త్రస్యరేఖా మవిలంఘ్య సత్వథా
ప్రకుర్వతే తేదిశతాత్ శుభం హరిః ॥

శా॥ శ్రీమత్కోటవరాన్వయ ప్రభవసుశ్రీ సుబ్బరాయాఖ్య ! మీ
ధీ మాధుర్య గుణోపగుహ విలాసద్దే తూత్కరాదర్శితం
బామూలాగ్రము కార్మికంబయిన సిద్ధాంతోక్తి మద్గ్రంథమున్
సామోదంబయె నాయెడందకును వత్సా ! వృద్ధి నొందీపయిః ॥

సీ॥ శ్రీ సుబ్బరాయార్య ! భాసుర వాగ్జాల
యుక్తమౌ హరికథ భక్తితోడ
హరికథాగ్రేసర ! వరశాస్త్రమార్గాన
కర్మసిద్ధాంతమౌ గ్రంథరచన
రచనాప్రవీణ నీరమణీయ భావంబు
వినయపూరితమౌచు వెలయుచుండు
వినయశోభిత ! గుప్త ! వేయేల ? నీవాక్కు
అమృతోపమానమై యలరుచుండు॥

తే॥ గీ॥ అట్టి నీ రచన సరణి నఖిలప్రజకు
సుగమమయియుండె గీతార్థ నిగమ ఫణితి
విడక కర్మసిద్ధాంతము వెలికిపజూ
తాళలంటగ యశము దిగంతమంట.

లంకా సీతారామశాస్త్రి
శ్రీరామభక్త: విద్వత్కవిశేఖర;
నల్లకుంట; హైదరాబాదు.

ది 6-6-81 న
నర్సరావుపేట

III)

## శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతులకు

# శుభాశీస్సు

కథక జ్ఞానిశ్రేష్ఠీ !

మీరు రచనచేసిన, కర్మసిద్ధాంతము చదివితిని, మీ భావములు కర్మవిశ్వాసము గలవా రందఱు సమర్థింతురు. మీ రుపయోగించిన సామెతలు నుపమానములు మీకుఁగల అసాధారణ లోకజ్ఞానమును వెల్లడించుచున్నవి. శ్రీమద్రామాయణ మహాభారత మహాభాగవతములపై దైవముపై మీకుఁగల భక్తి అపారమైనది. చెప్పఁదలచుకొన్నయది చాల విస్పష్టముగ నిర్భయముగ చెప్పుచున్నారు. కర్మసిద్ధాంతమును గూర్చిన మీ వివరణ మనోహరముగ నున్నది. హేతువాదులు సహితము, మీ యీరచనను నంగీకరింతురు. ఇతరుల అభిప్రాయములను విమర్శించుటయందును సభ్యత మర్యాద మన్నన మెఱయించినారు. కర్మసిద్ధాంతమున గూర్చిన మీ యీ రచనను నేను బలపఱచుచున్నాను. మిమ్ముఁగని తల్లి దండ్రి వంగడము తెలుఁగునేల మాన్యమైనది.

ఆ॥ వె॥ సార్థకంబు నీదుజని, సహజజ్ఞాని
వగుట; స్థిరయశము నందుమెందు
కోట సుప్రసిద్ధకులజన్య హరికథా
గేయదీప్త! సుబ్బరాయగుప్త ॥

మీ వాడు

నరసరావుపేట
ది 6-6-81

కొప్పరపు సీతారామప్రసాదరావుకవి
శతావధాని



శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతారుగారు వ్రాసిన 'కర్మసిద్ధాంతం' అన్న గ్రంథం వెలువడటానికి పూర్వం చూచే అవకాశం వారు నాకు దయతో కలిగించి నందున స్థాలీపులాకన్యాయంగ పరిశీలించాను. వీరు దీనికి కర్మసిద్ధాంతం అని పేరు పెట్టినా స్వీయానుభవంతో జోడించి 'కర్మప్రభావము' మున్నగు శీర్షికలతో జిజ్ఞాసువులు చదివి, మననము చేయవలసిన అనేక విషయాలను రమణీయ రీతిలో చర్చించారు. వృధాకాలక్షేపం కాక సద్విషయ పరామర్శ చేయగోరిన వారందరు పఠించి మననం చేయవలసిన గ్రంథం.

"అనంతసాహితి"
గుంటూరు
ది 19-5-81

'కవికుల రత్నదీప'
ఏలూరిపాటి అనంతరామయ్య
M A.

## అభినందనము

డాక్టర్: వి. వి. యల్. నరసింహారావు
M. A. Ph. D.
డైరక్టర్ :
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము
పరిశోధనసంస్థ - హైదరాబాద్ ది 31-5-81

శ్రీ కోట సుబ్బరాయగుప్తా భాగవతార్‌గారిచే రచింపబడిన 'కర్మసిద్ధాంతము' అను నీ గ్రంథము విషయమునుబట్టి ఉత్తమశ్రేణికి చెందినది. ఇట్టి విషయములపై బుద్ధి ప్రసరించుటయే ఒక విశేషము.

గుప్తగారు సంగీత సాహిత్యములందు కృతశ్రములు; జితశ్రములు; వ్యాసంగముచే హరికథకులు. కమనీయమైన కంఠనాదమును, రమణీయమైన భక్తి భావమును కలిపి హరికథాగానముగ రూపొందించుకొనిన ఈ భాగవతారుగారి కృషి అభినందనీయము.

హరికథలు చెప్పుటవేరు, ఆ యా కథాంశములను మననమొనర్చుకొని అంతశ్శుద్ధితో ఆచరణసాధ్యమొనర్చుకొనుట వేరు. అట్లు ఆచరణసాధ్యమొనర్చుకొనుటయందే కర్మసిద్ధాంతముయొక్క పారమ్యము సిద్ధించును.

కర్మసిద్ధాంత మనునది నేడు క్రొత్తగా ఉదయించిన తత్త్వవిషయముకాదు. చిరకాలము భారతీయ తాత్త్వికులు పరిశీలించి నిగ్గుతేల్చికొన్న అంశమే. ఎందఱెంత వాచావేదాంత మొలుకబోసినను అచ్చమైన కర్మశూరులు లోకమున వ్రేళ్ళమీద లెక్కింపదగినవారే !

గీతయందు కర్మయోగమునుగూర్చి ఒక అధ్యాయమును, కర్మసన్న్యాసమును గూర్చి వేరొక అధ్యాయమును గలవు. జీవికి కర్మము ముఖ్యమా ? కర్మసన్న్యాసము ముఖ్యమా ? ఈ ముడి వీడకయే నరుడు నారాయణుని గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నింపవలసి వచ్చెను. ఆత్మసాక్షాత్కార విషయములో నిష్కామకర్మములకంటె జ్ఞాననిష్ఠయే శ్రేష్ఠతరము. అది సమ్మతమయ్యేనేని తత్సిద్ధికి జ్ఞానయోగ మవలంబింపవలసి యున్నది. కాని నారాయణు డట్లుపదేశింపక భయంకరమగు కర్మయోగమునందే నరుని నియోగించెను. నరుని బుద్ధి గిజగిజలాడి—

''తత్కిం కర్మాణి ఘోరే మాం నియోజయసి కేశవ ?.... (3-1)

అని ప్రశ్నించెను. అనగా కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ, అను నీ రెండింటిలో ఏది అనుసర

ణీయ మను ప్రశ్న ఉదయించినది. ఈ ప్రశ్నకును భగవానుడు సమాధానము చెప్పకపోలేదు. "చిత్తశుద్ధిలేని కర్మయోగులకు కర్మయోగమునందును, ఆత్మ సాక్షాత్కారము చేసెడి సాంఖ్యులకు జ్ఞానయోగమునందును అధికారములు కలవు" అని చెప్పుటచే పరస్పర విరోధము పరిహృతమైనది. దీనినే భగవానుని మాటలలో చెప్పవలెనన్నచో—

"జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్"....(3-3) అగును.

గీతయందు కర్మయోగము మూడవ అధ్యాయము. కర్మసన్యాసము అయిదవ అధ్యాయము. ఈ అయిదవ అధ్యాయ ప్రారంభమునందును, నరుననొక సంప్రశ్నము పొడమినది. "కృష్ణా! నీవొకప్పుడు జ్ఞానయోగమును ప్రశంసించి కర్మలను పరిత్యజింపుమనియు, మరొకప్పుడు జ్ఞానాంగమైన కర్మమును ప్రశంసించి దాని నాచరింపుమనియు చెప్పుచున్నావు. ఇది పరస్పర విరుద్ధముకాదా?"

దీనికి కృష్ణు డిట్లు సమాధానము చెప్పెను. "అర్జునా! జ్ఞానయోగ, కర్మయోగములు రెండును తత్త్వసాక్షాత్కార జనకములై మోక్షహేతువులైనను జ్ఞానయోగముకంటె కర్మయోగము శ్రేష్ఠతరము.

"సన్యాసకర్మయోగశ్చ । నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్యాసా । త్కర్మయోగో విశిష్యతే".... (5-2)

కర్మయోగముయొక్క శ్రేష్ఠత్వమును భగవానుడింత స్పష్టముగా ఉగ్గడించుట చేతనే కాబోలు శ్రీ కోట సుబ్బరాయగుప్తగారు స్వీయానుభవములను పురస్కరించుకొని 'కర్మసిద్ధాంతమను పేరుతో నీ బృహద్గ్రంథమును రచన యొనర్చెను. గీతయందువలెనే ఈ గ్రంథమునందును పదునెనిమిది అధ్యాయములు కలవు. 'కర్మప్రభావము' మొదలుగా 'శ్రీ భక్తకవిరాజత్రయము' వరకుగల పదునెనిమిది అధ్యాయములును ధర్మజిజ్ఞాసరూపమైన అనేక విషయములను కొట్టి కోలాహల మొనర్చుచున్నవి. ధర్మచ్యుతి దుఃఖమూలమనియు, గుణవంతుడు సమాజాదర్శమూర్తి యనియు, ధర్మాత్ముడే దైవకృపాపాత్రుడనియు, రచయిత ఘంటాఘోషముగ వాదించెను. ధర్మశక్తియొక్క స్వరూపము ఇదమిద్ధమని చెప్పుట, వ్యక్తిశక్తికి కొండొకయెడ అందని విషయమే. ప్రశాంతనిలయము నన్వేషించుచు, జీవయాత్ర సాగించుచు మానవుని మనస్సు మాయావృతమై మాధవ కృపవలననే మాయావర

ణమునుండి బహిర్గతము కావలసియున్నది. క్షేత్రము-క్షేత్రజ్ఞుడు - బీజము, అనునవి విడదీయరాని సంబంధముగల అంశములు. క్షేత్రజ్ఞుడై బీజావాపన మొనరించిన వాడొక్కడే ఫలమాశింప నర్హుడు. ఈ రహస్యము గుర్తించియే శ్రీ గుప్తగారు 'క్షేత్రమెరిగి విత్తనము' అను నొక ప్రత్యేక ప్రకరణము రచించిరి. అపాత్రదానము వలన కలిగెడి కష్టనష్టమునుకూడ విస్పష్టము గావించిరి.

"దేవుడున్నాడా ? లేడా ?" అనునది ఈనాటి ప్రశ్నకాదు. చెట్టుముందా - విత్తుముందా ? అను ప్రశ్న పుట్టిననాటిది. అది తేలినచో నిది తేలును. అంతఃకరణమును నమ్మికొని ఆత్మసాక్షాత్కార మొనర్చుకొనిన ముక్తసంగులు భగవత్సాక్షాత్కార మహానుభూతి సౌఖ్యమును సహస్రముఖముల కీర్తించి శతసహస్ర గ్రంథములలో వక్కాణించియున్నారు. వానిని చదివిన వాసనావిశేషమునకు ఆత్మానుభవ పరిపాకమును తోడుచేసికొని శ్రీ గుప్తగారు అఖండాద్వైత బ్రహ్మజ్ఞాన సంప్రాప్తికి శాయశక్తులచేసిన కృషి ఈగ్రంథమున సాక్షాత్కరించుచున్నది. స్త్రీ, ధన, కీర్తి, కామ, దాహములు నరు నశక్తు నొనరించుచున్నవి. అట్టి అశక్తుల సంఖ్యయే లోకములో అధికము. జ్ఞానోపదేష్టలయందును పలువురిట్టివారు కలరు. అందువలననే కాబోలు గుప్తగారు 'అందరిమాటలు వాస్తవములేనా ? అని ఈ పెద్దిపోటువంటి ఒక ప్రశ్నవైచిరి. తీర్థయాత్రలుచేసినను తిరుణాళ్ళు దర్శించినను స్వస్వరూపజ్ఞానము అంత సులభమైనది కాదు. సంసారి సన్యాసియగుట ఎంత కష్టమో, అజ్ఞాని సుజ్ఞానియగుట అంత కష్టము. అయినను రాజయోగులై, ముక్తసంగులైన మహానుభావులు పలువురున్నారు. వారిలో బమ్మెర పోతరాజు, భక్త రామదాసు, త్యాగరాజు అగ్రగణ్యులు. ఈ గ్రంథమందలి చివరి ప్రకరణములో ఈ మువ్వురిని గూర్చియే రచయిత వివరించెను.

రచయిత ఆత్మజ్ఞానము గలవాడనుటకు గ్రంథాంతమందలి ఈ వాక్యములే నిదర్శనములు. "పనికిమాలిన ఈ పాడుదేహములో ఎందరో శత్రువులు మకాము చేసినారు. ఆరుగు రాడించెడివారు. మువ్వురు ముంచెడివారు. ఏడుగు రేడ్పించెడి వారు. ఎనిమిదిమంది వెతలుబెట్టెడివారు. పదుగురు ప్రక్కకీడ్చెడివారు. ఐదుగురు కావలివారు. ఇర్వురు వచ్చిపోయెడివారు. ఒకడు బిక్కుబిక్కుమనువాడు." అన్యదుర్లభములుగా అలంకరింపబడిన ఈ వాక్యములు రచయిత రచనాపాటవమును స్పష్టముచేయుచున్నవి. అరిషడ్వర్గమును, గుణత్రయమును, సప్తవ్యసనములును, అష్టకష్టములును, దశదిశలును, పంచభూతములును, జనన మరణములును - ఈ

ఇన్నింట బిక్కుబిక్కుమను ఏకైక చిదంశము ఆత్మ ఒక్కటియే ప్రధానమైనది. కర్మయోగ మవలంబించినను, కర్మసన్న్యాస మవలంబించినను, ఈ ఒక్కటిని తెలిసికొనుటకే ఎన్నెన్నో జీవితకాలములు చాలకయున్నవి. శ్రీ కోట సుబ్బరాయగుప్త గారు ఇంత పెద్ద గ్రంథమును వ్రాసినదియు నీ యొక్కటిని తెలిసికొనుటకే! ఇంతటి బృహత్ప్రయత్న మొనర్చి కృతకృత్యులైన శ్రీ గుప్తగారిని హృదయపూర్వకముగ నభినందించుచున్నాను.

హైదరాబాద్
ది 31-5-81

వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు

ఓం

శ్రీ లక్ష్మీనరసింహాయనమః

శ్రీ గుప్తాగారు నాకు ఆత్మబంధువులు, వారితో నాకు తొలిపరిచయం గోదావరీ పుష్కరాలలో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఏర్పాటుచేసిన "హిందూ ధర్మరక్షణ సంస్థ" ధార్మిక వేదికమీద పలుకరించుకొన్నది స్వల్పకాలం. అయినా స్నేహబంధం ఎన్నిజన్మలకైన సరిపోయేదే, ఆనాడే వారు నాకు "ఏది సత్యము" రెండవ భాగము భక్తితో, ఆత్మీయతతో సమర్పించారు. అది చదివాక మాబంధం మరింత దృఢతరమైనది. అది మరపురానిది. మరువలేనిది. వారి పూర్వరచిత గ్రంథాలన్ని నాకందించారు. ఇప్పటికి ఆఖరుసారిగా అందించిన గ్రంథం ఈ "కర్మసిద్ధాంతం" అన్నిటిని చదివాను. అంతో యింతో ఆకళింపుచేసికొన్నాను.

"అతిశయోక్తి నాకు అసలు సహించదు
ఉన్నమాట చెప్పుచున్నవాడ"

శ్రీ గుప్తాగారిలో గుప్తంగావున్న కవితావైభవాన్ని పైపై మాటలెవరో చెప్పగా "ఆహా!" అనడంకాదు; స్వయంగా పఠనంలోకి దిగి ఊపిరితీసికొనుటకైన సావకాశంలేక ఉక్కిరిబిక్కిరై "అబ్బా!" అని తీరవలసిందే, ఎవరైన; ఎప్పుడైన; ఎక్కడైనా.

కుమ్మరి గురునాథుని వ్రాతగానిగా చేసికొని తిక్కనమనీషి ఆగకుండ కవిత్వం చెప్పలేకపోయాడన్న కథ సత్యమో ? కాదో ? కాని ! శ్రీ గుప్తాగారి కలం కాగితాన్ని తాకితే ఏ పేజీకో, రెండు పేజీలకో బలవంతంగా ఆపాలికాని, అలసట చెంది ఆగడమనేది ఉండనే ఉండదని చెపితే అదిమాత్రం సత్యం.

అది హిమవదుత్తుంగ శిఖరాలనుండి జాలువారే గంగాస్రవంతి మాత్రమే కాదు-''అంబరచుంబి శిరస్సరఝరీపటల ముహూర్ముహూర్లుఠ దభంగతరంగ మృదంగ నిస్వనస్ఫుట నటనానుకూల పరిపుల్లకలాపకలాపిజాలము''ను గుర్తుకు తెస్తుంది.

అసలు వారు ఏవ్యాసానికైన ''శీర్షిక'' ఎన్నుకోవడంలోనే ఒక ప్రత్యేకత ఉంది. ఇక సరియైన శీర్షిక వారి శీర్షంలో స్ఫురించిందో కలం కదంత్రొక్కిందన్న మాటే. కర్మసిద్ధాంతంలోని ప్రతి వ్యాసానికి ఒక ప్రత్యేకస్థానముంది. అది మనిషిని, మనీషినికూడ అలరించే ఒక మణిహారం. అందులో మధ్యమణి (లాకెట్) యే ''దేవుడున్నాడా ? లేడా ?'' అనే వ్యాసం.

> ''దేవుడనేవాడున్నాడా యని
> మనిషికి కలిగెను సందేహం
> మనుషులనే వారున్నారాయని
> దేవునకొచ్చెను అనుమానం''

అన్న యీదౌర్భాగ్యకాలములో కావాలనుకొన్నవారికి కళ్ళుతెరిపించడానికి సాక్షాత్తు ఆ లక్ష్మీనరసింహస్వామిదయే యీ నరసింహోపాసక గుప్తాలో ప్రవేశించి యింత ఖండితంగా వ్రాయించి ఉండాలని నా సంపూర్ణ విశ్వాసం. అది ప్రత్యేకించి చదువ వలసిన ప్రముఖ వ్యాసం.

విచిత్రమేమంటే - ''నదీనాం సాగరోగతిః'' అన్నట్లు ఏ శీర్షికతోకూడిన వ్యాసం చదివినా చివరికి ఏది సత్యం ? అని ప్రశ్నిస్తూనే సత్యంలో సమాశ్వాసం చెందిస్తుంది.

''తస్మైనమఃకర్మణే'' - అని ఎంతటివారికైనా కర్మసిద్ధాంతంతో సంబంధ ముండి తీరవలసినదే. కర్మదేవతకు నమస్కరించవలసినదే. సమస్తవేదశాస్త్రములు తెలిపే సారమిది; సాగరమది.

అడుగడుగున కర్త ప్రాభవాన్ని నిరూపిస్తు తైలధారవలె శ్రీగుప్తాజీ రచన సాగించారు. సత్యాన్ని ఇంత విపులంగా. నిస్సంకోచంగా, నిర్భయంగా ప్రజల ముందు పెట్టగల ధీశక్తి, వాక్పటిమ ఆ నారసింహు డీయవలసినదేకాని నరుడు తనంత సాధించేధికాదు

ఏ జన్మాంతర సుకృతమో అట్టి దైవబలం శ్రీ గుప్తాగారిలో ప్రవేశించి యింతవరకు చేయించిన ధార్మికరచనా సేవ, పరంపరగా చిరకాలం చేయించాలని కోరుతూ, ఇంతకన్న విస్తారంగా చెప్పిన ఏమాటలైన వారి రచనముందు పొల్లే అవుతుందేమోనని భావిస్తు శ్రీ లక్ష్మీనరసింహస్వామి తన భక్తుడైన గుప్తాచే ఇతోధికముగా ధార్మికగ్రంథరచన చేయిస్తాడని ఆశిస్తూ ఆప్తమిత్రుడుగా అభినందిస్తూ, శ్రేయోభిలాషిగా ఆశీర్వదిస్తూ—

జగంపేట<br>
పెద్దాపురం తా॥<br>
తూ॥ గో॥ జిల్లా<br>
ది 2-6-81

నూజళ్ళ లక్ష్మీనరసింహం<br>
"భాషాప్రవీణ" "సంస్కృతీప్రచారక"

## శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహస్వామివారి
## దివ్యాశీర్వాదమ్

సద్గురువులు, శ్రీ కేశవతీర్థస్వామివారి దివ్యచరణసాన్నిధ్యము శ్రీ సుబ్బరాయగుప్త భాగవత కవిగారిని, నన్ను కలిపి మాహృదయముల నొక్కటిచేసినది. "ఏ గూటిపక్షి ఆగూటికి చేరు" నన్నది సత్యము గదా! వీరు ప్రౌఢవేదాంతులు. నేను బాలవేదాంతిని. వీరు గృహస్థులు. నేను బ్రహ్మచారిని. శ్రీ కేశవతీర్థ మహాయతీశ్వరుల వద్ద మేమిద్దరము ప్రచ్ఛన్న సన్యాసులమైతిమి-ఇది మా విషయం.

శ్రీ గుప్తాజీ కర్మసిద్ధాంతగ్రంథము నేడీ ఆధునిక సమాజమున కెంతయో అవసరము. కర్మలుచేయక అలసులైనవారికి, దుష్టకర్మలొనర్చుచు భయభక్తులులేక సంచరించువారికి ఈగ్రంథము తగిన గుణపాఠమును నేర్పును. "కీర్తనకంఠీరవ" శ్రీ కోట సుబ్బరాయగుప్తగారి ఆనువంశిక గురూత్తములు శ్రీ యోగానందనరసింహస్వామి అనుగ్రహ ప్రవాహము-శ్రీ కేశవతీర్థ యతీంద్రుల చరణసేవానుగ్రహ ప్రవాహము జగద్గురువు శ్రీ రామతీర్థస్వామి వేదాంతపఠన పవిత్రానుగ్రహ ప్రవాహములు మూడున్ను కలసి త్రివేణీసంగమమై "కర్మసిదాంత" గ్రంథరూపములో అలరారుచున్నవి. ఈ కర్మసిద్ధాంత త్రివేణీసంగమమందు ఏజీవిమనస్సు మునకలు వేయునో - ఆతడు పవిత్రాచరణశీలియై పరమాత్మానుగ్రహమును బడయగల్గును. ఇవి చంద్రమండలమునుండి శాస్త్రజ్ఞులు గొనివచ్చిన రాళ్లుకావు. శ్రీ గుప్తాగారు స్వాత్మమండల యాత్రచేసి గొనివచ్చి మనకందించిన రత్నాలు! అందరూ ధరించి ఆనందించండి.

పిడుగురాళ్ళ
గుంటూరుజిల్లా
ది 151-5-8

దిట్టకవి వేంకట రామానుజాచార్యులు
M. A.
భాషాప్రవీణ (గోల్డుమెడలిస్టు)

---

## సిద్ధాంతాల పూదోట - కోట

తే॥ గీ॥ పరమ పావనమైన ఈ భరతభూమి
ధర్మసూత్రాల, భాసిల్లు ధర్మభూమి
కలుషితంబై చలంగు ఈ కలియుగమున
దీనవదనములో నిల్చె దిక్కులేక.

తే॥ గీ॥ కత్తితము, కీడు, మోసము, మత్సరమ్ము
ఇచ్చవచ్చిన రీతిన పెచ్చుపెరిగ
ఇద్ధరిత్రిని ఈనాడు ఉద్ధరించి
వేద ధర్మపతాక స్థాపించవలయు.

ఆ॥ వె॥ సత్య కేతనమ్ము సంస్థాపనముచేయు
తలపుతోడ నేడు ధర్మభూమి
నుద్ధరించు "కర్మసిద్ధాంతము"ను వ్రాసి
మాన్యుడయ్యె 'కోట' ధన్యజీవి!

ఆ॥ వె॥ కోటసుబ్బరాయ! కోట్లాది గ్రంథాలు
రెండువత్సరములు నిండుగాను
శోధనములుచేసి సుకవీశు మెప్పుల
పొందినావు! గుప్త! పూజనీయ!

తే॥ గీ॥ కోటి జయములు శుభములు కూడుగాక!
ఆయురారోగ్యములు మీకు అమరుగాక!
వెలయువిఖ్యాతి మీకు ప్రాప్తించుగాక!
గుప్త! కోట సుబ్బారాయ! గుణసముద్ర ! !

పిడుగురాళ్ళ
15-6-81

డి. ఎ. వి. ఆర్. కె. ప్రసాద్
రాధశ్రీ

# కల్యాణవాణి

శ్రీమాన్ పద్మావతీనాథః
స్వామీ శేషగిరీశ్వరః
శ్రీ వేంకటేశ్వరః పాయాత్
సుబ్బరాయ సుధీమణిమ్ ॥

యోగానంద నృసింహేంద్ర
ప్రేమ వాత్సల్య భాజనః
"కథాభారతి" విఖ్యాతః
సుబ్బరాయో విరాజతే ॥

యస్య కంఠః కృష్ణోత్కంఠః
కాంశ్య దుందుభి సన్నిభః
యస్య భాషా రసోన్మేషా
కృష్ణవేణీవ ధావతి —

సోయం వైశ్యకులాంభోధి
చంద్రమా గాయకాగ్రణీః
భక్తః శక్తః కళాసక్తః
సుబ్బరాయః సుధీమణిః ॥

సుబ్బరాయ కృతిస్సేయం
కర్మసిద్ధాంత రూపిణీ
ఆచంద్రతారకం జీయాద్
భూయాత్ కల్యాణకారిణీ ॥

గుంటూరు
కొత్తపట్టాభిపురం
19-6-81

ఇత్యాశీః
జంధ్యాల పాపయ్యశాస్త్రి
"కరుణశ్రీ"

# ఆ ము ఖ ము

చిన్నతనమందె రక్తి, నశేషభక్తి
నున్నతుండగు నరసింహయోగి వరుని
జేరి శిష్యుండవై భవజీవితమును
నిర్మలమ్ముగ నడిపింప నేర్చినావు.

ఎన్నియో యోగసిద్ధుల మిన్న యౌచు,
శిష్యకోటిని, భక్తుల జేర్చి మహిత
పుణ్య పథము చూపించె! నా గణ్యయోగి
చరిత రచియించితివి సుప్రశస్తముగను.

పరమ ప్రజ్ఞను విష్ణుసత్కథలు చెప్పంజాలి నిన్ బోలు వా
రరు దీనాడు; అపారభక్తి మెయి ప్రహ్లాదుండ వీవౌచు నా
నరసింహప్రభు చూచి కొల్చునెడ ధన్యత్వంబు నీకబ్బె నం
చరలే కాదెద రెల్ల శ్రోతలును; గుప్తా! ముక్తి నీ కబ్బెడిన్.

తమి నే నిచ్చిన 'నారసింహ' ఘన మంత్రంబున్ మహాశ్రద్ధతో
విమలోపాసన సేయు దెల్లెడల; నీ విజ్ఞాన మివ్వేళ ను
త్తమ రీతిన్ వెలుగొందుచున్నయది గుప్తా! సత్య ధర్మ క్రియా
కమనీయుండవు; దివ్యసౌఖ్య శుభరక్షల్ నీకు చేకూరుతన్.

ఎంతో జ్ఞానము పంచిపెట్టితివి; వీక్షింపంగ నీ ''కర్మసి
ద్ధాంతమ్ము'' న్ మది నిన్ను మెచ్చెదరు పెద్దల్; జ్ఞాన మా పూర్వ జ
న్మాంతర్గర్భిత మిప్పు డబ్బినది; నీ మర్యాదలో క్రొత్తలున్
వింతల్ తోచెడు; నీ బృహద్రచనచే విఖ్యాతి నిత్యమ్మగున్.

గుంటూరు
ది. 18-6-81

''కుమారధూర్జటి'' ''సాహిత్యనిధి''
వానిలాల సోమయాజులు

"విద్యాలంకార్" డాక్టర్. బొడ్డుపల్లి పురుషోత్తంగారు,
ఎం. ఎ. పి హెచ్. డి.
రీడర్ : తెలుగుశాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జుననగర్

ఆప్తమిత్రులు, భగవదార్తిహృదయులు, శ్రీమన్నారసింహ కరావలంబనులు గురుకృపా పాత్రులు, అయిన శ్రీ కోట సుబ్బరాయగుప్తా మహాశయులు సహజ పండితులు, నిరంతర సాధుసేవా సంసక్త హృదయులు -

అట్టివారు 'కర్మసిద్ధాంతము' గ్రంథమును పదునెన్మి దధ్యాయములుగా విరచించి జిజ్ఞాసాలోకమునకు గొప్ప ఆలోకమును సమకూర్చి మహోపకారమొనర్చిరి.

ఆర్ష తత్త్వము పరమదురవగాహము. దానికెన్ని వ్యాఖ్యానములైనను కావలయును. ఎన్ని వచ్చినను ఇంక కొన్నిరావలయునను ఆకాంక్ష పాఠకునిలో మిగిలిపోవును. పూర్వకాలమున గ్రంథములు గీర్వాణవాణిలో వెలసినవి. ఈనాటి వారి అవగాహనకవి దూరములు.

శ్రీ సుబ్బరాయగుప్త గంగాప్రవాహ సదృశమగు శైలిలో వచనరచన గావించి దైనందిన జీవితములో గుప్తముగానున్న కర్మసిద్ధాంతరహస్యములను వ్యక్తమొనర్చి తత్త్వార్థుల కుపశమనమును చేకూర్చిరి. కర్మసిద్ధాంతమునకు పెట్టని కోటవంటి దీ గ్రంథము.

'బుద్ధిః కర్మానుసారిణీ' అని ఆర్షోక్తి. ఎంత జ్ఞానియైనను, ఎంతటి యోగియైనను, ఎంతటి పరమహంసయైనను, కర్మబద్ధుడు కాకతప్పదు. నిరంతర సత్కర్మాచరణముచేతనే కర్మవిముక్తుడు కావలయును. జీవునకేవంవిధ రహస్యోపదేశముల నొసగు ఈ ప్రకరణ గ్రంథమును అవశ్యము పఠించి అసత్యమునుండి సత్యమునకు, తమస్సునుండి జ్యోతికి, మృత్యువునుండి అమృతత్వము నధిగమింపగలరని ఆశింతును. ఇట్టి సహజ వ్యాఖ్యా సంశోభిత గ్రంథములనేకము వెలార్చి శ్రీ గుప్తగారు ధన్యులగుదురు గాక.

గుంటూరు.
ది. 19-6-81

ఇట్లు
బొడ్డుపల్లి పురుషోత్తం



కర్మసిద్ధాంత సమీక్ష
''దర్శనాచార్య'' ''కళాప్రపూర్ణ''

## డాక్టర్ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులువారు

ఈ గ్రంథము కర్మసిద్ధాంతము. దీని రచయిత శ్రీ కోట సుబ్బరాయ గుప్త (భాగవతార్) గారు. కర్మ సిద్ధాంతము వేదాన్తదృష్టితో చూచి నప్పుడు హేతువాదమునకు మిక్కిలి సమీపమైనదే. ఏ ప్రాణిగాని ఒక్క క్షణమైనను కర్మచేయక ఊరకుండ వీలులేదని భగవద్గీత వక్కాణించు చున్నది.

> న హి క శ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
> కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః ॥ (గీత 3.5)

నిజమే; కర్మ-జ్ఞానేంద్రియములతో గూడుకొన్న దేహవిశిష్టుడైన ప్రాణి, యే కర్మనేని చేయకుండుటకు వీలులేదు. ప్రతి ప్రాణికిని ఆకలి దప్పులు సహజములు. అవి తీర్చుకొనుటకైనను కర్మ చేయకతప్పదు. ఆహార నిద్రాభయములు సర్వ ప్రాణి సాధారణ ధర్మములే కదా! మనుష్యులగువారికి మనస్సు, బుద్ధి, ఆలోచనాశక్తి అనునవి అధికముగా నున్నవి, కావున వారు నిరంతరము బహువిధ కర్మరతులు గాక తప్పదు. అయిన మానవుడుచేయు నీ కర్మలకేదైన ఫలమున్నదా? లేదా? హేతువాదమునుబట్టి చూచిన-కర్మలకు ఫలములేకుండుట అంగీకారయోగ్యముకాదు. సంవత్సరమంతయు కష్టపడి చదివిన విద్యార్థి పరీక్షలో తప్పుట యెవ్వరికైనను ఇష్ట మగునా? నెలరోజులు పనిచేసినయుద్యోగి మాసాంతమున జీతమును పొందలేకుండు టకు ఎవ్వరేని అంగీకరింతురా! పొయ్యిని రగులచేసి బియ్యముకడిగి నీటితోనింపి పాత్రను పొయ్యిమీదపెట్టి వండగా, ఆ బియ్యము ఉడుకకుండ బియ్యముగానే

ఉండునా? నేలలో నాటిన విత్తనములు మొలవకుండుట ఎవ్వరికేని సమ్మతమగునా? కావున చేసిన కర్మము ఫలమొసంగుట అనునది ప్రకృతిసిద్ధధర్మమే! కర్తయగువాడు వలదన్నను ఆతడు చేసిన కర్మము దానికి తగిన ఫలము నాతనికీయక ఊరకుండదు. ఆ యా కర్త వారు వారు చేసికొన్న కర్మముల ఫలములను వారనుభవింపకయు తీరదు.

ఈ కర్మలనునవి మంచివికొన్ని, చెడ్డవికొన్ని అందఱెఱుంగుదురు. "చెడ్డ కర్మకు చెడుఫలము, మంచికర్మకు మంచిఫలము కలుగుననుటకూడ ప్రకృతిసిద్ధ ధర్మమే. వేము నాటినవానికి వేపపండ్లే లభించునుగాని, మామిడిపండ్లు రావు. అట్లే మామిడి నాటినవానికి వేపపండ్లునురావు. కనుక, ఏ యే మానవులెట్టి యెట్టి కార్య ములు నొనర్తురో అట్టి కర్మలకు తగిన ఫలములను వారు పొందక తీరదు.

మానవులొనర్చు కర్మములలో సద్యఃఫలములనొసంగునని కొన్నియు, దీర్ఘ కాలమునకు ఫలించునవి కొన్నియు, ఈ కర్మములను బీజములతో పోల్చుకొన వచ్చును. బీర, వంగ, పొట్ల-మొదలగు విత్తనములు నాటిన పిమ్మట కొన్ని రోజులకు మాత్రమే ఫలించును. కొబ్బరి మొదలగు విత్తనములు చాల కాలమునకు గాని ఫలింపవు. ఒక్కొక్క కర్మఫలితమునకు వచ్చుటకు కొన్ని జన్మముల కాలము కూడ పటవచ్చును. కనుకనే తాను చేసిన కర్మముల ఫలితముల ననుభవించుటకు జీవులు ఎన్నిజన్మములనైనను ఎత్తవలసివచ్చుచున్నది. ఈ కర్మమనునది జీవుని చావదలంచినను చావనీయదు.

ఒకడు ఈనాడు నలుగురువ్యక్తులను దారుణముగ కత్తితో పొడిచి చంపి నాడనుకొందము. తన్ను బంధించి శిక్షింతురనుభీతితో వెంటనే ఆత్మహత్యకూడ చేసికొన్నాడు అంతటితో వాడుచేసిన నరహత్యలఫలము అనుభవించక తప్పునా? అజ్ఞానులు తప్పుననుకొనవచ్చును గాని,కర్మసిద్ధాంతము మాత్రమట్లొప్పుకొనదు.ఎన్ని జన్మలకైనను వెంటాడి అది తన ఫలితము నాతనికి సంక్రమింపచేసియే తీరును. అట్లు చేయకున్నచో హేతువాదమునకు ఆగ్రహము కలుగును. కారణమెప్పటికైనను కార్యరూపముగా పరిణమింపక తప్పదు. అట్లు జరుగకున్నచో, ప్రకృతి తన ధర్మ మును వీడినదగుచున్నది. ధర్మాధర్మములను పాలించు భగవంతుడను వాడొకడున్నచో ఆతడు తన రాజ్యమున, ధర్మభంగమునకు తావిచ్చినవాడు కాగలడు. కనుక ఏ విధముగా చూచినను చేసిన కర్మల ఫలమును జీవులనుభవింపక తప్పదు.

కర్మమన్నదెపుడు ఘనశక్తి యుక్తమై
ఉచితఫలమొసంగు చుంట నిజము;
ఇట్టి శక్తినే అదృష్ట మంచాడిరి
విశ్వహిత చరిత్ర। వినర। మిత్ర। — మిత్ర సాహస్రి

ఈ కర్మనుగూర్చిన విజ్ఞానము మిక్కిలి కష్టమైనది. అందఱును కర్మగతిని గూర్చి తెలియజాలరు. కనుకనే గీతలో భగవానుడు "కర్మణో, హ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః, అకర్మణశ్చ, బోద్ధవ్యం గహనా కర్మణోగతిః"— (గీత 4-17) కర్మ, వికర్మ, అకర్మలయొక్క మార్గములు తెలియదగినవనియు, ఎట్లయినను కర్మగతిమాత్రము అతీగహనమనియు పలికి, కర్మసిద్ధాంతముయొక్క దురవగాహతను స్పష్టీకరించినాడు.

మానవులను నానాజన్మములెత్తించుటకును, సుఖ దుఃఖములను గడుపుటకును బంధమును, మోక్షమును, చేకూర్చుటకును అన్నిటికిని వారువారు చేసికొన్న కర్మములే కారణములనునది ప్రకృతినియమము, పరమేశ్వరానుశాసనము. ప్రాణి సాధారణములైన ఆహార నిద్రా భయాది కర్మముల నటుంచి, విజ్ఞానముగల మానవులకు, జన్మసిద్ధములైన కర్మములనుగూర్చి విచారించినచో, అవి- నిత్య, నైమిత్తిక, కామ్య, నిషిద్ధము - లని నాల్గు విధములుగా నుండును. ఇందు సంధ్యావందనాదులు, దేహధారణావసరములగు నితరములు నిత్యములు. వీనినెల్లరు ఆచరింపకతప్పదు. ధర్మభంగము - ధర్మాతిక్రమణము జరిగినప్పుడు - తచ్ఛాంతికోసమై ప్రాయశ్చిత్తాది రూపముగా చేయుకర్మములు నైమిత్తికములు। వీటిచే కొంతవఱకు ధర్మాతిక్రమణ రూపదోషము శాంతించును. తరువాత చెప్పదగినవి కామ్యకర్మములు. స్వర్గాదులైన లోకములను కోరువారు జ్యోతిష్టోమాది యజ్ఞముల నొనర్చి, మరణానంతరము దివ్య దేహములను దాల్చి స్వర్గమున దేవభోగముల ననుభవింతురు. ఇట్లే సంతానకాంక్ష గలవారు పుత్రకామేష్టిచేసి తత్ఫలితమునందుదురు. ఇట్లు ఆ యా కోరికలుగల వారికి ఆ యా పుణ్యకర్మలు వేదములందు చెప్పబడినవి. ఇక నాల్గవరకము- నిషిద్ధకర్మములు. మద్యపానము. మాంసభక్షణము. పరస్త్రీ సంగమము, పరహింస, అసత్యము- మొదలగునవి, అనాచరణీయములైన కర్మలు. ఈ నిషిద్ధ కర్మము లాచరించినచో మానవుడు పతితుడై శునక, సూకర, క్రిమి కీటకాది నీచజన్మముల కేగి దుఃఖములనుభవించును. ఇంతకూ ఈ నాల్గుకర్మములకు ఫలములేవన్నచో- నిత్యకర్మాచరణముచే ప్రత్యవాయమను దోషముపుట్టదు. నైమిత్తిక కర్మచేత అధర్మా

చరణముచే గల్గిన దోషము శాంతించును. కామ్యకర్మములచేత శ్రేష్ఠములగు ఇష్ట శరీరములు, ఇష్టభోగములు కలుగును. నిషిద్ధకర్మములచే అనిష్టశరీరములు, అనిష్ట ఫలములు చేకూరును. ఈ సందర్భమున మానసికములగు శుభాశుభ సంకల్పాది కర్మలుగూడ పుణ్యపాపరూపములగు ఫలములనిచ్చునని మఱువగూడదు. సర్వ మానవులు ఈ నాలుగువిధములైన కర్మములనుచేసి, వాటికి తగిన ఫలితముల నందుచుందురు. సంగ్రహముగా కర్మస్వరూపమిది.

ప్రాణులనేకజన్మములనెత్తి ఆచరించిన ఈ కర్మములన్నియు ''ఆగామి'' సంచితము, ప్రారబ్దము'' అని మూడు విధము లగును. వీటిలో సాధారణమగు మొదటి విభాగము సంచితమనుకొందము. సంచితమనగా అనేక జన్మములందు సంపాదింపబడినదని యర్థము. ఈ సంచితములోనుండి కొన్ని కర్మలుమాత్రము ఫలితావస్థకువచ్చి వర్తమానకాలమందున్న శరీరము ప్రారంభమగుచున్నది. ఈ శరీర మును ప్రారంభించిన కర్మసముదాయమునే మనము పారబ్ధకర్మమని వాడుచున్నాము. అనగా, ఇప్పుడున్నశరీరమును, దీనిచే అనుభవింపదగిన సుఖదుఃఖ ఫలములను ప్రారంభించిన కర్మమని అర్థము. ప్రారబ్ధకర్మమంతయు అనుభవింపబడినచో, ఇక ప్రారబ్ధములేనందున వర్తమానకాలమునందలి ఈ శరీరము నశించుచున్నది.

జీవుడు ప్రారబ్ధము ననుభవించుచు మఱల కొంత కర్మముచేయుచున్నాడు. అనగా మఱల కామ్య నిషిద్ధకర్మముల నాచరించుచున్నాడన్నమాట. ఇది అంతయు ఆగామి యని చెప్పబడుచున్నది. ఇది రాబోవు కాలమున ఇతనిచే అనుభవమునకు తెచ్చుకొనదగిన కర్మమని భావము. ఇది సంచితములోగాని ప్రారబ్ధములోగాని చేరి యుండలేదు శరీరము మరణించిన పిమ్మట ఈ ఆగామి సంచితములో చేరుచుండును. మఱల సంచితకర్మరాశినుండి కొన్నికర్మములు మాత్రమే ఫలితావస్థకువచ్చి ప్రారబ్ధ రూపమునొంది శరీరమును సృష్టించుచుండును. ఈ ప్రకారముగా ఎన్నిజన్మలెత్తు చున్నను, ఈ కర్మపరంపర అంతములేకుండ పెరుగుచు జీవులకు నానాజన్మముల నిచ్చి సుఖదుఃఖములను గుడుపుచునేయుండును. ఇట్లు కర్మజనిత సంసారము ఎడ తెంపులేక నిరంతరమై సాగిపోవుచున్నది.

జీవునకు దేహము తాను కాదనియు, సచ్చిదానందాత్మస్వరూపమే తాననియు జ్ఞానము కలిగినచో, ఆ జ్ఞానాగ్నిచేత ఈ కర్మబంధములన్నియుకాలిపోయి, నిరతిశయ నిత్యానందస్థితి సిద్ధించి కర్మబంధములనుండి విముక్తి ప్రాప్తించును. ఇదియే సర్వులును కోరదగిన కైవల్యము, మోక్షము!

అతిసంగ్రహముగా కర్మసిద్ధాంత స్వరూపసూత్రముల నిప్పుడు మనము చెప్పికొన్నాము. ఈ సూత్రముల నాధారముగాచేసికొని, వీటిని శాఖోపశాఖలుగా సుమధుర శైలిలో విస్తరింపదలచిన మన గుప్తగారు 390 పుటల గ్రంథమును వ్రాసినారు. గుప్తగారు భగవత్కథా ప్రచారకులు. ఆ కారణమువల్లనే వారికి చక్కని వాగ్ధాటీ రచనాపాటవము అలవడినవి. నేను సంగ్రహముగా వర్ణించిన కర్మసిద్ధాంత సూత్రముల నూతగాగొని నాలుగు వందల పుటల గ్రంథమును వ్రాయుట తేలికపనికాదు. గుప్తగారు (తుమ్మెదవంటివారు) ఎవరివద్ద నేపాటి సుజ్ఞాన మధువున్నను, వారి నాశ్రయించి, అంజలించి, సేవించినవారికి బాధలేకుండ వారిలోని సుజ్ఞానమధువును స్వాయత్తము చేసికొనగల ప్రజ్ఞ ఈయనకు గలదు. ఆ విధముగా తన జ్ఞానమును వృద్ధిచేసికొనుచు గుప్తగారీగ్రంథమును వ్రాయగలిగినారు.

ఒకపుట చదివినపిమ్మట తరువాతి పుటలో ఈయన ఏమివ్రాయునా అని పాఠకు లాశ్చర్యపడుచుందురు. పాఠకు డూహింపని క్రొత్త విషయము నేదో యొకదానిని అతని చిత్తమాకర్షింపబడున ట్లీయన వ్రాయుచుండును. ఈ విధముగా ఎంతయో లోకవృత్తమును, అనేక విశేష విషయములను ఈ గ్రంథకర్త పాఠకుల కందించినాడు.

వస్తుతః బాల్యమునుండి ఈయన మంచి భక్తుడు. వినయశీలి. గురుదైవ విశ్వాసము, మాతృపితృ భక్తికలవాడు. దానికితగిన సాధనముచేయు నేర్పీయన కలవడినది. 250 పుటలో 6వ పంక్తినుండి 'ఈ గ్రంథ రచయిత 38-వ పంక్తివరకు వీరు తమ స్వీయజీవితచరిత్రోదంతమును వ్యక్తమొనర్చినారు. ఇట్టి వ్యక్తిజీవితానుభవములు పాఠకుల కుపకారము కలిగించుననుటలో సందేహములేదు.

ఈ గ్రంథములోని చివరపేరా 391 లో 14 పంక్తిలోని వాక్యములు ''పనికిమాలిన......... వ్రాసినది'' ఈవేదాంత వాక్యములు చూచినప్పుడు ''ఆంధ్ర మహాభారతోద్యోగపర్వములోని దిగువ పద్యము గుర్తుకురాకమానదు.

''ఒకటి గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి<br>
మూటి, నాల్గింటఁ గడు వశ్యములుగఁజేసి<br>
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు<br>
విడిచి వర్తించువాఁడు, వివేకధనుడు....''

ఈ పద్యము రాజనీతికి సంబంధించినవి. ఇందలి అంకెలు సంకేతార్థములు కలవి. బ్రహ్మముగారుగూడ "మూడుకాల్వలు దాటిలేరన్నా" అను తత్త్వములో "మూడు కాల్వలు" అనెడి పదముచేత-ధనేషణ, దారేషణ, పుత్రేషణ,-అనెడి ఇషణత్రయము తోపింపజేసినారు. అట్లే సిద్ధప్ప "ఏడుమెట్ల నిచ్చెనవేనుక వెలుగుదాటి పువ్వులుగోసుక పూజకు నేనొస్తి" అను తత్త్వములోను ఏడుమెట్ల నిచ్చెన అని ఆధారాది చక్రముల సూచించినాడు. ఇది వేదాంతులవలంబించు నొక నిగూఢబోధ మార్గము. మొత్తముమీద కర్మసిద్ధాంతము అనుపేర అనేకాంశములను ప్రోగుచేసి కొని నాలుగువందల పుటల గ్రంథమును వ్రాసిన శ్రీ గుప్తగారభినందనీయులు. ఇందలి భాష సరళము, సర్వగ్రాహ్యము.

పాఠకు లీగ్రంథమును పలుసార్లు చదివి అవగాహనచేసికొని దుష్కర్మముల జోలికిపోక, సత్కార్యములకు చేయుటకేమఱక, కర్మబంధములనుండి క్రమముగా విముక్తులై ఆత్మదర్శనానందము నందుదురుగాత యని యాశింతము.

తెనాలి
ది. 11-6-81

ఇట్లు
డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు



# దేవుని మహిమా విభూతి

"సాహిత్య కళానిధి" శ్రీ శ్రీ శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి



జీవుడు క్రిమి కీట పశు పక్ష్యాది జన్మ లెన్నియో యెత్తియెత్తి, పడరాని యిడుమ లెన్నియో పడిపడి కర్మపరిపాకమున తుట్ట తుదకుగాని, మానవత్వము ను పొందజాలడు. ఆహార నిద్రాభయాది లక్షణములు క్రిమి, కీటకాదులకును-మానవులకును సమానమే. కాని, మానవునకు జ్ఞానము విశిష్టలక్షణము. అందుకే విజ్ఞులు "జంతూనాం నరజన్మ దుర్లభ" మన్నారు.

జ్ఞానమనగా, మంచిచెడ్డలు; పుణ్యపాప పాపములు; కృత్యాకృత్యములు; సత్యాసత్యములు తెలిసికొని, సహనము. శాంతము, సర్వసమభావము. భూతదయ, పరోపకారము, భగవద్భక్తి, మొదలగు సద్గుణము లలవరచుకొని లోకహితవర్తనముతో మెలగు మెలుకువ. అట్టి మెలకువలేక, అసహనము, అశాంతి, భేదభావము, స్వార్థపరత్వము, భగవద్ద్వేషము, సజ్జననింద, మతభేదము, మొదలగు దుర్గుణములతో లోకబాధకుడుగా వర్తించువాడు, ఆకృతిచేత, మానవుడయ్యును, దానవు డనిపించుకొనును. కావుననేగదా, భాగవతకవి-బమ్మెర పోతరాజు—

> "చేతులారంగ శివునిఁ బూజింపడేని
> నోరునొవ్వంగ హరికీర్తి నొడువఁడేని
> దయయు సత్యంబు లోనుగాఁ దలపఁడేని
> కలుగనేటికి ? తల్లుల కడుపుచేటు !"

అన్నాడు. మానవుడెంత ఉత్తమవర్తనుడైనను, వివిధకర్మలొనర్చి మిక్కుటమైన ధనమార్జించినను, ఎన్నిభోగము లనుభవించినను, దాసదాసీజన మర్యాదలను పొందినను, హంసతూలికాతల్పముపై సతీసమేతముగ సంసారసుఖములను చూరగొన్నను-అదియంతా మూణ్ణాళ్ళముచ్చట. తను వేమి శాశ్వతమా ? భోగభాగ్యములు తనవెంట

వచ్చునా? అవియన్నియు తనువుతోనే సరి. ఈ సత్యమును గుర్తించి, ప్రతి మానవుడు-శాశ్వతానంద సంపాదనకు సమకట్టవలె. శాశ్వతానందమనగా మోక్షము. మోక్షమనగా జనన మరణ చక్రభ్రమణమునుండి విడివడుట. అందుకు మార్గములు మూడు. భక్తి, జ్ఞానము, వైరాగ్యములు. ఈ మూటిలోను భక్తి సులభమార్గము. భక్తియనగా, విషయవాంఛలు విసర్జించి, అహంకార మమకారములు చంపుకొని 'అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అని నిశ్చలహృదయముతో నిరంతర ధ్యానముతో భగవంతుని శరణుజొచ్చుట.

ఆ 'చొచ్చుట' యెప్పుడు? బుద్ధిబలము, అవయవముల పాటవము, శరీరశక్తి చేతిలో పెత్తనము, అణగారిన పిమ్మట ఎప్పుడో ముదిముప్పునకాదు; తనూధార్ఢ్యము చక్కగా నున్నప్పుడే. ఆ ప్రయత్నము సాగింపవలెను. సంసారపు గొడవలన్నియు తీర్చుకొని, తిన్నగా-తీరికగా-భగవద్ధ్యానమున కుపక్రమింపవలెనని కొందరనుకొనుచుందురు. అది, అలల యలజడి ఆగిన తరువాత, సముద్రములో స్నానము, చేయవలె ననుకొనుటవంటి వివేకముమాలిన యాలోచన.

అది యట్లుండనిండు. ఇంతకును భగవంతునియెడ భక్తిభావ మేర్పడుట యెట్లు? అది వారి వారి పురాకృత సుకృత విశేషమున పుట్టుకతో రావలసినదేగాని, ఒకరింకొకరికి కనికరించి యిచ్చుటకుగాని, ఎరువుతెచ్చుకొనుటకుగాని వీలైనదికాదు. ఐశ్వర్యముచేతగాని, అధికారముచేతగాని భక్తిని పడయశక్యముకాదు.

ఉ॥ అచ్చపుఁజీఁకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణులైన వారికిం
జెచ్చరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేఁగిననైన హరిప్రబోధముల్?

(శ్రీ మహాభాగవతము - సప్తమస్కంధము) 181 ప.

శ్రీహరికృపకు పాత్రములై, తాము తరించి, యితరులను తరింపజేసిన భక్తజనుల చరిత్రలన్నియు నిందుకు తార్కాణములే. ఎవరిచరిత్రమో యెందుకు? ప్రకృత గ్రంథకర్త శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతుని చరిత్రయే మనకు ప్రత్యక్ష నిదర్శనము.

బాల్యమున- పల్లెకూటమున శ్రీ బొగ్గరము వేంకటరంగయ్యా, నరసింహారావు హనుమయ్య పంతులుగార్లయొద్ద అక్షరాభ్యాసమున కారంభమొనర్చి విద్యార్జనము చేసిన దినములలోనే, ఈయన హృదయక్షేత్రమున భగవద్భక్తి బీజములు మొలకలెత్తినవి. తోడిబాలురతో ఆటకాయతనముగా క్రీడించుచున్నను మనసు మాధవాను చింతనమున మగ్నమైయుడెండిది. గురువులయెడ కవిపండితాది పెద్దలయెడ జ్ఞానులయెడ వినయము, విధేయత, భయభక్తులు మున్నగు మేలిగుణములు, ఈయనకు స్వాభావికములు. ఈయన మంచి మేధావి. బహువిధ గ్రంథములను పఠనమొనర్చి వివిధ వేదాంతవిషయములను సాహిత్యపురీతుల నెన్నింటినో సంతరించుకొనిరి. ఎంత పెద్దపద్యమునైనను, గొట్టుపాఠమునైనను ఒక్కమారు చదువుటచేతనే, ధారణచేసి తప్పులేకుండ వెంటనేఒప్పగించెడివాడు. ఆ యసాధారణశక్తికి సంతోషించి గురువు లీయనను 'ఏకసంధాగ్రాహి, యని మెచ్చుకొనుచు, అత్యంత వాత్సల్యముతో గౌరవించెడివారు.

గుప్తలో గుప్తమైయున్న హరిభక్తి క్రమక్రమముగా వెలికబుకసాగినది. భాగవతములోని ప్రహ్లాదచరిత్ర - వీరి కిత్యంత ప్రియము. శ్రీ ప్రహ్లాదభక్తి ఆదర్శము. శ్రీ నరసింహదేవుని ఉపాశించుచు సర్వదేవతామూర్తులలో నరసింహదేవునే దర్శించుచు తదనుభూతినొందెడి అద్వైత భక్తిమూర్తి.

తెనుఁగుచదువు అధ్యయనముచేయించిన గురువులు త్రిమూర్తులు. అట్లే శ్రీ హరికథాధ్యయనము చేయించిన గురువులు ముప్పురు శ్రీ విద్యాదానకర్ణ, తెల్లాకుల వేంకటేశ్వరగుప్తా భాగవతులు. "భక్తిప్రచారప్రవీణ" ఆదర్శకవి కథకాచార్య" శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతులు, 'మృదుమధురగాయకులు' వినయవివేక సౌజన్యహృదయులు శ్రీ ఆత్మకూరి గురుబ్రహ్మగుప్త భాగవతులుగార యొద్ద శ్రీ భక్తప్రహ్లాదాది కథల ధ్యయనమొనర్చి ఆంధ్రదేశమునందు వెలుగొందెడి పవిత్రాలయములందు పెద్దలాహ్వానములతో వెళ్లి, కథాగానములొనర్చి విజ్ఞులైనవారిచే బిరుదు సన్మానములనుపొంది సద్యశోవిరాజితులైరి.

గుప్త గొప్పవాడై, కవియై, కథకుడై మహాపండితుల మెప్పులను వడయుటకు మూలకారణ మొక్కటున్నది. శ్రీ లక్ష్మీనృసింహకళావతారమూర్తులు, యోగవిద్యా విశారదులు, ధీరగంభీరతేజోవిరాజితులు, 'తోకపల్లిస్వామి,' వారని వేనోళ్ళ కీర్తింపబడిన శ్రీశ్రీశ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి పరమపవిత్ర పాదపద్మద్వయ

సన్నిధి లభించుట, వారికృప ప్రవహించి మంత్రదీక్షనిచ్చి మహిమావిభూతిని ప్రసాదించుటయే ప్రధానమై యున్నది.

ఈ గ్రంథ రచయిత శ్రీ సుబ్బరాయగుప్త చదివిన ప్రాథమిక విద్యను తన సద్గురు కరుణచే బహుగ్రంథపఠనముచే పెంపొందింపచేసుకొనిరి. దేశమునందుగల కవిపండిత విద్వద్గాయకులను మహాత్ములను సాధుపుంగవుల నెందరినో దర్శించి వారిని భక్తితో సేవించి వారి సత్యసందేశములను శ్రద్ధతోవిన్న, కవుల చర్చలను పండితుల సూక్తులను ప్రశాంతమతితో నవగతమొనర్చుకొన్న, సుసంస్కార ప్రభావముతో వేదాంతరచనల నొనర్చి లోకమున కందించి, గురువుల ఋణమును దీర్చి తన కర్తవ్యమును నిర్వహించి, శ్రీనరహరికృపకు పాత్రులై జన్మను చరితార్థ మొనర్చుకొనిరి.

ఎంతోకాలము మనోమధనముతో రచనచేయుట, ఆ యీ రచనమును ముద్రణ చేయించుటకై తెలిసినవారి సన్నిధికి - తెలియనివారిసన్నిధికి జని స్వీయానుభవములను సద్గురుశక్తిని భక్తితో యోర్పుతో తెలియచెప్పి వారిచేత విరాళములను వాగ్దానములు చేయించి, విసుగు విసర్జించి గృహకర్మములను త్యజించి యెన్నోసార్లు విరాళదాతల గేహపరిభ్రమణములతో విరాళధనసేకరణ మొనర్చుట—.

ఆ సేకరణధనమును భద్రమొనర్చుకొని, తెనాలి చేరి మారీసుపేటలోగల శ్రీ సప్తగిరి ఆర్ట్ ప్రింటర్స్‌వారితో సంప్రదించి ముద్రణమునకై వ్రాతప్రతి నర్పించి పేపర్ తెప్పించి, వారికర్పించి యెన్నోశ్రమలు భరించి, ముద్రణమును పూర్తి నొందించి, కవిపండితాది పెద్దలకాహ్వానములను బంపించి వారివారి సత్యసదభిప్రాయములను సేకరించి సర్వాంగసుందరముగ గ్రంథమును సంపూర్తిచేయించి. ఆ హ్వానములను, కపిలగిరియందు వెలింగెడి శ్రీ సద్గురు యోగానందనరసింహస్వామి వారి దివ్యతపోసమాధిమందిరప్రాంగణమున కవిపండితాది పెద్దల సమక్షంలో విరాళదాతలెల్లరు యానందమొందెడి మహాపర్వసమయములో గ్రంధావిష్కరణ మొనర్చి కవులకు సన్మానములు విరాళదాతలకు హ్వానములను సమర్పించుటాదిగాగల కార్యములను నిర్వహించుట యెంతటి బాధ్యతాభారమైన మహకర్మనిర్వహణమో?

'ఈ కర్మసిద్ధాంతము రచన' కర్మభూమియందవతరణ మొందిన మనకెల్లరకు సర్వదా శిరోధార్యము. మానవులకు సంప్రాప్తమయ్యెడి సుఖదుఃఖాది ద్వంద్వ

నమూహమంతయు వారొనర్చిన కర్మల ప్రతిఫలములేనని, ఎంతటి ధీశాలురైన యనుభవించక తప్పదని గుప్తాగారు వివిధోపమానములచే నిర్ధారణమొనర్చిరి.

ఇది ఆస్తికులెల్లరు పఠించవలసిన యుత్తమగ్రంథము. ఆస్తికత నణుగంటి నాస్తికత అంతకంతకును మిక్కుటమగుచున్న యీ కాలమున ప్రజానీకమునకు కావలసిన విట్టిగ్రంథములే. ఈ గ్రంథము పాఠకుల హృదయములలో భగవద్భక్తిని ధర్మకర్మనిర్వహణాసక్తిని, అధర్మకర్మలపై విరక్తిని కల్గించి వారి చిత్తములను భగవదారాధనకు ఉన్ముఖములు కావించుననుటలో సందేహములేదు.

ఈ గ్రంథకర్త పెద్దనాన్నగారైన శ్రీ కోట హనుమయ్యగుప్తాగారు నేను వినుకొండ తాలూకయందు 'బొమ్మరాజుపల్లె'లో నివాసముచేయు కాలమున 'చిట్టాపురము' గ్రామమున విద్యాబోధచేయు రోజులలో నాయొద్ద విద్యాభ్యాసమొనర్చిరి.

ఆనాటి మా సంబంధమే కాలక్రమమున వారి వంశసంజాతుడగు శ్రీ కోట సుబ్బరాయ కవివరుని కవితాసంబంధముగా విరాజిల్లినది వైశ్యులకు వ్యాపారమునం దాసక్తి, ధనార్జనశక్తి స్వాభావికములు. ఈ గుప్తాగారికి జగత్సంసారియగు మురారియందాసక్తి, సాహితీలోతుల నెఱింగెడి శక్తి స్వాభావికములైనవి. ఇట్టి అదృష్టము గుప్తలందరికి లభింపజాలదు. జన్మాంతర పుణ్యఫలశక్తివలన మాత్రమే లభ్యమగుచున్నది.

ఈయన గురుకటాక్షమున తానును నరసింహోపాసన మొనర్చి కృతకృత్యుడైనాడు. ఈయనకు ప్రపంచమంతయు నరసింహమయమే. ప్రతిశబ్దము ప్రణవ స్వరూపమనెడి భావనయే. అదే నిజమైన భక్తికి లక్షణము.

ఈ గ్రంథకర్త జన్మస్థలము వినుకొండసీమలోని పెద్దకొండాయపాలెము. వినుకొండ శ్రీ సీతారాముల దివ్యపాదచిహ్నములచే ముద్రితమైన పవిత్రపట్టణము. శ్రీరామదూతయు, భక్తాభీష్టప్రదుడునునైన శ్రీ గుంటి హనుమంతునకు నిలయమైన పుణ్యస్థలము కీర్తన కంఠీరవుడును, నరసింహోపాసకుడును, భక్తశిఖామణియునైన శ్రీ సుబ్బరాయగుప్త భాగవతులుగారు వినుకొండసీమవారగుట ఆ సీమకీర్తి కొక నూతనవికాసము; ఆ సీమకుచెందిన మముబోంట్లకు ఆనందహేతువు.

నెల్లూరు
ది. 24-6-81

ఇట్లు
దీపాల పిచ్చయ్యశాస్త్రి

# బ్రహ్మోద్యమము

## శ్రీ టి. శామ్యూల్ కవి

ఆత్మయే బ్రహ్మము-బ్రహ్మయే నాదము ఆ నాదమే ఓమ్ యిత్యేకాక్షరమ్-



ఆ అక్షరమే నాశరహితమైన ధ్వని - ఆ ధ్వని ఒకే ఒక్కటి. ఆ ఒక్కటియే జీవితమున తావృతిమార్గము. ఆ బ్రహ్మము జీవితములలో ప్రతిఫలించుచుండును. పరిణామము చెందుచుండును. ఆ బ్రహ్మమును కేంద్రముగా తీసికొని జీవితమును బ్రహ్మముతో పోల్చుకొనుచు పురోగతినొంది బ్రహ్మసాక్షాత్కారమును పొందుట యే ముముక్షువునకు విధి.

ఈ విధిని గమనించుట కెంతటి జన్మసంస్కారమో; యెంతటి లోకజ్ఞతయో, యెంతటి స్వానుభవమో కావలసియుండును. ఇన్ని యుండినను చిత్తస్థైర్యము లలవరచుకొనకున్న నిరుపయోగము. ఈ సత్యమును ధృవపరచుటకే శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతోత్తములు తన వేదాంతగమనమును సాగించినారు. వస్తుతః జిజ్ఞాసపరుడు; ముముక్షువు. కావుననే జీవితపరమయిన బ్రహమును జీవితములలో రంగరించి వన్నెలుతేల్చి విలువకట్టి, వదలినాడీ వణిజుడు.

ఈయన యుపన్యాసములు నేలవిడచి చేసెడి సాములవలెగాక నొక యాధారమును చుట్టివచ్చుచున్నట్లనిపించుచుండును. కన్నులకు కన్పించుచు వీనులకు విన్పించుచుండును. ఇట్టి రచనల చదువుటవలన, మానసికస్థితు లెన్నియోరీతుల విశ్లేషించి యెన్నియో స్థితులలో కుదురుకొను తీరుల స్ఫురణకు తెచ్చుచుండును. ఇన్నిరకముల మానసిక పరిణామములుగల మనుజులుండురని, మనస్సే యుపద్రవములకు వక్రమార్గము లనుసరించుటకు మూలకందమను సత్యమును గమనింపచేయు మహత్తర గ్రంథమిది.

చిన్నదయ్యు నెన్నదగిన యీ పుస్తకపఠనమున లౌకికజ్ఞానము మొగ్గదొడిగి బ్రహ్మజ్ఞానమున పయనించి నిత్యసత్యసనాతన చిన్మయానందజ్యోతిని కనుగొనజేయు ననుటకెట్టి సందియమును లేదు.

బ్రహ్మవిదులు పండితులు వేదబ్రాహ్మ్యఉపనిషద్గీతాపారాయణము లొనర్చియు గ్రహించిన విషయములనే పునశ్చరణ మొనర్చి యథాతథముగా నాసిద్ధాంతములనే వచించుచు వారి శేముషీధురంధరత జూపుచుందురు. కాని, వేదాంతపిపాసికి బ్రహ్మ జిజ్ఞాసువునకు కావలసిన దదికాదనియు బ్రహ్మమును నిరూపించుట యా పరబ్రహ్మ మునందైక్యమగుటయే కర్మసిద్ధాంతమునకు మూలమని యెరింగిన గురుసేవాపరాయ ణుడు శ్రీ లక్ష్మీనృసింహోపాసకుడైన ఈ కవిగారు నింతగ్రంథమును వ్రాసి లోక మున కందించిరి.

జీవితమునకు బంధమోక్షణములయిన కర్మలనుపట్టితెచ్చి తనపరిశోధనశాలలో బంధించి యా కర్మలు మనస్సులో చలించి సంకల్పమున రూపుగొని బహిర్గత మగు చుండునన్న సత్యమును తేల్చినాడు. చదువు వానికి తెలియకున్నను చదివించు బలమయిన చక్కని చిక్కని రచనమునేర్చి కూర్చగల నేర్పరి.

ఎన్నెన్నో జీవితములను వారికర్మలను యా కర్మపరిణామములనుకన్నులకుగట్టి 'మనస్సు చంచలమ్ - కర్మఫలమ్ నిశ్చయమ్ - భద్రం' - అని పాఠకుల వీపుచరచి యుద్బోధించుచున్నారు. కావుననే, లోకజ్ఞతనేని జీవిత స్వారస్యమునేని, కర్మ నిజస్వరూపమునేని గమనింపుచు సమన్వయపఱచుకొనుచు చరించుచున్న నది వ్యథయే గాని జీవితసుధ కానేరదని నిర్ధారణమొనర్చినారీ కవిగారైన శ్రీ గుప్తగారు.

వెలకాంతలచెలి మెంతవానికైన వినాశము చేకూర్చునని, మతిగతిదప్పిన, దుర్గతి దుఃఖము చేకూరునని సర్వులకు బోధారూపమగు హెచ్చరిచేసిరి.

నేటి కలికాల ప్రభావమును కలికి బానిసలైన దుష్టనరులొనర్చెడి దుందుడుకు కర్మలను యెంతో నేర్పుగా పాఠకులకు గోచరింపచేసిరి. వీరు నేను ఒకతాలూకలోని వారమే. వినుకొండసీమ వేదాంతకవులకు విద్వన్మణులకు పుట్టినిల్లనెడి నుడిని సార్థకమొనర్చి శైలిలో శ్రేష్ఠత్వమును జూపి మహాపండితకవుల మెప్పునువడసిరి.

మ॥ నిజమేదో పరిశీలనాత్మకముసై - నిర్ణీతమైయుండె - నా
ఋజువే జీవితమందు జేర్చుకొనగా - ఋక్పాఠముల్ బుట్టె - నా
నిజమిట్లే యొడబోసి జీవితములో - నిగ్గెల్ల దేల్చెంజు మీ
విజయంబందెను సుబ్బరాయ బుధుడు - ద్వేగంబునం దిట్టయై.

గీ॥ భక్తియును, జ్ఞాన వైరాగ్యముక్తులకును
కర్మయే కారణముగాన - కర్మలేక
జన్మ సాఫల్యమందదు - జ్ఞాని కర్మ
విజ్ఞుడై, యాచరింప ల - భించుముక్తి.

శా॥ బంధంబిచ్చు, కుకర్మలాత్మ, కధికం - బై యొప్పు సత్కర్మలున్
సంధించున్మది కెల్లవేళలను స్వ - చ్ఛంబైన యానందమున్
అంధత్వమ్ము సడల్చి యేనరుడు స । త్యంబైన నిష్కామ క
ర్మం, ధర్మస్థితి జల్పునాతడె గొనున్ - మాన్యంబునౌ మోక్షమున్.

శా॥ జ్ఞానస్థానమునౌ నృసింహభజనా - సక్తుండు నైనట్టి । ల
క్ష్మీనారాయణ పుత్రుడై సుకృతియై - జెన్నూరి కోటాన్వయ
స్థానంబందు జనించి, మిక్కిలి సమ - ర్థంబైన బ్రహ్మోద్యమ
ధ్యానమ్ముల్ వికలించె నిష్ఠమెయి సుబ్బారాయగుప్తాఖ్యుడై.

ఇసుమెళ్ళ
ది. 24-6-81

"సంయమీంద్ర"
టి. శామ్యూల్ కవి



శ్రీ వాగ్దేవతాయైనమః

''సరస్వతీపుత్ర'' ''మహాకవి''

## పద్మశ్రీ డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

చిరంజీవి, సుబ్బరాయగుప్త భాగవతునకు - ఆదర్శమైన అందరికి కావలసిన ఆచరించదగిన యోగత్రయములో మొదటిదైన కర్మయోగమును ప్రాతిపదికగ తీసికొని మిగిలిన భక్తియోగము, జ్ఞానయోగములు రెండింటికి కర్మయోగమే పునాది యని నిర్ధారణ మొనర్చిన మీ మేధాసంపత్తి మిగుల శ్లాఘనీయమైనది.



కర్మయే జన్మకు కారణము. కర్మలేనిదే జన్మలేదు. జన్మలేనిదే కర్మలేదు. ఈ జన్మకర్మల విషయ రహస్యమంతటిని మీ పొత్తమునందు విపులముగ విశేషముగ వివరముగ వ్రాయుట నేటి లోకమునకు గొప్ప మేలు చేకూరినది.

భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్త్వ, ముక్తులకు సైతము కర్మయే పునాది. ఈ విషయము నాధారముగ తీసికొని పదునెన్మిది వ్యాసములతో శ్రీ భగవద్గీతలోని యాధ్యాయములవలె ప్రకాశింపచేసి మహాకవుల మెప్పులను పొందుట సామాన్యమా?

ఇదంతయు మీ ప్రజ్ఞకాదు. మీరు సదానమ్మి ధ్యానించెడి శ్రీమన్నారాయణుని మహామంత్ర మహిమ. దివ్యయోగ తత్త్వరహస్యముల నన్నింటిని కరతలామలక మొనర్చుకొన్న సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామివారి పవిత్ర పాదపద్మద్వయ సన్నిధి మీకు బాల్యజీవితమునందే లభించుటయే మీరిట్టి రచనమును చేయ మహత్తర శక్తి మీకు లభించినది.

సాధకులకు వక్రరీతులలో సంచారమొనర్చెడి మనోగతులలోని పొరపాట్లనన్నింటిని యథాతథముగ మీ రచనాదర్పణమున సాక్షాత్కరింపచేసి వారికెంతో మహోపకార మొనర్చిరి.

ఈ గ్రంథము కర్మభూమియం దవతరణమొందిన ప్రతివ్యక్తికి ధర్మకర్మల యందాసక్తి, అధర్మకర్మలయందు విరక్తి నిష్కామకర్మములయందు భక్తిని కల్గించి గొప్ప మేలొనరించుననుటయం దెవ్వరి కెట్టి సందేహమువలదు.

ప్రతి మతము నిత్యసత్య శివసుందరాత్మకమగు చైతన్య తత్త్వమైన దైవము నందు చేర్చగలదు. మతమేదైనను మనుజుడు నీతి, నిజాయితీ, సత్య, ధర్మ, ప్రేమ, అహింసాది పవిత్ర కర్మముల నాచరించిననాడే పరమపదప్రాప్తి చేకూరు మహావకాశము గల్గునని శ్రీ గుప్తాగారు ప్రబోధముచేయుట మిగుల రమ్యముగా శాస్త్రసమ్మతముగా యద్వైతదృష్టి కాదర్శముగ నలరారుచున్నది.

ఈ గ్రంథ రచయిత శ్రీ కోట సుబ్బరాయగుప్తా భాగవతోత్తముని దృష్టి, రచనాసృష్టి, కర్మలపై కర్మసిద్ధాంతములపై కర్మములందు గల మంచి చెడ్డలపై వాటి ఫలాఫలములపై ప్రసరించి ప్రయాణమొనర్చి "వక్రకర్మ లొనర్చిన వారెంతటి మేధాశాలురైనను, సదా దైవమును ప్రార్థన-భజన-పారాయణాది కర్మలతో యుపాశించినను, కాలగమనమున కర్మ పరిపక్వసమయమునందా యా వక్రకర్మల ఫలము వెన్నంటి వేటాడి కన్నీటిలో స్నానము చేయించక వదలదని" నిర్భయముగ ధీరత్వముతో శ్రీ లక్ష్మీనృసింహోపాసన మహాబలశక్తితో తన రచనముద్వార, గమ్యము దెలియని గమనముతో పర్వులుతీసెడి నేటి సంఘమునకు హెచ్చరికచేసి దివ్యజాగృతిని కల్గించిరి.

నిజము చెప్పవలసినచో శ్రీగుప్తాగారి రచనము సత్యదృష్టిగల వారెల్లరికి సమంజసమై నిత్యజీవిత జీవనకర్మములకు పునాదియై భాసిల్లుచున్నది.

మానవుని కులమేదైన మతమేదైన ఈ కర్మసిద్ధాంతములోని ప్రతివాక్యము తన నిత్యజీవిత జీవనకర్మములందు మేళవింపచేసికొన్ననాడే సుస్థిరమైన శాంత్యా నందములను బడయగల్గును.

ఎంతోకృషితో, దీక్షతో, పట్టుదలతో, యోర్పుతో, నేర్పుతో, భక్తితో పెద్దల కృపాశీర్వాదబలశక్తితో శ్రీ సద్గురు మహామంత్రమహిమతో నింతటి గొప్ప సత్య సవిమర్శ సద్గ్రంధరాజమును రూపొందింపచేసిన శ్రీ గుప్తాగారికి వీరి కుటుంబము నకు శ్రీ లక్ష్మీనారాయణులు, ఆయురారోగ్యైశ్వర్యములు భక్తిజ్ఞానములు నొసంగి, ముక్తిసామ్రాజ్యమును చేకూర్చెదరుగాత !

కడప
12—7—81

ఇట్లు
పుట్టపర్తి నారాయణాచార్యులు

ఓమ్

# శ్రీ సద్గురు శక్తి - శిష్యుని భక్తి

పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపులగు ప్రియాత్మబంధువులారా ! శ్రీ కోట సుబ్బరాయగుప్త కవిగారు సహృదయులు ఉత్తమకోటికి చెందినవారు. శ్రీశ్రీశ్రీ యోగానంద నరసింహస్వాములవారి ప్రియశిష్యులు. కరుణాకరుడగు శ్రీ నరసింహ స్వామియొక్క ఉపాసకులు. మరియు భాగవతార్ అనగా శ్రావ్యముగా భక్తిపార వశ్యముతో హరికథాగానము చేయుచుండువారు. మిక్కిలి గురుభక్తి గలవారు. అందరియందు తన గురుస్వరూపమునే దర్శించుచు తదనుభూతి నొందెడివారు. కనుకనే, వారి సద్గురువరేణ్యుల దివ్యకృపాశక్తి ప్రభావముతో "కర్మసిద్ధాంతము" అనెడి నామముతో ఎన్నో విషయరహస్యములను పాఠకలోకమున కందించి గొప్ప మేలును చేకూర్చిరి. ఈ గుప్తగారి రచనము సరళము సద్భావోపేతము. ఇందు పదునెన్మిది అధ్యాయములు గలవు. ప్రతివిషయము మృదువైనభాషతో లోకానుభవ ముతో చక్కగా వివరింపబడినది. గమనింపుడు.

శ్రీకృష్ణపరమాత్మ పరమభక్తుడైన పార్థుని నెపముగా నెన్నుకొని ముముక్షు జనసహస్రములకు శ్రీ భగవద్గీతా ప్రబోధము పదునెన్మిది యధ్యాయములుగ ప్రబోధ మొనర్చిరి.

అదేవిధముగ పరిపూర్ణ పరబ్రహ్మస్వరూపులైన సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామివారి దివ్యయోగాత్మశక్తి, తన ప్రియశిష్యుడైన భక్తవతంసుడైన శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతునిలోచేరి నేటి లోకమునకు "కర్మసిద్ధాంతము" అనెడి పేరుతో పదునెన్మిది విషయములతో నరులొనర్చు కర్మనిగతులలో చిత్ర విచిత్రరీతుల నెన్నింటినో ప్రబోధమొనర్చి, "శ్రీ సద్గురు శక్తి - శిష్యుని భక్తి" రెండింటిని పాఠకులకు వ్యక్తమొనర్చినది.

ప్రతివ్యాసమును ప్రేమతో జదివి సజ్జనులు సద్విషయముల గ్రహించి యాచరించి జీవన్ముక్తి నొందెదరుగాక.

ఓమ్ లోకాసమస్తా స్సుఖినోభవంతు

ఓం శ్శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఓమ్ తత్ సత్ ఓమ్

శ్రీ వ్యాసాశ్రమము
12—7—81

ఇట్లు
శ్రీ విద్యానన్దస్వామి

## ఓమ్ తత్ సత్

పవిత్రాత్మస్వరూపులు పరమభక్తిపూరిత హృదయులు. శ్రీ లక్ష్మీనృసింహ స్వామి దివ్యానుగ్రహపాత్రులు, సద్గురు భక్తితో నరహరి శక్తితో లోకమునందు, లోకకర్మములందు చరించెడి శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతోత్తములు, మనోమధనముతో ఆవేదనతో మన పూర్వసంస్కృతిని ఆదర్శభక్తిని వినిర్మలజీవిత గమనమును ప్రజలలో ప్రవేశపెట్టి భారతీయుల పూర్వటౌన్నత్యమును మరల వెలిగింపచేయు సత్సంకల్పముతో "కర్మసిద్ధాంతము" అనెడి రచనమును సంపూర్తి చేసి నాకు బంపించి నా అభిప్రాయమును కోరుట నాకెంతో ముదావహము.

భారతీయ సంస్కృతిపై ఎన్నో రచనములొనర్చి ముముక్షువుల కందజేసిన నేను గుప్తగారి రచనమును ఆద్యంతములు చదివి వీరి సునిసితసత్యదృష్టికి కర్మాకర్మములపై వీరుచేసిన సాహితీసంగ్రామమునకు నాహృదయమెంతో పరవశించినది.

నేటికాలమున నూటికి తొంబదిమంది సాగించెడి మాటలకు వారి చేతలకు తూర్పు పడమరలంత వ్యత్యాసము వ్యక్తమగుచున్నదని గుప్తగారు వారి రచనయందు పేర్కొనిరి.

ఈ గురుభక్తిని రచనయందు వీరి బహుముఖప్రజ్ఞ వివిధస్థల సంచార మహిమ. భిన్నమైన తత్త్వములుగల వ్యక్తుల స్వరూపస్వభావముల తీరు చదువరుల కన్నులముందు సాక్షాత్కరించు రీతిగ రచనమును సాగించి లోకమునకే గొప్ప మేలొనర్చిరి.

ఆంధ్రదేశమునందుగల పవిత్రాశ్రమములను ఆశ్రమాధికారులైన స్వాములను గుప్తగారు భక్తితో దర్శించి వారి పవిత్ర పాదపద్మములకు సాష్టాంగ నమస్సులర్పించి సత్సంభాషణము లొనర్చి వారివారి సందేశములను విన్న తాత్త్వికసంస్కార శక్తి ఈ గ్రంథమునందంతటను తాండవము చేయుచున్నది.

ఈ గ్రంథ రచయిత శ్రీ గుప్తాగారు నాకు చిరకాలమునుండి తెలిసినవారు. శ్రీ అఖిలాంధ్ర సాధుపరిషత్సభలలో తెనాలి, పాలకొల్లు, బొమ్మకల్లపల్లి, సిద్ధిపేట, ఆదోని, కోదాడులలో (పూజ్యశ్రీ శ్రీ శ్రీ శ్రీ కేశవతీర్థస్వామివారి రచనము) "భక్త

ప్రహ్లాదచరిత్రము'' ను వివిధ వేదాంతోపమానములతో భక్తిబాష్పలోచనములతో గానమొనర్చి వేలాది భక్తులను, శ్రీ సాధుసభావేదిక నలంకరించిన మహాత్ములందరిని మంత్రముగ్ధ మొనర్చిరి.

ఇంతటి సారస్వతము, [ నృహరికథాకదన దీక్షాదక్షతలు, శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి దివ్య కృపాశీర్వాదసహిత మహామంత్రానుష్ఠాన మహిమయేనని మేమెల్లరము గుర్తించి సంతసమొందితిమి.

ధర్మశక్తికి, సత్యనిరతికి, సద్గురుభక్తికి లోకము మోకరిల్లవలసినదే. భారత దేశమున నాటినుండి నేటివరకు శ్రీ శంకరరామానుజ మధ్వాచార్యాది పెద్దల బహువిధ ప్రచారప్రబోధకర్మముల ప్రభావశక్తి తైలధారవలె ప్రవహించుచునే యున్నది.

ఏకాలమునందైన యేసమయమునందైన యెట్టివారైన యే యే కర్మములను చేయుదురో నా యా కర్మఫలములను విధిగ ననుభవించవలసినదేనని శ్రీ గుప్త గారు నిర్భయముగ నిర్విచారముగ వివరముగ విశేషముగా పాఠకలోకమునకు ప్రబోధమొనర్చిరి.

ప్రతిమనుజు డీ గ్రంథమును నిత్యపారాయణ గ్రంథముగా గుర్తించి పఠన మొనర్చి వాని జీవితనడతలందు గల తప్పులను వక్రకర్మములను వెంటనే ధీశక్తితో త్యజించి అర్థధర్మకర్మ నిరతుడైననాడు పూర్ణపురోగతి నొంది పురుషోత్తముని పరిపూర్ణకృపకు పాత్రులై తరించెదరుగాత !

మహాయోగిని ఆశ్రమము
పెనుమత్స పోస్టు
గన్నవరం తా॥ కృష్ణా జిల్లా
29—6—81

ఇట్లు
శ్రీ నిర్విషయానందస్వామి

జయ జయ లక్ష్మీనృసింహా

# ఆశీస్సువాలు

''భక్తిప్రచార ప్రవీణ'' ''మధురపదప్రాసకవితా చతురానన''

బ్రహ్మశ్రీ శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతులుగారు.

చ॥ నరహరి పాదపద్మముల నమ్మితిరమ్ముగ భక్తిభావ భా
సురమగు ''వ్యాస'' సూనముల సూత్రనిబద్ధమొనర్చి యాంధ్రీ సుం
దరగళసీమగూర్చి కడు ధన్యుడవైతివి; సుబ్బరాయ! యా
దరమున నోముగావుత సదా నరకేసరి నిన్ను సర్వదా॥

చిరంజీవి, శిష్యుడు, ప్రశిష్యుడైన కోట సుబ్బరాయగుప్త భాగవతులు రచనచేసిన వ్యాససంపుటియందలి కొన్నిభాగములు చదివి చవిచూచితిని. విషయము లన్నియు గంభీరములై సద్భావోపేతములై ఆర్షసంస్కృతికి సోపానములై ద్వంద్వ సంకులసమరమైన సంసారబంధవిముక్తికి మార్గదర్శకములై మహోన్నతమైన సద్గురు భక్తి శక్తిసమ్మేళనమై నలరారుచున్నవి.

ఈ రచయిత, శ్రీ బాలభక్త ప్రహ్లాదుని జీవితచరిత్ర నధ్యయనము చేయుటకై ఆవేదనతో నాయొద్దకు చేరగ, అధ్యాపకవృత్తితో శ్రీహరికథాగానములతో యుండెడి నాకు సమయము చాలదని, నా ప్రధానశిష్యుడై వినయవివేక సౌజన్యమూర్తియై మధురగానముతో శ్రీ మహాభారత కథాగానము లొనర్చెడి ఆత్మకూరి గురుబ్రహ్మ గుప్తా భాగవతునియొద్దకు బంపితిని.

ఆయనయొద్ద నాలుగు మాసములు శ్రీ ప్రహ్లాదాదికథ లధ్యయనమొనర్చి జన్మార్జిత సుసంస్కారసంపద్వైభవుడై ఆంధ్రదేశమునందుగల శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానములాదిగాగల మహాక్షేత్రాదులందు కథాగానము లొనర్చి విజ్ఞుల సన్మాన సద్గౌరవములకు పాత్రుడై మహామహులైన పెద్దలచే ''కీర్తన కంఠీరవ'' ''కవి వతంసే'' త్యాది బిరుదు సన్మానములను పొందితిరి.

శ్రీ గురునరహరి భక్తితో పెద్దల సత్సంగశక్తితో సదురు శ్రీ యోగానంద నరసింహయోగీంద్రుల దివ్యమంత్రాశీర్వాద మహామహిమతో కవియై "కర్మ సిద్ధాంతము" అనెడి యీ పొత్తమును రచనమొనర్చి మహాకవిపుంగవుల దివ్య భవ్యాశీస్సుల నొందిన గుప్త జీవితము ధన్యవంతమైనది.

సృష్ట్యాదినుండియు మంచిచెడుగులకు సంఘర్షణమున్నది. ఆ రెంటిని విమర్శించి మంచిని మన్నించుటే మహాత్ముల కర్తవ్యం—

లోకవృత్తములోని సార్వకాలిక మానవ చిత్తవృత్తులు యీ గ్రంథమున సవిమర్శనంగా పొందుపరచబడియున్నవి. ఇందు ప్రకృతికి బానిసయై పరమాత్మను విస్మరింపరాదు. దుష్టకర్మ లొనర్చెడి వారెంతటి ఘనులైన మేధాశాలురైన, కవి కథకులైన, పరదేశపర్యటనము లొనర్చి లక్షలార్జించినవారైన, కర్మఫలశక్తి వదలక వెంటాడి వేటాడుననెడి పరమ సత్యమును ప్రతివ్యాసమునందును ప్రత్యక్షమగుచున్నది.

ప్రతివ్యక్తియు సదాశయ సత్యాదర్శ ధర్మజీవితమును, గడుపవలెననియు, అందులకై సత్యద్రష్టల సనాతనవాణి మార్గదర్శకమనియు యీ రచయిత భావోద్రేకమున అడుగడుగున భద్రవచనములు విరచించినాడు.

విత్తప్రమత్తులో విశృంఖలంగా విహరించుచున్న నేటి సమాజ వికృత స్వరూపం పరికించి పరిశీలనచేసి, రచయిత సంక్షుభితహృదయంలో సాగిన భావ తరంగసమూహమే యీ వ్యాససంపుటి.

ఈతడు నారసింహోపాసకుడగుట భావోద్రేకం మెండు శ్రీ సద్గురుభక్తి సాధుసజ్జనసేవానురక్తి సద్విషయశ్రవణాసక్తి బాల్యమాదిగా సహజ సంస్కారము లగుట యీతని జన్మాంతర సుకృత విశేషం. నృసింహదివ్యానుగ్రహలబ్ధమైన విజ్ఞానవిత్తాన్ని విరిగా సర్వులకు పంచాలనీ అందరూ అనుభవించాలనీ, యీతని ధ్యేయం. సదాశయంతో సాగిస్తున్న యీతని కృషి సత్ఫలమొసఁగుగాత! ఈ చిరంజీవి గుప్త నారసింహుని దివ్యానుగ్రహపాత్రుడగుగాక!

ఇట్లు

కపిలేశ్వరపురం
12—7—81

రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతులు
శ్రీ సర్వారాయ హరికథాపాఠశాల ప్రిన్సిపాల్

శ్రీః

# కర్మ సిద్ధాంతము

రెండు శిలలు గలవు. పోలిక ఒకటే. ఐనను ఒకటి శివలింగమై పూజింప బడుచున్నది. ఒకటి రుబ్బుడు పాత్రముగా ఉపయోగింపబడుచున్నది. దాని యోగ మది. దీనియోగమిది. కర్మసిద్ధాంత మిట్లున్నదని........శ్రీ భాగవతార్ వచించును. ఎంత మంచి దృష్టాంతము !

ఒక కుక్క మంచిరకము కారులో ప్రయాణించుచున్నది. దానికంటె ఒక మంచి కుక్క తిండిలేక బజారులో బాధపడుచున్నది. దీనికి కారణమేమి ?

ఒకతండ్రికి నలుగురు సంతానము. అందు ఒకనికి మంచి పాండిత్యము గలదు. ఒకడు మూర్ఖుడు. ఒకడు ఆరోగ్యవంతుడు. ఒకడు సదా రోగి. దీనికి కారణమేమి?

ఒక లక్షాధికారికి ఇద్దరు పుత్రులు గలరు. తండ్రి ఇద్దఱకు ఆస్తి సమానముగా పంచి యిచ్చెను. ఒకడు ఇంకను చాలా లక్షాధికారియయ్యెను. మఱొకడు బుద్ధి మంతుడే యైనను దరిద్రుడాయెను. దీనికి కారణమేమి ?

ఒకడు బాగుగా చదువుకొనియు మాటలాడలేడు. ఒకడు చదివినది కొంచమే యయినను, లేదా, చదువులేకయు అద్భుతముగా మాటలాడును. దీనికి కారణమేమి?

ఒకడు శ్రీమంతుడైనను వాని తిండి, బట్ట అంతయు దరిద్రముగానే యుండును. ఒకడు అంతగా సంపాదనాపరుడు కాదు. ఐనను చాలా దర్జాగా జీవించుచున్నాడు. దీని నేమనవలెను ?

ఒకడు అతిగా తినును. ఐనను వానిదేహము చిక్కియుండును. ఒకడు అంతగా తినడు. ఐనను పుష్టిగా కనబడుచున్నాడు. దీని రహస్యమేమి ?

ఒక రిక్షావాడు లాటరీలో లక్ష సంపాదించెను. కొందఱు లాటరీలో పోగొట్టు కొనుటయేగాని సంపాదించి యెఱుగరు. దీనికి కారణమేమి?

ఒకడు ఎక్కువగా చదువడు. ఐనను మంచిమార్కులు సంపాదించును. ఒకడు ఎక్కువగా చదువును. సరిగా మార్కులు రావు. గారణము? బుద్ధిసూక్ష్మతలో తేడా అని యందుమా? ఈ తేడాకు కారణము?

ఒకడు పుణ్యాత్ముడు. కాని అన్నీ కష్టాలే. ఒకడు పాపాత్ముడు. కాని, అంతా దర్జాయే. హేతువేమియై యుండును?

ఒకడు శ్రీమంతునియింట బుట్టును. ఒకడు దరిద్రునియింట బుట్టును. ఈ శిశువులు ఏ పుణ్యము, ఏ పాపము తెలియనివారు. వీరు ఈ జన్మలో ఏమిచేసినారు?

శాస్త్రమిట్లు చెప్పును— సుకర్మకు ఫలము-సుఖము. దుష్కర్మకు ఫలము దుఃఖము. ఈ ఫలము ఇప్పుడు రావచ్చును. ఆలస్యముగా రావచ్చును. లేదా మఱియొక జన్మలోనైనను రావచ్చును. ఇన్స్యూరు జీవించియుండగా రాదు. ఐతే ఇన్స్యూరుచేయుట వ్యర్థమనవచ్చునా? ఒకడు నూఱు యజ్ఞములుచేసెను. జీవించి యుండగా ఇంద్రపదవిరాదు. ఐతే ఈ యజ్ఞములుచేయుట వృథా అని అనవచ్చునా?

శాస్త్రీయమైన కర్మ సత్కర్మ యనబడును. శాస్త్రవిరుద్ధ కర్మ దుష్కర్మ యనబడును. వివరములు తెలియవచ్చు; తెలియకపోవచ్చు. ఎప్పటికైనను సత్కర్మ శ్రేయస్సును, దుష్కర్మ అనర్థమును కలిగించుననుట కర్మసిద్ధాంతము.

అదృష్టములేక ఏదియు లభింపదు. లభించినను ఉపయోగపడదు. పరిశీలింపగా పలుచోట్ల ప్రత్యక్షమగుచుండునట్టిదే ఈ విషయము. సత్కర్మ అదృష్టమును, దుష్కర్మ దురదృష్టమును కలిగించుననునది కర్మసిద్ధాంతము.

మిత్రుడు శ్రీ కోట వెంకటసుబ్బారావుగుప్త భాగవతార్ నిరాడంబరుడు, నిరహంకారుడు, చాలా సౌమ్యుడు, కల్ల, కపటములేని మంచి వ్యక్తి. భావము మధురము, భాష మధురము, కంఠము సరేసరి. అంతయు మధురమే.

చిరకాలము వివిధ గ్రంథములను పరిశీలించి, వివిధ ప్రదేశములలో సంచరించి, వివిధానుభూతులను గడించి యీ పెద్దగ్రంథమును రచించెను. ఈ గ్రంథమున కర్మసిద్ధాంతమునేగాక భక్తి, జ్ఞాన వైరాగ్యాది విషయములనుగూడ విపులముగా వివరించియున్నాడు.

చక్కగా చదివి, సత్కర్మానుష్ఠానపరులమై, ఇంకను ఎక్కువగ సజ్జనులమై, భగవదనుగ్రహపాత్రులమై, సర్వశ్రేయములను సంపాదింతుముగాక !

ఆంధ్రనిర్వాణాశ్రమము
హృషీకేశము
10-7-81

ఇట్లు
శుద్ధచైతన్యస్వామి

---

# ఆత్మీయత

అమరావతిలో నాడు అమరేశ్వరుని సన్నిధిలో కృష్ణవేణి ప్రవాహముతో పోటీపడుతూ వెలువడిన మీ అనుభవపూర్వక హరికథా గానలహరిని ప్రత్యక్షంగా చూచాను. సరస్వతీదేవి మీవంటివారిలో సంస్కృతిని శాశ్వతంగా భద్రపరచిన రీతికి కృతజ్ఞతలు ప్రకటించుకొన్నాను. నేడు మళ్ళీ కర్మసిద్ధాంత గ్రంథములో మీ అనుభూతి పరంపరకు అక్షరాకృతి దర్శించాను. "పలికించువాడు నరసింహుడే' అనే చెక్కుచెదరని మీ విశ్వాసానికి జోహార్లు. మీ రచనలో గుణగ్రహణ పారీణత ప్రత్యక్షరంలో ప్రత్యక్షమే. ఎందరో మహానుభావులు-ఎన్నో ప్రాంతాలు - ఎన్నెన్నో అనుభవాలు - ఇంకెన్నో విశేషాలు అన్ని కలిపితే మీరూ మీ జీవితమూ దానికి పుస్తకరూపంవస్తే ఇట్లాగే ఉంటుంది అనిపించింది. సంప్రదాయానికి సన్నిహితంగా నవ్యతకు దగ్గరగాఉన్న మీ సంస్కారం వర్తమాన సమాజానికి ఆదర్శంగాఉంది. భావితరాలకు ఆలోచనపంచుతుంది అనడం నిస్సందేహం.

పొన్నూరు
18 - 7 - 81

నమస్సులతో
దీవి దీక్షితులు, M. A.
S. B. S సంస్కృత కాలేజి.

'పండితరాజు' 'సరస్వతీ కంఠాభరణ' 'సాహిత్యసుధాకర'

## సూ డి ద

## ప్రభాకర శ్రీకృష్ణభగవాన్, M. A.

అధ్యక్షులు : సంస్కృత కళాశాల, పొన్నూరు.

చరిత్ర కందని చిరకాలమునుండి, జ్ఞాన విజ్ఞాన దధితులను ప్రపంచం నలు దిశల వ్యాపింపజేయు పవిత్ర భారతదేశమున భారతీయులుగ జన్మించిన మనము అదృష్టవంతులము. మనం భారతీయులం. మనది భారతదేశం. మన సంస్కృతి భారతీయ సంస్కృతి. మన విజ్ఞానం ఆర్షవిజ్ఞానం. వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాదులు, రామాయణ, భారత, భాగవతాది పుణ్యచరిత్రలు మన జాతికి జీవనాధారాలు. మన ఆధ్యాత్మిక జీవనవిధానం, మన నైతికవిలువలు, మన ధార్మిక భావ పరంపర, మన ఉత్తమ సంస్కారాలు, అందరి మన్ననలను పొందినవి.

మనం కాదనేవ్యక్తి మతిహీనుడు తపస్సునుండి జ్యోతిర్మార్గంలోనికి, అసత్తునుండి సత్తునకు, మృత్యుమార్గంనుండి అమృతసౌధంలోకి తీసుకొనివెళ్ళు మానవుని, ప్రాపంచిక ఆధ్యాత్మిక సుఖశాంతులను ప్రసాదించే దివ్యసాధనం మతం. మతం మనపాలిటి దేవుడిచ్చిన వరప్రసాదం. మతంలేనిదే మానవుడికి మనుగడేలేదు.

కర్మ, భక్తి, జ్ఞానమార్గాలు హిందూధర్మానికి మూలాధారాలు. ఆధ్యాత్మిక ఆనంద సామ్రాజ్య మహాసౌధానికి మూలసోపానాలు. వేదహితకర్మాచరణ అత్యంతావశ్యకం. సత్కర్మాచరణతో బుద్ధి సున్నితమై, సునిశితమై, పరిపక్వమగును. ఆ సమయంలో భక్తి భావ పూరితుడగు వ్యక్తి, నామ జప పారాయణ పరాయణుడగును. ఆర్ద్రమైన బుద్ధితో జ్ఞానమార్గ గవేషణచేస్తే మార్గం సులభమవుతుంది.

మన ప్రాచీనులు కర్మసిద్ధాంతానికిచ్చిన ప్రాముఖ్యత అద్వితీయం. కర్మసిద్ధాంతాన్ని అంగీకరించకపోతే, లోకంలో మనం ఉద్ధరించే సుఖదుఃఖాలకు, కష్టనష్టాలకు, సమాధానమే దొరకదు. భగవంతుని దృష్టిలో అందరూ సమానమేకదా! అందరూ ఆయన అనుంగుబిడ్డలేకదా! మరి ఈ వ్యత్యాసాలకు, హెచ్చుతగ్గులకు కారణం ఏమిటి ? దానికి కర్మసిద్ధాంతమే సరైన సమాధానము. మంచి కర్మచేస్తే సుఖిస్తాం. చెడుకర్మచేస్తే కష్టాలను అనుభవిస్తాం. ఈ సిద్ధాంతం చాలా శాస్త్రీయంగా, సహేతుకంగా, ఉండుటవలన అనాదికాలంనుండికూడా భారతీయులు వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాదులను అనుసరించి, నిత్యం తమకు ప్రత్యేకంగా చెప్పబడిన విధులను సక్రమంగా నిర్వర్తిస్తూ వస్తున్నారు. కర్మప్రభావం, అనుల్లంఘనీయం. కర్మసిద్ధాంతం అత్యంత ఆదరణీయం.

ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ హరికథా విద్వాంసులు, భక్తిప్రచార ధురీణులు, పండిత పామర పరిచితులు, ఆధ్యాత్మిక ప్రచార సార్వభౌములు, హరికథక కుల

దీపులు శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతారులు ఉదారచరితులు. శ్రీ లక్ష్మీ నృసింహ కరుణాకటాక్ష వీక్షణములతో పరిపూతులైన శ్రీ గుప్తగారు, తమ హరి కథామృతమును ఆబాలగోపాలమునకు అందించు ధన్యులు. తెలుగుదేశంలో వీరు సుపరిచితులు. వీరి కథలు అవ్యక్త మధురానుభూతులను కలింగించును

శ్రీ సుబ్బరాయగుప్త భాగవతార్ గారు మంచిపండితులు, కవులు, విద్వాంసులు. సంగీత, సాహిత్య మర్మజ్ఞులు. ప్రజలనాడిని తెలుసుకొని వారి హృదయక్షేత్రాలలో ధార్మిక భావ బీజములను నాటుమనీషి.

శ్రీ గుప్తగారిచే రచింపబడిన "కర్మసిద్ధాంతము" అనే గ్రంధాన్ని ఆమూలాగ్రం పలుపర్యాయములు ఎంతో ఆసక్తితో చదివాను. ఈ గ్రంథరచనలో శ్రీగుప్త గారి పరిశ్రమ, ఆవేదన, తపన, ఆందోళనలు వ్యక్తమగుచున్నది. ఈనాటి సగటు మనిషికి ఈ గ్రంథం ఎంతో అవసరం.

ఈ కాలంలో ఇటువంటి ఉత్తమగ్రంథాల్ని ఆదరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. గ్రంథకర్తను అభినందివ్వాల్సిన అవసరంకూడా ఉంది. అంతేకాదు ఆస్తికులందరూ శ్రీ గుప్తను సమ్మానించాల్సిన ఆవశ్యకతకూడా ఉంది.

తెలుగు సాహిత్య లక్ష్మిగళసీమలో మంచి ముత్యపుహారాన్ని సమర్పించిన శ్రీ సుబ్బరాయగుప్త ధన్యుడు, ధన్యతరుడు, ధన్యతముడు.

ఈ గ్రంథం కొంతమందికైనా కనువిప్పు కలిగిస్తే శ్రీ గుప్త ప్రయత్నం ఫలించినట్లే. అస్తు.

శ్రీ కృష్ణ భ గ వా న్

---

'కవిశేఖర, ఆయుర్వేదమార్తాండ", గ్రంధే రఘురామగుప్త

శ్రీ కోట సుబ్బరాయగుప్త విరచిత "కర్మసిద్ధాంతము" ను స్థాలీపులాకన్యాయంగ చూడడం తటస్థించినది. పద్య కవితకంటె గద్య కవిత రచించడం చాల కష్టము. కాని గద్య కవితలో శ్రీ సుబ్బరాయగుప్తగారి లేఖినీ పలు నాట్యభంగిమముల సంతరించుకొన్నది. శ్రీ నారసింహోపాసకు లగు శ్రీ సుబ్బరాయగుప్తగారి రచనకాదది. సాక్షాత్ నారసింహుడే యీ రచనను సాగించాడు.

రమామణి వీరిని యితోధిక కీర్తి శిఖరముల నధిరోహింపజేయుగాక.

మార్కాపూర్. 19 – 7 – 81



రచయిత

## కోట సుబ్బరాయగుప్తా భాగవతుఁడు

# భగవానుని దివ్యలీల

శ్రీ శ్రీ శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి దివ్య భవ్య నవ్య కళావతారమూర్తులై, జన్మాంతర పుణ్యతపః ఫలముతో నార్ష ఋషుల మహోత్తమ సంస్కార విభవముతో మహారణ్యసీమలందు వెలు

గొందెడి కొండబిలమునం దెన్నియో సంవత్సరములు తపోదీక్షాదక్షులై సర్వాద్భుతశక్తిసమన్వితమైనభగవత్స్వరూపతత్త్వదర్శనులై లోకోద్ధరణమునకై ప్రకాశముజిల్లా మార్కాపురమునకు రెండుమైళ్ళ దూరమున పశ్చిమభాగమున కుండికనదీతీరమున సుందరమైన ప్రకృతి కాలవాలమగు పుణ్యస్థలమునందు శ్రీ కపిల మహర్షి తపస్సుచేసిన రమణీయమగు గిరిశిఖరముపై శ్రీ లక్ష్మీనృసింహమూర్తిని ప్రతిష్ఠించి చేసి యారాధించి, భవసాగరతరణోపాయమును కాంక్షించి విచ్చేసిన ముముక్షువుల నెందరినో యుద్ధరణమునొందించి వృద్ధులై యోగవిద్యా విభూతితో సమాధియందు ప్రకాశించెడి సద్గురు శ్రీ శ్రీ శ్రీ యోగానంద నరసింహాస్వామివారి మహోజ్వల దివ్యయోగాత్మశక్తి ప్రసారప్రభావ మహిమావేశముతో సాగించిన కర్మసిద్ధాంత విశేష సముదాయము.

లోకేశ్వరుడై కరుణాసాగరుడై సమస్తమున కాధారుడై, సర్వ ప్రాణికోటి హృదయగుహాంతర నివాసుడై వేదాతీతుడై సర్వముతానై తానే సర్వమై సకల భువనమోహనుడై, సాధుసజ్జనపరిపాలకుడై, సర్వదుష్టజనవిధ్వంసియై నాస్తికహృదయుల కగమ్యుడై దానవరాజ సభాస్తంభసంజనితుడై కోటిసూర్యుల కాంతితో వివిధాస్త్ర విజృంభణ ముతో వీరభయానక కరుణభీభత్సస్వరూపుడై లోకకంటకుడైన హిరణ్యకశ్యపుని వక్షోభాగమును వ్రయ్యలుచేసిన మహోగ్రమూర్తి. తనయందుగల చైతన్యమే సర్వభూతములందు గలదనెడి యద్వైత తత్త్వదృష్టితో నేప్రాణి కపకారమొనర్చక సర్వార్పణబుద్ధితో లోకమున చరించిన బాలభక్తాగ్రేసర ప్రహ్లాదమూర్తిని పరమకరుణతో రక్షించి రాజ్యరమను ముక్తిసామ్రాజ్యమును ప్రసాదించిన పరమాత్మయే శ్రీ లక్ష్మీనృసింహమూర్తి.

క్షీరసాగరశయనుడై వేణుగాన వినోదియై భువనమోహన సౌందర్యస్వరూపుడై ప్రణవనాదానందమూర్తియై నమ్మి భజించెడి

వతంసుని సర్వసాత్త్వికకార్యనిర్వాహకుడై. స్వార్థదాహపీడితులు గాని, కవిపండిత విద్వద్గాయక నాయకమణులను సదా రక్షించెడి స్వామి శ్రీమన్నారాయణుడు. నాశరహితుడు, జగదేకారాధ్యుడు అంబోధిజా వరుడు ఆర్తావనుడు రవిశశివహ్నినయనుడు భక్తజనవశవర్తి, దేవ దేవుని దివ్యలీలావిలాస వినోదయోగవిద్యా ప్రదర్శనము లన్నియు చిత్రవిచిత్ర మనోహర మంగళమధుర దృశ్యములు.

నేటికి సృష్టియారంభము 197 కోట్ల 29లక్షల 49 వేల యెనుబది సంవత్సరములు గడచినవి. ఈ దుర్మతి సంవత్సరమునకు, కలియుగారంభము శ్రీకృష్ణపరమాత్మ నిర్యాణము ఐదువేల యెనుబది సంవత్సరములు గడచినవి.

ఋషభుని కుమారుడు వేదవిజ్ఞాన హృదయుడు ప్రణవోపాసకుడైన "భరతుడు" పాలించుటచేత ఈ భూఖండమునకు భరతఖండమని పేరువచ్చెను.

సర్వనామ సముదాయము వేదములనుండి యావిర్భవించినవి. అట్టి మహిమోపేతములైన వేదములు, స్వరములు, త్రిలోకములు, ఈ చరాచర ప్రకృతియంతయు ఓంకారమునందే నుద్భవమొందినవి. ఇందులకు ప్రమాణమిది.

"ఓంకార ప్రభవో వేదాః । ఓంకార ప్రభవస్స్వరాః
ఓంకార ప్రభవో సర్వం । త్రైలోక్యం సచరాచరం

సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడగు భగవంతుడు జగత్తునకు సృష్టికర్తయై సర్వేశ్వరుడై విలసిల్లియున్నాడు. విశ్వసృష్టిస్థితిలయములు పరమాత్ముని పావనలీలలు. అట్టి దివ్యశక్తివంతములైన భగవల్లీలలను గ్రహించుటకు మరియొకరికి సాధ్యముకాదు.

విషయవిముఖులు బ్రహ్మనిష్ఠులగు జ్ఞానులు కొందరు మాత్రము భగవంతుని పావనలీలల నర్థముచేసికొని యానందించుచున్నారు.

సామాన్యజనులను తమ దివ్యబోధలచే ఆనందింపజేయుచుందురు. మాయకు బానిసలై విషయసుఖములకులోనై కాలమును వారి కాయములను దుర్వ్యయ మొనర్చెడి నరుల హృదయములలో సత్ప్రరిణామమును కల్పించి జీవితనడకలలో ధర్మమును మేళవింపజేసి తద్వారా భగవత్సాన్నిధ్యము పొందుటకు మహాత్ములనేకులు వారి తపోబలముచే విజ్ఞానచక్షువులతో పరిశీలించి సృష్టిరహస్యములను పతితజనోద్ధరణమునకు సరియైన భవ్యమార్గములను ప్రబోదములొనర్చి ఆనందింపజేయు చుందురు.

అట్టి మహాత్ములలో నొకరై సిద్ధతపోయోగశక్తి సాగ్రిలాసులైన సద్గురు శ్రీయోగానంద నరసింహస్వామివారి పరమపవిత్రనామమును, వారి యోగాశీర్వాద ప్రసాద మహామంత్ర ధ్యానమును, శ్రీ లక్ష్మీనరసింహస్వామి నామసంస్మరణమును భక్తితో యొనర్చెడి మహాపుణ్యఫలశక్తియే నాలోచేరి నన్నీవిధముగ వ్రాయించి మీ కందించినది.

అవ్యయుడై నిత్యమంగళ స్వరూపుడై సృష్టిస్థితిలయాధినాధులకు నాథుడైన శ్రీభగవానుని వాణిని విస్మరించి కర్మలుసాగించిన వారెంతటి ఘనులైనను కర్మఫలములను తప్పించుకొని భువిపై బ్రతుకజాలరు.

భగవద్వాణియే వేదగానమైనది. ఆ వేదగానమే జగత్తుకు విజ్ఞానమై బహుముఖముల విరాజిల్లినది. అట్టి విజ్ఞానమును ఆర్షఋషులు తపోసమాధులందు దర్శించి విని లోకమునకు ప్రబోధమొనర్చిరి.

ఆర్షఋషులు ప్రసాదించిన విజ్ఞానపు కాంతులకు, మహాకవులు వాగ్దేవికృపతో లోకమున కందించిన నిస్వార్థ నిర్మల కవితారీతులకు యెట్టి భేదములేదు. అట్టి యాదర్శధర్మ ప్రబోధాత్మక సత్యసందేశోప

కేశములను మాయాశక్తికి వశులైనవారెల్లరు విస్మరించి లోకమున సుధర్మవర్తనులై ప్రతిఫలముల ననుభవించుచున్నారు. అట్టివారి తిగతి స్వరూపాదిన్నైఖరు లీవిధముగానున్నవి. పాఠకులు యేకాగ్రత్తులై పఠించి సత్యమును గుర్తించగలరు.

ఈ భువిపై జరించెడి విద్వత్కవితావతంసులైన పెద్దలు, బంగరు డైలమీద సుఖాసీనులై ప్రజాపాలన మొనర్చెడి చక్రవర్తులు, భూవ్యో కాశాది గమనములొనర్చెడి భౌతికపరిశోధన లొనర్చెడి విజ్ఞాన త్తలు, బహుశాస్త్రములు పఠించిన సాహితీశక్తితో నాస్తికాస్తిక ాదనలతో సర్వజనుల సంశయముల నివృత్తిచేసెడి తార్కికులు, ంటితో చూచినంతవరకే నిజము తదితరము లన్నియు సత్యముకాదని ాదించెడి నాస్తికులు, కండయండ సంఘబలములతో నోరున్నవానిదే యూరని మొండివాగ్వాదము లొనర్చెడి మూర్ఖులు, జిహ్వేంద్రియ హ్వేంద్రియముల చాపల్యముతో సంఘవ్యతిరేకములైన కర్మలు యుక్తిశక్తుల నుపయోగించి సాగించిన నాడెట్టికష్టనష్టములు లేవనెడి పలచిత్తులైన జనులు, నవీనకాలమున కుబుద్ధితో మేధాశక్తి సంపదను ుర్వినియోగ మొనర్చి సాగించిన దైవధర్మాపరాధ రచనాకర్తలు, దృష్టము కలసివచ్చి కానిపనులొనర్చి కాసులను సమకూర్చుకొనిన ాత్కాలిక సుఖభోగలాలసులు, రామారాధనలు సాగించుచు, కామా ాధనలతో మునిగితేలుచు, కడకు కర్మపరిపక్వమై కృంగి కృశించి శించినట్టి ప్రేమరోగులు, పరులకు ధర్మప్రబోధము లొనర్చుచు ారాచరించక కడగండ్లపాలై కన్నీరుగార్చెడి ధర్మద్రోహులు, బ్రహ్మసత్య-జగన్మిథ్యా" యనెడి శ్రీ శంకరాచార్యదేశికులవారి ాణిని పలుకుచు పరులమతులను మార్చి వారొసంగిన యర్థముతో సత్తుపదార్థములను మెక్కుచు, కామభోగస్వేచ్ఛావిహారులై చరించెడి ాచావేదాంతులు, భగవన్మందిరములలో భక్తులవలె నటనను ొనర్చుచు కన్నులుమూసి భజనలుచేయుచు వారికి యలవడిన

వ్యభిచార చౌర్య సురాపానాది కర్మలు యథాతథముగా సాగించెడి దొంగభక్తులు, భక్తురాండ్రు, గొప్పవారై వయసు పెరిగి విరివిరిగ ధన సంపత్తిగలిగి తినెడువారు కఱవై పలుకరించెడి బంధువులు విరోధులై యొంటరి జీవితము గడుపుచు ధనాశతో తబ్బిబ్బుచెందెడి లోభహృదయులైన నరులు, సంతతిలేక, సంతతికవకాశములేక పూర్వార్జితము తుష్టిగానుండి పరోపకారములకై పైసలు ఖర్చుచేయజాలని పరమ లోభులైన మనుజులు, మహాత్ములను దురాత్ములని, దురాత్ములను మహాత్ములనెడి దుష్ప్రచారములతో పొట్టలునింపుకొనెడి దుష్టులు, "ధనము శాశ్వతముకాదు, దేహము శాశ్వతముకాదు, దైవమొక్కడే శాశ్వతము, తను మనోధనము లర్పించుటే, శిష్యుని ధర్మము, సర్వసంగపరిత్యాగులైన మావంటి మహాత్ములు మీకు లభించుట దుర్లభమనెడి తియ్యని వేదాంతముతో భక్తుల మతులనుమార్చి వారి ధన దారాది సర్వస్వమును కొల్లగొట్టెడి దొంగగురువులు, మహావేదికలపై చేరి వేలాది సభికులకు భక్తజీవితచరిత్రలను గానమొనర్చుచు భక్తి శక్తి గణనీయమైనదని ప్రబోధములుచేసి తామాచరణములంకుంచ జాలక భక్తివ్యతిరేకములైన కర్మల సాగించెడి మోసకారులైన దోష హృదయులై హరిదాసులు, కళ భగవానుని స్వరూపము. ఆ దేవ దేవుని చేరి తరించుట కిది రాజమార్గమని మధురసంగీతగానము లొనర్చుచు తుష్టిగా విరాళములనుపొంది లోభత్వముతో యివ్వవలసినవారికి తిలోదకములిడి తప్పత్రాగి సిగ్గుపీడి చిందులువేసెడి దుష్టకళాకారులు, అచలము, పరిపూర్ణము, సర్వము నేనే, నేనే సర్వము, విగ్రహములు లేవు, విగ్రహారాధనలులేవు, దానములేదు, ధర్మములేదు, సర్వము మిధ్య యనెడి తమాషావాక్యములతో గారడి వేదాంతముతో లోకమునకు టోపీవేసి లోకసుఖాలకు మరగి మనస్సులోని దుర్వేగమును జయించలేక తమకుతామే సర్వజ్ఞులమని భావించెడి మిథ్యావేదాంతులు గుడులని, గోపురములని, సప్తాహములని, సన్మానములని, గ్రంథ

ంద్రణములని, భక్తిగల పెద్దలకు వినయముతో దైవకథలు నచ్చ
ప్పి వారి ధనమును విరాళరూపముతో మెల్లగాలాగి స్వంతఖర్చులకు
్వాహాచేసి పెద్దలకు బాధకల్గించెడి కపట నటనాచాతురీధురీణులైన
చమతులైన నరులు రవాణాసౌకర్యము లన్నియు కలుగజేసెదము
ఎకిమాలిన త్రోవలను రాజమార్గములవలె రూపొందించెదము.
మమ్ము గెలిపించండి మీ వోట్లన్నియు మాకే యివ్వండని మంచి
ాక్యములాడి, ప్రజలునమ్మి వేసినవోట్లు బలముతో గెలిచి గద్దెలెక్కి
ందవారిని మరచి చరించెడి మేకవన్నెపులులైన రాజకీయవేత్తలు,
వికథక కళాకారులను నమ్మించి బహుశ్రమలపాల్జేసి కథాగానోప
ములు చేయించి కడకు పైసాలివ్వక, ప్రసాదమునిడక కంటికి కన్పించని
మతులైన పెద్దమనుష్యులు, పేదలై మహాకవులై యఖండకృషితో
ార్తిచేసిన కావ్యకథలను దొంగలై సంగ్రహించి తమపేరిట ముద్రణ
ేయించి, సన్మానములు పొందిన సాహితీద్రోహులునోటం 'సత్యంవద-
ర్మంచర' యని నుడువుచు జీవితాచరణములందు సత్యమువధయై
ర్మము చెరపాలైనరీతి చరించెడి సమాజద్రోహులు, బహువిధరూప
ిలాసములతో వేదవాఙ్మయమును పచారమొనర్చుచు కామినీ
ాంచనకీర్తి దాహములతో పరితపించెడి ధర్మద్రోహులైన వేద
ండితులు, దైవకార్యముల నిర్వహణముతో ప్రజలసొత్తు నార్జించి
్వామికార్యమునకు సగము స్వకార్యమునకు సగము స్వాహాచేసెడి
లికాలపు పెద్దలు, భక్తుని వేషభాషలతో యజ్ఞులైనవారిని మెప్పించి
ల్లబొల్లికథలతో వారి ధనమును గ్రహించి భక్తివిడచి భుక్తిచూచు
ొనెడి నిజభక్తజనద్రోహులు, గీర్వాణభాషాసమన్వితులైన భక్తి
థల ప్రచారముతో ముముక్షుజనసహస్రముల మనస్సులను రంజింప
చేసి వారొసంగిన ఘనమైన పారితోషికములతో ధనవంతులైన
స్వామి, లోభత్వముతో పైసాలలో పరమాత్మను జూచెడి వైఖరికి
దిగజారి దైవదృష్టిని పోనాడి, ధర్మబుద్ధిని విడనాడి ధనాశాపిశాచి

వాడికోరలకు చిక్కి, సంఘగౌరవమును గోల్పోయి యెంగిలచేత కాకి నదల్పని స్థితితో మెలగెడి భక్తిగీతాప్రబోధ ప్రచారోద్యమనాయకులు విమలోర్ధ్వపుండ్రనామధారులై భక్తిగీతాగానాలాపములతో చూచు వారి కాశ్చర్యమును కల్గించుచు నిత్యజీవితజీవన వృత్తికర్మములలో నమాయకుల కన్యాయము కల్గించెడి కర్మవిశ్వాసద్రోహులు, మొద లైన వారెందరో, నేటి కలిపురుషునకు నెలవైన లోకమునందు వివిధ స్థలములయందు వివిధ తరగతులందు విరివిగా కన్పట్టుచున్నారు. ఇట్టి వారెల్లరు తెలిసిచేసిన యధర్మకర్మల ప్రతిఫలములను తప్పించుకొను టకు సాధ్యము కాదు కాదు కాదు.

నరుడు, ధనము-బలము ప్రభుత్వమునందు పలుకుబడి సాఘ బలముగల రోజులలో పాపకర్మలొనర్చినను నాకేమిభయము లేదనెడు యహంకృతితో దుష్టకర్మలొనర్చుచున్నాడు, ఇట్లూహించుట చాల తెలివితక్కువ యని తెలియవలెను.

ఆనాటికాలపు రావణ, కీచక, దుర్యోధన, సైంధవాది వీరులకు మించినవాడా? నేటికాలపు పాపకర్మాచరణుడైన మానవుడు. నిజము తెలియక సత్యమునకై ప్రయత్నించక 'కర్మసిద్ధాంతము'ను ఆద్యంత ములు పఠించక గుప్తశక్తిని గుర్తించక తనకు తెలిసినదే సత్యమని తానాడెడి నుడియే వేదమని తానాచరించెడి కర్మమే దైవకర్మయని తనలో తాను విఱ్ఱవీగుచున్నాడు. దైవకరుణ తొలగిననాడు భౌతిక వాదియగు నరుని బలమెంత ? ధనమెంత ?

ఈ జగతిలో నందరికి మిన్నయై ప్రగతి సాధించిన నరేంద్రుడై నను ప్రకృతిస్థితి, వ్యతిరేకమై కర్మలకెదురై నిల్చి యెదిర్చిననాడు బానిసయై బ్రతుకును సాగించవలసినదే! క్షణకాలమున నరుని చిత్తము విత్తము జీవితము పరిణామమును పొంది కష్టనష్టాలను చేకూర్చి సంతా పము నొందించుననెడి నుడి లోకానుభవసిద్ధమై యలరారుచున్నది.

నరుల కైశ్వర్యము పెత్తనము పలుకుబడిగలిగిన రోజులలో ోపకారములైన విశిష్టవిశేషములైన సాత్త్విక-తాత్త్విక కర్మలనే గ యొనర్చుటెంతో ముదావహము. వ్యక్తులకు ప్రాప్తించెడి ఖేద ాదములు, లాభనష్టములు, సుఖదుఃఖములు, జయాపజయములు ి తెలివిచేతను తెలివితక్కువచేతను కాదనెడి సత్యము ప్రతి మనుజు తెలిసినదే! ఎందుచేతనని ప్రశ్న వేసుకొని సత్యమరచినచో, ్రలు గతకాలమునందు కర్తవ్యకాలమునందు యొనర్చిన కుకర్మల కర్మల ఫలానుభవములే.

నరుడొనర్చిన పుణ్యకర్మలఫలము కర్తవ్యకాలమునం దనుభవ నకు వచ్చిననాడు సతిసుతులకుగల వక్రగుణములన్నియు సక్రమ లై, 'నీరక్షీరముల' వలె కలసి చరించుచుందురు. పుణ్యఫలములేక నకు తానొనర్చిన పాపకర్మలఫల మనుభవమునకు వచ్చినరోజులలో శక్తియై, సుతుడు శత్రువై, ఋణము వ్రణమై బాధలకు గురిచేయును.

"నాభియందు పుట్టిన పురుగు నాభియందే మరణించు" ననెడి ర్యోక్తి నెంతటి లోకానుభవమును చాటుచున్నదో పాఠకులు గమ ంచవలెను. దొంగప్రవృత్తి గలవాడుదొంగతనమునందే మరణించును. ద్యమునకు కాలుదువ్వి కత్తిదూయు నరుడా కయ్యమువలననే ాణములను గోల్పోవును. ఏవృత్తితో చరించెడి నరుడావృత్తికే న జీవితము నంకితము చేయుచున్నాడు. ఆంధ్ర దేశ ప్రజల మన్ననల ందిన మధురగాయకు"శ్రీరామాంజనేయ యుద్ధము" నాటకమందు ఆంజనేయపాత్రధారి శ్రీ భేతా వేంకట్రావుగారు కళావేదికపై శ్రీరామా! రఘురామా!"యని భక్తితో నోరార గానముచేయు నే తన ప్రాణములను గోల్పోయెను. కర్మగతి రహస్యము బహు చిత్రమైనది.

కర్మసిద్ధాంతములోని లోతులను నీతులను గుర్తించి వర్తించిన నాడు కర్మయే భక్తియై, భక్తియే జ్ఞానమై జ్ఞానమే విజ్ఞానమై, విజ్ఞానమే విశేషశక్తియై, శక్తియే సర్వేశ్వరునిలోచేర్చి తాదాత్మ్యము చెందు చున్నది.

నరుడే నారాయడనుట నతిశయోక్తి కాదు. ధర్మకర్మలు చేయు వా రధర్మకర లెన్నటికి చేయరు. చేయుటకు సంకల్పించరు. పరి పక్వ ఫలమునందు పచ్చివాసన వగరుగుణ మెన్నటికి నుండ నేరదు.

నరులలో కొందరి వేషాభాషాప్రవర్తనములకు పొత్తుకుదురని కారణముతో కర్మప్రభావరహస్యవిశేష వివరములను, సమాజములో గల యొడిదుడుకు కర్మలను, కర్మలొనర్చువారి వేషభాషల స్వరూప మర్యాదలను, ముముక్షువులకు తెలియజేయవలయు ననెడి యావేద నతో, హిందూమత ప్రాశస్త్యము దినదినమునకు క్షీణించుచున్నదనెడి బాధతో, తదితర మతములు నా యా మతప్రబోధకులు హైందవమత ముపై దాడిచేయుచు వమ్ముచేయుచుండిరనెడి యావేదనాగ్ని నాలో విజృంభించి హైందవమతమునందు గల వారిలో కొందరొనర్చెడి కుకర్మములను ధర్మబద్ధముచేసి సర్వమతములవారి కాదర్శముగా జీవిత జీవనకర్మములను ప్రతి భారతీయపౌరుడు నొదలదాల్చి వెలుగొందవలె ననెడు యాకాంక్షతో, తమతప్పు తామెఱింగి సంస్కరణమొందించన నాడే మతమునకు, మతమును సృష్టించిన పెద్దల ధ్యేయమునకు పురో గతి గలుగుననెడి పరోపకార చింతనతో నాలోనేయుండి నాకు తెలి యని యజ్ఞాతశక్తి సంఘశ్రేయస్సభిలషించి వ్రాయించినది.

ప్రతికర్మకు కారణమున్నది. కార్యము, కారణము, చిత్రవిచిత్ర ముగా కలియుచుండును. ఈ రచన యొనర్చుటకు సైతము కారణ గలదు. ఐనను కారణము దైవలీలావిలాసమని నా ప్రగాఢవిశ్వాసము.

1977 వ సంవత్సరము సెప్టెంబరు 23 వ తేదీన ఒరంగల్లు జిల్లా, జనగామ తాలూకా "చేర్యాల" లో శ్రీ హరికథాగానము చేయుటకై సాగించిన ధూమశకటయానమునందు నే పొందిన క్షుద్బాధ ల్యానుభవమే! ప్రధానకారణమై కవితావేశము గల్గించి కలముబట్టి వ్రాయించినది.

సర్వము భగవానుని దివ్యలీల. ఆ నృసింహభగవానుని కరుణయే భక్తుని కన్నీటిని పన్నీటిగా మార్చగలదు. కవితాశక్తి నాలో మచ్చునకైనను లేదు. విద్వాంసుడను కాదు. పండితుడను కాదు. నేనొక సామాన్య గృహాధికారిని. ఐనను నేను నమ్మి సదా యారాధించెడి శ్రీ సద్గురు యోగానందనరసింహస్వామివారు సాక్షాత్ నృసింహ స్వరూపులు. అఖండ వ్యయానందాత్మస్థితితో వెలుగొందెడి మహనీయమూర్తులు. ఆ మహామహుని దివ్యాశీర్వాదసహిత మహా మంత్రోపదేశపఠన మహిమావిభూతి శక్తితో "కర్మసిద్ధాంతము" అనెడి యీ రచనమును సంపూర్తి చేసితిని.

దైవస్వరూపమును స్వరూపరహస్యమును స్వరూపైక్యసంధాన విధానమును బోధించిన దేశికేంద్రులైన శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగా నంద నరసింహస్వామివారి జీవితచరిత్రమును సద్గురు కృపాబలముతో రచనమొనర్చి భక్తమూర్తుల విరాళద్రవ్యముతో 1967 సం. నందు తెనాలిలో నలందాప్రెస్‌లో శ్రీ అబ్బరాజు నాగభూషణముశర్మగారి సలహా సహకార సానుభూతులతో ముద్రణచేయించి విరాళదాతలకు తదితర పెద్దలెందరికో ఆ పొత్తముల నర్పించితిని. కాలగమనమునందు, నా కన్నతండ్రి శ్రీ కోట లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారి యపార ప్రేమా దరణముల చలువతో నా జీవితగమనము సర్వసుఖములతో ఆనంద ముతో హాయిగ దినమొక క్షణముగ దొరలిపోయినది.

1976 సం. న ఆ నా సద్గురుస్వామివారి మహా ప్రేరణాశక్తితో వివిధ విషయ విమర్శలతో నిత్య సత్య వినిర్మల భక్తితత్వాది ప్రబోధ ములైన వ్యాస సముదాయముతో, నిష్ఠతో రచనమును సాగించి "ఏది సత్యము?" ప్రథమ, ద్వితీయభాగములు, "సద్గురు శ్రీ యోగా నంద బోధామృతము" అనెడి నామములతో భక్తుల విరాళద్రవ్యముతో ముద్రణములు చేయించి విరాళదాతలకు తదితర భక్తాదులకు సమర్పించితిని.

రచనకు స్వస్తి అని సంకల్పించుకొన్నాను. నా సంకల్పము ప్రకారము జరుగలేదు. మహాకవుల వర్ణనలకు నందని శ్రీ నృసింహ భగవానుని దివ్య కళావతారమైన శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి ప్రేరణాపరమైన భూమశకటయాన ప్రభావముతో మూడవసారిగ ఈ "కర్మసిద్ధాంతము" రచనారంభమై సంపూర్తియై పాత్రమై సాక్షాత్కరించినది.

ఈ నా రచనమును తెనాలిలో మారీసుపేట నివాసులై వినయ వివేక సౌజన్య హృదయులై మృదంగ విద్వాంసులైన శ్రీ బెజ్జంకి వేంకటరత్నముగారి సలహాతో వారి కుమారుడైన శ్రీ బెజ్జంకి సాంబశివరావు, శ్రీ దాసరి ఋష్యశ్రశ్చంద్రబోసు (ఋషి) శ్రీ బెల్లంకొండ శివన్నారాయణగార్లచే నడపబడుచున్న సప్తగిరి ఆర్ట్ ప్రింటర్స్ వారి మిత్రులైన శ్రీ కోన రాధాకృష్ణమూర్తి, గుప్తాగారి యధ్వర్యమున సుందరరూపముతో ముద్రణము చేయించబడినది. ఈ నా రచనము ముద్రణమై పాఠకుల హృదయముల కానందము గల్గించుటకై నాకు తెలిసిన పెద్దలు, నా బంధుకోటిలో సంస్కారము గలవారు, నా సాహితీశక్తిని గుర్తించిన మిత్రులు, కథాగానములకు వెళ్ళిన సుసమయములందు పరిచయమైన భక్తమూర్తులు, వినుకొండ

పురనివాసులై, నాయందు, నా కవితయందు అభిమానము ఆప్యాయత గల శ్రీ ఆర్యవైశ్య వంశోద్భవులైన పుణ్యమూర్తులు, ప్రేమ హృదయులై నేను అడిగిన వెంటనే విరాళములొసంగి నా యీ కార్య క్రమమునకు చేయూతనొసంగిరి. ఆత్మీయులు, బంధువులు, పెద్దలైన శ్రీ కటకము ఆంజనేయులు గుప్తాగారు నా రచనమును విని ఆనందముతో భూరివిరాళమొసంగిరి. ఈ గ్రంథమును చదివి సారాంశ మును అభిప్రాయముల రూపములతో నాకు అందచేసి నా హృదయ మున కెంతో ఆనందమును కల్గించిన సాహితీవేత్తలు, కవులు, పండితులు పెద్దలు, పూజ్యులైన శ్రీ డాక్టర్ దనకుధరం లక్ష్మీనరసింహాచార్యులు, శ్రీ పండిత గోపదేవ్, డాక్టర్ శ్రీ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. పి. హెచ్.డి., డాక్టర్ శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య, ఎం.ఏ. పి. హెచ్.డి. ఆర్. యమ్. పి, (H), 'సరస్వతీకంఠాభరణ' డాక్టర్ శ్రీ ప్రసాదరాయ కులపతి, ఆచార్య శ్రీ పుచ్చా వేంకట్రామయ్య, "భక్తకవిశేఖర" శ్రీమాన్ నరవారి గోపాలాచార్యులు, విద్వాన్ శ్రీ బీర్నీడి ప్రసన్న కవి, 'హరికథావిశారద' శ్రీ దండిబొట్ల వేంకటశాస్త్రి, 'వేదాంత పారీణ' 'విద్యానాద' శ్రీ మిన్నికంటి గురునాథశర్మ, 'రామభక్త' 'విద్వత్కవిశేఖర' శ్రీ లంకా సీతారామశాస్త్రి, 'శతావధాని' శ్రీ కొప్పరపు సీతారామప్రసాదరావుకవి, 'కవికుల రత్నదీప' శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య M. A., డాక్టర్ శ్రీ వి.వి యల్. నరసింహారావు, ఎం. ఏ. పి. హెచ్. డి, "భాషాప్రవీణ" "సంస్కృతీ ప్రచారక" శ్రీ నూజిళ్ళ లక్ష్మీనరసింహం, శ్రీ దిట్టకవి వేంకట రామానుజాచార్యులు, M. A., రాధశ్రీ డి. ఎ. వి. ఆర్. కె. ప్రసాద్, "కరుణశ్రీ" శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, "కుమారధూర్జటి" "సాహిత్యనిధి" శ్రీ వావిలాల సోమయాజులుగారు, "విద్యాలంకార్" డాక్టర్ శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం, "దర్శనాచార్య" "కళాప్రపూర్ణ"

డాక్టర్ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులువారు, "సాహిత్య కళానిధి" శ్రీ శ్రీ శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, శ్రీ టి. శామ్యూల్ కవిగారికి, "సరస్వతీపుత్ర" పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ విద్యానన్దస్వామి, శ్రీ నిర్విషయానందస్వామి, భక్తిప్రచారప్రవీణ, మధురపసప్రాస కవితాచతురానన, బ్రహ్మశ్రీ శ్రీ రాజశేఖరుని లక్ష్మీపతిరావు భాగవతులు, శుద్ధచైతన్యస్వామి, దీవి దీక్షితులు, పండితరాజు, సరస్వతీకంఠాభరణ, సాహిత్య సుధాకర ప్రభాకర శ్రీ కృష్ణభగవాన్ M. A., 'ఆయుర్వేదమార్తాండ' గ్రంథే రఘురామ గుప్త Ex. ఛైర్మన్, మున్సిపల్ కౌన్సిల్, మార్కాపూర్. పెద్దలకు హృదయ పూర్వకమైన భక్తిప్రణామ సహస్రములర్పించు కొనుచున్నాడను—

ఇట్లు

రచయిత



## క వి దం ప తు లు



శ్రీ కోట సుబ్బరాయగుప్త భాగవతార్
శ్రీమతి వేంకటహనుమాయమ్మ



ఓం శ్రీ లక్ష్మీ నృసింహ దేవాతాభ్యోనమః

# కర్మ సిద్ధాంతము

## కర్మ ప్రభావము

నరుడెంత మేధాసంపద్విభవుడైనను భూస్వామియైనను దూర దేశమున నిర్ధనుడైనచో క్షుత్పిపాసానివారణకుచిత తాత్కాలిక మార్గముతోచక దేవదేవుని దివ్యనామ జపమొనర్చుచు తినెడివారి మోములఁ దిలకించుచు మౌనవ్రతముఁ బాటించవలసినదే.

ఆర్షఋషుల యానాటి స్వానుభవసత్యసందేశముల సారాంశ మిట్టిపట్టుల నాస్తికుడైనను సత్యమనకతప్పదు. "పెట్టిన దినముల లోపల నట్టడవిననున్నవచ్చు నానార్థముల్ పెట్టని దినముల కనకపు గట్టెక్కిన నేమిలేదుగదారా సుమతీ!" యనెడి పద్యరత్నమెంతటి సత్యాంశమును బోధించుచున్నదో పాఠకులు గమనించవలెను.

కర్మప్రభావశక్తి తప్పించుకొని చరించిన ఘనుడొక్కడైన నేటికి కన్పించలేదు. కన్పించాడన్న వ్యక్తివాణి విన్పించలేదు. నరులు తెలిసి తెలియకొనర్చెడి సామాన్యకర్మ ప్రభావమే కాలానుగుణానుభవగతమై చింతలకు వంతలకు గురిచేయుచుండును.

నరులకు శక్తి యుక్తి భక్తి గలనాడే యాసక్తితో తనతోడి సమాజమునకు శక్తికి తగినట్లు సాయమొనర్చుటెంతయో శ్రేయోదాయకము. 'ఒకొక్కడెంగిలిచేత కాకినదల్పడ' ను సామెత మరువరానిది. ఉన్న సాదమంతయు తానొక్కడే మెక్కుచు 'క్వా' యని యరచెడు కాకిని చేతనదల్చినచో మెతుకు రాలునని తాను నోటితో కేకలు వేయసాగును. ఇట్టి పరమలోభులనుచూచి "మెతుకుబోయిన

బ్రతుకు పోయెనని దలచెదు నీచుడురా!" యిడని కొందరు సందర్భానుసారముగ లోకమున వాకొనుచుందురు.

"రంజనచెడి పాండవులరిభంజనులై। విరటుగొల్వ బాల్పడిరకటా సంజయ విధియేమందును। కుంజరయూధంబు దోమకుత్తుకజొచ్చెన్" ఉన్నతోన్నత మైనస్థితిని గోల్పోయి విరోధులైన దాయాదులైన కౌరవుల మాయాపన్నాగములకు గుఱియైన పంచపాండవులు ద్రౌపదీసహితముగా, సామంతరాజై కప్పముచెల్లించిన విరాటభూపతి కొల్వునందు పరిచర్యలొనర్చుచు నొకయేడు రహస్యజీవనము గడపిరి.

బాహుబల సంపన్నులై శౌరిరక్షణలో హాయిగా నానందముగా కాలము గడుపునట్టి పాండురాజు పుత్రులుసైతము విధికి విధేయులైరి. లోకమున కన్నీట కాపురమొనర్చెడి నరులనెందరినో నేటి మానవుడు చూచుచు "నాకేమి పన్నీటిస్నానాలతో పసందైన పడుచుపెండ్లాము సల్లాపములతో కులాసాగా విలాసాలతో వినోదాలతో భూతల స్వర్గమున తేలి ఖేలనమొనర్చుచున్నాడ" నని యెంతయో మురిసి పోవుచున్నాడు.

మురిపెము తిరిపెము రెండును నరుని జీవితమునందు వెన్నెల చీకటులవలె వృద్ధిక్షయములతో నొప్పారుచుండునని తెలిసి చరించి తరించదు. ఐశ్వర్యమెంతయుండినను మనుజునకాయురారోగ్య బల సంపత్తికలనాడే యనుభవించి యానందించవీలగును. లేనిచో భోగ్య పదార్థ సంచయ సందర్శనమున నువ్విళ్ళూరి సంతృప్తి చెందవలసినదే.

నరుడెన్ని కుయుక్తులతో ధనమార్జించినను పుణ్యఫలములేని నాడదియంతయు నాపదలకాకరంబగునని నేటికైన తెలిసి కుయుక్తుల కఠిన కర్మకర్తృత్వప్రేరణలకు తిలోదకములిడి భక్తిశక్తుల భగవదారాధన మొనర్చుచు భక్తమూర్తుల కోపినకొలది సాయమొనర్చిననాడు కర్మసిద్ధాంతము ధర్మసిద్ధాంతమై దయాలవాలమై లోకోపకారమొనర్చ గలదు.

ధర్మబద్ధమైన కర్మలతో నరుడు నారాయణుని కరుణాదృష్టికి పాత్రుడై సుఖశాంత్యానందములనంది పునీతుడగును. ప్రతివ్యక్తియు ధర్మకర్మల నొనర్పజాలడు. తనకెంత ధనసంపత్తియుండిన తనతోడి నరులాపదలంజిక్కి కర్తవ్యమెఱుంగని స్థితిలోనుండినను వారికిఁదగు సహాయమొనర్పజాలడు. కారణమేమి? తనసుఖము తనశాంతి తన యానందముదప్ప తదితరులేమైనను తనక్షేమియనెడి స్వార్థముతో చరించవలయుననెడి సంకల్పమే ప్రధానకారణము.

ఈ జగతియందుగల బాధలన్నిటికన్న మిన్నలై తారుమారొనర్చునవి క్షుత్పిపాసలే ప్రధానములైనవి. ఇందు మూలముననే మన తాతయ్యలు "అన్ని దానములకన్న అన్నదానమేమిన్న" యనివాకొనిరి. దప్పికతో బాధపడువాని కన్నినీళ్ళు ఆకటఁ నకనకలాడువానికంత కబళము నొసంగినవారే నిజమైన పుణ్యాత్ములు.

శుష్కవేదాంత వాక్యములతో శూన్యహస్తములతో నెంత వినయ సంభాషణములుసల్పి తోడివారిని బుజ్జగించి గమించఁజూచు పెద్దలు పుణ్యాత్ములుగారు. ఇట్టి తెలివిగల పెద్దలే యాశ్రమము లందున్నను లోకమునకు మేలుచేకూరదు.

కర్మయోగమునధిగమించి భక్తియోగమును సంపూర్తిగావించి జ్ఞానయోగముతో వెలుగొందుచుంటిమను భావనతో చరించెడి మేకవన్నెపులులైన పెద్దలు లోభత్వముతో పైసాలలో పరమాత్మను చూచెడి వైఖరితో చరించినన్నాడు చివరకశాంతిపాలై లోకపు హా!హా! రవములకు గుఱియై గౌరవమును గోల్పోయి సామాన్యులకన్న తేలిక యగు జీవితములను గడుపుచుందురు. ఇట్టి వాచావేదాంతులు ధనము పైగలయాశతో కర్మయోగమును తారుమారొనర్చి వినువారిమతులను మార్చి వారియర్థసంగ్రహణముతో ధనవంతులై వేదాంతభావములకు వ్యతిరేకములైన కర్మలయొనర్చుచు దురాశాచక్రపరిభ్రమణమున గాసి జెందుచున్నారు.

సత్కర్మల ప్రభావము నరునకు ఛాయవలె వెన్నంటి యేక్షణమున కేమియవసరమో యా యా పదార్థములను సమకూర్చి సంరక్షించు చున్నది. దృఢవిశ్వాసముతో నాత్మబలముతో పట్టుదలతో వ్యక్తి కర్మసాగించిననాడు మహావ్రతిధారిసైతము వ్యక్తినిచూచి సత్యసంభాషణములొనర్చి సంతసమొంది యాతిథ్యము స్వీకరించుమని ప్రేమావేశముతో పరామర్శించ మొదలిడును.

సర్వమునందు భాసించుశక్తి యేతనలో వెలుగొందుచున్నదనెడు ప్రగాఢ విశ్వాసముతో తోడినరులకే వ్యక్తిసాయమొనర్చి సంతసమొందునో, ఆ వ్యక్తి యెచ్చటకేగినను నరులెల్లరు ప్రియమిత్రులై పరిచర్యలొనర్చుచుందురు.

వ్యక్తి, సత్యజీవితగమనములో ధర్మబద్ధమైనకర్మాచరణముతో లోకమునందే ప్రాంతముకేగినను క్రొత్తవ్యక్తులుసైతము ప్రాణస్నేహితులరీతి కలసి మెలసి తిరుగుచు సహకరించుచుందురు. ఇట్టి పట్టుల నెన్నింటినో స్వానుభవమునొందినపెద్దలు నిందుగలభావములు నిత్యజీవితసత్యములని సంతసము వెలిబుచ్చుచుందురు.

కర్మసిద్ధాంతము గణనీయమై త్రికాలసత్యమై నాస్తికులహృదయముల కాస్తికత్వమును గల్పింపగలదనుటలో నెట్టిసందేహమువలదు ఎందరినో యేడ్పించి వారిధనమును నరుడు తనకుగల ప్రజ్ఞాపాటవములతో నార్జించి నిల్వచేసినను యోటికుండలోని జలమువలె తనకు తెలియకనే వ్యయమగును.

అంతులేని యాశాపాశములతో బంధింపబడిన నరునకెన్నటికి శాంతిలేదు. శాంతిపొందుటకవకాశమేలేదు. 'మోటబావిగిలకవలె' 'పిచ్చెత్తినకుక్కవలె' చపలచిత్తుడైన నరుడు దేనియందు నిలకడలేక యోర్పులేక కంటికి కన్పించెడి కర్మములన్నింటిని చేసి ఘనవిజయమొందవలెననువాంఛతో నిశ్చితాభిప్రాయమునుగోల్పోయి కార్యసిద్ధినొందక కడకు సోమరియై దేశద్రిమ్మరియగును.

నరుడు స్థిరతరమైనబుద్ధిబలముచే నోర్పుగలిగి ప్రారంభించిన కర్మను వీడక పట్టుదలతో నాస్తికతతో శక్తివంచనలేని కర్మయొనర్చిన నాడు విధిగ కార్యసిద్ధిని పొందగలడు.

వ్యక్తి, తనకుగలమేధాశక్తిని వివిధకోణములందు ప్రసరింపజేయక, గత సంస్కారానుగుణకర్మలందే వినియోగ మొనర్చిననాడు తప్పక పురోగతినొంది ధ్యేయసిద్ధి పొందగలడు.

మనుజుడు ప్రాప్తమున్ననాడుఫలమేల గలుగదనుభ్రాంతితో ప్రయత్నమునువీడినచో ఫలమారుడగును. కర్మకుతగినఫలమును నరుడు తప్పకపొందగలడు. దీనినెవ్వరు నిరోధించలేరు. ఫలమున్నదో? లేదో? యనెడి సంశయమునుత్యజించి కార్యరంగమునచేరి క్రమముగా కర్మ యొనర్చిననాడు కర్మకనుగుణమగు ఫలమునుపొందగలడు. శ్రుతిహితమగు కర్మాచరణముతో నరుడు శాంతి శుభశ్రీలతో వెలుగొందగలడు శ్రుతివిరహితకర్మాచరణమున నరుడు వానరుడై పనికిమాలినవాడై పడరాని బాధలకు గుఱియగును.

ముముక్షువైన మానవుడు కర్మయోగమునుండి భక్తియోగము, భక్తియోగమునుండి జ్ఞానయోగమునుపొంది జ్ఞానయోగానుభవముతో విజ్ఞానియై దంద్వాతీతుడై విరాజిల్లుచుండును.

నేటి కలిదోషగ్రస్తుడైన మానవుడు కర్మయోగభ్రష్టత్వమును పొంది వికృతభావములతో నాస్తికవాదములతో కామవాంఛాదాహ పీడనముతో 'మధువుత్రాగిన మర్కటమురీతి' జరించుచున్నాడు.

కర్మయోగము చాలశక్తివంతమైనది. కర్మయే జన్మకుకారణ మనెడిసూక్తి గణనీయమైనది. కర్మలేనిదే సృష్టిస్థితి లయములులేవు. ప్రాణికోటికి మనుగడయేలేదు. ప్రపంచమేలేదు. కర్మయోగము యొక్క విశిష్టత భాగవతములో శ్రీ పోతన మహాకవిగారు —

"కర్మమునబుట్టు జంతువు । కర్మమునను ।
వృద్ధిచెందు। కర్మమున జెడున్
కర్మయే దేవత జనులకు । కర్మమె
సుఖదుఃఖములకు కారణ మధిపా !"

సుఖదుఃఖములు లాభనష్టములు జయాపజయములు శాంత్యానందములు కీర్త్యపకీర్తులు, గౌరవాగౌరవములు కలిమిలేములు హర్షశోకములు కన్నీరుపన్నీరు మొదలగునవన్నియును నరులొనర్చు కర్మముల ప్రతిఫలములే!

ఏ యే కర్మములు చేయదగినవి యేవి చేయదగనివి వివరముగా వేదశాస్త్రములు ప్రమాణబద్ధముగా నిర్ధేశించినవి. శాస్త్ర విషయ రహస్యార్థములను పూర్తిగా తెలిసిన నరులైన నిషిద్ధకర్మములొనర్చి వాని ప్రతిఫలముల ననుభవించుచు తీరని దుఖఃముల నొందుచున్నారు. దీనికంతటికి కారణము, నరులు తాత్కాలిక సుఖభోగసంతృప్తి కాశించి చరించుట యేయని తెలియబడుచున్నది.

జనులు తామొనర్చెడి నింద్యకర్మముల ప్రతిఫలములు దుష్కారములనియు ననుభవించక తీరదనియు తెలిసియు మనోవేగమును నిరోధించుటకు యత్నించక నుపేక్షతో మనోమర్కట సంచారానుగుణముగ వర్తించి చింతలకు గురియై 'దేవునిదయమాపై లేదని' వగచుచుందురు.

వేదోపనిషద్గీతాది శాస్త్రపురాణములు, మహాత్ములు, సద్గురువులు, భక్తశిఖామణులైన కవిపుంగవులు, విజ్ఞులైన పెద్దలెల్లరు, నాదేశించిన వాక్యములన్నియు పరమప్రమాణములని నరులొనర్చు సత్కర్మములకు పునాదులని, శాంత్యానందములకు నిలయములని, భగవదారాధకులెల్లరుగుర్తించి విశ్వసించి నిత్యజీవితాచరణములందుంచిననాడెట్టి కష్టనష్టములను పొందక భగవద్విభూతినిపొంది జీవన్ముక్తి నొందెదరు.

స్త్రీ పురుషులెవ్వరైనను నిర్దోషులై నిరహంకారులై నిర్వి చారులై-సత్యాన్వేషకులై-సదాచారులై-స్వార్థత్యాగులై-ధర్మ కర్మ నిర్వాహకులై పరోపకార పరాయణులై - సత్యవాక్పరిపాలకులై శ్రీ సద్గురుభక్తితత్పరులై మోక్షేచ్ఛతో మెలగిననాడు సర్వేశ్వరుని యవ్యాజకరుణాకటాక్షవీక్షణమునకు పాత్రులై జన్మజరామృత్యుభయ రహితులై సుఖశాంత్యానందములనుబొంది తరించగలరు.

సత్య ధర్మ దయాదిసద్గుణప్రభావ విభవాది వర్ణనలను నరులెంత కాలము పఠించిన నందుగలభావముల కనుగుణముగ వారు చరించని నాడెట్టి ప్రయోజనమును బడయజాలరు. మీదు మిక్కిలి సమాజముచే 'దొంగభక్తులని' తెగడబడుచు నిజభక్తుల హృదయముల కావేదనలు చేకూర్చినవారై దైవద్రోహులై పతితులగుదురు.

పతితులైన తఱివైన నరులు జాగృతినొంది పతితపావనుని, శ్రీలక్ష్మీనృసింహుని దివ్యచరణారవిందముల నాశ్రయించి దోషరహి తులై నోటాడిననుడిని సమయభంగములేక ననుసరించుచు సదాధర్మ కర్మముల నాచరణములందుంచిననాడు కర్మయోగము ఫలించి భగవత్కృపకుపాత్రులై కైవల్యమునొందెదరు.

నేటి దుష్టకలివాతావరణములో స్త్రీ పురుషులందు కొందరు కుయుక్తితో కుమార్గములకులోనై శరీరసుఖాలకు మరగి ధనకాంక్షా తప్తులై నీతిని పోనాడి ధర్మమునుత్యజించి కండ యండ నోటిబలము లతో తోడినరుల హృదయములను క్షోభింపజేసి ధనమునుకూడబెట్టి సుఖించవలెనని యెంచి చివరకు కష్టములపాలై నష్టపడి పరపతిచెడి పలుకుబడినశించి సంఘగౌరవమును గోల్పోయి దుష్టులని తమతోడి వారిచే పిలువబడుచు నీచావస్థలకు గుఱియై జీవచ్ఛవములకరణి చావు బ్రతుకులమధ్యచిక్కి సతమతమగుచుందురు.

"ఎన్నాళ్ళుబ్రతికినా కూటికే ! ఎన్నాళ్ళుగతికినా కాటికే!" యనెడి పెద్దల స్వానుభవసందేశసూక్తులను మాయాబద్ధులైన నరులు విన్నను వారి జీవితగమన కర్మములందెట్టి సత్పరిణామము కన్పట్టదు.

మూర్ఖ ప్రవృత్తితో పెడవాదనలుచేయు మనుజుడు వక్ర కర్మలనే వృత్తిగామార్చుకొని, స్వార్థమునువీడి ధర్మబద్ధమైన జీవితము ను గడపుటకు మనసొప్పక, పైపెచ్చు 'నేనొనర్చెడి కర్మములందెట్టి దోషములేదు. మీరొనర్చెడికర్మములే దోషయుక్తములని' వదరుచుండును. ఇట్టి వక్రమార్గావలంబకుని కాలమే శిక్షించగలదు.

మూర్ఖుని మనోప్రవృత్తిని గురించి మహాకవి భర్తృహరి గారిట్లుచెప్పిరి.

తే॥ తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రాగవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధించవచ్చుఁ
జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు॥

తా॥ ప్రయత్నముచేసి ఇసుకనుండి చమురుతీయవచ్చును. ఎండమావులనుండి నీటిని సంపాదించి త్రాగవచ్చును. తిరిగి తిరిగి కుందేటికొమ్మునైనను సాధింపవచ్చును కాని దురాగ్రహముగల మూఢుని మనస్సును మాత్రము సమాదానమొనర్చుట సాధ్యముకానిదనిరి.

అట్టి మూర్ఖుడైన మానవునితో ముముక్షువు సంభాషణలు పూర్తిగామాని వానివాక్యముల నౌననక కాదనక మౌనమువహించు టెంతయో శ్రేయోదాయకము.

భగవానుడు విశ్వస్వరూపుడు. ఈ సువిశాల విశ్వమునందు ప్రత్యణువు పరమాత్ముని దివ్యవిభూతి, యని విశ్వసించి యేప్రాణికిని బాధ భయాందోళనలు కల్గించక సర్వసమానదృష్టితో పరోపకార మొనర్చెడి మానవుని ముముక్షుడని, భక్తుడని తెలియవలయును.

ఇట్టి సర్వసమత్వైక్య దృష్టితో చరించెడి నరునకెట్టియాపదలు చేకూరవు. ఇందులకు ప్రత్యక్షప్రమాణము శ్రీ ప్రహ్లాదాది భక్తశిఖామణుల జీవితచరిత్రములే.

ఒకవేళ భగవద్భక్తునకు ప్రారబ్ధానుగతముగ కష్టనష్టములు సంభవించినను కఠినకర్మ-శబాధలకుగుటిచేయక వెంటనేసమసి శాంతిని

చేకూర్చును. ప్రారబ్ధానుగతమైన కర్మప్రభావానుభవమునకు సైతము ధీరోదాత్తహృదయుడైన నిజభక్తశేఖరుడు చలించక దైవమును దూఱక సహనముతో సులభముగా నధిగమించి నిత్యానందమును పొందగలడు.

మనుజునిభక్తికి సంసారబంధవిముక్తికి ప్రథమసోపానము సత్య వాక్యాచరణము. ద్వితీయసోపానము పరకాంతాసక్తి లేకుండుట. తృతీయసోపానము పరధనకాంక్షావిరక్తి. చతుర్థసోపానము ఆత్మస్తుతి పరనింద లేకుండుట. పంచమసోపానము సర్వభూతసమాదరణము. షష్టమ సోపానము గురుశాస్త్ర దైవములయెడ నపారవిశ్వాసముగలిగి త్యాగిమై చరించుట. సప్తమసోపానము తనను తా మరచి తత్త్వమునందైక్యమై నిర్వికారస్థితితో భక్తిపరాకాష్టను పొందుట. ఇట్టినిత్యానందైక్యమహా నిర్వాణస్థితిని మోక్షమని కైవల్యమని పరిపూర్ణమని నిర్గుణాతీతమని బుధులు శ్రుతులందు శాసించిరి.

సర్వమతముల ముఖ్యోద్దేశమిదియేనని సర్వశాస్త్రరహస్యార్థోక్తి నింతకంటె వేరేమియు లేదని శ్రీ యోగానంద నరసింహసద్గురు స్వామివారు వారి ప్రియశిష్యులకు పదే పదే చెప్పెడివారు.

మహామహులైన పెద్దలెందరో కర్మబంధములనుండి విముక్తి నొంది విశ్రాంతిపొందెడి శక్తిగల్గియు త్యజించక యనుభవించిరి. కర్మ యోగ ప్రభావమును కర్మ సిద్ధాంతమును నరులెల్లరు గుర్తించి దుష్టకర్మలొనర్చుటకు భీతిగల్గి నవారై వేదవిహితములైనసద్గురాదేశము లైన కర్మలనొలర్చుచు శాస్త్రనిషేధములైన కర్మలను పూర్తిగా త్యజించి దుష్కర్మములొనర్చు నరులకు బహుదూరముగా మెలగుచు కర్మయోగమును భక్తియోగసమ్మేళనముతో జ్ఞానయోగముగా రూపొందించి దైవానుగ్రహమునకు పాత్రులై జీవన్ముక్తిని జన్మజరా మృత్యుభయరహితమైన నిశ్చలాత్మానంద సంసిద్ధిని చెందవలెను.

లోకమునందున్న నజ్ఞులెల్లరు వారి వారి హృదయగతసంస్కారానుగుణకర్మములనే భూతలమునందొనర్చి తదనుగుణాఫలములను పొందుచు, సత్యదూరలై, సుఖానుభవములందు మాస్వయంశక్తియని, దుఃఖానుభవములందు భగవానుడొనర్చినాడనెడి యజ్ఞానపువాక్యము లాడుచు కాలకర్మచక్రపరిభ్రమణము నొందుచున్నారు.

కల్మషహృదయులైన మానవులు తమసతిసుతాదివర్గముల సంరక్షణ మొనర్చు మహాప్రయత్నములలో వేదశాస్త్రసద్గుర్వాదేశములకు తిలోదకములొసగి కన్నకడుపుతీపితో కులమత వర్గద్వేషములతో కాని పనులొనర్చి ధనార్జనమొనర్చి నా యా ధనసంపత్తితో పెంపొందించబడిన సంసారసమూహములవలన నిజమైన ప్రశాంతిని పొందజాలక సంసారసుఖములు సారహీనములని ఆత్మానందవిఘాతములని వీనివలన సుఖశాంతులు లేవని తమలోతాను దలంచి "మాకుగలధనమంతయు ధర్మకార్యములకు వెచ్చించి మాచిత్తక్షోభను నిర్మూలనమొనర్చి శేషజీవితములను, భగవత్కైంకర్యమునసద్వినియోగమొనర్చెద"మని త్యాగధనులైన ధర్మకార్యనిర్వహణములకు పూనినంత, తాముకన్న సంతతి తమ యల్లుండ్రు-కోడండ్రు నొక్కుమ్మడిగాలేచి "నోరుమూసుకొని చచ్చిన పీనుగులవలె నోరువిప్పక కుక్కిమంచములోపడి చావండిరా!" యని చివాట్లు పెట్టసాగెదరు.

ఈ జగత్తునందు కర్మరహస్యవిచిత్రగతిని లౌకికులైనమానవులు తెలియజాలక చిట్టచివరి దశవరకు సంసారతాపత్రయాగ్నులతో దహింపబడుచుందురు.

అజ్ఞాని, తానొనర్చిన కుకర్మల ఫలానుగుణములైన దురంత దుర్భరదుస్థితులనుండి తప్పించుకొనెడి తెరవుగానక శారీరమానసిక బాధలతో కట్టకడవరకు పడరానిపాట్లకు గురియై దుష్టసంసారచక్రపరిభ్రమణమునందు జిక్కి జీవితమునుకన్నీటితో పరిసమాప్తినొందించును.

ఇట్టి యమయాతనలతో కృంగి కృసించి నశించిన నరులనెందరినో వయసుగల నవయువకులు చూచినను సత్ఫరిణామమునొందక నీతిని పోనాడి కామ్యసుఖాలకై కాలమును కాయములను దుర్వ్యయ మొనర్చుచున్నారు.

ఐనను నిందరిలో యొకానొకవ్యక్తి. తనపూర్వపుణ్యప్రభావాను భవసత్సంపత్తితోడై దుష్టవాతావరణమునుండి బయటపడి ప్రశాంతి స్థానమైన పరమాత్మునిచేరుటకై మహాత్ముల దివ్యచరణసన్నిధిచేరి వారి కరుణకుపాత్రుడై హృదయపరిణామముచెంది జీవితగమ్యమైన ముక్తిపథము చేరుటకై విధిగ తగిన పురుషప్రయత్నమొనర్చి దైవత్వమునొందగలడు.

నరుడు నారాయణుడై, మానవుడు మాధవుడై, దయ్యము దైవమై, పాపి పావనుడై, మనిషి మనీషియై, జీవుడు దేవుడై, పాషాణము ప్రతిమయై, కర్మ యోగమై, మట్టి బంగారమై, మారగలవా?

నరుడు నిరహంకారియై నిర్వికారచిత్తముతో సంసారపయోధి లోని సుఖదుఃఖతరంగతాడనములకు జంకక లోకమునందుగల లౌకిక వ్యవహార సమస్యలయందు మనస్సును జొప్పించక తనజీవితధ్యేయమైన భగవత్సన్నిధిని మరువక నిజభక్తిని వదలక సర్వభూతములలో సర్వేశ్వరుని దర్శించుచు, భక్తివశవర్తి కరుణారసమూర్తి భద్ర ముద్రాంకితుడై నభక్తజనరక్షణదీక్షాకంకణధారి దశదిశలదివ్యప్రభలతో వెలుగొందెడి వేదస్వరూపుని శ్రీ శ్రీనివాసుని, త్రిగుణాతీతమైనస్థితితో నారాధించిననాడు నరుడు నారాయణుడై పూజనీయుడై పురాణ పురుషుడై లోకారాధ్యుడై వెలుగొందగలడు.

ఇట్టి యనిర్వచనీయమైన మహోత్తమస్థితిని నరుడు పొందుటకు కారణమేమి? దోషరహితమైన నిస్వార్థమైన నిరాడంబరమైన నిశ్చల మైన కర్మయోగమును పాటించుటయేనని తెలియవలెను. నరుడొనర్చు

పరమ పవిత్రకర్మయే, యోగమై భవబంధవిముక్తికిసోపానమై సర్వభయహారియై సర్వశుభములకు మూలమై రాణించగలదు.

సర్వభూతసమవర్తి సకలభువనాధిపతి శ్రీపతిపవిత్రదివ్యచరణార విందములనే సదాస్మరించెడి పరమభాగవతుడొనర్చు పవిత్రకర్మమే యోగమై సర్వజనాదర్శమై బరగుచున్నది. ఇట్టి భాగవతుడు సదా ధర్మ కర్మ బద్ధుడై తన జీవితగమనమును సాగించుచుండును. శాస్త్ర నిషేధకర్మములను ధనకీర్తిగౌరవములనాశించి చేయక తనకుగల సాదమే ప్రసాదమను దివ్యభావనతో కుటుంబభార నిర్వహణమొనర్చు చుండును. ఇట్టి యాదర్శగృహస్థధర్మకర్మ నిర్వాహకుడైన పరమ భాగవతోత్తముని భగవానుడైన శ్రీ లక్ష్మీనృసింహస్వామివారు వజ్ర కవచమై వక్రమార్గములకుజననివ్వక సాత్త్విక తాత్త్వికజీవనవిధాతగా రూపొందించగలడు.

"దేవుడసలుకలడా? ఎన్నడైన నెవ్వరికైన కన్పించెనా? కరుణతో సంభాషించెనా?" యని వదరెడి యహంకారి సైతము శ్రీ తిరుమల మహాదివ్యక్షేత్రమున కాలిడినవెంటనే భుజగశయనుడైన భూనాధుడు తన భూరికృపాదృష్టిని ప్రసరింపచేసి హృదయపరిణామము నొందించి వారిచే 'గోవిందా!' యనిపించి గుడిచుట్టూ భక్తిప్రదక్షిణము చేయునట్లొనర్చి దివ్యావ్యయ మహాద్భుత శక్తిని తెలియచేసి 'దాసపోషకా! కరుణాసముద్రా! కాంచనచేలా!' యనెడు స్తోత్రములు చేయించుకొనుచుండును.

శ్రీతిరుపతిగిరిపై జగత్పతియై సర్వజగత్పునకారాధ్యమూర్తియై నమ్మి భజించెడి తనభక్తకోటి కన్నీటిని పన్నీటిగామార్చి వేదాంత వీధులలోవిహరించిరి. శ్రీలక్ష్మీరమణునిదివ్యావ్యయభవ్యవైభవమును ప్రత్యక్షముగా ప్రతి భారతీయుడు దర్శించి పొందిన మధురానుభూతి మఱపురానిదై జీవితాంతమువరకు సుస్థిరమై ప్రకాశించుచున్నది.

నిజభక్తితో శ్రీపతిదివ్యనామస్మరణమొనర్చెడి భక్తవతంసుని దారుణసంసారభారనిర్వహణమూ యనంతుడే భరించి కాచి రక్షించ గలడు. ఇది యీ రచయిత స్వానుభవసారాంశసత్యసూక్తి.

సర్వవ్యాపకుడు సర్వభూతసమవర్తి సాత్వికజనరక్షకుడు కలికల్మషమానవోద్ధరణమునకై శ్రీ సప్తగిరిపై స్వామియై వెలసిన సర్వేశ్వరుని దివ్య సౌందర్యస్వరూపమును దర్శించని హైందవుడుండ డనుట యతిశయోక్తి కాదు.

విషయవాంఛలు నరుని వానరునిగామార్చి నరకమునకు నేరుగా బంపించుననెడి ప్రజానుభవసత్యమును ప్రతిముముక్షువు తెలిసి భీకర భయదోగ్ర సంసారమాయాపిశాచిని సద్గురావాదేశోపదేశసందేశసూక్తి సంస్మరణ మహత్తర శక్తితో రూపుమాపి నిర్భయుడై స్వేచ్ఛా విహారియై స్వామికరుణకు పాత్రుడగును.

శ్రీ సద్గురుసేవాభక్తికర్మతత్పరుడైన నరుని శ్రీమన్నారాయణమూర్తి సదా కన్నతండ్రికి మిన్నయైన కరుణతో కాపాడి పోషించి రక్షించగలడు.

'పాలున్నవానికి పెరుగుకేమికొదువ' 'బియ్యముగలవానికన్నము నకేమిలోటు' యనెడు సామెతలగా ప్రతిముముక్షువు శ్రుతి స్మృతి సద్గుర్వాదేశములను భక్తితో నాచరణమునందుంచినవాడు సర్వదుఃఖ నిలయమైన సంసారమే ముక్తికి సోపానమై భవబంధవిముక్తికి పాఠశాలయై భాసించగలదు.

ధర్మాచరణమునువీడి దయనుపోనాడి త్యాగమునకుతిలోదకము లిడిన నరుడు వాగ్రూపవేదాంతవీధులలో విహరించిన నుద్ధరణమొంద జాలడు.

త్రేతాయుగమున అయోధ్యాపురీశుడు శ్రీ దశరథక్ష్మాపతి నోటాడిన నుడి ననుసరించు మహాప్రయత్నములో కల్యాణగుణాభిరాముని శ్రీరామచంద్రుని ఘోరారణ్యమునకు లక్ష్మణస్వామిని

శోకముచేసి వసిష్ఠమహర్షి వెంట బంపుటకు ధర్మనిర్ణయముచేయు, పతిభక్తిపరాయణమైన జనకరాజసుత, నిండుహృదయముతో పతి జగత్పతియనెడి దివ్యభావనాబలముతో యారాధించెడి స్థితినివీడినునజాలక సర్వసుఖభోగనిలయమైన అయోధ్యనువీడి పతివెంట పయనమైనది. నాయనాడుదయమే, సర్వసామ్రాజ్యమునకధినేతయై పరిపాలించవలసిన రాజ్యారమనువీడి పితౄజ్ఞాపరిపాలనా నిర్వాహణమునకై, కైకమ్మ స్వార్థావేశం దేశపరిపాలనకై ధర్మోద్ధారణమునకై తాను దివినుండి భువికరుదెంచిన దుష్టరాక్షసమారణ మహోద్యమ కర్తృత్వసిద్ధికై శ్రీరామభూపాలుడు కాషాయాంబరధారణతో సతీసమేతముగా లక్ష్మణుని వెంటతీసికొని ఘోరారణ్యములకుంజనియె.

ఇట్టి మహోత్తమమానవధర్మప్రతిష్ఠాపకుడగుటచేత శ్రీరాముని సర్వజనులారాధ్యదేవుడని భావించి నేటికిని ప్రతి గ్రామ గ్రామమున శ్రీరామాలయనిర్మాణములొనర్చి శ్రీరామభజనలుగావింపదొడంగిరి.

ఇట్టి యాదర్శమూర్తి శ్రీ రఘువంశతిలకుడగు రామచంద్రుని దివ్యజీవితగాథను మహాకవి శ్రీ వాల్మీకిమహర్షి వేలాది శ్లోకములతో రచనచేసి ప్రజాహృదయములందు శ్రీరాముని ప్రతిష్ఠించిరి.

ఎన్నడో రచనచేయబడిన శ్రీమద్రామాయణమునకు వ్యతిరేకములైన భావాలను సృష్టించి రాముడు దేవుడుకాదు, సామాన్య మనుజునికంటె తేలికగాచరించెనని,దుష్టుడని,'రామాయణవిషవృక్షము' యనెడి నామముతో రచించి లోకమునకందించెను శ్రీ ముప్పాళ రంగనాయకమ్మ.

అదేమిచిత్రమో? వెంటనే, శ్రీరాముని సత్యశక్తిపరాక్రమ విజృంభణ మహత్తరమహిమావిశేషమా!యని శ్రోతలాశ్చర్యమొందు కీర్తి మహాకవయిత్రి శ్రీ మహిళామణి "లత"యను నామె'రామాయణ విషవృక్షఖండన' యనెడి నామముతో నొక గ్రంథరాజమావిర్భవింప చేసెను.

అసలు రాముడు దేవుడా? దేవుడే రాముడా? రాముడు, దేవుడు వీరిద్దరు మనకుమించినశక్తిగల మానవులా?యనుప్రశ్నలతో కాలమును కాయములను దుర్వ్యయ మొనర్చుటతప్ప మరెట్టి ప్రయోజనము కనపట్టదు.

భక్తియోగము జ్ఞానయోగము రెండింటికి కర్మయోగము పునాదియని సుస్పష్టముగా శ్రీ వాల్మీకిరామాయణములోని శ్రీరామ చరిత్ర లోకమునకు చాటుచున్నది.

లోకమున సర్వులు కర్మయోగచక్రపరిభ్రమణమునందే నిమగ్నులైరి. కర్మయోగ ప్రభావముతో నరుడు నారాయణుడై వెలుంగ గలడు. కర్మప్రభావముతో నరుడు వానరుడై దానవుడై చరించి కట్టకడకు దేవుడేలేడను నాస్తికభావముతో కంటికింపైన కులటలతో కలియుచు చేతిలో పైసాలున్నంతవరకు కులుకుచు భగవదారాధకులోనర్చెడి విశిష్టకర్మములను హేళనమొనర్చుచు తానే సర్వజ్ఞుడననెడి దుర్భావముతో దురహంకారియై దుష్టకర్మములందే మసలి కన్నీటికి గురియై కాటికిచేరుటెన్నడా? యనెడి చింతతో దినమొక యుగముగా గడపెడి దుర్భర దుర్విచారముపాలై వర్ణనలకందని నరకము నిహ లోకమునందే యనుభవించుచున్నాడు.

వయోరూపవిలాసినియై సద్గుణముల బంతియై చెన్నారెడు సతీమణి చేసెడి మర్యాదలను సర్వవిధసేవలను పొందుచు మతిలేని స్థితితో మంచమునందే మెత్తని పరుపుదిండ్లమధ్య మాంసపుముద్దవలె చలనరహితుడై నాసికారంధ్రములనుండి గాలినిమాత్రము పీల్చుచు వదలుచు వివిధములైన ఘనవైద్యములను పొందియు ప్రయోజనమును బడయజాలక స్వయంకృతాపరాధముల ఫలానుభవముతో జీవచ్ఛవము కరణి బ్రతికెడి నరునిస్థితి యెంతటి దుస్థితియో?

ఇట్టి కఠినకర్మఫలభోక్తయైన నరుని దుర్భర దుస్థితిని కన్నులార దర్శించిన నవయువకులు వెంటనే, శిక్షించెడివాడొక్కడెక్కడో

యున్నాడని, విధిగ విశ్వసించి సాత్త్విక సౌజన్య సద్గుణ స్వరూపులై సదా సద్గుణవంతుల ప్రబోధములను వినుచు మనోవేగమును నిరోధించుచు మహాత్ములను భక్తితో దర్శించుచు సర్వేశ్వరుని యనంతశక్తి రహస్యమును తెలిసి చరించుచు హృదయపరిణామమును చెంది వేదాది గ్రంథములను పరామర్శదృష్టితో పఠించి సత్యమును గుర్తించి జీవిత విధులలో చొప్పించి దివ్యాచరణశీలురై వెలుగొందిననాడు కర్మయోగమే కైవల్యమును ప్రసాదించగలదు.

నేటికాలపు వికృతభావోన్మత్తుడైన మానవుడు భౌతికసుఖభోగ వాంఛాబద్ధుడై భగవాదేశములైన ధర్మ న్యాయ సత్య నీతి వాక్యములను విస్మరించి దురాశావేశమునకు బానిసయై ధనార్జనమునకు చేయవలసిన వ్యవసాయ వ్యాపారాది కర్మలనుచేయుట శ్రమయని త్యజించి కష్టములేని ధనార్జనకై యెన్నోమాయామార్గములను సృష్టించి విషయపరిజ్ఞానములేని దురాశాపరులను వశమొనర్చుకొని వారితో రహస్యముగా 'ఇత్తడిని బంగారముచేయువారున్నారు పెట్టుబడికి రొఖ్ఖము కావలయు' ననెడి తియ్యని మాటలుచెప్పి వారియర్థములలాగి స్వాహా చేయుటయు, సినిమాపిచ్చితో, సినిమాలలోచేరి లక్షలార్జించవచ్చునను యూహలతో తిరిగెడి సోమరిపోతులను యొద్దకుచేర్చుకొని, సినిమా నిర్మాతలు నాకు తెలిసినవారే సినిమాలో చేర్చగలను ఖర్చులకై ముందు పెట్టుబడి తీసుకురండన వారు దురాశకులోనై తెచ్చియిచ్చిన ధనమును స్వంతఖర్చులకై స్వాహాచేయుటయు లోకమునందు జరుగుచున్నది. ఏ పనిచేయుటకు మనస్సు కుదురక శరీరశ్రమ లేకయే తనతోడి వారికి మించిన ధనవంతులమై సుఖించవలయుననెడి దుర్బుద్ధితో దేవతా విగ్రహములపై తళ తళ కాంతులతో మెఱయుచుండెడి సువర్ణ రజితాభరణములనులాగి యెవ్వరికి తెలియనిరూపమున దొంగవ్యాపారులకు విక్రయమొనర్చి వారొసంగిన ధనమునుస్వీకరించి తాను తనకుటుంబము హాయిగా బ్రతుకదలంచుచుండును.

ఆలయములలో మంత్రయంత్రాది పునశ్చరణాది శక్తులతో వేదవిదులైనపెద్దలు ప్రతిష్ఠించిన దేవతామూర్తులపై ప్రకాశించెడి వస్తుసంగ్రహమొనర్చిన మానవాధముడు వానిదుష్టదౌర్జన్యముండుటకు కర్మపరిపక్వమైన సమయమున సర్వవిధముల పతితుడై మూటికిదూరమై కన్నీటిలో కాపురమొనర్చి వంశనాశనమొందగలడు.

నేటి దుష్టకలివాతావరణప్రభావముచే ధనకాంక్షాతప్తులైన మేకవన్నెపులులైనపెద్దలు, దోపిడివిధానముతో దయాధర్మములను త్యజించి తమతోడి మానవులను కబళించి కాసులనునిల్వచేసికొని నోటిమాటలబలముతో సంఘమున చలామణియగుచున్నారు. ఇట్టి కపట రాజకీయ చతురులు స్వగృహములనువీడి గ్రామసంచారము లొనర్చి దుష్టులతో పొత్తొనర్చి పాచికలతో మాయారూప ప్రదర్శనములతో సత్యాత్ములను సమయముచూచి నమ్మించి వారిధనమును కాజేయుచున్నారు.

సర్వము సర్వేశ్వరుని యధీనమున నడచుచున్నది. నరులకర్మ ఫలానుగుణముగా సర్వేశ్వరుడే సంతోషసంతాపములను సమకూర్చుచున్నాడు. ఈ సత్యమును తెలియనివారు కర్మసిద్ధాంతమును నమ్మని వారు 'సర్వసుఖాలను యుక్తి శక్తి మేధాసంపత్తి వినియోగమువలన పొందవచ్చు'ననెడి దురాశతో పరవిత్తాపహారులైన మధ్యవర్తుల సలహాసహకారసంపత్తితో కార్యసిద్ధికై లంచాలనిడి చివరకు రావలసిన యర్థము వ్యర్థముగాగ తనకుగల యర్థముసైతము వ్యయమై చింతలకు గురియగుదురు.

కల్లకపటములేని కరుణాహృదయులు కొందరు, స్వార్థపరుల చల్లనిమాటలనునమ్మి కష్టనష్టములపాలై "ఆహా! మనవంటివారని మోసపోయితిమి. వేషభాషల మహిమనుచూచి నరులనునమ్మరాదు. ధనమునకై యెట్టి ఘోరకర్మలనైన వెనుకంజవేయక చేసెదరను సత్యము నేటికి తెలిసినదని" కడుజాగరూకతతో మెలంగుచున్నారు.

ఆత్మబలములేనివ్యక్తి, పరిస్థితుల ప్రభావమునకు బానిసమై వక్రకర్మలనొనర్చుచుండును. పరిస్థితుల ప్రభావమునకు నరుడు బానిసగాక యాత్మతేజోశక్తితో సత్యాదర్శమునకై ధర్మ కర్మ నిర్వాహకుడై వెలుగొందిన నాడాతడే మహాత్ముడు.

ఇట్టి మానవోత్తముని కుటుంబసహితముగా శ్రీమన్నారాయణ మూర్తియే కాపాడితీఱును. కర్మసిద్ధాంతములలో నిరహస్యము లందరి కవగతములుగావు.

శ్రీ నరహరినినమ్మిభజించెడి భక్తవతంసుడై ననుతననోటాడిన నుడి ననుసరించనినాడు చిత్తక్షోభను చెందవలసినదే! జూదము, సురాపానము, వ్యభిచారము, దొంగతనము, అసత్యము, యనెడి నీ యైదింటిని నరుడు కాంక్షించి వాటియందుగల యభిరుచితో త్యజించు టకు మనస్సు కుదురక కడకిడుములపాలగుచున్నాడు. ధర్మములేదు. దైవములేదు, సర్వము నరుడనుభవించుటకే సృష్టించబడినవని వాదిం చెడి తార్కికబుద్ధితో లోకమున నరుడెంతకాలము పరిభ్రమించినను, పరిశ్రమ మొనర్చినను నిజమైన శాంత్యానందములను బడయజాలడు. శతావధానినై సర్వజనపూజితుడైన వ్యక్తి సైతము తాత్కాలిక తృప్తికై మహాగ్రంథపఠనములందప్పుడప్పుడు నశ్యమును తన నాశికా రంధ్రమున కెక్కించి సంతృప్తి చెందసాగును. ఈ దృశ్యమునువీక్షించెడి వారి కెంతయో నసహ్యముకల్గించినను నా పౌరాణికాగ్రేసరుడా నస్య సేకరణ కార్యక్రమమును సాగించుచునేయుండును. దీనింబట్టి ప్రతి పాఠకసోదరుడు తెలిసికొనదగిన సత్యమేది? దుష్టకార్యక్రమావలంబన మున ముకళితలవడిన మనస్సును నరుడు స్వాధీనమందుంచుకొనుట కష్టసాధ్యమని తెలియవలెను.

ఉత్తమసంస్కార విభవముతో విరాజిల్లెడి నరుడెట్టి వక్ర కర్మల ననుసరించడు. ఒకవేళ ప్రారబ్ధానుగతముగ దుష్టకార్యములందు

మనస్సు ప్రవేశించినను వెంటనే తనతప్పుతానెఱింగి బుద్ధిని శుద్ధమొనర్చుకొని పునీతుడగును.

ఒక్కొక్కవ్యక్తి, పుష్కరములాదిగా సాగించిన ధూమపాన, మధుపాన, మాంసభక్షణ, చౌర్య, వ్యభిచార, యసత్యాది దోష కర్మములను యేదో యొకానొక సుసంఘటనా ప్రాభవముచేత నా యా వక్ర కర్మలన్నింటికి తిలోదకములొసంగి తీర్థ స్వరూపుడగును.

శ్రీ వేమన్న, నిజలింగచిక్కయ్య, కాళిదాసు, నజామిాళు డాదిగాగల మహావ్యక్తులెందరో వక్రరీతులలో స్వేచ్ఛాసంచార మొనర్చెడి వారి వారి మతులను క్షణకాలమున సంస్కరించుకొని సాధు పుంగవులై లోకపూజ్యులై ధ్రువతారలై వెలుగొందిరి.

ప్రకృతిరంగమునందు, సన్మార్గుడు దుర్మార్గునిగా, దుర్మార్గుడు సన్మార్గునిగా, మహామేధావి పిచ్చివానిగా, లక్షాధికారి బిక్షాధికారిగా, బిక్షాధికారి లక్షాధికారిగా, జీర్ణస్థలములు పుణ్యక్షేత్రములుగా, పుణ్యక్షేత్రములు పాటిమట్టిదిన్నెలుగా, గుండ్రాయి మహాదేవునిగా, మహాదేవుడు గుండ్రాయిగా, రాజు కింకరునిగా, కింకరుడే రాజుగా, పాషాణమే ప్రతిమగా, ప్రతిమ పాషాణముగా పరిణామమొందిన సన్నివేశముల నెన్నింటినో నేటికాలమున సర్వులము తిలకించుచున్నాము.

మానవుడు సర్వభోగములనుభవించియానందించెడు మహావకాశము, ధన ధాన్య వస్తుసంపత్తి కలిగినను శరీరము నందారోగ్యము లేని నాడంతయు నిష్ఫలమే:. ఇట్టి యతుకులబొంత తొమ్మిది కంతల ముంత నిరంతరచింతగల తోలుబొమ్మను నిజమని నమ్మి నరహరి నామస్మరణమును, ధర్మాచరణమును వీడిన నరునిగతి దుర్గతియేగాని సద్గతికాదు.

శతాధిక మహాగ్రంథ రచనలను సంపూర్తిచేసి ప్రజానాయకుల గౌరవసన్మానములను శతాధికముగా పొందిన మహాకవిసార్వభౌము డైనను,తనయంతరాత్మాదేశములను త్యజించిబుద్ధివేగమునకు బానిసమై

పాపకర్మలకుపక్రమించిననాడు పురోగతి చెందక తిరోగతినొంది కర్మ భ్రష్టుడైననాడు క్షుద్రజాతికిచెందినవాడని నిర్ధారణమగును.

నరుడొనర్చు కర్మఫలప్రభావమే కాలానుగుణముగ సంస్కారమున భాసించగలదు. సత్కర్మల, సత్సంగముల, సద్గ్రంథముల, సత్యాత్ముల మహిమ చాలగొప్పది. నరునిబాల్యదశనుండి సాగించిన సద్గ్రంథ పఠన ప్రభావము, సజ్జనసాంగత్యశక్తి, మహాత్ములదివ్యాత్మ ప్రబోధములను, భక్తితో వినిన ఫలము, పుణ్యక్షేత్ర సంచారమహిమ, పెద్దలయెడగల భక్తి, సద్గురుకృపాశీర్వాదశక్తి, వీటియన్నింటి ఫలప్రభావ మహిమ లోకాదర్శమై, ప్రకృతి బంధాలకతీతమై వ్యక్తిలోదివ్యత్వమై ప్రకాశించగలదు.

అట్టి దివ్యపురుషుని మహిమోపేతమైన మధుర వాక్యములచేత స్వానుభవాత్మకమైన భవ్యరచనములచేత నరులు విధిగ హృదయ పరిణామమును చెంది ధర్మపథగాములై దేశాభ్యుదయమునకు కారకులై విలసిల్లుచుందురు.

శాస్త్రవాక్యములన్నియు నిత్యసత్యములా? ఆచరణ యోగ్యములా? ఆదర్శధర్మసూత్రములా? ఆర్షసంస్కృతిసోపానములా? కాదు. ప్రప్రథమున తెలివిగలవ్యక్తులేకమై సృష్టించిన స్వార్థపరమైన శాసనములని వాదించెడివారు నేటికాలమున దినదినాభివృద్ధిచెందుచున్నారు.

ఒకరుచెప్పినవి మఱొకరువ్రాసినవి విధిగవిశ్వసించినచో మనకేమైనముప్పువాటిల్లునా? యనెడి ప్రశ్న హృదయమునకల్గిన వారెల్లరు నిదానముగా, నిబ్బరముగా, ప్రశాంతమతితో యోచనచేసిన సత్యము తేటతెల్లముగా బోధపడగలదు.

హైందవమున, వాస్తు, జ్యోతిష, శకున, వైద్య, ధర్మ, యోగ, వేదాంత, కళా, గాంధర్వ, శాస్త్రాదికము లెన్నియోగలవు. ఈశాస్త్రములన్నింటిని, మేధాసంపద్విభూతితో, దివ్యతపోతేజశ్శక్తులతో

వర్ధిల్లిన మానవుడొకానొకసమయమున లోక క్షేమంకర ధ్యేయముతో కరుణాహృదయముతో రూపొందించినవి. ఇందెవ్వరికెట్టి సందేహము వలదు. సందేహము లేని దేహమునకే ప్రశాంతి. సందేహసందోహముతో మనుజుడు, వేదవేదాంగములను పుక్కిటబట్టినను ప్రయోజనములేదు.

మానవుడు శుభసంతోష కార్యక్రమనిర్వహణమునకై తిథి వార నక్షత్ర యోగములను బాగుగాపరిశీలనచేసి, బాగుగాయున్నదని గుర్తించిన యనంతరము ప్రయాణోన్ముఖుడగును. ఇట్టి సమయము లందునైతము శాస్త్రమునందు నిషేధించబడిన దుశ్శకునదృశ్యము లెదురైననాడు, తనలో తానివియన్నియు తెలివిగలమనుజులెవ్వరో సృష్టించి యమాయక పరిజలకన్యాయ మొనగూర్చిరని, యూహించి ధైర్యముతో ముందునకుసాగిచతురతతో యుక్తిశక్తులనుప్రయోగించియు కట్టకడకు కార్యవిఘాతమునొంది వగచినవారెందరినో నేటిలోకమున ప్రత్యక్షముగా గాంచుచున్నాము.

ఇట్టి నిత్యసత్యములను యథాతథముగా పరిశీలనాత్మక బుద్ధితో నరులాలోచనచేసి సత్యమును గుర్తించిననాడీశాస్త్రములన్నియు, నిస్వార్థపరులు, జితేంద్రియులు, యోగజ్ఞానానుభవమును పొందిన మహర్షులు త్రికాలములలోని సత్యాసత్య విషయములనుసునిశితబుద్ధితో యాత్మబలముతో వివిధ శాస్త్రములరూపముతో వ్యక్తమొనర్చి సజ్జనోపయోగముగా ప్రసాదించిరని నేడు మనకెల్లరకు నిజము వ్యక్తమగుచున్నది.

ధర్మపథగామియైన నరుడే మతమునకు, కులమునకు చెందినను, యే రూపము నుపాసించినను యే నామమును స్మరించినను యే యే స్థలముల చరించినను తిరోగతిలేక పురోగతినొందగలడు. ఇది తథ్యము త్రికాలసత్యము.

వ్యక్తి, వేదాంతపద్యశ్లోకగద్యాది విషయపఠనముతో వేదాంత విషయకవనముతో వేదాంత విషయోపన్యాసముతో నుద్ధరణము

నొందుటకల్ల.ఏ ధర్మసందేశసూక్తులను నరుడు నోటితోనుచ్చరించునో, పఠనమొనర్చునో, పారాయణముచేయునో వానిని పాటించవలెను. పాటించిననాడే ధర్మశక్తిననుభవించి దైవకరుణకుపాత్రుడై వర్ధిల్లగలడు. లేనిచో "తాటియాకుపై బెల్లమనివ్రాసి నాలుకతో చప్పరించిన" ఛాందసుని బోలినవాడగును.

పరులమాటలునమ్మి కర్మకుపక్రమించిన నరులగతి గరతమున పడద్రోయుననుటలో సందేహామువలదు. పరులనగా నెవరు? స్వార్థా వేశపిశాచికి బానిసలై నచో నట్టి కన్నతల్లిదండ్రులనైనను తోబుట్టువులైనను, బావ మరదులనైనను పరులగాభావించవలెను. దీనిభావమేమి? నవమాసములుమోసిన కన్నతల్లియైనను, కనికరముతో పెంచిపోషించిన తండ్రియైనను స్వార్థపిశాచి వాడికోఅలకు గుఱియైననాడు వారిలోగల మాతృత్వ పితృత్వశక్తి పలాయనమై దయ్యపుశక్తులతో తాండవించు చుందురు.

ఇందులకు శ్రీ ప్రహ్లాద ధృవాది మహాభక్తుల చరిత్రములు మనకు పరమప్రమాణములు. ఆదర్శభక్తశిఖామణుల జీవితములే లోకమునకు సత్యసందేశములై రాణించుచున్నవి. మహాత్ముల స్వానుభవ సందేశసూక్తులు భక్తకోటి నుద్ధరణ మొందించగలవు.

"రోగికి వైద్యునిసలహా యెంతటి సుఖ సంతోషములను చేకూర్చునో" మాయాబద్ధులైన నరులకు మహాత్ముల మధురవాణి యంతటి సుఖమును చేకూర్చగలదు.

నరులు నీతులెన్ని నేర్చినను శ్రుతులెన్ని పఠించినను తమ తమ హృదయగుహాలలో ప్రకాశించెడి పరమాత్మ ప్రబోధములకు వ్యతిరేకముగా జీవితగమనములను సాగించినచో కర్మభ్రష్టులై లోకపుతెగడ్తలకు గుఱియై హృదయక్షోభతో పరితపించుచుందురు.

"రామాయణము రంకు" "భారతము బొంకు"అని నేటి కాలపు కవులలో కుబుద్ధిగల స్త్రీ పురుష రచయితలు బృహద్గ్రంథములను

రూపొందించి సమాజమునకు విక్రయములొనర్చి వేలాది రూప్యముల నార్జించుచున్నారు.

దేవుడే లేడను భావముతో, నరుడు స్వయంశక్తి సామర్థ్యములతో సర్వమును గెలిచి యమరుడై సర్వాధినేతనై చరించెదనని దలంచెడి విపరీతవాతావరణ దుష్కరకాలమున సైతము, వైశ్యసమాజము ఆస్తికతతో పెద్దలయందు గౌరవభావము, గురు, శాస్త్ర, దైవ, బ్రాహ్మణులయెడ అపారభక్తి, దేహియని ప్రార్థించిన ప్రతివారికి శక్తికి తగినరీతిగా దానములు చేయుట, పరులాడిన పరుషవాక్యములను వినియు వారికర్మ వారిదే యనెడు పేక్షభావముతో నోర్పుగలిగి ద్వేషము లేకుండుట, భగవద్భాగవత సమారాధనా విధానముల నవలంభించుట, భగవదాలయనిర్మాణములు, సత్కార్యములకు విరివిగా ధనమును వినియోగముచేయుట, జగద్గురువులు, పీఠాధిపతులు, కవులు, పండితులు, విద్వాంసులు గాయకులాదిగా పెద్దలను సన్మానించి పూజలొనర్చి మహోత్సవములొనర్చుట, లోకోపకారమొనగూర్చెడి గ్రంథముద్రణాదికార్యక్రమముల నిర్వహణమొనర్చుటాదిగాగల కార్యములెన్నింటినో లోకమున భక్తితో, యోర్పుతో నేర్పుమీర స్వార్థమున కాసించక నిర్వహణమొనర్చుటెంతయో ముదావహము. మానవ సమాజమునకే గణనీయమైన ఆదర్శము.

సదా సత్కర్మల నిర్వహణమొనర్చెడి భక్తమూర్తులను భగవానుడు కాపాడితీరును. ఈ కలికాలమున మంచికిస్థానములేదు. ఐనను మంచివారు వారి సదాచారసత్యనిరతిని వీడక సర్వేశ్వరునినమ్మి భజించుచునేయున్నారు. ఇది ఆర్షసంస్కృతియొక్క ప్రభావము.

నేటి కలిప్రభావమునకు న్యాయశీలురు, ధర్మమూర్తులు, సదాచారనిరతులు, ఆదర్శకవి కథక గాయక నాయకులెల్లరు పురోగతి లేక తిరోగతినొందుచునేయున్నారు. వేదోపనిషద్గీతాశాస్త్రములపై నరులకు విశ్వాసముతగ్గినది. ఆ మహత్తర మహనీయ మధురాదేశ

సందేశములలోని గంభీరభావసముదాయ సౌందర్యమునందుగల యాదర్శ ధర్మశక్తిప్రభావమును గుర్తించెడివారరుదైరి.

"వ్యభిచారములోపుణ్యము" "దోపిడిలోశాంతి" "ఆకాశములో స్వర్గము" "అరచేతిలో వైకుంఠము" "రాముడు దేవుడుకాదు" "రాముడసలెవరో తెలుసా?" "ఆడ మగ తేడాలేదు" యనెడి నామములతో నిసారచనలుసాగించి పొత్తములుగా రూపొందించి విక్రయమునకు సిద్ధమొనర్చినచో లక్షలాదిపొత్తములు ఖర్చుకాగలవు.

ఇందులకు కారణమేమనగా! సర్వాలంకార భూషితమైన స్త్రీమూర్తి నందరు పనిబూనిచూడకున్నను, బట్టలువిడచి బజారున బడిన కులటను చూడనివారుండరు. ఇదే విధముగా నేటి విపరీత దారుణవాతావరణమునందు మంచినిగుర్తించి మంచితనముతో తదితర వ్యక్తుల హృదయముల తీఱు తెలిసి ప్రవర్తించెడి శుద్ధ సాత్త్విక హృదయులరుదైరి.

శ్రీకృష్ణగీతోపన్యాసము వినువారిలో, నొకరు, వేఱొకనితో 'ఆమహోపన్యాసచేసెడి యోగినీమాతగారి నామధేయము, నివాసస్థానమెచ్చట బాబూ!' యని మెల్లగా యడిగినచో గీతావాహినిలో మునిగి తేలిన ఘనమైనవ్యక్తి, నీకామెనామముతో నివాసస్థానముతో యేమిపని, యని క్రోధఘూర్ణితనేత్రాలతో సమాధానమొసంగును. "తెడ్డు పాయసములోనుండినను ప్రయోజనములేనిరీతి" వ్యక్తి స్వశక్తి సామర్థ్యములున్నవనెడు గర్వముతో తనకుతెలియని క్రొత్తవ్యక్తి హృదయపుతీఱు సుసంస్కారసంపత్తి నర్థముచేసికొనలేక యేమేమొ సంభాషణములుసాగించి బాధకల్గించుచు. వేషభాషలు విద్వత్శక్తి యుండినను ప్రయోజనముగలుగదు.

వ్యక్తిపూర్వాపరములు తెలియక దురాగ్రహావేశమునకు బానిసమైననాడు పండితశాల్వాలుపైన వేసినను పండివాక్యాలు ప్రసంగించినను

పండితుడు కానేరడు. సరళహృదయము, ప్రశాంతప్రసంగము, ఓర్పు, త్యాగము, సత్యనిరతిగల సామాన్యపౌరుడు, గీతోపన్యాసములజోలికి వెళ్ళక తనస్వధర్మమును తెలిసి నింట బయట మెలగినచో, గణనీయ మైన మానవత్వమని తెలియవలెను.

దుర్గర్వముగల మహాపండితులవలన, సకలవిద్యాచతురులవలన, గొప్పవంశమునబుట్టిన పెద్దలవలన, సమాజమునకు మేలుచేకూరదు. సద్గుణసంపత్తితో పరహితకాంక్షతో కామినీకాంచనాసక్త విదూరుడై సదా భగవద్గుణావైభవముచే నొప్పాఋచు కీర్తించుచు గానమొనర్చుచు సంసారయాత్రాపర్యటనముతో కాలమును సద్విని యోగమొనర్చు నరుడే నారాయణునికృపకు పాత్రుడై సమాజమున కాదర్శప్రాయుడై భక్తమూర్తియని ప్రజలమన్ననలనుపొందుచుండును.

నరులు భవసాగరోత్తరణమునొంది పరమపురుషునిలో తాదాత్మ్యమునొందుటకై పార్థునెపముతో శ్రీకృష్ణపరమాత్మ గీతారహస్య ప్రబోధమొనర్చిరి. దుర్గుణరహితుడై సద్గుణవరిష్టుడై నరుడు భక్తితో సాగించెడి ప్రతికర్మయు గీతాయజ్ఞమై భాసించగలదు.



# ధర్మచ్యుతియే దుఃఖమునకు మూలము.

దేవుని ద్వేషించి యహంకారిమైసాగించిన దక్షునియజ్ఞము సర్వజనమారణహోమముగా పరిణమించినది. దేవదేవుడైన వాసుదేవుని తన రథసారథిగా నియమించుకొని పార్థుడు సాగించిన కురుక్షేత్ర సంగ్రామము శ్రీ భగవద్గీతా ప్రబోధమునకు కారణమై లోకజన సంసేవ్యమై ముముక్షుజనసహస్రములకు మార్గదర్శకమై ప్రకాశించినది.

కర్మబలము చాలఘనమైనది. సత్కర్మ దుష్కర్మలు రెండు నరునికలవడినచో కోతిపుండువైద్యమువలె నానాటికి సత్కర్మక్షీణించి దుష్కర్మబలమై వదలించుకొనుటకు వీలుగాని దుస్థితికి గురిచేయు ననుటలో నెట్టి సందేహములేదు.

ఈ బలమైన కర్మప్రభావముచేత సత్కర్మలుచేయువారుసైతము ధర్మస్థితినుండిదిగజారి చోర, జార, సురాపానాది నింద్యకర్మలలో చరించుట లోకమునందక్కడక్కడ గాంచుచున్నాము.

స్త్రీ, పురుషులెవ్వరైనను చోర, జార,సురాపానాదినింద్యకర్మల కలవడి జీవితగమనములను సాగించెడు తఱి వారెంతటి ధనవంతులు, బలవంతులు, విద్యావంతులైనను వారుసాగించెడు నీచగుణకర్మలను వీడజాలక, మాయానాటక పాత్రధారులై కపటవినయ విధేయతలతో దైవకార్యములందు పాల్గొనుచు భగవంతుని నామస్మరణమును చేయుచు మహాత్ములసద్బోధలను వినుచు యలవడిన నీచకర్మలను త్యజించి శుద్ధజీవులుగా బ్రతుకుటకు మనసొప్పక నింద్యకర్మలలో కాలమును వారికాయములను పాడొనరించుచున్నారు.

నింద్యకర్మలతో జీవితముగడపెడి స్త్రీ పురుషులకు కులమత స్థితిగతి తారతమ్యములుండుటకవకాశములేదు. పరస్త్రీలతో తిరిగెడి పురుషునకు, పరపురుషులతో వ్యభిచరించెడిస్త్రీ, వీరికి సిగ్గు, మర్యాద, నీతి,భయము, భక్తి, సంఘభీతి, పరువు, ప్రతిష్ఠ, మొదలైన సద్గుణములు మచ్చునకైన లభించవు. పైపెచ్చు గ్రామమునందు వీరికి పలుకుబడి హెచ్చు. కండలు, యండలు, ధనము, బలముగలిగిన రోజులలో వీరిదర్జాలకంతుండదు. ఇట్టి వ్యభిచారులైన స్త్రీ పురుషుల నోటికి, నీతిగలిగి ధర్మమునకుబద్ధులై చరించెడిపెద్దలు భయముతో వారికి బహుదూరముగామసలుచు కులటలొనర్చెడి కుకర్మములను కన్నులతో చూచుచు చూడనివారిరీతి మసలుచుందురు.

నింద్యకర్మలతో జీవితములను గడపెడి స్త్రీ పురుషులలో కొందరు వారొనర్చిన గతకాల పుణ్యకర్మఫల ప్రభావముతోడై సత్పరిణామమును చెంది దైవకృపతో మహాత్ముల దివ్యచరణసన్నిధి లభించి గతజీవితకుకర్మములను త్యజించి దివ్యజీవనులై భగవన్మార్గమున పురోగతినొంది ముక్తిపథమును చెంది ప్రపంచముతో పనిలేని పరమోత్కృష్టస్థితితో భాసిల్లుచుందురు.

పూర్వకాలమున వేశ్యాదిజాతులలో వ్యభిచరించెడు వారెక్కువగా యుందురనుటాచారమైయున్నది. నేటి కాలమున కులప్రసక్తి లేదు. నింద్యముగా చూడబడిన వేశ్యాదిజాతులవారెందరో ధర్మబద్ధవివాహగృహస్థాశ్రమ జీవనమొనర్చుచున్నారు. గొప్పకులాల వారని భుజములుచరచి మీసములుమెలివేసినవారిలో చోర, జార, సురాపానాది వక్రకర్మలెక్కుడైనవి. కులధనగర్వగ్రస్తులగునరులొనర్చెడు జార,చోర,జూద,సురాపానాది నింద్యకర్మములను నిషేధించి సమాజశ్రేయస్సును కోరెడువారరుదైరి. ఒకవేళ నక్కడక్కడగల పెద్దలకు తప్పులని తెలిసి సంస్కరించెడు నేర్పు, బలముగల్గియు తప్పొనర్చెడి తనకన్న పెద్దవారిని మందలించి మంచిని ప్రబోధము చేయుటకు ధైర్యముచాలక 'మనకెందుకాదుర్మార్గులతోపని వారి పాపము పండిననాడు వారికివారే పతనమొందెద' రను వేదోక్తి మదినెంచి మౌనము వహించెదరు.

మార్కెట్టులో కూరగాయలమ్ముకొని జీవనముచేయువారివలె, నేటికాలమున పాపభీతిని పూర్తిగాపోనాడి శరీరమునమ్ముకొని సుఖ జీవనము చేయువారు ప్రతిచోటకనప్పట్టుచున్నారు.

ఈ నీచకార్యములుచేయువారెవ్వరు? ఏ రేజాతికిచెందినవారు? పేదవారా? లేక కూటికి గుడ్డకు కఱవై నీచకార్యములుచేయుట కారంభించితిరా? యని సత్యమాలోచనచేసిననాడు సులభముగా

బోధపడునది కాదు. ఈ చోరత్వ, జారత్వ, సురాపానాది నింద్యకర్మలకు కారణమేమి?

సమాజమునందొక గొప్ప పరిణామముత్పన్నమైనది. ఏ వక్ర కర్మలొనర్చినను నరులకు పాపములేదు. ధనమే సర్వసుఖములకు మూలము. ధనమునకై యెన్ని పాపకర్మలనైన చేయవచ్చును. ఏ పాపకర్మములైనను తెలివితో, యుక్తితో జాగ్రత్తగా యెవ్వరికంటపడక నేర్పుతో చేసిన నాడెట్టిభయము లేదు. దొంగతనము, వ్యభిచారము, సురాపానము, జూదము, అసత్యము మొదలైన కర్మలు పూర్వకాలమున తెలివిగల గొప్పవారెందరో చేసినవి. నేడు మనము చేసిన తప్పేమి? యనెడి తార్కికబుద్ధితో నరులలో కొందరు స్త్రీ, పురుషులు విచ్చలవిడిగా స్వేచ్ఛాసంచారులై భయభక్తిశూన్యులై వృత్తిగా చోరత్వ జారత్వములాదిగాగల హేయకర్మములను నిర్వహించి సులభముగా ధనార్జనమొనర్చి సర్వసుఖములనుభవించి చివరదశలో దుఃఖసంతప్త హృదయులై కన్నీటిస్నానములొనర్చి కాటికేగుచుండిరి.

దుష్టకర్మలతో కాలమును కాయమును దుర్వినియోగమొనర్చు చుండెడి స్త్రీ, పురుషులు రచ్చలలో తమతోడివారితో గొప్ప గొప్ప శాస్త్రవాక్యాలను వల్లించుచు "శివ రామ కృష్ణ బా బా" మొదలైన నామభజనలను సాగించుటెంతటి శోచనీయమో? మతమునకెంతటి దుర్గతియో? భారతభూమి వేదభూమి, ఋషిభూమి, పుణ్యభూమి, త్యాగభూమి యనెడి సనాతన సూక్తులకెంతటి కళంకమో? ప్రతి భారతీయ పౌరుడు, భగవద్భక్తిగల ప్రతినరుడు నేటినుండియైన తీవ్రముగా నాలోచనలు చేసి యీవేదనలతో నడుములుబిగించి సత్య దీక్షాదక్షులై పరమపవిత్రమైన హైందవమతముద్ధరణ మొనరించి సద్యశస్సునుపొంది భావితరములవారికి ఆదర్శపురుషులై జీవితములను సాగించుటెంతయో గణనీయమైనస్థితి.

నేటి కాలమున ప్రతివిషయమునందు మంచివారు లేకపోలేదు సమాజదృష్టి నిత్యసత్యవినిర్మలాత్ములపైకి ప్రసరించదు. పరమతావలంబకుల దృష్టి, హైందవమతమునందుగల వ్యభిచారిణులపై, చోరులపై, జూదరులపై, త్రాగుబోతులపై, యసత్యవాదులపై, దోపిడివిధానముతో ధనమార్జించెడివారిపై ప్రసరించి వీరిని గుర్తుచేసి వేదికలపై దూషించి హైందవమతమునే సమూలముగా ద్వేషించి తిరస్కృతిభావమును ప్రజలలోనెలకొల్పి పరదేశమతములే మహోన్నతములైనవని బోధించి హైందవమతముపై విరక్తిని కల్పించి బలహీనమొనగ్చుచున్నారు.

హిందూమత ప్రాశాస్త్యమునుగూర్చి నెంతోకృషితో మహత్తరమతరహస్యములుగల బృహద్గ్రంథములను రచనములొనర్చి గుంటూరు జిల్లా, ప్రకాశముజిల్లా, కృష్ణాజిల్లాలయందనేకములైన మహాసభలలో శ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులువారు మహోపన్యాసవాహినుల ప్రవహింపచేసి విజ్ఞులైనవారి హృదయముల ను రూతలూగించిరి. క్రైస్తవసోదరులు బంపించెడి ప్రశ్నలను పండితులువారు సహేతుకముగా శ్రుతిప్రమాణములద్వారా చెప్పి తలలూపించెడివారు. సర్వమతముల యేకైకలక్ష్యము నొక్కటియే!

ఈ దుష్కరమైన ఘోరవిపత్తునకు కారణమెవ్వరు? దుర్మార్గులు కాదు. సన్మార్గులుకాదు. ఇంకెవ్వరు? పరమభక్తులవలె వేషములు వేసి, పండితులవలె సంభాషణలు సాగించి, సత్ప్రవర్తనములేక దురాశాపాశబద్ధులై భయము, భక్తి, సిగ్గులను పూర్తిగావీడి ధనమే దైవమని, కడుపేకైలాసమని, శరీరసుఖమే జీవితాశయముగానెంచి నీచకర్మలనొనర్చు కుసంస్కారులైన స్త్రీ పురుషులే యిందులకు ప్రధానమైనవారని ఉత్తమభక్తులెల్లరు గుర్తించి దొంగభక్తులకు మోసపుస్వాములకుబహుదూరముగా మెలగుచు నిజభక్త శిఖామణులైన

శ్రీ ప్రహ్లాద, నారద, హనుమదాదులవలె చరించి తరించి హైందవ మతశక్తిని పెంపొందించి పరమాత్మస్వరూపులై తరించెదరుగాత!

చతుషష్టికళల నార్జించి విద్యత్కీర్తిచంద్రికలతో విశ్వమెల్లతిరిగి గొప్పవాడని ప్రజలందుకొన్నవ్యక్తియైనను, తన మానమర్యాదలకు భంగమురానిస్థితిలో, నవయౌవ్వనము తొణికిసలాడెడి బంగారుఛాయ గల వగలాడిని యేకాంతస్థలమున చూచిననాడు తప్పక మనస్సు చలించి స్థితినుండి దిగజారి నింద్యకర్మయొనర్చి పతనము చెందును.

"కార్చిచ్చుచూచిన మానవుడేరీతి పలాయనమొందునో" యదేరీతి యెట్టి మనుజుడైనను 'కులకాంతయై వ్యభిచారవృత్తితో చరించెడి నీచస్త్రీ' రూపమునకు బహుదూరముగా మసలుటయే మిక్కిలి శ్రేయోదాయకము.

ధర్మచ్యుతినొందిన కవిగాయక విద్వత్పండిత కథక శిరోమణుల నైనను లోకము యేహ్యభావముతో చూడసాగును. మనోవాక్కర్మలలో లోపములేక లోకమున చరించెడివ్యక్తి పూజనీయుడై ఆదర్శమూర్తియై చింతలు లేని చింతనతో దివ్యనాదానందుడై వెలుగొందసాగును.

సకలవిధసత్కర్మలు నరునిబుద్ధివేగమును నిరోధించి శుద్ధమొనర్చి శ్రుతి హిత కర్మాచరణమునందు ప్రవేశింపచేయుటకే మనీషులైన పెద్దలు నాటి ఋషివర్యులు నిర్ణయమొనర్చిరి. ఋషులొనర్చిన శాస్త్రములలోని ధర్మశాసనములను మనుజులు నిర్వర్తించినచో ముక్తి కరతలామలకము.

సర్వజగత్తునకాధారమైన శ్రీ లక్ష్మీనారాయణుని సర్వభూతాలలో దర్శించెడి సుసంస్కార సద్గుణ సంపత్తిగల నరునకెట్టి లోటుండదు. ఆస్తిపోయినను, అంతస్థులు మారినను, బలవంతులైన బావమరదులు ద్వేషించినను, బంధువులుతొలగినను, సంఘమునపరపతి

చెడినను లెక్కచేయక శ్రీరమానాథుని దివ్యనామమంత్రసంస్మరణ ముతో స్వార్థత్యాగియై, కర్తృత్వాకర్మాచరణముతో భువి చరించెడి పరమభాగవతోత్తముని సర్వకార్యకర్తృత్వభారనిర్వహణము దేవుడు భరించి భక్తుని బాధలను రూపుమాపి యందరికన్న మిన్నగా వెలుగొందింపచేయును.

కన్నీరు, పన్నీరు రెండు నరుని కుకర్మ, సుకర్మలవలన సంప్రాప్త మగును. "ఆదాయములేక ఋణముచేసి వ్యయమొనర్చెడి వ్యక్తి యెంతటిమేథావియైనను బికారియగురీతి" రామారాధనలోనర్చుచు కామారాధనలు సాగించిననాడు నరునకు కన్నీరులభించును. వాచా వేదాంతులకు కన్నీరు, ఆచరణవేదాంతులకు పన్నీరు.

వ్యక్తిమనస్సెంతో శక్తివంతమై యలరారుచున్నది. అట్టిశక్తి వంతమైన మనస్సులో గలిగెడి సంకల్పములు శక్తివంతములైనవి. ఇట్టి శక్తివంతమైన మనస్సుచేయు కర్మములు శక్తివంతములు.కర్మఫలములు శక్తివంతములు. ఇట్టి శక్తివంతములైన కర్మఫలములనెవ్వరు తప్పించు కొనజాలరు. విధిగ యనుభవించవలసినదే.

లక్షాధికారియైనను, భిక్షాధికారియైనను సూర్యోదయమాదిగా సూర్యాస్తమయమువరకుసంసారతాపత్రయాగ్నితో బాధలనొందుచునే యున్నారు. భిక్షాధికారికి ఆకలిబాధ. లక్షాధికారికున్నది చాలదనెడు బాధ. బాధలో నిర్వురికి సమానమైనదుఃఖమే సంభవమొందుచున్నది. ఆశకలిగినవాడే దరిద్రుడు. ఆశలేనివాడే ధనవంతుడు. ధర్మబద్ధమైన యాశవలన నరునకు శాంతి. అధర్మమైన యాశవలన నరునకశాంతి.

లౌకికమానవులు తమవయస్సునకుమించిన పెద్దలెందరో మృత్యు దేవతవాడికోరలకుచిక్కి 'గాలిలోదీపాలవలె' కాలగతిచెంది లోకమును వీడి యెక్కడికో తరలిపోవుట కనులార దర్శించియు చావనివారికై వడి, దైవదర్శనకాంక్షను పూర్తిగావీడి లోకవ్యవహారములకే తహతహ

లాడుచు ప్రొద్దుపోయినను రచ్చబండలను వీడజాలక పరాపకారకర్మ ప్రయత్నపు ముచ్చటలతో కాలునిమరచి కామినీకాంచనములనాశించి కాలగతినొందుచున్నారు.

"నేహి" దేహమును వీడకముందే విజ్ఞానముగల మానవుడుపేక్ష వహించక సంయోగవియోగసుఖదుఃఖనిలయమైన సంసారముపైగల భ్రాంతిని పోనాడి తనయాత్మదర్శనమునకు నెంతయో కృషియొనర్చి పరమాత్మునిలోచేరుటకు మూలమైన నిష్కామయోగకర్మయొనర్చి కృతార్థుడగును.

భగవంతుడనంతశక్తిసంపన్నుడు. విశ్వమునే సృజించెనని, విశ్వమంతటికి కర్తభర్తయని పెద్దలు, శ్రుతిస్మృతి పురాణాదులన్నియు నొకేరూపముగా పేర్కొనుచున్నవి. భగవంతుడనెడి పదమును సర్వులు వాకొనుచుందురు. ఐనను శ్రీరామకృష్ణ, బుద్ధ, శంకర, క్రీస్తు, మహమ్మదు, గాంధీమహాత్మునివంటి గొప్పవారెందరో లోకముచే పూజింపబడుచున్నారు. ఇట్టివారిని భగవదవతారమూర్తులని,వీరిచేతలు బోధలు వెలుగుబాటలై,మార్గదర్శకములై మహోపకృతియొనర్చునని విజ్ఞులు పలుకుచున్నారు.

భగవదవతారమూర్తులు భగవంతునిలో నొకానొకసూక్ష్మాంశ శక్తి. భగవంతుడనగా నెంత శక్తిగలవాడని ప్రశ్న వేసుకొన్నచో, కవుల కలాలకు, పండితుల జిహ్వలకు, తర్కవ్యాకరణ శాస్త్రముల చర్చలకందక వెలింగెడి యొకానొక మహత్తర మహిమోన్నతాద్భుత దివ్యమహాశక్తియని చెప్పవలసియున్నది.

అట్టి యనిర్వచనీయ విశ్వాంతర్గత మహాశక్తిని శ్రుతులు 'దేవుడు' భగవంతుడు, పరమేశ్వరుడు, శక్తియని శాసించినవి. ఇట్టి యథార్థ నిత్య సత్య పరమార్థమును తెలియని నరులు నీ దేవుడు నా దేవుడని వాగ్వాదములొనర్చుచు కాలమును వారి కాయములను దుర్వ్యయమొనర్చుచున్నారు.

భగవదవతారమూర్తుల స్వరూప స్వభావములను స్మరించుచు తరించుటకై వారి సత్వగుణ సంపత్తి నలవరచుకొనుటకు నరులు ప్రయత్నమొనర్చెడి స్థితిని సగుణోపాసనగా నెన్నదగియున్నది. భగవంతుడు, దేవుడు, పరమాత్మ, పరబ్రహ్మము, పరమేశ్వరుడు, శక్తి యని లోకము సహజముగా నోటాడినను "ఆ భగవంతుడెట్లున్నాడు? ఏ రూపముతో యున్నాడు ?" "ఎక్కడున్నాడు ?" యని తన తోడివారడిగినచో లోకము మౌనముద్ర వేయుచున్నది. ఇట్టి దట్టిదని నోట నుడువుటకు సాధ్యముగానిదైయున్నది.

ఈ విషయమధనముతో ప్రతి ముముక్షువు దీర్ఘాలోచనతో సత్యమరసిన "నిరాకార నిర్గుణ నిత్యసత్యశివసుందరాత్మక చైతన్య మహాతత్త్వము" గా వ్యక్తమగుచున్నది. ఇట్టి తత్త్వమునే వేదోపనిషద్గీతాది శాస్త్రములన్నియు "దేవుడు," "పరమాత్మ" యని శాసించినవి.

అట్టి మహిమాన్వితశక్తియగు దేవుడెక్కడున్నాడని వెదకనక్కరలేదు. ఆ నిరాకార, మహత్తర, మహనీయ, మధురానందాత్మ శక్తి నరుని హృదయాంతరాళమునందు జ్యోతి శక్తిపరమాణు స్వరూపమై సదా స్పందించుచున్నది.

బహుజన్మ పుణ్య తపఃఫలమై విజ్ఞానదాయకమైన స్థితితో జన్మించిన నరుడు జనన మరణ తాపత్రయ సమ్మేళనమైన సంసార ఘోరవారాశియందు మునకలు వేయుచు తేలుచు, పరమాత్మలో తాదాత్మ్యమొంది మహానిర్వాణ పదవితో విరాజిల్లెడి గణనీయమైన స్థితినొందెడి తెరవు గానక కాలమృత్యుకౌగిలిలో చిక్కి క్షణక్షణము నకు దేహబలవయోరూపాది పరిణామమొందుచు తన స్వస్థితిని సరిచేసికొనుటకశక్తుడై, యే పుణ్యలేశప్రభావముతోడై మహాత్ముల సన్నిధిచేరి వారిని భక్తితో సేవించి మంత్రోపదేశమును పొంది

ధ్యానము చేయుచు స్థితినుండి దిగజారి సంసారముపైగల భ్రాంతికి వశుడై మహాత్ముల సందేశములను విస్మరించి మంత్రధ్యానమొనర్చుటకు మతిస్థిమితములేక కాలమంతయు ధనార్జనమునకు దారాపుత్రాది సౌఖ్యములకే వినియోగ మొనర్చి భువివీడి తరలిపోవుచున్నాడు.

ముముక్షువు నిజభక్తితో నిలకడగల మనస్సుతో భగవానుడున్నాడని తెలిసి దృశ్యములపై పరకాంతాధనవస్తుసంచయముపైగల పాపదృష్టి మమకారమును నిశ్శేషముగ త్యజించి త్యాగబుద్ధితో తన దేశికేంద్రులుపదేశించిన మహావాక్య చతుష్టయ బోధల నాచరణము నందుంచిననాడు తానే తత్త్వవేత్తయై దేశికేంద్రులకానందమును చేకూర్చినవాడై తనతోడివారికి మార్గదర్శకుడై సత్కీర్తితో వర్ధిల్లగలడు.

వ్యక్తి,వివిధోపాసనాదికర్మలచే గొప్పవాడై సర్వజనవశీకరణైక సిద్ధమూర్తియై మహారాజప్రాసాదమువలె తన జీర్ణకుటీరమును రూపొందించి నేర్పుతో సర్వసుఖభోగలీలావిలాసాదులకాలవాలమైన స్థితితో "బ్రహ్మసత్యం-జగన్మిథ్యా"యనెడివినిర్మలవేదాంతసూక్తులతో విశ్వప్రజలనాకర్షించి ఘనబహుకృతుల స్వీకరించుచు ధనాశజిడ్డుతో కీర్తితపనతో సుఖాశాపిపాస శాంతించక తానుప్రారంభదశలో సంకల్పించిన సదాశయ మహావిరాగత్యాగోద్యమమునకు స్వస్తి చెప్పి ప్రకృతిశక్తికే బానిసయై తనయుత్స్మోద్ధరణమునకు మారుగా తనదేహ, ధన, స్థల సుఖోద్ధరణములకే పాల్పడి క్రమముగా సంసారముగాని సంసారమును కల్పించుకొని తనకాయమును పవిత్రమైనకాలమును దుర్వ్యయమొనర్చి కలిప్రభావపీడితుడై దురంతమగు దుఃఖములనొందుచున్నాడు.

ఈ దృశ్య జగత్తునందేది సత్యమని నరుడాలోచనచేసిననాడింకేదియు సత్యముకాదు. సర్వాధిష్ఠానసద్వస్తువైన పరబ్రహ్మతత్త్వమేనని సత్యాంశము ఋజువగుచున్నది. నిరాకార, నిర్గుణ, చైతన్యతత్త్వమునందైక్యమొంది పరమశాంతినొందుటకై లోకమున

మహామహులెందరో త్యాగధనులై నిర్విరామకృషి యొనర్చుచునే యున్నారు.

విశేష ప్రజ్ఞాప్రాభవములతో నరుడు మహత్తరకార్యక్రమ నిర్మాణములొనర్చినను సర్వజనులను వశమొనర్చి వారిధనవ్యయముతో ఘనమైన గజారోహణాదిమహోత్సవములను హొందినను పన్నీటిజల్లులతో మేను పులకాంకురమునొందినను గత కాలమునందొనర్చిన మోస కర్మలఫలము కర్తవ్యజీవితమునందనుభవమునకువచ్చి శారీర,మానసిక, సాంఘిక, యార్థిక, స్థితిగతులను తాగమారొనర్చి తీరని యావేదనల పాల్సేయుననుటలో నెట్టి సంధియములేదు.

ధర్మకర్మాసక్తితో జరించుచు సద్గుర్వాదేశపరిపాలనాకర్తృత్వ దీక్షతో బయనించెడి నిజభక్తవతంసుని సర్వసంరక్షణము శ్రీలక్ష్మీనృసింహభగవానుడే భరించి తరింపజేయును.

ప్రతిమారూపముతో నెవ్వరితో పలుకక చలన రహితుడై దృష్టికి గోచరించెడిమూర్తి తన భక్తునేరీతి యుద్ధరణమొందించుననెడి సంశయాత్మకమైన ప్రశ్న ప్రతి ముముక్షువు హృదయములో స్ఫురించ గలదు.

నరుని, స్వయంకృతదోషములఫలానుభవముతో క్రుంగికృశించి నశించుటకు తయారైన స్థితియందైనను భగవానుని దివ్యపదకమల సన్నిధిచేరి యావేదనతో ప్రార్థించి కన్నీరుకార్చినచో కరుణాసాగరుడు నిజభక్తరక్షణదీక్షాకంకణధారి చక్రధారియైనమురారి తక్షణమే తన పాదములపై మోకరిల్లిన భక్తుని కన్నీరు పన్నీరుగామార్చి సర్వశుభములను చేకూర్చి భక్తకవిశేఖరుల జీవితములను మూడుపూవులారు కాయలుగా రూపొందింపచేసి దైవశక్తిని సమాజమునకు ఋజువుచేసి కర్మసిద్ధాంతములోని రహస్యములను, సర్వులకు బహిర్గతమొనర్చు ననుటలో నెట్టి సంధియము లేదు.

"భక్తివశఃపురుషః" యనెడి సూక్తి త్రికాల సత్యము. "సతిపతి" "ప్రకృతి పరమాత్మ" "జీవో దేవసనాతనః" "మాతృ దేవోభవ పితృ దేవోభవ" "సీతారాములు" "లక్ష్మీనారాయణులు" "భూమ్యాకాశాదులు" "అత్తమామలు" "భక్తుడు భగవంతుడు" "పార్వతీపరమేశ్వరులు" మొదలైన వాక్య సముదాయమంతయు చిన్న పెద్ద పదాలతో ముందు వెనుకల తారతమ్య ప్రధానముగాక యెన్నుకోబడినవి.

సతిగుణగణములే పతికి గౌరవము. ప్రకృతి యాధారములేనిదే పరమాత్మను చెందుటకు నరునకు సాధ్యముకాదు. తల్లిని దర్శించిన తదుపరి శిశువు తన తండ్రిని దర్శించును. ఆదిలేనిదే యంత్యములేదు. నిరాకార నిర్గుణ చైతన్యతత్త్వమొక్కటున్నదని యూహించి నిశ్చయించుటకు సాకారమే ప్రధానమై బరగుచున్నది. ఈ విధి విధానముననుసరించి నిరాకారుడైన భగవానుని భక్తుడు సాకారునిగా రూపొందింపజేసి తన మనోసంతృప్తికై దివ్యపారవశ్యసంసిద్ధికై సగుణారాధనమొనర్చి కష్టపరంపరలనుండి విముక్తినొంది దేవదేవుని దివ్యావ్యయభవ్యమహోజ్జ్వలశక్తిని వేనోళ్ళ యెలుగెత్తి విశ్వమెల్ల చాటి భక్తి శక్తికి గొప్పసద్యశస్సును చేకూర్చి కృతకృత్యుడైనాడు.

నరుడేకాంతస్థలమునందుపవిష్టుడై కన్నులుమూసి తనమనస్సును భ్రూమధ్యమునందునిల్పి లోకపు గతిని తన జీవిత పురోగతిని తనగత జీవితస్థితిని గుర్తుకుదెచ్చుకొని తన నిజకర్తవ్య పరిపాలనలో తానెంత వరకు కృతకృత్యుడైనాడో సత్యాలోచనచర్చతో నిజము తెలిసిననాడు విధిగ కన్నీరు గార్చవలసినదే.

ఈ కలియుగమున కంటికి గోచరించెడి ప్రతిప్రాణియు కంటికి గోచరముగాని స్థితితో పరిణామమొందుచు చివరకు భువిపై కూలి మట్టిలో కలసెదరనెడి నిత్యసత్యము సర్వులకు బోధపడుచున్నది. నరుడు నూరేండ్లుజీవించినా ఒకరోజు దర్శించిన స్పర్శించిన దృశ్యభోగకర్మాను

భవమే యనుభవించుచున్నారు. క్రొత్తవింతేమియు కానరాదు. నడివీధి, రచ్చబండ, రోలు మొదలైనవస్తువులు శతాబ్దములవరకటులే కంటికి కన్పించగలవు. ఐనను యీ రచ్చబండపై జేరి రకరకములైన సంభాషణములుసాగించిన ఘనులైన నరులెందరో కాటికిచేరి భూతి గాసిగామారిరి. ఆ రోటిలో ధ్యానముంచి దంచిన పెద్ద పెద్ద మహిళా మణులెందరో కాలగర్భమున కలసిరి. ఐనను యీరోలుయట్లే నిలచి యున్నది. నరులు స్వయంప్రజ్ఞతో నిర్మించినవస్తువులున్నంత కాలము నరులుండుటలేదు. కత్తిబట్టి యుద్ధముచేసిన మహావీరులెందరో మరణించిరి. ఆ కత్తులు నేటికి కన్పించుచునేయున్నవి. హైద్రాబాద్ పట్టణములోగల శ్రీ సాలార్ జంగ్ మ్యూజియమునందు వెలుగొందెడి విలువైన ఘనమైన వివిధవస్తు సంచయము నేటికిని దర్శనీయమై మనోజ్ఞమై నలరారుచున్నవి. ఆ వస్తు నిర్మాణ నిపుణులు వస్తువుల నుపయోగించుకొని స్వర్గసుఖములను పొందిన మహారాజులెందరో కాలధర్మమునొందిరి. బంగరుగద్దెలపై సుఖాశీనులై రత్నకిరీటములను ధరించి రాజ్యములేలిన చక్రవర్తులు సైతము సర్వమును క్షణములో త్యజించి స్మశానముచేరిరి. ఎన్నెన్నో ప్రబంధములు రచనము లొనర్చిన శ్రీ అల్లసానిపెద్దనామాత్యులు, శ్రీనాధమహాకవి సార్వభౌములాదిగాగల మహనీయమూర్తులెందరో కాలవాహినిలో కలసిరి. ఆంధ్రదేశ ప్రజల మన్ననలనొందిన శ్రీ మహావాది వేంకటప్పయ్యశాస్త్రిగారు, శ్రీ ఘంటసాల వేంకటేశ్వరరావు గార్ల వంటి మధురగాయకమణులెందరో భువివీడి దివికేగిరి. శ్రీ మహాభారతము లోని మధురఘట్టములను "శ్రీ పాండవోద్యోగవిజయములు" యనెడి పేర్లతో ముక్కోటియాంధ్రులు మురిసి ముచ్చటలు చెప్పుకొనెడిరీతి, ప్రతి భారతీయునినోట "చెల్లియొ చెల్లకో తమకుచేసిన యెగ్గులు సైచి రందరున్" యనెడి పద్యరత్నములు ప్రతిధ్వనించురీతి, మహనీయ మంగళ మధుర సుందర సుకుమార దివ్యశైలితో ముత్యములవంటి

యక్షరసముదాయమును సృష్టించిన మహాకవులు శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగార్లు సైతము కాలగర్భములో విలీనమైరి.

ఇట్టి నగ్నసత్యమును నరులు తెలిసియు మాయామోహమున లోనై భువిపై నుండుటయే నిజమనెడు భ్రాంతితో దుష్టకర్మలనొనర్చు చున్నారు. సామాన్యముగా ప్రతి గృహమునందు చరించెడి పిల్లి తన యాహారసంపాదనకై, రంధ్రములందు రహస్య జీవనమొనర్చెడి యెలుకలను పొంచి నోటితో కబళించి కొఱికిచంపి తనయాకలి తీర్చుకొని సంతృప్తినొంది షికారులొనర్చుచుండును. ఇట్టి షికారులొనర్చెడి పిల్లిపిల్లలను, గండుబిల్లొకటి దాపురించి నోటితో కొఱికి చంపి భక్షించిన తఱి, కన్నపిల్లలను గోల్పోయినపిల్లి యెంతో చింతతో తనగృహాధికారు లర్పించిన పెరుగన్నమును సైతము ముట్టక పిచ్చిపట్టినదానివలె తిరుగ సాగెను. ఐనను పిల్లికి, తనపిల్లలను గండుబిల్లి భక్షించిన నాడున్నబాధ యెలుకలను చంపి భక్షించిననాడున్నదా? లేదు.

ఇదే విధముగా లోకమునందు అజ్ఞానాహంకారాదులతో స్వార్థభోగాసక్తపిపాసతో చరించెడు దుష్టసంస్కారులైన పాపపు నరులు తమతోడినరుల నవకాశము చిక్కిననాడు ధన, మాన,ప్రాణాది సర్వస్వమును హరించివేయుచున్నారు.

విజ్ఞానములేని గండుబిల్లి చేసిన వక్రకర్మకు పిల్లలను గోల్పోయిన పిల్లి యెంతబాధను పొందినదో! నేటి దుష్టనరులొనర్చెడి దుందుడుకు చేతలకు గుఱియైన సమాజమట్టి బాధలను పొందుచున్నది.

దూరదృష్టిలేని మానవులెల్లరు దుర్దృష్టితో దుష్టకర్మావ లంబకులై నిద్రలేచినది మొదలు శయనించునంతవరకు, తాను తన కుటుంబము క్షేమముగా సర్వసుఖములతో నుండవలెననెడు సంకల్ప ములతో తమతోడివారిని మాయాపన్నాగములతో "గండుబిల్లివలె" దుష్టకర్మలొనర్చుచుందురు.

మాయా మోహావేశమునకు లోనిసమైన ఘనుడైనను దుర్గర్వముతో భయభక్తి శూన్యుడై వయోరూపలావణ్యరాశియైన తనసతిని కాదని పరుని సతినాశించి నిరాశనొంది తనస్థితికెన్నోరెట్లు తక్కువైన పరసతిపతి పరుషవాక్యములపాలై గౌరవభంగమునొంది సమాజముచే తక్కువదృష్టితో చూడబడును.

నిత్యసత్యస్వరూప సౌభాగ్య సంపద నంతటిని సమకూర్చి, గణనీయమైన సద్గుణ సంపత్తిని జతచేర్చి సుందర సుకుమార స్వరూపమును తీర్చిదిద్ది నొక్కటిగా భాసింపజేసి "దేవుడు" యనెడ నామమును సృష్టించిరి. ఈ ధర్మస్థితి స్వరూప సూక్ష్మాంశమును విజ్ఞులు గుర్తించగలరు.

భగవానుని మరచినను ధర్మమును, నోటాడిన సత్యవాక్య నిర్ణయమును నరుడెన్నడు మరచి చరించరాదు. సత్య ధర్మన్యాయోహాంసాది సద్గుణసంపత్తియే భగవానుడనెడి పదమునకు నిర్వచనము. చక్కెరనుండి తియ్యదనమును, తియ్యదనమునుండి చక్కెర నెట్లు విడదీయుటకు వీలులేదో, ఆ విధముగా సత్యధర్మన్యాయాది సుగుణ సంపద్విభూతిస్వరూపమునుండి భగవానుని వేరుపరచుటకు వీలులేదు. ఈ కార్యకారణ సంబంధమువలననే శ్రీప్రహ్లాదాది భక్తమూర్తులకు శ్రీమీరాసాధ్వి, సక్కుబాయి మొదలైన భక్తురాండ్రకు సంభవించిన కష్టములన్నింటిని భగవానుడే భరించి వారికి బంధవిముక్తి కల్గించెను.

ఎంతో వినయముగా సాత్వికునివలె లోకమునకు నరుడుకన్పించినంతనే యాతని హృదయము నందుగల భావములన్నియు ధర్మబద్ధములని నమ్ముటకు వీలులేదు. ధనము ఖర్చుగాని రూపమున తోడివారికి సహాయులవలె కన్పట్టెడి మేకవన్నెపులులైన నరుల నడవడి బహు విచిత్రముగా లోకమునకు కన్పించుచు వారి విపరీత ధోరణి విన్పించుచున్నది.

కల్లుత్రాగిన పిచ్చికోతివలె చరించెడి బుద్దిని నరుడు స్వాధీనము చేసికొని శుద్ధిహితమగు కర్మాచరణముతో జీవితగమనమును సాగించిన నాడు స్థితిగతి స్వరూప విభవాది వైభవము నిండుపూర్ణిమవలె దివ్య శోభామయమై లోకాదర్శమై సద్గురు దివ్యాదేశోద్యమ మహాకార్య నిర్వాహణమునకు పునాదియై సత్యనిత్యదివ్యాధ్యాత్మిక భక్తిప్రబోధ ప్రచారమునకు వెలుగై భాసించగలదు.

జిహ్వోపస్థల దుష్టచాపల్య మహోధృతిని భక్తిగల ముముక్షువు తత్క్షణమే నిరోధించి నిత్యప్రార్థన ధ్యానభజన విమలవేదాంత పఠనాది విశేషకార్యక్రమమును సాగించిననాడు విధిగ నవ్యశోభాలంకృతమై భక్తిశక్తి ద్విగుణీకృతమై, దినదినాభివృద్ధితో విజ్ఞానమై విశేష రూపాదులతో విలసిల్లగలదు.

భగవద్భక్తుడు లోకపు వికృతవాసనలను లెక్కచేయక నిరసనతో నిర్జించి మహోత్తమ మహనీయ మధుర స్వరూపమై ప్రకాశించెడి పరమాత్మ దర్శనమునకై పాటుబడుచు దీక్షాదక్షతతో కర్మసాగించి కృతార్థుడగును.

భగవద్భక్తునకు వేషభాషలు, కీర్తనాదులను స్వరసాహిత్య గతులలో గానమొనర్చుటతోడనే కర్తవ్యము ముగియలేదు. ప్రహ్లాదుని సద్గుణసంపత్తి కావలెను. ప్రహ్లాదుని స్థితిలేని ప్రతినరుడు కష్టనష్టములను పొందగలడు. ప్రహ్లాదునకు సంభవించిన భీకర దుఃఖ పరంపరలన్నియు భగవానుని దివ్యగుణనామగాన మాధుర్యమహిమచే సమసిపోయెను. గతకర్మప్రభావముతో భక్తునకు కష్టములు వాటిల్లినను ఆదర్శభక్తిశక్తితోడై శౌరి కృపకు పాత్రునిచేసి కన్నీరు పన్నీరుగా మార్చగలదు.

నిత్యసత్యనిరతిగల నరుని, భక్తి కవచమై సదారక్షించుచున్నది. ఐనవారు దూరమైనను కానివారు దగ్గరై కరుణతో కాపాడుచుందురు.

నిశ్చింతతో నిర్భయుడై నరులందరిలో నారాయణుని చూచుచు ధర్మమైన నడవడితో దైవారాధనమొనర్చెడి ముముక్షువు త్వరితగతి శ్రీ నృహరి దివ్యసందర్శన మహద్భాగ్యమునొంది తత్త్వజ్ఞుడై నలరారు చుండును.

ఇట్టి యనిర్వచనీయ దివ్యజ్యోతిర్మయ స్వరూపులై విరాజిల్లెడి తఱి భక్తుడే భగవానుడై విరాజిల్లగలడు. భక్తుడే భగవంతుడు, జీవుడే దేవుడు, జీవుడు దేవుడు యనెడి వ్యక్తులిర్వురులేరు. బాల విద్యార్థులతో బడికివెళ్ళి పాఠాలధ్యయనమొనర్చిన. శ్రీ పుట్టపర్తి గ్రామ నివాసియగు శ్రీ రత్నాకరము సత్యనారాయణరాజుగారే, కాలక్రమమున నేడు, అనంతపురము జిల్లా, ధర్మవరము తాలూకా, బుక్కపట్నమునకు మూడుమైళ్ళ దూరములో "పుట్టపర్తి" గ్రామమున లక్షలాది రూప్యములు వ్యయమొనర్చి నిర్మాణమొనర్చినట్టి "శ్రీ ప్రశాంతి నిలయము" పరమపవిత్రమై మహత్తరపుణ్యస్థలమై లక్షలాదిభక్తులకు దర్శనీయమై కన్పించెడి మధుర మంగళదృశ్యమునకు మహానాయకులై లోకోత్తరమైన శక్తితో మహాపండితుల హృదయముల కాశ్చర్యముకల్గించురీతి వివిధ వేద విషయాది రహస్యములను తేటతెనుగుపదాలతో మహోపన్యాసములొనర్చెడి "భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా" గారై సర్వులకు పరమశాంతిని కల్గించెడి విషయము జగద్విదితము. ఆ నాటి బాలవిద్యార్థియైనట్టి శ్రీ సత్యనారాయణరాజుగారే నేడు శ్రీ భగవాన్ సాయినాథునిగా విరాజిల్లుటయే కర్మసిద్ధాంతమునకు సరియైన చక్కని సమాధానము.

పరిశుద్ధమైన దర్పణమును బోలినట్టిదే దైవశక్తి. మసి మరకలతో నిండిన దర్పణమును బోలినట్టిదే మానవశక్తి. ఇదేరీతి దేవుడే జీవుడై శరీరమునందున్నను సంపూర్ణశక్తియగు దైవత్వము జీవునిలో భాసించదు. కారణమేమి? కుల మత జాతి వర్గ ధన పదవీ వైషమ్య

ములతో ధనదారాసుతాది మమకారముతో సమదృష్టిదూరుడై ద్వైతదృష్టిని వీడజాలక దేహవయోబలపటుత్వ ప్రతిభాది సంపత్తి శాశ్వతమనెడు భావనతో లోకమున చరించెడు నరుని ప్రవృత్తియే జీవుని గుణస్వరూపము. ఈ ప్రకృతిరంగమున జీవభావములేక సర్వము దైవాకృతియనెడు దివ్యభావనతో సర్వప్రాణులకు మేలొనర్చుచు తనవలె ప్రేమించెడి నరుని ప్రవృత్తియే దేవునికృపాపాత్రమై భాసించ గలదు. వాణిజ్య, వ్యవసాయ, న్యాయవాదవృత్తి, వైదికవృత్తి, వైద్యవృత్తి, విద్యావృత్తి, కవితావృత్తి, కథాగానవృత్తి, కథాధ్య యనవృత్తి, ప్రభుత్వోద్యోగవృత్తి, గాంధర్వవృత్తి, సంగీత సాహిత్యాద వృత్తులతో జీవనోపాధికై లోకమున నరులు మెలగుచున్నారు.

ఏ యే వృత్తులతో మెలగెడి వ్యక్తులైనను సత్యప్రవృత్తితో తనతోడి నరులతో యథార్థమునే సంభాషించి యొద్దకు పనివడి చేరిన వారి యార్థిక సాంఘిక శక్తులకు తగినరీతిలో ధనార్జనమును చేయ వలెను.

దైవము ధర్మము రెండును మహత్తరశక్తితో భాసిల్లుచుండును. దైవము నారాధించెడి నరుడు తానొనర్చెడి వృత్తిధర్మమును వీడి ధనాశకు వ్యక్తిత్వమును గోల్పోయి తనతో పనిగలిగివచ్చిన నరులతో మాయమాటలుచెప్పి నమ్మించి వారి కష్టార్జితమును కాజేసిననాడు విధిగ సర్వవిధముల పతితుడగును. వందకు పదివందలై కలిసి వచ్చెడి రోజులలో నరులకిట్టి సిద్ధాంతములు చులకనగా కన్పట్టుచుండును. కర్మశక్తి విజృంభించి వ్యక్తిశక్తిని వమ్మొనర్చి యున్న ధనమంతయు వ్యయమైననాడు సర్వము సత్యమే! మహాత్ముల బోధలు జీవితమునకు వెలుగుబాటలని స్మరించసాగును.

లోకమున, పాదరక్షల వ్యాపారములొనర్చి పదిమేడలు కట్టించిన వారుగలరు. బంగారువ్యాపారములుచేసి యున్నదంతయు ఖర్చుచేసి బికారులై తిరిగెడువారుగలరు. కర్మగతి బహువిచిత్రము.

ధనాశతో వ్యక్తిత్వములకు తిలోదకములిచ్చి చెడుమార్గములకులోనై సాగించినట్టి వ్యాపారోద్యోగ వైద్యాధికారులార్జించిన ధనము వారికి వారికుటుంబములకు వదలించుకొనుటకు వీలులేని దుర్భర దుఃఖము నొనగూర్చుచున్నది.

భక్తుడు తనయుపాస్యదైవముతో కష్టములను తొలగించమని ప్రార్థనలుచేసినను ధర్మమార్గమునుండి తప్పిననాడు దైవము భక్తుని ప్రార్థనలనాలించి రక్షించడు. పాపకర్మలఫలము క్షయముగానినాడు నరుని ప్రార్థనలు ఫలించవు.

భక్తుడు జ్ఞానాజ్ఞానముల వివరము తెలిసి దుష్కర్మములను దుష్టసంకల్పములను నిశ్శేషముగా త్యజించి నిర్వికారచిత్తముతో నిశ్చలధ్యాన నిష్ఠానురక్తితో ఫలాపేక్షరహితుడై కర్మలుచేసిననాడు భగవానుడే భక్తునికొఱకు దివినుండి భువికి దిగిరాగలడు.

ఇట్టి నిష్కామకర్మావలంబకుడైన భక్తుని వెన్నంటి భగవానుడు తిరుగుచు భక్తుని మతిని సద్గతికి పయనింపజేసి సాధుమూర్తిగా రూపొందించగలడు. కరుణాసముద్రుడైన గోవిందుని దివ్యపాదారవిందార్చకుడగు భక్తవరునకెట్టిలోటులేదు. భక్తితో నిష్కల్మష హృదయముతో భగవద్భజన మొనర్చెడి భక్తుని యానందమునకు మేరలేదు.

ప్రాప్తములేని ఫలమునాశించున పండితుడైనను కార్యభంగము నొంది మనోవేదనకు పాత్రుడగును. ఎప్పటికెయ్యది నరునకుప్రాప్తమో? అది తప్పక సిద్ధించి సంతసము నొనగూర్చును. 'పరిపక్వదశకురాని మహాఫలమైనను రుచిలేనిరీతి' కాలము కలిసిరానినాడు ప్రయత్నమొనర్చియు నరుడు ఫలదూరుడగును. ఇట్టిపట్టులయందు విజ్ఞానములేని నరుడు దేవుని దూషణమొనర్చి శాస్త్ర ధర్మములను ద్వేషించుచుండును.

మనుజుడు విషయము తెలిసి ప్రయత్నమును వీడక పట్టుదలతో శక్తికి తగినకృషి యొనర్చిననాడు కార్యసిద్ధి చేకూరగలదు.

తానొనర్చెడు కార్యములందుగల విశ్వాసమును కోల్పోయిననాడు సర్వ సమర్థుడైన నరుడు సైతము సమాజపు దృష్టికి చులకనయగును.

కాలము విలువైనది, బలమైనది. గత కుసంస్కార సుసంస్కారముల ప్రభావము మనుజుని కర్తవ్యజీవిత జీవనకర్మములలో వ్యక్తమై కుకర్మ సుకర్మములకుడింపి పాత్రపోషణము నిర్వాహణ మొనరింప చేయును. ఈ కర్మల ఫలసంస్కార ప్రభావము గొప్పశక్తివంతమై మానవుని దానవునిగా, మాధవునిగ రూపొందింపచేయగలదు.

సద్గురుకృప సద్గ్రంథముల పఠనమొనర్చిన ఫలము మహాపురుషు లాశీర్వాదశక్తి యేకమై నరుని వరించిననాడు నారాయణుని కృప ప్రసారమై తరించగలడు. దుష్టనరుల మిత్రత్వము, కాముకగ్రంథ పారాయణము పాపకర్మలొనర్చు నరులుండెడి పరిసర స్థలములలో నివాసమొనర్చుటయు, నరునకు తటస్థించినచో నరుడే వానరుడై పనికి మాలిన వాడగును.

ఆర్తత్రాణపరాయణుడైన పరమాత్ముని నమ్మి శక్తివంచనలేని కృషియొనర్చెడి ధర్మకర్మ పరాయణుడైన భాగవతశేఖరున కెట్టిలోప ముండదు. ధనరాసులు లేకపోయిన, ధనవంతుడు కాకపోయిన సకలవిధ సంసార బంధవిముక్తిని చెంది శాంత్యానందములతో విరాజిల్లు చుండును.

ప్రకృతిబద్ధులైన నరులు లౌకిక కర్మావలంబకులై లోకపు నడతల ననుసరించి దురహంకారులై తమలో కలిసి తిరిగెడి విజ్ఞానధనులైన కవి విద్వద్గాయకాది పెద్దలను గేలిసేయుచు మీదుమిక్కిలి "మీరేమైన దివినుండి దిగివచ్చితిరా? మాకుమించినవారా?" యని వదరుచుందురు.

"రాజమరాళగమనమును వాయసము లెఱుంగనిరీతి" నిజభక్త శిఖామణియై, కవియై, గాయకుడై వెలుగొందెడి వ్యక్తినిసైతము తాను పుట్టిపెరిగిన వాతావరణములోగల దురహంకారులైన పెద్దలు గుర్తించి గౌరవించక పైపెచ్చు వెగటుభావములతో తెగడుచుందురు.

మన భారతదేశపు విలువలను విదేశములలో వేనోళ్ళ యెలుగెత్తి చాటి విజయభేరిని మ్రోగించి విదేశీయుల ఘనసన్మానముల నొందినట్టి శ్రీ వివేకానందస్వామివారిని భారతీయులు ప్రారంభమునందు గుర్తించితిరా? లేదు.

మహాత్ముడైన శ్రీ గాంధీతాతగారిని, అమరజీవియగు శ్రీ పొట్టి శ్రీరాములుగుప్తాగారిని వారివారి జీవిత చరమదశలందు గుర్తించి సంపూర్ణ భక్తితో పూజలొనర్చితిరా? లేదు.

వివిధ రీతులలో ఛందోబద్ధమైన సాహితీ సౌభాగ్యముతో మహోన్నతభావసముదాయముతో సంఘసంస్కరణ దృష్టితో మ్రోడు లను సైతము చిగురింపచేసెడి దివ్య కవితావైభవమున వేలాది పద్య రత్నములతో ఖండ కావ్యములను భారతీయుల కందించిన 'నవయుగకవి చక్రవర్తి' యగు శ్రీ గుఱ్ఱము జాషువాగారిని తానవతరణమొందిన వినుకొండసీమ ప్రజలు వారి ప్రారంభకవితా జీవితకాలమున గుర్తించి తిరా? ఘనసన్మానములొనర్చితిరా? లేదు.

కవి పండిత గాయకాది పెద్దలు వారి పరిసర ప్రజల కెల్లవేళల యందు కన్పించుటయు, సరస సంభాషణములొనర్చుటయు కలసి మెలసి చరించుటయు, 'బావ' 'అన్న' 'మామా' 'ఏమోయ్' యని వరుస క్రమముగా సంబోధనలుచేయుటయు, పనివడి వారిండ్ల కేగుటయు, తమ కవసరమైన వేళలలో ధనమునర్థించుటయే నిందులకు ప్రధాన ప్రబల కారణములు.

వ్యక్తి, ప్రజలకెన్నడు పరిచయములేక గ్రంథాలలో చదివి తెలిసికొన్ననాడు వారెంతో మహనీయమూర్తులు వారి జీవిత విశేషాంశముల నెట్లు వర్ణించిరోయని యాశ్చర్యమానసులై వారిని గురించి రచ్చలలో నెంతో భక్తితో స్తోత్రపాఠము లొనర్చెదరు.

ఇట్టి స్తోత్రపాఠాలకు కారకులైన మహాత్ములు భువిపై చరించుచు తోడినరులతో సద్గోష్ఠియొనర్చెడి మధుర సమయములలో వారిని గుర్తించి గౌరవించెడివారు చాల తక్కువ సంఖ్యలో నుందురు.

సత్యమును, సత్యస్థితియందు చరించెడి గృహస్థాశ్రమాధి కారులను, మహోజ్జ్వల భవితవ్యస్థితిగతిస్వరూపాది విభవములను యథాతథముగా, వ్యక్తమొనర్చెడి భగవదుపాసకులను, లౌకికులై పాపకర్మలొనర్చెడి దుష్టనరులు గుర్తించజాలరు. కుల మత వర్గ భేదాలతో, సంఘబలముతో, భక్తమణులొనర్చెడి నిత్య సత్య సంభాష ణాది సత్కర్మములను హేళనమొనర్చుచు కాదని పెడవాదనలొనర్చు చుందురు. నీతి నిజాయతీలు సత్య ధర్మ న్యాయ సూత్రముల నిరసించి నట్టి నరులే సమాజమున పలుకుబడిగలవారై చరించుచున్నారు. "పాపము పదేండ్లు" యనెడి లోకోక్తి వారియెడ సార్థకము నొందుచున్నది.

అన్యాయాక్రమ దౌర్జన్య దంభదర్పాసూయాద్వేషాదులతో ధనవ్యయమొనర్చెడి కలికాలపు పెద్దలకే లోకము తలయొగ్గి బ్రహ్మ రథముపట్టి ఘనస్వాగతములొనర్చుచున్నది. మంచికి మంచికార్య క్రమములకు సంఘమున యెక్కువస్థానము లేదు. టెంకాయతీర్థము త్రాగువారెక్కడో యొకరిద్దరు. కల్లు, సారా, బ్రాందీలు త్రాగువారి సంఖ్య దినదినాభివృద్ధిచెందుచున్నది. చెడు క్షణములో వ్యాపించి వ్యక్తుల వ్యక్తిత్వమును వమ్మొనరించుచున్నది. శివరాత్రిజాగరణ మహాపర్వమున . శివనామభజనకొక్కరూపాయి విరాళమడిగినచో, కాలమానపరిస్థితులు తారుమారైనవి. తుపాను ప్రభావమున పంటలన్నీ నష్టమై పలుబాధలకు లోనైతిమి. రూపాయి బండిచక్రమువలె కన్పట్టు చున్నదనెడి పెద్దలే శివరాత్రిజాగరణకు శ్రీ కోటప్పకొండతిరుణాలకై ప్రభలనుగట్టి హాయిని యానందమును చేకూర్చెడు మంగళవాద్య బృందములవారిని పూర్తిగా త్యజించి, చిత్రకారైకుక్కలరీతిగా సిగ్గువీడి

చిందులువేసెడి కాంతలతో శ్రీ స్వామివారి సన్నిధిచేరుటకై వేలరూపాయలు ఖర్చుచేయుదురు. కలిదేవత ప్రభావము, నరుల మస్తకములందు జీర్ణించిన కుసంస్కారపు శక్తియే నిందులకు ప్రధాన కారణము.

మంచి చెడ్డలు రెండు నరులహృదయములందు ప్రవేశించి మేలు కీళ్ళొనర్చుటకెంతో యవకాశమున్నది. కాదనుకొని వదలిన కార్యములను సైతము నరులు ధీరత్వముతో దైవమునునమ్మి ధర్మమునుదప్పక కృషి యొనర్చిననాడు ఘనవిజయమునొంది పెద్దలచే కీర్తిగౌరవాదరముల నొంది కృతార్థులయ్యెదరు. తల్లి దండ్రి, గురువు దైవము, యనెడి నల్వురు ధర్మమునే బోధించెదరు.

ఎంతో విజ్ఞానము పెంపొందినది. సర్వమును సమకూర్చుకొనెడి యవకాశము చేకూరినదనెడు నేటికాలమునందు సైతము మరుక్షణమున మానవుని స్థితి యేరీతి పరిణమించుననెడి సత్యము బోధపడుటలేదు. ఏనాటికేనరుడెచ్చటికేగవలసినదియు తెలియబడుటలేదు. సర్వము సర్వేశ్వరుని యధీనమున నడచుచున్నది. రవి శశి తారకాది గ్రహసంచారమంతయు దేవదేవుని యాజ్ఞాబద్ధమై సాగుచున్నది. ఇట్టి సత్యమును గుర్తించని కలిమలహృదయుడైన నరుడు, నారాయణుడే లేడు నాశక్తితో నాయుక్తితో సర్వమును సమకూర్చుకొని సంతసము నొందుచుంటినని విఱ్ఱవీగుచుండును.

ధర్మకర్మ విరహితుడైన వ్యక్తికెంతటి మేధాసంపత్తి కల్గినను లోకమున కష్టనష్టములకుగురియై తీరని యావేదనల పాలగుచుండును. శిష్టాచారపరాయణుడై యాడిన నుడికనుగుణమైన నడవడితో జీవితపు నడకను సాగించెడి మానవుడెచ్చటికేగినను సర్వులు నాత్మీయులై యాదరాభిమానములతో సహకరించుచుందురు.

"పరోపకారాయ పుణ్యాయ - పాపాయ పరపీడనమ్" యనెడి విద్వద్వాణి గణనీయమైనది. భక్తమణుల జీవిత స్వానుభవముల సారాంశమంతయు నా వాణియందే తాండవించుచున్నది.

పెట్టిపుట్టినవాని కెట్టి కొఱంతయు లేదు. వాచావేదాంతములతో వానర జీవితముతో లోకమున చరించెడివ్యక్తి కెవ్వరు సహాయ మొనర్పరు. పుణ్యసంస్కారముగల మనుజులు దుష్టసంస్కారులైన స్వార్థపరుల వాక్యములను నమ్మి ధర్మకర్మ నిర్వహణమునకై కృషి సల్పియు చివరకిడుమల పాలౌదురు. శుద్ధజలము బురదనీటిలో కలసి చెడినరీతి, మంచిహృదయముగలవారునైతము దుష్టమతులైన నరులతో కలసి చరించుటవలన పరుషవాక్యములాడ సాగుదురు. 'తెల్లని వస్త్రము లను ధరించిన మనుజుడు మసిమరకలుగల వస్తుసంపర్కముతో నల్లనివాడైనరీతి' ప్రశాంతమతిగల పండితుడైనను దుష్టమతులైన సతిసుతుల పరుషవాక్య ప్రసంగములను వినినకొలది మతి గతితప్పి బుసలుకొట్టుచు వినరాని వాక్యములాడుటకారంభించును. కాలము కర్మము కలయనినాడు కన్నకొడుకులే పగవారై పరుషములాడి వ్యక్తిపై కుఱుకసాగెదరు. ధనార్జనలేని మగడెంత పలుకుబడిగలవాడైనను సతి చులకనగా విరసముగా యేహ్యభావముతో చూడసాగును.

'ఎవరేమనిన మనకెందుకునోడవ' యనెడి ప్రశాంతమతి నింట బయట చరించుచు ధర్మకర్మ నిర్వహణమునకే తను మనోధనముల వెచ్చించుచు జీవితగమనమును సాగించెడి భాగవతునకేవిధమైన బాధలు గలుగవు.

"ఇంటిలోని నిప్పుని చేతులుంచినచో బొబ్బలై బాధనుకల్గించు రీతి" నరుడు నాసతియే నాకేమికొదువయని మితములేని మమకార ముతో స్వేచ్ఛారూపసంభాషణముల సాగించిననాడు సతియే సర్పమై కాటువేయక మానదు.

పురుషుడు సతియందు సంతతి గాంచిన పిదప సతికి పతిపైగల మమకారము క్షీణించసాగును. తనకొఱకు పెద్దవాడై ప్రయోజకుడై కన్నతల్లిదండ్రులను కాదని వాని సతిప్రేమపాశమున బంధించబడి బానిసయై పనికిమాలినవాడైన తఱి, సతిప్రేమ పూర్తిగా పతిపై ప్రసరించి భక్తిగా పరిణామము చెందసాగును.

లోకమునందు ప్రతి మనుజుడు తల్లిదండ్రులపైగల ప్రేమకు పదిరెట్లు తన కుమారులను, కుమార్తెలను చూడసాగును. కారణమేమి?

"ఆత్మానా పుత్రనామాసి" యనెడి శ్రుతివాక్యానుసరణముగా నరుని రేతఃకణమే సతిగర్భమున ప్రవేశించి పిండమై నవమాసానంతరము శిశువై భువికి దిగివచ్చిన కారణముగా తండ్రికి తన కొమరునిపైగల మమకారము తదితరులపై నిలువనేరదు.

కొమరునకు తండ్రిపై ప్రేమనశించి వెగటు భావముతో చూచినను, తండ్రికి తన కుమారునిపైగల ప్రేమ నశించదు. ఈ కార్య కారణసంబంధ బంధము ననుసరించి నేటికిని కుమారులు నీచులై ధన మంతయు వెచ్చించి లోకకంటకులై దుష్టులై చరించినను కన్నతండ్రి యెన్నియో యసత్యములాడి కుమారుని శ్రేయస్సునే సదాకోరుచుండుట మనమెల్లరము ప్రత్యక్షముగా ప్రతి గ్రామమున గాంచుచున్నారము.

ఆదికవి వాల్మీకిని తనసతి నీ ఆదాయములో, నీ సుఖాలలో నాకు సమభాగము; నీ పాపములో తాపములో భాగము లేదని నొక్కి చెప్పినదని చరిత్ర ఋజువుచేయుచున్నది. ఇట్టియెడ పుల్లయ్యభార్య యల్లయ్య భార్య సుబ్బయ్యభార్యల విషయము లడుగుట మనకే దోసము.

'బెల్లముంచినబుట్టకే యీగ లిముసరినరీతి' పతి పండితుడైనను పామరుడైనను పదికాసులు సమకూర్చి సతికి సమర్పించిననాడే ప్రత్యక్ష దైవమని పూజలుచేయసాగును.

కాసులుఖర్చై వయసుడిగి రోగాలపాలైననాడు పతిని ప్రేమతో పూజించి ప్రసాదమిడి గౌరవించెడి సతియే సాధ్వియై లోకముచే గౌరవ మర్యాదలనుపొంది వంశప్రతిష్ఠను నిల్పుకోగలదు.

నేటికాలమున నూటికి తొంబదిమంది స్త్రీలు, తమ పతులు కావలసినంత ధనమును సమకూర్చి తెచ్చి చేతులలో నిడి నీయిష్టాను సారముగాఖర్చుచేసికో-నాకెట్టి సంబంధము లేదన్న నాడు మాత్రమే "మాపతులు చాలమంచివారని" నవ్వుముఖములతో సరస సంభాష ణములు సాగించుచుందురు.

కలిపురుషుడు స్త్రీ, ధన, వ్యామోహాములకు బానిసయై ధర్మ ద్రోహియై దైవోపహతుడగుచున్నాడు. ఈ కామినీ కాంచనముల శక్తికి లోకము లోనై తారుమారగుచున్నది.

వ్యక్తి, తన మనోవేగమును నిరోధించి నిజకర్తవ్య శీలుడై సర్వసముడై సాధుహృదయుడై ప్రాకృత సుఖభోగములపై విరాగము నొంది సదా సత్సంగియై మెలంగిననాడున్నతోన్నత స్థితితో నొప్పారు చుండును.

ప్రయత్నముతో పురుషోత్తమునందైక్య మొందవలెనను సద్వాంఛతోడనే నరుడు కాలమంతయు గడపి కడకు కాలమృత్యువు యొడిలోనికిచేరి తన ఘనమైన చరిత్రకు స్వస్తి చెప్పి లోకపు హా! హా! రవములకు పాత్రుడగును.

సృష్టిలోచరించెడి జీవకోటి సముదాయమంతయు క్షణక్షణము నకు మరణసమయమనెడి గమ్యస్థానమునకు పర్వెత్తుచున్నదనెడు నిత్య సత్యమును నరుడు విస్మరించి యంతులేని ధనాశతో స్వజాతియనెడి దురభిమానముతో బంధించబడి వదలించుకొను ప్రయత్నమునువీడి నొకనాడెవ్వరితో చెప్పకెక్కడికో నేగుచున్నాడు. ఈ రహస్యస్థల మునకై విజ్ఞానవేత్తలు కోట్లధనవ్యయముతో కృషి సల్పుచునే యున్నారు. ముందేమి జరుగునో?

ప్రకృతి పరిస్థితుల ప్రభావమునకు బానిసలైన స్త్రీ పురుషు లెల్లరును తామాడిన నుడిని పోనాడి ధర్మమును త్యజించి ధనాశా బద్ధులై, యుక్తాయుక్త విచక్షణాజ్ఞానమును గోల్పోయి సిగ్గువీడి నడివీధి పాలై జగడములకు తారసిల్లి మానమర్యాదలను పూర్తిగా వదలి పదిమందిచే "వీరు నీచులురా!" యనిపించుకొనుచుందురు. దీనికంతటికి కారణమేమి? తనశక్తి, తనకెదురాడెడి వారిశక్తిని మరచి 'నోరున్న వాడిదే యూర' నెడి సామెతను సార్థకమొనర్చుచు న్యాయదృష్టిలేక కోపావేశముతో ఒళ్ళు తెలియని త్రుళ్ళిపాటుతో చరించుటయే ప్రధాన కారణమై యొప్పుచున్నది.

"నిజరంకులాడికి నిష్ఠ మెండ" నెడు రీతి వేశ్యగాకుండియు వేశ్యయై తిరిగెడి నీచుగాలి జోలికి మంచివారు వెళ్ళక మానముతో బహుదూరముగా మసలుటెంతయో శ్రేయోదాయకము.

గ్రామవేశ్యల స్థితిగతి సంసారస్వరూపాదులన్నియు ప్రారంభమున 'మూడుపూలారుకాయలవలె' విజృంభించి చివరదశలో మూటికి దూరమై మలమూత్రములతో పొరలుచు మంచములబడి మరణించు చుందురు.

ఆత్మవిశ్వాసము సద్గురుభక్తి దైవనిష్ఠ కళాహృదయముకల్గి పెద్దలవాక్కులనమ్మి చరించుచు సత్య సత్త్వ సంపత్తితో నరుడే ప్రదేశమునకు చేరినను పెద్దల సహకారముల కార్యసిద్ధినొంది సంతుష్టి పొందగలడు.

భక్తి బాష్ప నయనములతో మేనుమరచి నరహరి నుతించినట్టి వ్యక్తి విద్యాబుద్ధులకు, సంగీత సాహిత్య నృత్య గానకళలకు మహా పండితులైనను గౌరవించి శుభాశీర్వాదయుక్త పారితోషికాదులొసంగ వలసినదే!

భక్తిలేనివ్యక్తి విద్యకు ఫలితము లభించినను భగవద్భక్తిగల పెద్దల హృదయముల కేమాత్రమానందము లభించనేరదు. భక్తి

గురువుల చెంత నధ్యయన మొనర్చి సంపాదించుటకువీలు లేనిదై యున్నది. భక్తి నరునకు జన్మతః లభించవలసినదే. నిజభక్తుని సర్వకార్య కర్తృత్వమా రమాపతియే చూచుకొనగలడు. నిజభక్తుడనగా సామాన్యుడు కాదు. బాలభక్త ప్రహ్లాదమూర్తివలె తన గృహస్థజీవన జీవిత విధి విధానములను మార్చుకొని యింట బయట మెలగిననాడు నిజభక్తునిగా నెన్నుకోబడగలడు.

"పాకమునకువచ్చి పగిలిపోయెడుస్థితి చేకూరినగడ్డనరునిబాధించు కరణి" నరులొనర్చు దుష్టకర్మల ఫలమనుభవమునకు వచ్చిన తరి వారు దురంతదుఃఖములకు గుఱియై గాసినొందెదరు.

ప్రపంచ పర్యటన మొనర్చి నరుడు సత్యమును గుర్తించిననాడు జీవకోటి సముదాయమంతయు కర్మల ప్రతిఫలముల ననుభవించుచు హర్ష శోకముల నొందుచుండిరను విషయము తెలియవచ్చుచున్నది.

దుష్టసంస్కారులైన నరులు కన్నీటితో కాలముగడపెడి దుష్ట దివసములందు సైతము వారి లోకాపకార నీచ ప్రవృత్తిని విస్మరింప జాలక కుబుద్ధి, నిగ్రహించజాలక అమాయకులైనట్టి పరుల కాపురము లను కబళించెడి మాయాపన్నాగములను సృష్టించి కుతంత్ర జీవనులై బ్రతుకుచుందురు.

ఈ భువిపై పుట్టిన ప్రతిప్రాణి యేకానొకనాడు గిట్టి మట్టిలో కలియక తప్పదనెడు యథార్థము తెలిసియు నరులు మాయకు వశులై తమకున్నది చాలదనెడు యాకాంక్షతో నురాశకులోనై బంధుమిత్రా దులకు వెగటగు భావాలతో ధనార్జనకై ధర్మవిరుద్ధకర్మలనే సాగించి కన్నీటిపాలై తన సతి సుతాదులకు నయాపైసెనియు మిగల్చక కడకు కాటికేగి లోకపు తెగడ్తల పాలగుట యెంతటి శోచనీయమో!

అసత్యవాదినై జూద సురాపాన వ్యభిచాద్యక్రమ నింద్య కర్మలతో కాలమును దుర్వినియోగ మొనర్చెడి దుష్టమానవులకట్టి

రచనలెంతో బాధాకరములై కన్పట్టుచుండును. "యథార్థవాది లోకవిరోధి" యన్నట్లు నిత్యసత్యవాక్యము, లజ్జలకెంతేని బాధ భయాందోళనలు గల్గించగలవు. అసత్యమై యనర్థములకాలవాలమై మాయామహిమతో కన్నులకింపొనగూర్చు లోకస్థితిని గుర్తించు టెంతయో కష్టతరము.

లోకమున కండలండలుండి గుండెబలముగల వస్తాదులెందరో క్షణకాలములో నర్థముగాని గుండెపోటులాదిగాగల వ్యాధులతో మరణించి కాటికిచేరి దహనమై భూతిరాశిగా మారిన దృశ్యముల నెన్నింటినో కలిమానవులు ప్రత్యక్షముగా చూచియు వారొనర్చెడి ధనార్జనపరమైన దుష్టకర్మలనువీడి ధర్మమార్గములందు చరించరు.

ఈ వికృతకాలమున దుష్టకార్యములకలవడిన నరుడు ప్రజ్ఞతో శిష్టకార్యములొనర్పగలడు. చెడిన మనస్సు బాగై సత్ఫలితము నొందుటకై ధర్మాత్ములైన పెద్దల సన్నిధినిచేరి వారికి భక్తితో సేవలొనర్చి వారుచెప్పెడి ధర్మోపదేశములను విని వారొనర్చెడి సత్కార్యములాచరించుచు వారిదివ్య పాదపద్మముల సన్నిధిలో కొంత కాలము క్రమశిక్షణతో మెలగినచో 'రోగి ఘనవైద్యుని యౌషధ పానముచే సంపూర్ణారోగ్యము చెందినరీతి' ముముక్షువై కర్తవ్యకర్మ నిర్వహణమొనర్చి ముక్తిని బడయగలడు.

అందమైన యాకారముతో సువాసనలు విరజిమ్మెడి గులాబి పుష్పములనుజూచి మనుజుడానందించుచున్నాడు. కాని గులాబీలను సృష్టించిన గోవిందుని గుణవైభవమును గుర్తించడుగదా! లడ్డు, జిలేబి, హల్వా మొదలైన మధురవస్తు సముదాయముతో లోకమున కెంతో విందొనగూర్చు సృష్టికాద్యుడైన పరమేశ్వరుని దివ్యనామ స్మరణమును మానవులు విస్మరించి ప్రకృతిశక్తులనే సంస్మరణమొనర్చు చున్నారు. ప్రకృతినంతటిని నడపించెడివాడు పరమాత్మ. అట్టి పరమాత్మయందు నరులు వారి మనస్సులను లగ్నమొనర్చుటకై

యత్నించక ప్రకృతి స్వరూప స్వభావ సమ్మేళనమైన ప్రపంచము నమ్మి మోసపోవుచున్నారు.

మాటలులేక మౌనముద్రతో కదలక స్థాణువై ఘోరారణ్య సీమలలో కొండశిఖరాలయములలో వెలుగొందెడి శ్రీ శివ కేశవా మూర్తులను దర్శించుటకై వేలాది ప్రజలెన్నో శ్రమలకు గురియై చేరుచుండుటకు కారణమేమి?

ఘోరసంసారారణ్యములలో చరించి చరించి నిజమైన ప్రశాంత ప్రమోదముల బడయజాలక నరులెల్లరు మహాపర్వదివసముల కానల మధ్య వెలుగొందెడి భగవదాలయములకు జని నిరాహారులై జితేంద్రియులై నృహరినామ స్మరణమొనర్చుచున్నారు.

కొందరు రాగద్వేష భయ సంకుల సంసారమునందు శాంతిని బొందజాలక సతమతమగుచు నిజమైన మార్గముదెలియక తాము చేర వలసిన గమ్యమును గుర్తించక వివిధ వినోదయాత్రా పర్యటనములను సాగించుచున్నారు.

ఇంటియందుండినను, యాత్రలు సేవించినను, నిరాహారులైనను నరులు వారివారి మనః ప్రవృత్తులకులొంగక మనస్సును వశమొనర్చు కొని పరమాత్మునిలో లీనమొనర్చి చేష్టలుడిగిననాడే నిజమైన ముక్తిని బడసిన వారయ్యెదరు.

శ్రీ శంకర రామానుజ మధ్వాచార్య విద్యారణ్యాది మహనీయ మూర్తులెందరో లోకమునందవతరణమునొంది సర్వజనాభ్యుదయ కాంక్షాసక్తచిత్తులై వేదవేదాంగ పురాణేతిహాస విజ్ఞాన సారస్వత మాతయు వారి రచనలయందు తాండవింపజేసి లోకోపకారమొనర్చి నారనుటతిశయోక్తి కాదు. అట్టి విజ్ఞానమూర్తులందించిన దివ్యరచనలను నేటి కాలమున గుర్తించి భక్తితో పఠించెడువారరుదైరి. పిచ్చిబట్టి చరించెడి వానికి పెద్దల వాక్యములు రుచించనిరీతి, ప్రపంచ

కర్మాసక్తులై ధనాన్వేషణతో ధర్మవిరుద్ధకర్మలనాచరించెడి దుష్ట మతులైన నరులకు దైవధర్మోపదేశ రహస్య విశేష వివరణములుగల రచనలు రుచించునా? లేదు లేదు లేదు.

శ్రీ భగవద్గీత, ఖురాన్, బైబిల్ మొదలగు మతగ్రంథము లన్నియు చెప్పిన సందేశసూక్తుల సారాంశమేమి? సర్వభూతములందు వెలింగెడి చైతన్యశక్తి తనలో వెలింగెడి చైతన్యశక్తియునొక్కటియే గాన, యేప్రాణి కపకారము కల్గించక శక్తికి తగిన యుపకార మొనర్చుచు, పరస్త్రీధనాదుల నాశించక కష్టనష్టములు కల్గినను సత్యమునే పలుకుచు నాడిన నుడి దప్పక చరించుచు, కూటికొఱకు మోసకర్మలుచేయక సుఖదుఃఖములకు పొంగక క్రుంగక, పరమాత్ముని చింతనతో కాలమును కాయమును సద్వినియోగ మొనర్చుచు పరహిత కర్మాచరణముతో గురుదైన వేదాది సూక్తులయెడ విశ్వాసముంచి నందందుగల భావముల నాచరణము నందుంచి సంసారసాగర తరంగ కల్లోలములకు జంకక స్థిరతరమైనబుద్ధితో ధర్మజీవనముతో సంతృప్తి చెందుచు జనన మరణ భయ దుఃఖ సంకులసమరమైన సంసారమునకు మూలకారణములైన మనోసంకల్ప వికల్పములలోని మార్పును గుర్తించి మతిని సద్గతికిమార్చి దుర్గతిని దూరముచేసి ప్రాప్తము లేని ప్రసాదమునకై వ్యసనమును చెందక సర్వాలలోగల సర్వేశ్వరునినిరసించక సర్వసముడై భౌతికదృష్టికగమ్యమై జ్యోతిరూపముతో భాసించెడి శివసుందరుని దివ్యతత్త్వమును దర్శించి తాదాత్మ్యము నొందుటయే యని సారము.

హైందవ పురాణ కథలలోని మూలమును, వాటి స్వరూప స్వభావ సౌభాగ్య సౌందర్య రహస్య విశేష వివరణమును, ఔను-కాదనెడి వాగ్వాదములొనర్చు మనమెల్లరము పఠించి స్వార్థములేక సత్యాంశమును గుర్తించిననాడు, నరుల సుఖదుఃఖములకు కారణములు వారొనర్చెడి పరోపకార పరాపకార కర్మములే ప్రధానములై విరాజిల్లు చున్నవని తెలియబడుచున్నది.

దేవుడని, దేవతని, దైవకార్యములని నరుడెంతో ప్రజ్ఞాబలము నుపయోగించి బూటకపు భక్తితో కపటవినయముతో ప్రాణమిత్రులవలె చరించి లేనిపోని కథలను సృష్టించి భక్తహృదయులైన నరులకు బోధించి వారిమనస్సులను ఘడియకాలములో మార్చి వారి హృదయములందు నూతనోత్తేజమును రేకెత్తించి వారి యర్థమును కొల్లగొని నిర్ణయప్రయత్నమును తారుమారొనర్చి దైవకర్మను దయ్యపుకర్మగామార్చి తన యాహ్వానాతిథుల కగచాట్లనుచేకూర్చి యేదోయొక నెపమునుజూపి భక్తితో విచ్చేసిన ముముక్షువులకసంతృప్తిని చేకూర్చి కార్యవిఘాతమును కల్గించి స్వార్థపరుడై ధనమును నిల్వచేసి సుఖభోగముల నొందెడు కాంక్షతో లోకమున చరించినంత మాత్రమున సుఖసంతోషసత్కీర్తిని పొందజాలడు. ఇట్టి దైవవంచకుడు సజ్జన హృదయసంతాపకుడైన మానవుడెట్టి శక్తివంతుడైనను, కవియై, కథకుడై లోకమున చరించినను వాని గతకాల సజ్జనాపకారకర్మ ప్రభావము వెన్నంటి కాల్చిచ్చు కరణి ధ్వంసమొనర్పక మానదు.

## గుణము గలవాడే సమాజమునకాదర్శమూర్తి

ఘోరతపస్సులొనర్చి పరమశివుని మెప్పించి ధర్మవ్యతిరేకములై శక్తివంతములై లోకకంటకములైన గొప్పవరములను పొందిన భస్మాసురాదులు సాధించిన దుష్టఫలితమురీతిగా, నేటి లోకమున నాగించెడి దైవకర్మాపరాధులెల్లరు దురంత దుఃఖములనుపొంది లోకమునే తెగడబడుచుందురు.

పాపకర్మలుచేయువారు సైతము పుణ్యపురుషులు సాగించెడి యాధ్యాత్మికధర్మ విషయ ప్రబోధములు విన్ననాడు విధిగ పరిణామ మొందగలరు. సర్వజ్ఞులనగా నెట్టివారు? అజ్ఞానదశలోనుండి తత్త్వము దెలియక దైవమాషణమొనర్చెడి మూఢజనులను సైతము విజ్ఞాన

ప్రబోధామృతమును పానముచేయించి వారిహృదయములలో గొప్ప మార్పును కల్గించి భక్తమణులుగా రూపొందించెడి వారని తెలియవలయును.

జీవుల పతనమునకు మూలము స్త్రీ ధన కీర్తులపై గల వ్యామోహమే! ఒక వ్యక్తి చెప్పెడి స్వానుభవసత్యాంశమును సత్యమైనదని తెలిసియు వేఱొకవ్యక్తి కాదని వాగ్వాదముతో మూర్ఖ ప్రవృత్తితో ఖండించుచుండును. ఇందులకు కారణము కీర్తి తపనయే.

ఒకేజాతి మానవులలో సాత్త్వికరాజసిక తామసిక గుణములు తాండవించుచుండును. ఈ గుణత్రయ సంస్కారప్రభావమే లోకమునందు ఆహార విహార వ్యవహార ప్రతీకారాదికర్మలతో వ్యక్తమగుచుండును. ఈ సత్యాంశమును గుర్తించినచో, పరిశీలనాత్మక దృష్టితో చూచినచో సర్వమానవులు సమానమని దలంచుట చాల పొరపాటు.

చర్మము రక్తము మాంసము నరములు యెముకలు నవరంధ్రములు ఆకలి దప్పిక మల మూత్ర విసర్జనాదికర్మలు సర్వులకు సమానరూపాలతో కన్పించినను, వారి వారి గతకర్మల సంస్కారాది గుణములలో మార్పులు కన్పట్టుచుండునుగాన, లోకమునగల వారెల్లరు సమానమే:! ఒకేవిందు యొకేమందు నొకేమార్గమనుటకు ధర్మము కానేరదు.

క్రైస్తవులెల్లరు శ్రీ గుఱ్ఱము జాషువా మహాకవులై విలసిల్ల గలరా? వైశ్యులెల్లరు శ్రీ మహాత్మాగాంధీగారివలె వెలుగొందగలరా? హరిజనులందరు శ్రీ ముమ్మడివరం బాలయోగులై ప్రకాశించగలరా? భట్టుమూర్తులందరు 'పుట్టపర్తి' శ్రీ భగవాన్ సత్యసాయినాథులై లోకోద్ధరణ మొందించగలరా? చౌధరులందరు శ్రీ త్రిపురనేని రామస్వామి వారివలె, శ్రీ తుమ్మల సీతారామమూర్తి వారివలె

మహాకవిపుంగవులై రూపొందగలరా? రెడ్డెల్లరు శ్రీ యోగి వేమ
కాగలరా? విశ్వబ్రాహ్మణులందరు శ్రీ కందిమల్లయ్యపల్లె శ్రీవి
పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములై కాలజ్ఞానమును ప్రబోధము
గలరా? బ్రాహ్మణులెల్లరు శ్రీ శంకర రామానుజ మధ్వాచారు
లోకోద్ధరణ మొందించగలరా? క్షత్రియులందరు గౌతమబు
మహోపదేశములు గావించగలరా? లేదు లేదు.

ఒకేజాతిరక్తముగల వంశమునందుద్భవించిన వారిలో నొ
రావణుడు మఱియొక్కడు విభీషణుడు. పంచపాండవులలో ధర్మ
మతి స్థితి పరిస్థితులలో భీముని స్థితి మతి పరిస్థితులలో చాల
కనవచ్చుచున్నది. ఇట్టి భేదములుండుటవలననే నాటి నుండి నేటి వ
భిన్నములైన మతములు మార్గములు పూజలు ప్రార్థనలు పారా
ణములు లోకమున నాగుచున్నవి. సృష్టియారంభమునుండి కాదు-ఔ
యనెడి విషయ నిర్ణయ సమస్యలతో సంఘము సతమతమగుచున్న
ఆనాటి వేదములు నేటి విజ్ఞానశాస్త్రపరిశోధనల సారాంశము నొక్క
యేయని తెలిసినవారు తెలుసుకొనుచున్నారు.

మూర్ఖులై పెడవాదనములతో పెద్దల సత్యసూక్తులను కాద
ఖండించెడివారు సైతము వారి హృదయాంతరములలో 'పెద్దల సత
సూక్తులే పరమప్రమాణములు పదిమందిలో మనశక్తిని దుర్విని యో
మొనర్చితి' మని ఖేదమును పొందుచుందురు.

మూర్ఖచిత్తులై స్వార్థప్రయోజనముల నాశించి దూరదృష్టి
పోనాడి పెద్దలతో పెడవాదనలుచేయు పాపదృష్టిగల నరులకు కో
జన్మలకైన సద్గతి చేకూరదు. సద్గతిదూరమై దుర్గతిపాలై భవచ
పరిభ్రమణముతోడనే గాసి చెందుచుందురు.

యథార్థస్థితిని, నిరాడంబరులైన మహాత్ములను ఆహ్వానముల
లేక దైవప్రేరణతో పెద్దల సన్నిధికరుదెంచిన కళాకారులను,నిరాడంబ

లైన కవిపండితులను, బీదవారై వినిర్మలగృహస్థాశ్రమ జీవనమొనర్చు ధర్మహృదయులను, భౌతికభోగ లాలసత్వముతో బొర్రలు పెంచి కర్ర పెత్తన మొనర్చుచు సమాజపరమైన ధనముతో కార్యక్రమముల నిర్వహణ మొనర్చెడివారు గుర్తించి గౌరవించజాలరు.

ఆహ్వానితులై వెళ్ళిననాడే కవి గాయక పండిత విద్వద్వరులైన పెద్దలకు ఘనమైన గౌరవాదరణములు చేకూరుచుండును. లేనిచో 'వలచిపోయినకులటకుమాండ! విటుడు వలచివచ్చినచో వరహాఖర్చనె' డి సామెతగా గొప్పకళాకారుడైనను తనకు తానే స్వప్రేరణతో వెళ్ళిన నాడు యాతిథ్యమునకు సైతమాహ్వానించరనెడి విషయము సత్యమై సమంజసమై యొప్పుచున్నది.

ప్రతివ్యక్తి తనకుగల గత సంస్కారానుగుణమైన మనఃప్రవృత్తి కనువైన వృత్తిని చేబూని సాగించి సంపూర్ణస్థితిచెంది వెలుగొందిన నాడున్నతోన్నతులైన పెద్దలే యాహ్వానములొనర్చి గౌరవించి ఘనమైన కార్యముల నిర్వహణ మొనర్చి పసందైన విందులనేర్పరచి వెలలేని యాత్మానందానుభూతిని కల్పించి వారానందించుచుందురు.

ప్రతి కళాకారుడు, ఈ గ్రంథరచయిత గుప్తగారిచే గతమున రచనచేయబడి ముద్రణమైన ముముక్షువుల కందచేసిన పరమ పవిత్ర విషయ విమర్శ రహస్య ప్రబోధములు గల "ఏదిసత్యము?" ద్వితీయ భాగమునందున్నట్టి వ్యాసము "భగవంతుడు-భాగవతుడు" యనుదానిని పఠించినచో సర్వము విశదమగును.

ఈ రచనల నొకేసమయమందారంభించి క్రమముగా వ్రాసినవి కాదు. వివిధస్థల పర్యటనములలో పలురకముల సంస్కారములుగల వ్యక్తులతో సరస విరస సంభాషణములొనర్చి సత్యమును గుర్తించి స్వానుభవాత్మక చైతన్య శక్తితో "జితేంద్రియులై యోగనిష్ఠా గరిష్ఠాత్ములై, నన్నే స్మరించెడి నిజభక్తుల హృదయములలో తాండవ

మొనర్చెడి సర్వశక్తి సముపేతులైన సద్గురు శ్రీ యోగానంద నరసింహస్వామివారి దివ్యకరుణా ప్రసార మహిమాతిశయముతో సత్యాంశసూక్తి సుధాకలశమును భక్తమూర్తులై సత్కర్మనిరతులైన పెద్దల కందించ యిందుగల సారామృతమునుగ్రోలి సుస్థిర శాంతి భద్రతల నొందెదరుగాత!" యనెడు భక్తజనోపకార భవ్యదృష్టితో రచనమును సాగించి రచయిత సంతృప్తినొందిరి.

నరులకు దారాసుత ధనాదిభోగసంపత్తి యనుభవముతో గలిగెడి తాత్కాలికతృప్తి శాశ్వతమైన ముక్తికి సోపానము గానేరదు. సంతృప్తి, సోపానక్రమమై దివ్యాచరణమునకు దోహదమై మోక్ష ధామము చేర్చెడి సాధనమై యలరారుచున్నది.

సంతృప్తిపొందుట సామాన్యముకాదు. శబరి యొసంగిన భక్తి ఫలప్రేమకానుకతో శ్రీ రఘురామభూపాలుడు సంతృప్తినొందెను. బీద కుచేలుడొసంగిన భక్తికానుకయైన చేరెడటుకులతో శ్రీకృష్ణ పరమాత్మ సంతృప్తి చెందెను.సంతృప్తినొందుటకు సప్తద్వీపభూమండల మైనను చాలదు. సంతృప్తి భక్తి శక్తిలో నున్నది.

ఆలయప్రాకార గోపురమంటపాదులకు గ్రామదేవతోత్సవాది కార్యక్రమములకు సత్రశాలాదినిర్మాణములకు లోకమునగల జనులలో కొందరు వారివారి శక్త్యానుసారముగా విరాళముల నర్పించుచుందురు.

ఆదర్శ కవుల యాధ్యాత్మిక రచనాముద్రణలకు స్వార్థత్యాగ నిరతులైన మహాత్ముల పోషణలకు సర్వసమత్వదృష్టిగల మహాపండితు లను గౌరవించి సన్మానములొనర్చుటకై, సాహిత్యదృష్టి భగవద్భక్తి గల వ్యక్తులు వారిధనమును త్యాగహృదయులై వ్యయమొనర్చి జీవితములను వారార్జించిన యర్థసంపత్తిని సార్థకమొనర్చిధన్యులై వర్థిల్లుచుందురు.

కొందరున్నారు. వీరుదైవధర్మన్యాయ సత్య సాహిత్య కవిత్వాది మహనీయ కార్యక్రమములకు పైసాను ఖర్చుచేయక వారి సుఖ శాంతి సౌఖ్యములకు సైతము ధనమును వ్యయమొనర్పక యభివృద్ధిచేసి చేసి చివరకు రోగాలకు, నిర్నిమిత్త కలహములకు లోనయి కోర్టులకు, మనోవ్యథను చేకూర్చెడి యహంకార దుష్టకర్మలకు ధనవ్యయ మొనర్చి తీరనియీ వేదనల పాలగుచుందురు.

నరులిట్టి దుష్టకర్మలకు వ్యయమొనర్చెడి ధనము వారి యన్యాయార్జితవిత్తమై యుండును. దుష్టకర్మలొనర్చు నరుల మనోవృత్తియే వేఱు. వారు చిన్ననాటినుండియు దుష్టవాతావరణమున పెరిగి పెద్దరై మహాత్ముల సత్యసంభాషణములను వినక మహాకవులొనర్చిన సద్గ్రంథ రచనలను పఠించక భగవానుని దివ్యనామముల స్మరించక గత దేశ చరిత్రలను చూడక 'కూపస్థమండూకముల' వలె పుట్టి పెరిగిన స్థలము లందే తిరిగి సంఘబలమే బలమని పెద్దలను తిరస్కారభావముతో నిరసనదృష్టితో చూచెడి కుకర్మల ప్రభావమే వారికి ఛాయయై వెంటనంటి వేటాడుటయే ప్రధానమై కన్పట్టుచున్నది. దీనంతటికి వారికావరించిన యజ్ఞానమైన మాయామహిమ.

విశాలదృష్టితో సర్వసమత్వ భావముగలిగి కులమత వర్గభేదము లను పోనాడి లోక పరిభ్రమణ మొనర్చెడి భగవద్భక్తుడు బ్రాహ్మణేతరుల గృహములకుజని భక్తితో వారొసంగిన నీరు, సాత్త్వికాహార మును భక్షణ మొనర్చినాడు, విషయము దెలియని బ్రాహ్మణేతర సంఘము 'ఓహో ? పెద్దలనుకొనెడి వీరెల్లరు మనగృహములకు విచ్చేసి మన పానీయ ఫలహార ప్రసాదాలను స్వీకరించి సంతృప్తి చెందు చున్నారు. మనము వారు నొక్కటియే భేదములే'దని యెంచి పెద్దలైన వారిని రచ్చలలో చులకన భావముతో వెగటైన వాక్యము లాడు చుందురు.

జ్ఞానులై వేదాంతభావాలకనుగుణముగాజీవితగమనములొనర్చెడి పెద్దలు, సాత్త్విక సంభాషణములు సాగించిన వారెల్లరి గేహములకు

జని పానీయ ఫలహార ప్రసాదములను భక్షించక బహుదూరముగా మెలగి మహావ్రతము నవలంభించుటయే మిక్కిలి శ్రేయోదాయకము.

'మరాళగమనము వాయసము లెరుంగనిరీతి' జ్ఞానిదృష్టికి యజ్ఞాని దృష్టికి తూర్పు పడమరలంత వ్యత్యాసము. కవిమస్తకపు విలువ కవికే తెలియును. పండితుని వాక్చతురత, కావ్యవిషయ విమర్శనాశక్తి పండితునకే యవగతమగురీతి, ఏస్థితియందనుభవము గలవారి కాస్థితియందుగల కష్టసుఖములు తెలియులాగున, కర్మసిద్ధాంతములోని వివిధ విషయ రహస్య విశేష విమర్శార్థ ప్రతిపాదకములైన భావములలోని లోతుల నందఱు గమనించి గౌరవించజాలరు.

మహాకవి శ్రీ కాళిదాసుగారి గణనీయ గీర్వాణ పదభంగిమలలోని భావగాంభీర్యము కామదాసుల కయోమయమగురీతి, దివ్యజ్ఞాన సంపత్తితో శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి మహత్తర మహనీయశక్తి ప్రసారమహిమావేశ సంభరిత దివ్యపారవశ్యస్థితిలో కలముబట్టి కవితను సాగించిన గుప్తస్థితి భౌతికదృష్టిగల పెద్దల మస్తకములకు బోధపడదు. ఇది ప్రకృతి శక్తియొక్క వికృతి స్వరూపమని సర్వులు తెలియదగినది.

'మనోవ్యాధికి మందులేదు' యనెడిసామెత సర్వులకు తెలిసినదే. శారీరవ్యాధులకు ఘనవైద్యులెందరో ఔషధములనొసంగి యారోగ్యవంతులనొనర్చినరీతి, మనోవ్యాధితో వ్యధచెందెడి నరులకు శాంతి సౌఖ్యములు చేకూర్చవలెనన్నచో భవరోగవైద్యులైన సద్గురుస్వాములొసంగెడి దివ్యాత్మ ప్రబోధామృతమును భక్తితో ధర్మవర్తనముతో పానమొనర్చవలెను.

అట్టి సద్గురువుల దివ్యచరణసన్నిధి ముముక్షువులైన వారెల్లరికి లభ్యమగుట దుర్లభము గదా! ఎంతో పూర్వపుణ్యఫలసంస్కారము గల భక్తమూర్తులకే పరమగురువుల పవిత్రపాదపద్మసన్నిధి లభించగలదు. అఖండ యోగశక్తిపరులైన సద్గురుదేవుల కరుణాశీర్వాద మహాఫలశక్తితో నిస్వార్థదృష్టితో వేదసత్యప్రబోధపరమైన భక్తిజ్ఞాన

వైరాగ్యతత్త్వ ముక్తిమార్గములకు మూలమైన రచనలు సాగించి లోకమునకందించుటయే శిష్యుని భక్తికి నిదర్శనము.

ఆధ్యాత్మిక చింతనతో సత్యవాక్యపరిపాలనతో దుర్గుణ రహితుడై విరాగ వివేకజీవనుడై సద్గురుభక్తితో నృసింహోపాసనతో పరమాత్మ ప్రేరణతో లోకక్షేమంకరధ్యేయముతో సాగించినట్టి రచనలను ముముక్షువులు చలనములేని చిత్తస్థైర్యముతో నిష్ఠతో నిత్య పారాయణమొనర్చి యాచరణమునందుంచిననాడు, శ్రీపతి నిలయము శ్రీ వైకుంఠధామమును చేరెదరు. ఇది నిస్సందేహము.

నరుడు బాల్యయౌవనకౌమారదశలందొనర్చిన కర్మల సంస్కారమే యాతని వృద్ధదశయందును ప్రత్యక్షమై మనస్సును బంధించి గాసి జెందించుచున్నది. జీవితమంతయు నరుడేకర్మ మొనర్చునో తుది దశ యందును కర్మను విడువక సాగించుచునేయుండును. కర్మస్వరూప రహస్యమును గుర్తించిన జ్ఞాని కర్మఫలమును త్యజించి కోర్కెలనణచి దైవకర్మలొనర్చుచు సాధనసిద్ధితో నిర్వికారుడై నిత్యానందుడై వెలుగొందును. ఈ స్థితి నూటికొక్కటికి సాధ్యమగును.

కవి, కవితను వ్రాయుచునే కాలమంతయు గడిపి కడకు కాల గర్భమునందు లీనమగును. పండితుడు, గాయకుడు, విజ్ఞానశాస్త్రజ్ఞుడు, కళారాధకుడు,కళాపోషకుడు,భక్తుడు,సాధువు,సంసారి, కసాయి,కమ్మరి, కుమ్మరి, ఉద్యోగి, వ్యాపారి, పురోహితుడు, పూజారి, యర్చకుడు, యాధ్యాపకుడు, కర్షకుడు, కార్మికుడు, చిత్రలేఖకుడు, దుష్టుడు, జూదరి, వ్యభిచారి, త్రాగుబోతు, చోరుడు అసత్యవాది, వైద్యుడు, వ్యాయామ కళాకోవిదుడు, వ్యభిచారిణి, రాజు, మంత్రి, సేవకుడు, సైనికుడు, మాంత్రికుడు, మాయలునేర్చిన మానవాధముడు మొదలైనవారెల్ల రీలోకమునందు నిత్యము వారి కభ్యాసమైన కర్మలొనర్చుచునే కడకు కాలమృత్యువు కౌగిటజిక్కి లోకమునువీడి యెక్కడికో తరలిపోవు చున్నారు.

ఇట్టి కర్మసిద్ధాంతమును నరులు తెలిసియు ప్రపంచ వ్యామోహ మునకు బానిసలై విపరీత వర్తనులై విజ్జృంభించుచున్నారు. కార్యార్థి యైన మానవుడు తనభవితవ్యపుస్థితిని తెలియనేరక త్వరితగతి కార్యము సాధించి సంతోషమును చెందవలెననెడి నుబలాటముతో పరుగులు తీసినను ప్రయోజనమును బడయనేరడు. కాలము కలసివచ్చిననాడే నరుడొనర్చెడి సుకర్మములు ఫలవంతములగును. కాలము కలసిరానినాడు నరుడొనర్చెడి సుకర్మములన్నియు కుకర్మములై కష్టనష్టములు కల్గి పది మంది తెగడ్తలచే గాసి చెందసాగును. కాలము కలసిరాని నాడనగా భావమేమి ? గత కాలమునందు నరుడొనర్చిన దుష్ట కర్మల ఫలాను భవము కర్తవ్య కాలమున పొడగట్టినదని తెలియవలెను. ఒకే కాలములో కొందరికి కన్నీటిస్నానము, మఱికొందఱికి పన్నీటి స్నానము సహ్యాలు చూచుచున్నారు.

శ్రీ భారతీయ ఋషివర్యులైన కపిలుడు, కణాదుడు వేల సంవత్సరములకు పూర్వమే గణనీయమైన కృషితో వారి వారి స్వానుభవ సత్యములైన విషయములనే లోకమునకు దర్శనములనెడు నామములతో నందించిరి.

ఒకరు చెప్పిన దర్శనమునకు వేఱొకరు చెప్పిన దర్శనమునకు విషయ నిర్ణయములలో భేదము కన్పట్టుచున్నది. భిన్నములైన సంస్కారములతో దేశ కాలాది భేదములతో రూపొందించబడిన దర్శనాది మహాగ్రంథములను పూర్తిగా పరిశీలనాత్మక దృష్టితో పరామర్శించి యందందుగల విషయములను దర్శించిననాడు దేహ ధారులైన జీవుల మనోవృత్తి సంచార కార్యక్రమము లన్నియు భిన్నములై ప్రవర్తిల్లినట్లుగా నేడు మనకు కన్పట్టుచున్నవి.

ఒక్క గృహములో నొకేతల్లిగన్న బిడ్డలలో వయోరూప గుణకర్మముల స్వరూపాది విభవములెట్లు భిన్నములై గోచరములగునో యదేరీతిగా విశ్వమునందు లోకపూజ్యులై ధ్రువతారలై వెలుగొందెడి

నాటికాలపు తత్త్వవేత్తలు సమాజమునకు చాటిన వివిధశాస్త్రార్థ రహస్యములలోను భిన్నత్వము ప్రత్యక్షమగుచున్నది.

నేటి సమాజము భక్తితో పూజించి యారాధించెడి మహామహు లైన శ్రీరామ కృష్ణ బుద్ధ శంకర రామానుజ మధ్వాచార్యాది మహాపురుషులందరిని వారు భువిపై నవతరణమునొంది కర్మల నాచరిం చెడి దివసములలో వారిని బహురీతులలో ప్రజాసమూహము ద్వేషించి హింసలకు గురిచేసినది.బహుకొద్దిమందిమాత్రమే యా మహాత్ముల శక్తిని గుర్తించి భక్తితో నారాధించిరి.

ఈ విషయ ద్వంద్వరహస్య సమస్యాపరిష్కారము చాల కఠిన మైనది. కారణమేమి? "ఎద్దుయీనెనన - గాటకట్టివేయు" మనెడి సామెతగా, యొకానొక విషయనిర్ణయ సమస్యాపరిష్కారమునుగాని, బహుదూరప్రాంతములందుండెడి వ్యక్తులనుగాని, క్షేత్రములనుగాని, కవి పండిత విద్వద్గాయకులైనవారినిగాని, యొకానొక మానవుడు తెలిసియో తెలియకయో, లేక నాతని గొప్పతనమును వ్యక్తముచేసి కొనుటకో 'వారుచాలగొప్పమహిమగలవారు జితేంద్రియులు సమాజ క్షేమంకరులు కామినీ కాంచనాసక్తవిదూరులు' యని మెల్లగా పదిమందికి చెప్పగా నాపదిమంది వందమందికి, యావందమంది వెయ్యి మందికి నా వెయ్యిమంది లోకమంతటికి బహుళప్రచారము చేయ సాగుదురు. ఈ బహువిధ ప్రజా ప్రచారోద్యమశక్తితో లోకమంతయు నొక్కుమ్మడిగా పయనమై వివిధములైన ప్రయాసలకులోనై ధన వ్యయమును లెక్కచేయక ధూమశకటయానములొనర్చి, మహిమలు చూపెడివ్యక్తి చుట్టూమూగి గొప్ప కోలాహలము కొనసాగించి కోర్కెలు సిద్ధించవలెననెడు తృష్ణతో పాదపూజలు పన్నీటిస్నానములు ప్రారంభించి శ్రమరహితమైన ముక్తిపథమును కాంక్షించి, దారములు

తెగిన గాలిపటములవలె లోకమంతయు తిరిగి తిరిగి చివరకు 'బూడిదలో పన్నీరు బుడబుడ' లనెడు సామెతలతో స్వస్థలములకు చేరుచుందురు.

శ్రీలక్ష్మీనృసింహోపాసకులై అచంచలయోగ నిష్ఠాగరిష్ఠాత్ములైన సిద్ధతపోమూర్తులను వారి దివ్యశక్త్యాదేశముల ననుభవించి యానంద మొందిన పెద్దలెందరో దూరస్థలములనుండి విచ్చేసి, సిద్ధతపోయోగులై నిరాడంబరులై వెలుగొందెడి శ్రీ యోగానంద నరసింహ స్వామివారి దివ్యపాదపద్మముల సన్నిధిచేరి భక్తితో పూజించి ఘనమైన నిర్మాణ కార్యక్రమములు చేబూని కృషియొనర్చెడి సాత్వికమూర్తులనుచూచి, సిద్ధమూర్తులైన స్వామివారి పరిసరములందుగల నజ్ఞులు "ఓహో! సిద్ధతపోమూర్తి యని భవితవ్య స్థితిగతి స్వరూపాది విషయములను చెప్పెడి భగవత్స్వరూపుడని బహుదూరములనుండి విచ్చేసి ఘనమైన పూజలతో దివ్యమందిర నిర్మాణములొనర్చుచున్నారు మీకు వెఱ్ఱియా? మీరు పూజలొనర్చెడి వారిసంగతి మాకు తెలియనిదికాదు చిన్నతనములో నిల్లువీడి దేశాటనముచేసి జడలు పెంచుకొని నిచ్చటనే స్థిరనివాసమేర్పరచుకొనిరి. వ్యవసాయాదికర్మలు సాగించిరి. వృద్ధులై కాలధర్మమును చెందిరి. నాగ్రామము వారిగ్రామము నొక్కటియే!" యని చెప్పగా విన్న డాంబికభక్తులందరు పూజలు మాని పలాయన మంత్రము పఠించెదరు.

నేటి లోకమున సమాజము మంచివారి విషయము దెలియక ద్వేషించుటయు చెడ్డవారని తెలియక ప్రేమించుటయు, యొనర్చి చివరకు సత్యదూరులై యజ్ఞానమను పెనుగోతిలో బడుచున్నారు.

నేటినుండి ముముక్షువులు మున్ముందుగా తమ తమ మనోవేగముల నిరోధించి ప్రశాంతమనస్కులై నిదానముగా నిబ్బరముగా నెవరికివారే లోకేశ్వరుడు ప్రసాదించిన మానవశిక్షశక్తితో మానముతో సవిమర్శన మొనర్చిననాడు సత్యమవగతమై సత్యాత్ములైన పెద్దల

సన్నిధికిచేరి వారి మహనీయోపదేశసందేశాది బోధలు విని భౌతిక వాంఛాపరమైన బాధలను నిర్మూలనమొనర్చి సత్కర్మనిరతులై కర్మ యోగమున పురోగమించి తరించుటయే ప్రతి నరుని కర్తవ్య కర్మమై భాసిల్లుచున్నది.

శ్రీ భగవద్గీత, ఖురాన్, బైబుల్ హైందవ, మహమ్మదీయ, క్రైస్తవులకు ప్రమాణగ్రంథములు. ఈ మత త్రయమునకు మహోన్నత భావాత్మక ప్రబోధములకు నిలయములైన యీ గ్రంథత్రయమునకు సైతము మూలకందములట్లు ప్రధానములై వెల్గొందిన వివేదములు. ఈ వేద విజ్ఞానమంతయు ఆదికాలమున యఖండ కృషితో నార్జించిన మహర్షుల స్వానుభవ సత్యాంశము లేనని నేటికి ఋజువగుచున్నవి.

ఆనాటి వేదధర్మములనే ప్రధానముగానెంచి శక్తిగల కవి పుంగవులు వారివారి వ్యక్తిత్వగుణగణముల సమ్మేళనములతో వేలాది గ్రంధరాజములను రూపొందింపచేసిరి. చందోబద్ధమైన కావ్యరాజములలో కథామూలము సూక్ష్మమై వివిధ వర్ణనల స్వరూప స్వభావ మహిమ గొప్పదై రసజ్ఞులకు హృదయరంజకమై వెలుగొందుచున్నవి.

ప్రతి మతమునందున్నట్టి కథలు జరిగినవి కావు. స్వార్థపరులైన వారెవ్వరో కవులచే సృష్టింపచేసి కవులకు జీవనోపాధిని కల్పించి వారి స్వార్థపరత్వమునకు పునాదులనునిర్మాణమొనరింపచేసి సమాజపరమైన ధనము నార్జించి సర్వసుఖభోగలాలసులై చరించినారనెడివ్యర్థ వాగ్వాద కువిమర్శకులు నేటి కలికాలమున కోకొల్లలుగా కన్పట్టుచున్నారు.

కువిమర్శకులైనట్టి యజ్ఞానులొనర్చెడి నాస్తికతాంత్రిక వితండ వాగ్వాదములకు సత్యము నశించదు. ధర్మము క్షీణించదు. వేద మంత్ర ధ్వని లోపించదు. సద్గురువుల స్వానుభవాత్మకములైన మధుర సందేశోపదేశములశక్తి మౌనము వహించదు. ప్రతి యుగమునందు జరిగిన దేశ చరిత్రాంశములందు లోపములు లేకపోలేదు. "శిరోజములులేని

వ్యక్తినిచూచి శిరస్సే' లేదనెడి మూర్ఖుని చందమున హైందవమతము నందుగల కథలలోని ధర్మశక్తిస్వరూపమునువీడి సూక్ష్మదోషములను, వర్ణనములకై సృష్టించిన సాహితి సొగసులలోని స్వరూపాలను నిజమని మూలములై సర్వజనోపకరములై వెలుగొందెడి కథలన్నియు కల్పిత ములే! రాముడులేడు. రావణుడులేడు. కౌరవులు లేరు. పాండవులు లేరు. వాల్మీకి వ్యాసాదిపెద్దలంతా స్వార్థపరులే! యని వాదించెడి నిరువది శతాబ్దాంతమున చరించెడి వికృతమతి గల మానవుని దుర్గతిని సంస్కరించి తీర్చిదిద్దెడి మహాత్ములెవ్వరో ?

నేటి కాలపు, కుయుక్తి కుకవుల వాక్యములను వారి మనోగత వైఖరి కనుగుణముగా సృష్టించిన రచనలను సర్వులు త్యజించి పురాణ కథలలోగల సూక్ష్మాంశములను గుర్తించి మతి గతి స్థితులను సమాజ క్షేమంకరములుగా పరిణామము నొందించి ధర్మకర్మ జీవనులై సుఖ శాంతి సౌభాగ్యములతో వెలుగొందెదరు గాత !

ద్వాపరయుగాంతము కలియుగారంభమునైన సంధిసమయమున కురుక్షేత్రమునందు పాండవమధ్యముడైనట్టి అర్జునునకు 'నా-నీ' భేదమును రూపుమాప, సర్వకార్య నిర్వహణాధికారిని నేనేనని శ్రీకృష్ణపరమాత్మ తన స్వస్వరూపమైన విశ్వరూప సందర్శనమును జూపి 'కర్మసిద్ధాంతము' దివ్యతత్త్వజ్ఞానము, జీవుల మతి గతి స్థితి స్వరూప విభవాదులలోని మూలసిద్ధాంతములను, కర్మ భక్తి జ్ఞానముల విశాలస్వరూపాదులను మాయా మాధవుల రహస్య సంబంధమును రెండుఘడియల కాలములో ప్రబోధమొనర్చి నరునకావరించిన యజ్ఞాన భయాంధోళనములను రూపుమాపి కర్మవీరునిగా కర్తవ్యపరాయణునిగా భగవదాదేశపరిపాల కునిగా రూపొందించి తాను రథసారథి పార్థునిమనోరథసారథియై, కురు యోధులనెల్లరిని మారణహోమమొనర్చి భక్తుడు బావమరిదియైన పార్థునకకండవిజయమును చేకూర్చి యుగధర్మకర్మనిర్వహణమొనర్చిన మహాకర్మ ప్రభావమే! 'భగవద్గీత' కు మూలమై వెలుగొందినది.

ఐదువేలసంవత్సరములనాడు కురుక్షేత్రమునందు కౌరవ పాండవ వీరయోధులు పదవీవ్యామోహముతో రక్తదాహముతో రాజ్యకాంక్షా తపనతో యుద్ధమునకు తారసిల్లిననాడు, పార్థుడు బంధుప్రేమతో వీరెరుల్లనావారేయనెడి యాకాంక్షతో ధనస్సునువీడి విహ్వలచిత్తుడై దిక్కుదెలియని స్థితిలోనుండిన తఱి, మాయా మానవ వేషధారియై జగన్నాటక సూత్రధారియై సర్వయుక్తి శక్తిసముపేతుడైన శ్రీకృష్ణ పరమాత్మ విశ్వ విజ్ఞానమంతటిని మూడుమాటలతో చెప్పగా సర్వ సమర్థుడు పరమభక్తాగ్రేసరుడైన నరుడు నారాయణుడొనర్చిన ధర్మ సూత్రరహస్య సందేశాలలోని లోతులనుగుర్తించి కర్తృత్వధర్మకర్మ వీరావేశముతో గాండివధారియై నారీటంకారమొనర్చి శంఖమును పూరించి గీర్వాణబృందమున కాశ్చర్యము గొలుపురీతి శరవర్షము కురిపించి కౌరవయోధులెల్లరిని దైవబలముతో హతమార్చి విజయభేరిని ప్రమోగించెను.

ఆనాడు పాండవమధ్యముడైన పార్థుడు సర్వార్పణ దృష్టితో నిరహంకారియై భక్తిబాష్పలోచనుడై 'నీవేదిక్కని' ప్రార్థించిన మధుర మహాపర్వ శుభసమయమునందే భగవానుడుపదేశించిన గీతా వేదమునకు నేటికాలమున శ్రీకృష్ణాంశతో నవతరణమొందిన మహాత్ము లెందఱో మహావ్యాఖ్యలొనర్చి ముముక్షుమహాజన సహస్రములకందించు చున్నారు.

నేటికాలమున ప్రతిగృహమున భగవద్గీత సాక్షాత్కరించు చున్నది. ఐనను సమాజపరమైన మార్పేమి కన్పించుటలేదు. వ్యాఖ్యానము లొనర్చినవారిలో, నిత్యపారాయణమొనర్చినవారిలో, మున్ముందుగ త్యాగము, కరుణ, భూతదయ, సర్వసమానత్వపు సత్యదృష్టి శాంతము సత్యము కుల మత వర్గ భేద రహితమైనస్థితి, పరధనాసక్తి లేకుండుట పరకాంతావిరక్తి మొదలైన దైవీగుణ సంపద్విభూతి వెలుగొందవలెను. ఈ సద్గుణసంపత్తి వారిలో భాసించనినాడు గీత నరుల నొసటి వ్రాతలను మార్చి సంస్కరణమొందించి రక్షించజాలదు.

"ఆయుర్వేదమున సిద్ధమకరధ్వజము గొప్ప గుణము కల్గినదైనను రోగి నిత్యము మూడు వేళల సేవించినను వైద్యుని యాదేశమును పాటించక తినరాని వస్తువులను తిన్ననాడున్న రోగముగాక క్రొత్తరోగములు సంభవించి ఘోరాపదలపాలైనరీతి" భగవద్గీత మహాగ్రంథమును మార్గశిరశుద్ధయేకాదశి పర్వమునందు వెండి పీఠాలపైనుంచి పరిమళ ద్రవ్యములతో పూజించి దీపాలను వెలిగించి నారికేళాది ప్రసాదములనర్పించి ధూపాలను వేసి సాష్టాంగ ప్రణామములొనర్చినంతనే ముముక్షువుల కర్తవ్యము ముగియలేదు.

సర్వ భూతాంతర్గతుడైన పరమాత్మను సమస్తమునందు దర్శించి యేప్రాణికపకారమొనర్పక తనకున్నంతలో పరులకు సాయమొనర్చుచు త్యాగమయ జీవనులై హృదయగుహాంతర్నివాసియై ప్రకాశించెడి పరమాత్మ దివ్యకాంతిపుంజ దర్శనానంద పారవశ్యమహాస్థితి నొంది తరించుటకై కృషియొనర్చుటయే గీతలోగల గీతలలోని సారాంశము.

కర్మయోగము-భక్తియోగము--జ్ఞానయోగము, ఈ మూడే గీతలో ప్రధానమై రాణించుచున్నవి. కర్మయోగచక్రపరిభ్రమణమునందే మానవుడు తప్పటడుగు వేయుచున్నాడు. భక్తునివలే వేషధారణమొనర్చి జ్ఞానివలె సంభాషించి ధనాశకు లొంగి కామినీశక్తికి కృంగి లోకాపకారకర్మపరాయణుడై కర్మభ్రష్టుడై కడకు కర్మానుభవగతమైన కన్నీటితో స్నానమొనర్చి దిక్కులేని దీనుడై కాలునికఠోరపాశ బాధనమునకు గుఱియై నోటమాటలుడిగి చేష్టలులేక నేరుగా నరకమున కేగుచున్నాడు.

లోకమున సహజముగ కన్నీటితో కృంగి కృశించెడి నరుని 'నాయనా! నీ బాధయేమి?' యని ప్రశ్నించ 'ఇది నాగీత నొసటి వ్రాత' యని చెప్పినరీతిగా ప్రతి మనుజుని నొసట నలువ మూడుగీతలు వ్రాయునని మన తాతయ్యలు వాకొనుచుందురు. ఈ మూడింటితో లోకము ముడిపడి యున్నది. సృష్టి స్థితిలయములు, బ్రహ్మ విష్ణు

మహేశ్వరులు, భార్య బిడ్డలు, ధనము, సత్వ రజో తమోగుణములు, నలుపు, ఎరుపు, తెలుపు-కర్మ భక్తి జ్ఞానము, జీవుడు దేవుడు మాయ మొదలైన పదత్రయముతో లోకమునిండి చున్నది. ఆనలువ వ్రాయు గీతలు మూడు. 'ఓరీజీవా! ప్రకృతిని నమ్మకు! పరమాత్మని భజించి తరించుము.'—ఈ వాక్యత్రయమునందు గీతాసారము లేదా? ఉన్నది. నరుని సర్వానర్థములకు మూలము ప్రకృతిపై గలవ్యామోహమే! నరుని సర్వార్థసాధనము పరమాత్మని భజించుటయే! పరమాత్మయెట్టివాడు? ఈ మాంసపుముద్ద నాడించెడివాడే. ఆడించెడి నరహరి తోలుతిత్తిలో యున్నంతవఱకు కవిత్వములు, కావ్యగానములు,గీతాపారాయణములు. వాడువేఱైననాడు వీడులేడు. వాడే వీడా? లేక వీడే వాడా? వాడు వీడను వారిద్దరా? లేక యొక్కడా? ఈ రహస్యము తెలిసి నరుడు చరించిననాడు తప్పక తరించగలడు. విశ్వమయుడైన విశ్వేశ్వరుని తెలియుట సామాన్యముగాదు.

ఈ విశ్వమునంతటిని సృష్టించి పోషించి లయమునొందించుశక్తి యేదైయున్నదో యద్దానినే దేవుడని లోకము పలుకుచున్నది. ఈ విశ్వము ఆద్యంతరహితమైయున్నది. ఇందలి పదార్థము నిరంతరము చలించుచున్నది. వీనికొక స్థిరత్వములేదు. అనంతాకాశమున అసంఖ్యాకములైన నక్షత్రములుగలవు; వీనియందలి కొన్ని నక్షత్రములు నిదానముగా నశించుచున్నవి. మఱికొన్ని క్రొత్తగా జనించి వృద్ధినొందుచున్నవి. మనకు కాంతినిచ్చెడి సూర్యమండలము వీనియందొకటి. కోట్లకొలది సంవత్సరములక్రితము ఒకానొక యదృష్టకారణవిశేషముచే సూర్యమండలము నుండి కొన్ని ముక్కలు విరిగిపడినవి. ఇవియే గ్రహములు. ఇవి సూర్యాకర్షణకు గుఱియై సూర్యునిచుట్టు ఇప్పటికిని తిరుగుచునేయున్నవి. ఇట్టి గ్రహములయందు మనము నివసించుచున్నట్టి భూమియు ఒకటి. ఇది మొట్టమొదట మిక్కిలివేడియైన అనిలరూపమునందుండి, యెన్నియో సంవత్సరములకు చల్లారుచు గట్టిపడగా దానిపై

సీరు నిలచెను. కోట్లాది సంవత్సరములు గతించగా దానియందు జీవ రాసులు జనించినవి. ఆ ప్రాణులయందు పృష్ఠజ్వాలగలిగిన ప్రాణులు ఇతర ప్రాణులకంటె యభివృద్ధినొందినవి, వానివలన కొంత ప్రాణి సమూహముదయించినది. ఈ శాఖయందును వానర స్వరూపమైన శ్రేష్టమైన యొకానొకజాతికి చెందినవాడే ఈ మానవుడు. ఈ ఖగోళ భూగోళ సంబంధమైన సృష్టివైచిత్ర్యమును విన్నతఱి నెట్టివారికైన నాశ్చర్యము కలుగును. అఖండమైన ఆకాశమందలి నక్షత్రములసంఖ్య ఊహాతీతము. వానిచుట్టు పరిభ్రమించు సౌరవ్యూహము లెన్నిగలవో ఎవ్వరికిని తెలియదు. సౌరవ్యూహమున జేరియున్న గ్రహమండ లాంతర్గతమైన ఈ భూమిని, సమస్తవిశ్వముతో బోల్చినచో త్రసరేణువునకంటే చిన్నదియేనగును. ఇట్టిభూమిపై నొకమూల నిన్న మొన్న నేపుట్టి కన్నుదెరచిన మానవుని ఏ సూక్ష్మకణమునకు పోల్చవలెనో తెలియదు.

ఇట్టి మానవుడాదికాలము నుండి భిన్నములైన మతములతో వివిధములైన కర్మోపాసనలతో కృషి యొనర్చి యొనర్చి చివరకు నెవరి మార్గము వారిదను సామెతగా విడిపోయిరి.

వేదకాలమునందు యజ్ఞయాగాదులందు జరిపే జంతుబలులను బౌద్ధమతము ఖండించినది. దేవుడనెడివ్యక్తి ప్రత్యేకముగాలేడు సర్వ నామరూపాత్మకమైన జగత్తే దేవుని స్వరూపము. ఏ ప్రాణి కపకారము చేయక తనతోడి సంఘమును ప్రేమించి ద్వేషరోషాది గుణములను వీడి సత్కర్మలొనర్చుటే సమాజశ్రేయస్సని శ్రీ గౌతమ బుద్ధుడు ప్రబోధ మొనర్చి ప్రచార మొనర్చిరి.

కొంతకాలము గడువగా శ్రీ ఆచార్య శంకరులవతరణమొంది, బౌద్ధమతము నాస్తికత్వమును బోధించుచున్నదనిఖండించి, సర్వమును భాసింపచేయునది యద్వైతశక్తి యొక్కటియేనని బహుముఖ ప్రజ్ఞా ధురీణులై ప్రతివాద పండితభయంకరులై యాసేతుహిమాచలపర్యంతము

పాదయాత్రలొనర్చి ప్రచారములు చేసి సంఘమునందు గొప్ప పరిణామ మును కల్పించి కాలగర్భమున విలీనమైరి.

ఇట్టి ఘనులెందరో మన భారతావనియందవతరణమొంది వారి వారి మనోప్రవృత్తుల కనుగుణములైన కర్మలను విధించి వానికొక మతమని నామధారణ మొనర్చి మతాధిపతులై మానవుల మతులను మార్చి గతులను సంస్కరణమొనరించుచువచ్చిరి. మతముల సదాశ యములన్నింటి ధ్యేయమొక్కటియేనని తెలిసిన పెద్దలలో సైతము కట్టుబొట్టు జుట్టులలో కలియకలేక పెద్దగందరగోళమొనర్చుచు సత్య దూరులై స్వామికరుణకపాత్రులగుచున్నారు.

దేశకాల పాత్రలకనుగుణముగా ధర్మము మారుచుండునని పెద్దలు పలుకుచుందురు. చలికాలమునందు దుప్పటియవసరము. వేసవి కాలమునందు కౌపీనమవసరము. వర్షాకాలమునందు ఛత్రమవసరమగు రీతిగా గతకాలమునందు శ్రీ శంకర రామానుజ మధ్వాచార్యులు అద్వైతమని విశిష్టాద్వైతమని ద్వైతమని నామములేర్పరచి నరుల మతులనుమార్చి, ధర్మకర్మాచరణశీలురై భువిచరించుటకై తగిన ధర్మోపదేశ గ్రంథరాజములనుసృష్టించి సమాజమునకందించి వారెల్లరు భువివీడి దివికేగిరి.

కాలగమనమునందు వివిధములైన ప్రకృతిస్థితులననుసరించి పెద్దలు ప్రవచించిన ధర్మాదేశగీర్వాణ భాషాసమన్వితములైన శాస్త్ర ములను నరులు దర్శించి వానియథార్థ రూపములను గుర్తించెడి భాషా రహస్యజ్ఞానములేక 'ఓహో ? శాస్త్రములు రచనలుచేసిన పెద్దలకు సైతము మనవలె రోషాలు ద్వేషాలుగలవని' భావించుచు కాలకర్మ గతుల రహస్యములను తెలియక ధర్మశాస్త్రములయెడ మహర్షులు ప్రవచించిన సద్బోధలయెడ విశ్వాసములను గోల్పోయి మతమునుండి విడిపోయి వేఱొకమతము నాశ్రయించి తబ్బిబ్బుచెందుచున్నారు.

నరులు మతములుమార్చినంతమాత్రమున శాంతినిపొందజాలరు. మతమేదైనను నరుని ప్రవర్తన ధర్మబద్ధమైశాస్త్రవిహితమై సంఘాప కారములేనిదై వెలుగొందిననాడు వారున్నమతమును వీడెడియవసరము లేదు. సంతతిలేనివారు కొందఱు మతములనుమార్చి మంత్రములను మార్చి క్రొత్తదేవుళ్ళ నారాధించుచుందురు ఇది చాలవెఱ్ఱి. మత మేదైనను నరులొనర్చిన కర్మఫలముల ననుభవించకతప్పదు. మత ప్రవక్తలునైతము యోర్పుతో కష్టములననుభవించుచు సామాన్యుల వలె చింతించక భగవానుని చింతించి లోకాదర్శమైన జీవితములను గడపిరి.

సమస్త ప్రపంచము కర్మమొనర్చుచునే యున్నది. నాసికద్వార ములనుండి వాయువువచ్చి పోవుచున్నంతకాలము ప్రతిప్రాణి తనబుద్ధి కనుగుణముగు కర్మల సాగించుచునే యుండును.

భక్తిజ్ఞానములను సాధించిన నరునకు వైరాగ్యమలవడును భక్తి జ్ఞానములను వీడినరునికెన్ని శతాబ్దములకైన వైరాగ్యము కలుగదు. వైరాగ్యముగల వ్యక్తి, సంసారము నందు సంభవించెడి కష్టనష్టము లకు చింతించక దీని స్వరూపమే యిదని తెలిసి కర్మబంధాలలో చిక్కక లోకాతీతుడై ప్రశాంతమతితో పరమాత్మని ధ్యానించుచు భక్తమూర్తుల జీవితకథలను పారాయణ మొనర్చుచు మితాహారియై మితభాషియై మౌనవ్రతధారణములు సల్పుచు తనకుతానై తత్త్వాన్వేషణతో మెలగుచుండును.

‘నేను–నాది’ యనునవి మానసిక పాశములు. ఒక్కొక్కనికి స్నానముచేసి భగవత్ప్రార్థన చేయుటకుతీరికలేదు.ఎప్పుడు సంసారతాప త్రయమే చాలదనెడు చింతయే. సంవత్సరమున కొక్క సంతానమును పొందుతూ వారి బాగోగులకే తన శక్తినంతయు వినియోగమొనర్చు చున్నాడు. గొప్పవాడై సంతతి కెంతో యర్థసంపత్తిని సమకూర్చ వలెనని నరుడు తన జీవితమును చింతలకు గురిచేయుచున్నాడు. దీని

కంతటికి కారణమెవ్వరు? తన కర్మకు తనమనస్సే సర్వాధికారి. నరుడు దరిలేని కోర్కెలతో తీరుకలేని కర్మలను సృష్టించుకొని ధనాశా దాహముతో రాత్రింబవళ్ళు చరించుటయే కార్యకారణ సంబంధమై కన్పించుచున్నది.

'ఊషరక్షేత్రమునందు నాటిన విత్తనములు మొలకెత్తని రీతి' లోకమున పాపముగల నరుల మస్తకములందు సత్సంకల్పములుద్భవ మొందుటకవకాశములేదు. స్వార్థప్రయోజనములకై నరుడర్థములేని పరుష వాక్యములతో కన్నతల్లిదండ్రులను సైతము కాలదన్ని వారికి ప్రాణాపాయమును చేకూర్చుచున్నాడు. "శుద్ధమైన దర్పణమునకు మసిక్రమ్మినచో బింబము ప్రతిబింబించనిరీతి" నరుడెంత వివేకధనుడైనను పదిమందికి నీతు చెప్పనేర్చిన మేధావియైనను మితిలేని కోపావేశమునకు బానిసయైనచో చేయరాని ఘోరకృత్యముల నొనర్చి దురంతమైన దుఃఖముల పాలౌను.

భగవానుడెక్కడో యాకాశమున గలడు, నరులు చేయు లంచగొండితనము యసత్య వ్యాపార వ్యవసాయాది కర్మలన్నింటిని సాక్షిగానుండి చూడగలడా! ఆయనకు మాత్రమాకలిదప్పికలు లేవా? యని విశ్వసించెడి నరుల వైఖరి మిక్కిలి యవివేకము.

ప్రతి నరుని హృదయకోశమున గుప్తముగా నెవ్వరికి తెలియబడనిరీతిగా చిత్రస్వరూపుడై సాక్షియై కర్మఫలప్రదాతయై కర్మానుగుణముగా మనస్సులను త్రిప్పి సంచారము చేయించెడి నేతయై వెలుగొందుచుండును.

నరులు లోకమునందొనర్చెడి సుకృత దుష్కృతకర్మములకు కారణము వారిలో జీర్ణించిన సుసంస్కార కుసంస్కారముల ప్రభావమే నని తెలియవలెను. 'లేత వెదురుకర్రలను నరులు క్రిందికివొంచి రకరకములైన పల్లకీలకు నుపయోగించురీతి' మనస్సు వక్రమార్గ సంచార

కంతటికి కారణమెవ్వరు? తన కర్మకు తనమనస్సే సర్వాధికారి. నరుడు దరిలేని కోర్కెలతో తీరుకలేని కర్మలను సృష్టించుకొని ధనాశా దాహముతో రాత్రింబవళ్ళు చరించుటయే కార్యకారణ సంబంధమై కన్పించుచున్నది.

'ఊషరక్షేత్రమునందు నాటిన విత్తనములు మొలకెత్తని రీతి' లోకమున పాపముగల నరుల మస్తకములందు సత్సంకల్పములుద్భవ మొందుటకవకాశములేదు. స్వార్థప్రయోజనములకై నరుడర్థములేని పరుష వాక్యములతో కన్నతల్లిదండ్రులను సైతము కాలదన్ని వారికి ప్రాణాపాయమును చేకూర్చుచున్నాడు. "శుద్ధమైన దర్పణమునకు మసిక్రమ్మినచో బింబము ప్రతిబింబించనిరీతి" నరుడెంత వివేక ధనుడైనను పదిమందికి నీతు చెప్పనేర్చిన మేధావియైనను మితిలేని కోపావేశమునకు బానిసయైనచో చేయరాని ఘోరకృత్యముల నొనర్చి దురంతమైన దుఃఖముల పాలౌను.

భగవానుడెక్కడో యాకాశమున గలడు, నరులు చేయు లంచగొండితనము యసత్య వ్యాపార వ్యవసాయాది కర్మలన్నింటిని సాక్షిగానుండి చూడగలడా! ఆయనకు మాత్రమాకలిదప్పికలు లేవా? యని విశ్వసించెడి నరుల వైఖరి మిక్కిలి యవివేకము.

ప్రతి నరుని హృదయకోశమున గుప్తముగా నెవ్వరికి తెలియ బడనిరీతిగా చిత్రస్వరూపుడై సాక్షియై కర్మఫలప్రదాతయై కర్మాను గుణముగా మనస్సులను త్రిప్పి సంచారము చేయించెడి నేతయై వెలుగొందుచుండును.

నరులు లోకమునందొనర్చెడి సుకృత దుష్కృతకర్మములకు కారణము వారిలో జీర్ణించిన సుసంస్కార కుసంస్కారముల ప్రభావమే నని తెలియవలెను. 'లేత వెదురుకర్రలను నరులు క్రిందికివొంచి రకరకము లైన పల్లకీలకు నుపయోగించురీతి' మనస్సు వక్రమార్గ సంచార

ధర్మవిరుద్ధములైన కార్యక్రమము లొనర్చును. అట్టి మనోవృత్తిని సద్బుద్ధిబలముతో నిరోధించి నరుడు దివ్యజీవిత గమనమును సాగించవలెను. సమస్త వేదశాస్త్రేతిహాసముల ముఖ్యతాత్పర్యము పరకాంతా ధనములపై విరక్తి పరాత్పరునిపై భక్తికలిగి చరించుటయే. ఆ వినిర్మలభక్తియే కాలక్రమమున నరునకు విజ్ఞానమును సర్వసంసార బంధవిముక్తికల్గించి ముక్తిని చేకూర్చగలదు.

భగవద్గుణవిభవమును భక్తుడలవరచుకున్ననాడే భక్తుని రక్షణ భారము భగవానుడు భరించి తరింపజేయును. లేనిచో భగవానుని కృప యసత్యవాది రక్షణకై ప్రసారముకాదు. నేటికాలమునందేమి చిత్రమో ? విద్వత్ప్రవచనములు వేదాంత ప్రవచనములను మండలము లాదిగా మహావేదికలపై ప్రభోధములుచేసి వేలాది రూపాయలను భక్తులద్వారాపొంది భవనములతో వెలుగొందుచు ప్రశాంతాశ్రమము లని, ఋషిజీవితములని ప్రజలలోపలుకుబడి సంపాదించిన మహానుభావు లైన పెద్దలనే కాంచనపిశాచి వేధించి వేటాడుచున్నది. మంచిమాటల మహిమతో వందలాది రచనలను భక్తవిరాళములతో ముద్రణ చేయించి సముపార్జించిన పెద్దలు ముముక్షువు లెవరైనవచ్చి 'స్వామిజీ! శక్తిలేనివాడను చిన్నపాత్తమొక్కటి ప్రసాదించుడని ప్రార్థించినతఱి, ఆ స్వామివారు "నాయనా ! లోకోపకారణార్థము సద్వినియోగ మొనర్చిన భక్త మూర్తుల విరాళములతో ముద్రణ చేయించిన పాత్తములు కావలసినచో తీసికొనుడు. పాత్తములపైననే వెల యున్న దని" ప్రశాంతముగా యుక్తి శక్తితో పలుకుచుందురు. 'దయ్యమితరుల సొమ్ము గ్రహించునేగాని తా నితరుల కొసంగని' రీతిగా పెద్దలలో కొందరెన్ని వేదాంత ప్రవచనము లొనర్చినను గంభీరములైన గ్రంథములు రచన లొనర్చినను జ్యోతిశ్శాస్త్ర రహస్యము లెఱంగినను వారార్జించిన ధనమునకధికారు లెవ్వరు లేకుండినను వారు ధనాశను వీడి త్యాగ జీవనులై మెలగుటలేదు. సంసార శ్రమలతో గాసినొందెడి సామాన్య

నైన ముముక్షువుల యందే త్యాగముతో కూడిన నిజమైన భక్తి భావా ద్యక్త కర్మములు కన్పట్టుచున్నవి. నరుడెంత మేధాశక్తి సంపన్నుడైనను, వాక్చాతుర్య ప్రభావముతో సంఘమును వశమొనర్చుకొని లక్షలార్జించి రమణీయ సుందర ప్రాకార గోపురాది నిర్మాణము లెన్ని యొనర్చినను నాతని హృదయము నందు నిజమైన త్యాగము కరుణా భూతదయ సత్యవాక్యాచరణము లోపించిననాడు గారడి వేదాంతముతో లోకమును కొల్లగొట్టినాడనెడి వదంతికి గురియై నిజభక్త రక్షణా కర్తయైన నృహరి కరుణకుపాత్రుడగును.

నరులలో జీర్ణించిన పాపభావ సముదాయమును సత్యశక్తి ప్రభావముతో స్వాహాచేసి పావనమూర్తులుగా పరిణామ మొందించెడి వ్యక్తియే, స్వామి. లేనిచో "స్వామి కాదురా! పాములా! వీడని" లోకపు జనుల తెగడ్తలకు గురియగు చున్నాడు. లోకనిందకు గురియైన వ్యక్తి యెంతటి గొప్పవాడైనను ప్రయోజనము లేదు. ఆతని బోధల వలన తాత్కాలికానందము కల్గునేగాని సమాజమునందు సత్పరిణామము కలుగజాలదు.

ఈలోకమున మంచివారికి విజయము చెడ్డవారికపజయము చేకూర గలదు. ఐనను మంచివారికి కన్నీరు చెడ్డవారికి పన్నీరు లభించు దృశ్యముల నెన్నింటినో లోకమున గాంచుచున్నాము. దీనికొక కారణమున్నదని మున్ముందెవమత ప్రవక్తలాదేశించిరి. ప్రారబ్ధ కర్మఫలములు బాహ్యా దృష్టికి గోచరములుగావు. దుష్కర్మలఫలము సత్కర్మలఫలము వరుస క్రమముగా నరుని కనుభవములై సుఖదుఃఖములను కల్గించుచున్నవని తెలిసి.

మంచి చెడ్డల వ్యత్యాసమేమి? దైవమును దైవాదేశా పరమైన నీతులను మాతాపితాచార్యాది పెద్దలాదేశములను జీవిత విధులందు నిర్వహించెడివారిని మంచివారని, దైవమును దైవాదేశములను మాతా పితాచార్యాది పెద్దల మహోపదేశములను నిరసించి స్వార్థపరత్వ

ముతో పాపభీతిలేని కరడుకట్టిన హృదయముతో సంఘ వ్యతిరేకము లైన కర్మల నొనర్చు వారిని చెడ్డవారని బుధులు శాసించిరి. మంచి వారిని దేవుడెల్లవేళలా కాపాడుచుండును. చెడ్డవారిని కర్మాధి దేవత యైన కాలమృత్యువు సదా హింసలకు గురిచేయుచున్నది.

భక్తిలేని, భగవంతుని శక్తి తెలియని, నరుడు నిద్రలేచినది మొదలు శయనించునంతవరకు ప్రపంచ వ్యామోహముతో యన్యా యార్జనకుపాల్పడి పందిమందికిమిన్నయై తిరుగవలెననెడి యాకాంక్షతో పదిమంది చేయగల కర్మల తానొక్కడే చేయుట కుద్యుక్తుడై శక్తి జాలక యాశాదాహము ధనకాంక్షాతపనతీరక కానిపనులొనర్చి కడకిడుమలపాలై కన్నీరు కార్చుచుండును.

'దురాశదుఃఖముచేటు' యనెడి సామెతగా దురాశాచక్ర పరిభ్రమణ మొందెడు నరుడన్నపానీయములు త్యజించి యహరహము ధనార్జనకే పెనగులాడుచున్నాడు. తెలివితక్కువ వలన నరున కశాంతియా ? కాదు. తెలివితక్కువ వానికి శ్రమతక్కువ ప్రశాంతి ప్రమోదము. తెలివి ఎక్కువై దురాశకు గురియైన మనుజునకే యశాంతి యాందోళనలు చేకూరి సరియైనవేళకన్నపానీయములుతీసి కొనుటకు సమయము చాలక సతికోరినప్పుడు సంతోష సంభాషణము లొనర్చుటకు వసతిలేక సతమతమై సంతాపముతో నిల్లువీడి తిరుగాడ సాగును.

నరులు వా రొనర్చిన పుణ్యకర్మ ఫలానుభవ పరమగు సౌఖ్యముతో తృప్తినొందిననాడు ప్రశాంతి ప్రమోదములను పొందు చుందురు. తృప్తిలేక తమ శరీరారోగ్య సౌఖ్యములను విడనాడి దైవ మొసంగినది చాలదనెడు వ్యసనముతో ధనార్జనకుపక్రమించిన నరుల కశాంతి యావేదనలు గలుగుచున్నవి. ఒకొక్క వ్యక్తి బహు గ్రంథములలోని శ్లోకార్థములను కంఠస్థ మొనర్చి యొద్దకువచ్చిన

నరులకు ప్రబోధముచేయుచునే వృద్ధుడై జవసత్త్వ దూరుడై పరుల యాధారముతో పైకి లేచెడి దుర్భర దురవస్థలపాలై ధనాశతో తపించుచు చివరకు తానార్జించినధనమును పరులపాలొనర్చి తానొక్కడే లోకమును వీడుచున్నాడు.

మహనీయులైన శ్రీ రమణ మహర్షి, శ్రీ అరవిందఘోష్, శ్రీ రామకృష్ణ పరమహంస లాదిగాగల వారెందరో కర్మయోగమును గురించి చర్చించి యందుగల సత్యాంశములు లోకమున కందించి మహోపకార మొనర్చిరి. ప్రతి మత ప్రవక్త 'భగవంతుడే సత్యము అతడు సత్స్వరూపుడు' యని శాసించిరి. శ్రీ మహాత్మాగాంధీగారు ఇంకొక అడుగు ముందుకువేసి 'భగవంతుడే సత్యమనుటకంటె సత్యమే భగవంతుడనుట' సమంజసమన్నాడు. సత్య ధర్మములు పోనాడిన మానవుడెంత మేధావియైన పలుకుబడి గలిగి లక్షలార్జించినను మాయా గరతమున బడుట తప్పదని భగవంతుడట్టివానిని రక్షించడని శ్రీ మహాత్మాగాంధీగారి మహత్తర మహనీయ మధురసూక్తి. ప్రతి ధర్మవాక్యమును మున్ముందుగా వారాచరణమునందుంచి దాని మహత్తర ఫలమును పొందిన యనంతరము సమాజమునకు ప్రబోధ మొనర్చెడి కర్మయోగియైన కారణముచే లోకమంతా ఉత్తర దేశమునందవతరణ మొందిన వైశ్య వంశోద్ధారకుని 'మహాత్మాగాంధీ' యని జేజేలుచెప్పిరి.

నోటితో చెప్పెడి ధర్మసూక్తిని వ్యక్తి ప్రకృతిశకి వ్యతిరేకించెదురైనను లెక్కచేయక తన జీవితాచరణము నందుంచిననాడు లోకమంతయు వానిని మహాత్ముడని వాకొనును. నోటాడిన నీతు లాచరణము నందుంచని నరుని లోకమంతయు దురాత్ముడని దూషించును.

ప్రతి గ్రామమున నరులు వారికుటుంబ నిర్వాహణపు ఖర్చులకై పెట్టుబడి దాతల యొద్దకుచేరి వినయముతో బాబూ ! శుభకార్యము

తలపెట్టితిని పదివందలప్పు కావలెనని యర్థించి వారి ధనము గ్రహించి పత్రము వ్రాయుట 'నీకు అడిగినప్పుడే యివ్వగలవాడను యిది నా సమ్మతితో వ్రాసియిచ్చిన ప్రాంశిరినోటు' యని వ్రాసి జోహారులతో వెళ్ళిపోవును. రోజులు గడచిన తదుపరి ధనమొసంగిన పెట్టుబడిదారు బాకీ యివ్వవలసిన వానింటికెళ్ళి గౌరవముగా 'బాబూ! కుమార్తె వివాహము నిర్ణయమైనది. వారము రోజులలో లగ్నమున్నది. ధన మవసరము' ని యర్థించగా ఋణమున్న నరుడు నిరసన దృష్టితో పప్పు బియ్యాలకే లేక తికమకతోయున్నాను నీ బాకీలేదని మొంతో భేషజముగా సంభాషించును. పెట్టుబడిదారి 'నాయనా! అసలు బాకీ లేదన్నావు దానికైన వడ్డీమైన యివ్వండి కొన్ని ఖర్చులకు నుపయోగించుకొనెదనని దీనముగా ప్రార్థించ, ఋణమున్న నరుడు పెదవి విరచి కోపముతో 'మర్యాదగ వెళ్ళుట మంచిద'ని విరసముగా సంభాషణ మొనర్చినంత, పెట్టుబడిదారు మౌనముతో 'ఇచ్చినవాడు ఈగ,పుచ్చుకున్నవాడు పులి' యనెడు సామెత స్వానుభవము నొందితిని. వడ్డీ కాసపడి దుష్టనరులకుఋణమిచ్చిన ప్రతిఫలమింతేనని లోలోన వగచుచు మఱొక పెట్టుబడిదారు యొద్దకుజని ప్రార్థనలుచేసి ఋణమర్థించ సాగును. ధనాశ నరులను దానవులుగ మార్చివేయుచున్నది. కన్న కుమార్తెను తనకుగల ధనమును నరుడు తనకు మించినవారి కొసంగిన నాడు కన్నీరుదప్ప పన్నీరు లభించదు. ఇందుమూలముగ పెద్దలు, 'తెలిసి వియ్యమొనర్చుట మంచిది. వియ్యమొనర్చి తెలిసిననాడు కయ్యము ప్రాప్తించు' నని వాకొనిరి. పాత బంధువర్గమును వీడి నరులు దురాశలకులోనై క్రొత్తవారి వంశప్రతిష్ఠలు గుణగణ మర్యాద గౌరవ సంపత్తిని గుర్తించి కథనమును జూచి వియ్యములొనర్చి కడకు కయ్యములపాలై కన్నీరు గార్చుచున్నారు.

సంఘమునందు దురాశ, దోపిడివిధానము, కరడుగట్టిన స్వార్థము దేవుడు లేడు ధనమే ముఖ్యమనెడు దుష్టపశుప్రవృత్తి దినదినాభివృద్ధి నొందుచున్నది. మత ధర్మములను సంఘము విస్మరించి మేకవన్నె పులిమై విజృంభించుచున్నది.

మతములన్నియు ఏదోయొక యున్నతోన్నతమైన సర్వాత్మశక్తి శిఖరమొక్కటున్నది.ఆ ది వ్యకాంతిపుంజప్రభావిరాజితమైన పరమాత్మ శిఖరమును చేరుటకనేక మార్గములున్నవని వేనోళ్ళ వెలుగెత్తి చాటుచున్నవి. వేదోపనిషద్గీతాది గ్రంథములన్నియు, సాధక జనుల కేరూపములో భగవానుని యుపాసించుటమిష్టమో యా రూపము నారాధించువచ్చునని ప్రబోధము చేయుచున్నవి.

ఆధ్యాత్మిక తత్త్వచింతనతో ముముక్షువు క్రమపద్ధతితో సద్గురు స్వాములాజ్ఞానుసారముగ పై మెట్టునకుపోయినకొలది వివిధమతసిద్ధాంతములలోని తరతమ భేదములన్నియు సమసి పారమార్థిక సత్యస్వరూప మొక్కటియేననెడి స్థితితో ప్రశాంతితో నలరారుచుండును. బ్రహ్మము విష్ణువు, ఈశ్వరుడు మూడునామములు విచారణమొనర్చి సత్యమరసినచో నొక్కటియే. బ్రహ్మమన సత్యపదార్థము బ్రహ్మముగాని దేదియు లేదని తాత్పర్యము. విష్ణువన సకలోషధులకు నిలయమైన భూదేవికే పతియని సర్వవ్యాపకుడు సమస్తమునకాధారుడని భావము. ఈశ్వరుడన సర్వభూతములందుండి కదలించెడివాడు శక్తికి పతియనిభావము. ఈ మూడింటిలోని భావమొక్కటియే. ఆదిశక్తి ప్రకృతికి ప్రాణమై సర్వదేహములందుండెడి గుండెగడియారముల నాడించుచు ద్వైతమద్వైతమైనప్పుడే ప్రణవము వినబడునవెడిరీతి గంటలను కొట్టుచు కాలనిర్ణయమును నరులకు తెలియచేయుచు కర్మలకు కారణమై యొప్పుచున్నది. సర్వజగత్తు సృష్టిస్థితిలయములతో నొప్పారుచున్నది. ఇదియే కర్మసిద్ధాంతము.

ఈ భౌతిక ప్రపంచపు ఛాయలు దాటిననాడే భక్తునకనిర్వచనీయము ననంతమునైన పరంజ్యోతి స్వరూపసాక్షాత్కార సిద్ధికవకాశము కలుగుచున్నది. ప్రతివ్యక్తి భగవంతుడు కాజాలడు. వ్యక్తి భక్తుడైననాడు భగవంతునిలో చేరగలడు. ప్రతివ్యక్తియు భక్తునిగా మారగలడా ? మారుట సామాన్యముకాదు. దుష్టశక్తులు బాహ్యజగత్తులోగాక మానవునిలో మకాముచేయుచున్నవి. మానవుని మస్తకములో గూడుకట్టుకొని తిష్టవేసి మనస్సునకగోచరముగా పరిటీలు కొట్టుచున్నవి. మనుజుని మస్తకమునకు, నాభికమలమునందుద్భవమొందిన సంకల్పసముదాయము నేరుగా ప్రయాణముచేసి మజిలీయొనర్చి కర్మలరూపములో లోకమునకు వ్యక్తముకాబడుచున్నవి.

దుష్టగుణముల శక్తినే క్రైస్తవమతమునందు 'సైతాన్' యని చెప్పిరి. దైవప్రార్థనలతో పాపకర్మలులేని పరిశుద్ధ జీవనముతో నరుడు సైతాన్ శక్తిని నిగ్రహించి జయించినాడు. దీనినిబట్టి మానవుడు తన విధికి తానే కర్తయని తేలుచున్నది. కామక్రోధలోభమోహమద మాత్సర్యగుణములే నరుని పాపకర్మల కుద్యమింపజేసి పాపిగామార్చి పలుబాధలకు గురిచేయుచున్నదని హైందవమతము ప్రబోధము చేసినది. ప్రతి మతోద్దేశముల సారాంశము హైందవమతములో నంతర్లీనమగుచున్నది. ఈ హైందవమత సౌధమునకు పునాదియైన యనాదియైన వేదవిజ్ఞానము గంభీరసాగరమువలె ప్రకాశించుచున్నది.

ఆర్థికవసతులు లేవనెడు యశాంతితో చరించెడి మానవులున్న మతములను త్యజించి క్రొత్తమతములలో చేరినను సుఖజీవనమొనర్పజాలరు. మతములు మార్చినను వేషభాషలను మార్చినను మందబుద్ధులైన నరులకు ముక్తి లభించదు పరలోకసుఖము చేకూరదు. మతులను నరుడు దైవప్రార్థనాది సత్కర్మల బలముతో మార్చి భగవత్కర్మ మొనర్చిననాడే ముక్తి లంభించగలదు.

అశాంతి, దుఃఖము, నాందోళన, యసంతృప్తి, బాధలతో నుండెడి నరుని దుస్థితిని, చేతినిండా ధనము, పొట్టనిండుగతిండి, వంటి నిండబట్ట, గృహావసతి సౌకర్యములు లేవనెడి చింతను మతము లెన్నటికిని తీర్చజాలవు. మతములు దేవునిలోచేరుటకు తగిన మార్గము లను బోధించును. ప్రపంచమునగల మతములన్నింటిలో సుఖదుఃఖాలను పొందెడి నరులు కోకొల్లలుగా కన్పట్టుచున్నారు.

ఈ మతములో సుఖములేదు, సరియగు నాదాయములేదు వారి మతమైన క్రైస్తవమతమునందు చేరిన హాయిగా బ్రతుకగలము సాంఘిక సదుపాయములన్నియు సమకూర్చుకొనుటకవకాశముగలదు. అమెరికాదేశము నుండి కోట్లాది ధనము ఇండియాదేశమునకు రవాణా చేయుచున్నారు. మతములో చేరిన వారెట్టివారైనను గొప్ప గొప్ప కోట్లు, బూట్లు ఉచితముగ నొసంగుచుంటిరనెడు వాంఛలతో యజ్ఞాను లైన నరులు సత్యదూరులై మతములను నామములను మార్చుకొను టెంతటి దుర్గతియో ! పాతయముడు, క్రొత్తయముడని సినిమాలలో చూచినరీతిగా పాతదేవుని వదలి క్రొత్తదేవుని పట్టుకొనుట విజ్ఞులైన వారికెంతో వినోదమును చేకూర్చుచున్నది. మతముయొక్క మానవుని యొక్క పూర్ణస్వరూప స్వభావములను తెలిసికొనగోరు పెద్దలు ఈ గ్రంథరచయిత గారిచే రచనచేయబడి ముద్రణై ప్రచారముకాబడి గ్రంథము "సద్గురు శ్రీ యోగానందబోధామృతము" లో గల తృతీయ వ్యాసము "మతము=మానవుడు" యనుదానిని ప్రశాంత మతితో పఠించిన, భక్తసోదరులకు సత్యమవగతమై నిత్యానందమును పొందెదరు.

మతములు మార్చుకొనిన నరులు సుఖజీవన విలాసులై వెలుగొందెడవకాశము గలదనుమాట వాస్తవము గానేరదు. మతములనుసృష్టించి సమాజమునకు ప్రబోధములొనర్చిన మతప్రవక్తలే వారివారి జీవిత విధులందు పలురకములైన కష్టనష్టములను పొంది తుదిదశవరకు వోర్పుతో దేవుని ప్రార్థించిరి.

రోగికే వైద్యుడైన తియ్యనిమందు లొసంగడు. మానవు డేమతమునందు చేరినను సత్యధర్మ న్యాయాది గుణములనే ప్రబోధము చేయును. చేదుమందు తినుట కెంత బాధ రోగి పొందినను తనకు గల రోగము నశించి సంపూర్ణారోగ్యవంతుడగును. ఇదేరీతిగా మతమనెడు మందును మానవుడు సేవించుట కారంభించిననాడు మతధర్మములైన నీతి నిజాయతీధర్మము సత్యము, న్యాయము, సర్వభూతదయ, ప్రార్థన ధ్యానము, భజనపారాయణము లనెడు పథ్యమును పాటించవలెను. పథ్యమును పాటించక మందు సేవించినను వ్యాధికుదరదు. మతధర్మము లను పాటించక మతరూప ప్రార్థనలొనర్చినను దేవునిదయగలుగదు.

హిందూమతమునకు వృద్ధత్వమువచ్చినది. దీనిలో సుఖములేదు. మనిషిమనిషికి తేడాలుకల్పించి రకరకాల కులాలను సృష్టించి సమాజ మును చీల్చి ముక్కలుగా విభజించి హెచ్చుతగ్గుల భేదాలను నిర్మించి వేదాలను సర్వజనులు పఠించరాదు. గర్భాలయములలోని కెవ్వరు రారాదనెడు నియమము లేర్పరచి మూఢవిశ్వాసములనే సమాజములో పెంపొందించినారని కొందఱు వాదించుచు తదితర మతములందు ప్రవేశించుచుండిరి.

"ఎంతమందిని మార్చినను స్త్రీ వంటచేయక,సంతతిని ప్రసవించెడి బాధనుభరించుట తప్ప" దనెడి సామెతగ మానవుడేమతమునందు చేరినను సమాజక్షేమంకరములైన ధర్మముల నిర్వర్తించవలసినదే. ఏ యే మతస్థు లా యా మతము లాదేశించిన ధర్మములను తప్పక భయభక్తి విశ్వాసములు గలిగి జీవితాచరణములందుంచిననాడు వివిధ మతస్థు లా దేవుని జేరి తరించెదరు. నామతము–నీమతము, నీదేవుడు–నాదేవుడు, నీకులము–నాకులము యనెడి ద్వేషరోషాలతో వాగ్వాద ములకు దిగి కాలమును దుర్వ్యయ మొనర్చెడి వారెల్లరు నరకమున కేగెదరని ప్రతిమతము ప్రబోధము చేసినది. ఇందెవ్వరికెట్టి సందేహము వలదు.

మానవుడేశక్తినుండి యావిర్భవించెనో తుదకా శక్తియందు చేరుటయే పునరావృత్తి రహితమైన పదవి. దేవుడనెడివ్యక్తి యొక్క చోటలేదు. సృష్టియంతయూ స్వయంశక్తి ద్వారా పరిణామరూపాంతరములతో భాసిల్లుచున్నదని భౌతికతత్త్వవేత్తలు వాదించుచునే యున్నారు. సర్వజ్ఞుడెవ్వరో సర్వులకు బోధపడుటలేదు. ఆదికాలము నుండి సృష్టినిర్మాణ సిద్ధాంతరహస్య పరిశోధకులొసంగిన వారి స్వానుభవ విషయములలోను భేదము కన్పట్టుచున్నది. దీనికికారణము విజ్ఞాన పరిశోధకులు వారివారి ప్రజ్ఞా విశేష కృషిఫలితముగా తెలిసికొనబడిన విషయములనే సంఘమునకు చాటుచుంటిరనెడి యథార్థము తెలియబడుచున్నది.

ఈ అనంతమైన విశ్వవిజ్ఞానమును నరుడు సంపూర్ణముగా తెలిసికొను శక్తివంతుడు కాలేదని గతదేశచరిత్రలలోని పాఠాంతరముల వలన మనకెల్లరకు తెలియబడుచున్నవి. 'సముద్రస్నానమునకు వెళ్ళిన మనుజునకు నీటి కొలతలతో యనవసరము' ని శ్రీరామకృష్ణపరమహంసల వారు బోధించినరీతిని విడనాడి, నరుడు తనకుగల నల్పజ్ఞానముతో సృష్టికి మూలపదార్థమేది ? పదార్థమెట్లుత్పత్తి కాబడినది ? ప్రకృతి, పరమాత్మల సంయోగమేరీతి జరిగినది ? పరమాత్మయనుదాని కసలు రూపముగలదా ? రూపములేనిదానికి ప్రాణముండునా ? ప్రాణశక్తిలేని పదార్థమువలన సృష్టినిర్మాణము కాగలదా? దేవుడనెడి పదమున కసలు నిర్వచనమేమి ? దేవుడనెడి వాడెప్పటివాడు ? ఆదికాలము నందే యే పదార్థములతో నరుని సృష్టి యొనర్చెను ? దేహములో ధ్వనించెడి శబ్దము దేహమునుండెచ్చటికేగుచున్నది ? దాని ప్రయాణ మెచ్చటికి ? దీనంతటిని సృష్టించినవాడు నరుడా ? నారాయణుడా ? శక్తియా ? దీని మూలరహస్యమేది ? యనెడి ప్రశ్నలతో నరుడు కోట్లాది సంవత్సరములనుండి కృషియొనర్చినను సమస్యకు తృప్తికరమైన సరియైన పరిష్కార మార్గము తెలియబడదు. తెలిసిన

వారెక్కడైన నొక్కరిద్దరుండినచో వారికి లోకముతో లోకవ్యవహారములతో పనియుండదు. "పిచ్చికుదిరినచో పెండ్లియగును-పెండ్లియైనచో పిచ్చికుదురును" ఈ సామెత నీగ్రంథకర్త తాతగారైన కోట రామయ్య శ్రేష్ఠిగారు నెందరికో చెప్పి సమాధాన మడిగెడివారు. ఆ పెద్దలెల్లరు మౌనముతో లోలోన నవ్వుకొనెడివారు. ఆ ప్రశ్న కేరీతి సమాదానము చెప్పి యొప్పించి మెప్పించుటకు వీలులేదో యదేరీతి సృష్టినిర్మాణమున కసలైన పునాది యేదో యా పునాది కనాదియగు మూలపదార్థ మేదో సర్వులకు వ్యాగ్రూపమున చెప్పి మెప్పించుటకు విజ్ఞులకు వీలుగానిదై యున్నది.

విశ్వమయుడు సర్వాధినేత శక్తిస్వరూపుడెవ్వడో యొక్కడుండి తీరవలసినదే. ఇది కాదనుట కెవ్వరి కధికారములేదు. వస్తువు నరుని కంటికి గోచరమగుచున్నది. వస్తునిర్మాణ మొనర్చినవ్యక్తి వస్తుసమీపమున కన్పించని కారణముతో వస్తునిర్మాణకర్తను లేడనుట భావ్యమా! నాస్తికుడెవడైన లేడని వాదించినచో లోకులు వానిని మతిపోయిన పిచ్చివాడని గేలిసేయుదురు. ఇదేరీతి దృశ్యమానమై కంటికిగోచరించెడి సర్వజగత్తును సృష్టించిన జగన్నాటక సూత్రధారి యుండితీరవలెను. ఈ పొత్తమునందుగల వివిధ కర్మసిద్ధాంత విశేషాంశములను పాఠకోత్తములుపఠించి యానందించెడి మధురమహాపర్వ శుభసమయములందు రచన మొనర్చిన వ్యక్తి కన్పించనంత మాత్రమున రచయిత లేడనుటెట్లు సమంజసము గాదో! అదేరీతి జగత్తు కంటికి గోచరించుచున్నది గాన జగత్తును సృష్టించిన దేవుడు యున్నాడని సర్వులు విధిగ విశ్వసించదగినదై యున్నది.

'వారమునకొక వైద్యుని మార్చి వైద్యుల సలహాలకు వ్యతిరిక్తముగా కర్మము లొనర్చిన రోగి కాలుచేతులు వాచి ప్రాణములను గోల్పోయినరీతి' సర్వాధారుడు ప్రకృతి శాసనకర్తయగు పరమాత్ముని

విశ్వసించ లేక దేనియందు నిశ్చితాభిప్రాయము లేక నరుడు శివుడని కొన్నాళ్ళు, కేశవుడని కొన్నాళ్ళు, శక్తియని కొన్నాళ్ళు చివరకు యెహోవా! యని ప్రార్థించి సరియైన లాభమును పొందక తదితర ప్రార్థనలు చేయుచు కడకు బాబా! ప్రార్థనలలో దిగి దానియందును మనస్సు కుదరక భిన్నరీతులలో చరించి శాంతిదూరుడై సతమతమగు చున్నాడు.

గొడుగుగల నరునకు చినుకుల బాధలేదు. పాదరక్షలు గలవానికి ముళ్ళత్రోవల బాధలేదు. చద్దిగలవాని కాకలి బాధలేదు. దండధారియై ధైర్యముగలవానికి సర్వభయములేదు. తప్పుచేయని మనుజునకు ప్రభుత్వభయములేదు. సతిగలవానికి స్వయంపాక మవసరము లేదు. ఆహారక్రమము గలవానికి రోగభయములేదు. మౌనవ్రతధారికి కలహాభయములేదు. ముందుదృష్టిగలవాని కాపదల భయములేదు. విద్యగలవానికి లేమిబాధలేదు. సద్గుణములుగల సతి సుతాదులున్న వానికి వృద్ధత్వ భయములేదు. ధర్మకర్మ నిర్వాహకునకు కాలుని భయములేదు. నిజగురుని బోధయాచరణమునందుంచిన వానికి సంసార తాపత్రయబాధలేదు. సర్వభూతములను తనవలె ప్రేమించెడి వానికి కష్టమేలేదు. పరమాత్మను నమ్మినవానికి ప్రకృతిభయము లేదు. ఆస్తి గలవానికాడపిల్లల భయములేదు. నీతిగలవానికి నిందభయములేదు. కర్మలోపము లేనివానికి కార్యభంగములేదు. కృషిచేయు వానికి కూటి భయములేదు. జపమొనర్చు వానికి పాపభయములేదు. ఆత్మతత్వము తెలిసిన వానికి మరణభయములేదు. ఆశలేని వాని కగచాట్లులేవు. అక్రమవాదికందరు విరోధులే! వాచావేదాంతికి కన్నీటి స్నానము. ఆచరణ వేదాంతికి పన్నీటి స్నానము. ధనాశగల నరునకే పరోపకార చింత. భగవద్గీత పఠించెడివానికి తాత్కాలికశాంతి. ఆ గీతావాక్యము లాచరించెడి వానికి నిత్యనిర్మలప్రశాంతి. వేదాంతవాక్యముల పలుకుచు వ్యతిరేకముగా ప్రవర్తిల్లెడివాడు నరకమునకేగును. సకర్మలొనర్చుచు

కర్మఫలమాశించని నరుని రక్షణమా పరమాత్మయే చూచుకొనును. తలపులుడిగిననాడే బ్రహ్మముతానగును. సర్వకర్మలకు మూలము నరుని సంకల్పము. సంకల్పరహితుడే సదానందయోగి. ఈ కర్మసిద్ధాంతముల లోని రహస్యమును తెలిసిచరించిన నరుడు ముక్తిపథమునొందును.

కర్మలప్రభావము ఘనమైనది బలమైనది వదలించుకొనుటకు వీలులేనిదై యున్నది. నిష్కామకర్మ, యోగమునకుమూలము. దుష్కర్మ దుఃఖమునకుమూలము. సత్కర్మశాంతికి ప్రధానమైనది. కర్మలకు మూలముమనస్సు. మనఃప్రవృత్తికిమూలము గతకర్మలప్రభావసంస్కారము. ముల్లును ముల్లుతో తీసిన విధముగా కర్మను కర్మతో జయించవచ్చును. కర్మచేయని నరుడు ఫలదూరుడగును. ఫలమునుకాంక్షించక కర్మనిర్వర్తించిననాడు నరుడు విధిగ ఫలమును పొందగలడు. కోటి గ్రంథములసారము కర్తవ్యకర్మనుసాగించి నరుడు నారాయణునిలో నైక్యమునొందుటే.

సదా సత్కర్మనిరతులై కవిపండితగాయకులై భగవద్భక్తితో చరించెడివారినిసైతము గతకాలమునందు వారొనర్చిన దుష్కర్మల ఫలము ఛాయవలె వెంటాడి విడువక వేటాడుటకారంభముచేయును. దీనినెవ్వరు కాదనజాలరు. ఇది త్రికాలసత్యము. కర్మసిద్ధాంతమురీతిగ మహామహులై కవిరాజులై వెలుగొందినను కర్మశక్తికి బానిసలై కన్నీరు గార్చకతప్పదు. జననీజనకులొనర్చిన దుష్టకర్మలప్రభావము సంతతికి సంప్రాప్తమై కఠినవ్యాధులకు గురిచేయసాగును. సతియొనర్చిన కుకర్మ ఫలముపతికి, పతియొనర్చిన కుకర్మఫలముసతికి, సతిపతులొనర్చిన కుకర్మల ఫలము వారిసంతతికి విధిగ సంప్రాప్తములగును. 'భార్యచేసుగైన భరియించు భర్తతప్పు' యనెడి కవుల నుడి మరువరానిది. తల్లిదండ్రులొనర్చిన కర్మదోషాదిఫలములు వారిసంతతికిసైతముప్రాప్తించి కష్టనష్ట రోగాదిబుణబాధలకు గురిచేయసాగును. మానవుడు తన వయస్సునన

దుష్టమైన, శాస్త్ర, సంఘవ్యతిరేకములైన కర్మలొనర్చిన ప్రతిఫలములను వయస్సులోపించి శరీరపటుత్వము గతిదప్పినస్థితిలో విజృంభించి బాధలను కల్గించుచుండును. 'సారాయిసీసాను దర్శించినవానికెట్టి నిసానుకల్గించక పానముచేసినవానికే తిక్కెత్తించి దుష్టకర్మలకుదింపి దీనావస్థకుగురిచేయు' రీతి లోకమునగల నరులకు శారీరకమానసిక సాంసారిక సాంఘీకాదిబాధలుచేకూరి కన్నీరుగార్చుటకు బలమైన కారణములు వారియాహార విహారవ్యవహార ప్రతీకారాదికర్మములే.

వ్యక్తి, కర్మలోపమువలన కార్యభంగముగల్గును. దేవునిపై విశ్వాసము వైద్యుడొసగినమందును సేవించుట వైద్యునిసలహాపాటించుటాదిగాగల కర్మలనిర్వాహణమే నరుని కన్నివిధములు మేలుచేకూరును.

నరుని గతసంస్కారానుగుణ కర్మలశక్తి చాలబలమైనది. వదలించుకొనుటకశక్తుడై నానాటికి కర్మలనువీడజాలక కర్మలొనర్చు దుకర్మతోడనే కాలగర్భమునందు కలియుచుండును.ధూమపాన,మధుపాన, చౌర్య జూద,వ్యభిచారాది దుష్టకర్మలుసాగించిన మనుజులు ప్రకృతి వ్యతిరేకమొనర్చిననాడు మంచివారివలె సంఘమునకు కన్పించినను సమయము చిక్కిననాడు త్యజించినట్టి వక్రకర్మలనే కొనసాగించుచుందురు.

వ్యక్తి, మనోజయమునొందితినని మనస్సు స్వాధీనమైనదనుకొనుట యందే గొప్పపొరపాటు నొందుచున్నాడు. స్వాధీనమైననాడు నాయీ కర్మస్వరూపాదిమనోగతులు గుర్తుండజాలవు. నరుడు నిద్రావస్థలో నేను నిద్రనొందుచున్నాననెడి భావమేరీతిగలేదో యదేరీతి దుర్గుణములు వీడితిననెడి భావస్ఫురణముసైతము లేక సద్గుణప్రభావముతో సత్కర్మల నాచరణమొనర్చుచుండును. కలకండనీటిలో కలకండరూపము గోచరించక గుణమేరీతిభాసిల్లుచుండునో ఆవిధముగా కర్మసంస్కారము మనుజుడు కర్మలనువీడినను కర్మప్రభావశక్తి మనస్సులోదాగి కార్యమునకవకాశమున్ననాడు బహిర్గతమై కర్మలలోప్రవేశించగలదు.



# "వ్యక్తి = శక్తి"

సాధనదశారంభమున సాధకునకు "గోలు" పై కొట్టిన దెబ్బలు గుర్తుంచుకొనగలడు. నేను దెబ్బపై దెబ్బను కొట్టుచున్నాను అను భావ స్ఫురణముతోనుండును. సాధకుడు క్రమముగా [illegible] సిద్ధినొందినయనంతరము కచ్చేరిలో గోలుకొట్టిననాడు దెబ్బలను గణనము చేయక శబ్దసౌందర్యపిపాసాయత్తచిత్తుడై గోలును వాయించును. వ్యక్తి తనకలవడిన దుష్టగుణకర్మలను సుసంస్కారప్రభావమున జయించి సత్కర్మనిరతుడై కర్మఫలప్రదాతయైన [illegible] దివ్యకరుణకు పాత్రుడైననాడు గతకాలమునందొనర్చిన దుష్కర్మ బలప్రభావము గుర్తుండజాలదు.

పిచ్చికుక్క రోజూ గృహద్వారమున ప్రవేశించి [illegible] మెక్కడిస్థితిని వీడజాలక ప్రయత్నమొనర్చురీతిగ, మనసు [illegible] కార్యక్రమములను విధిగ సాగించసాగును. ఆ పిచ్చికుక్క [illegible] సమయమునకు గృహద్వారము బంధించినతఱి ప్రయత్నమొనర్చియు శక్తిజాలక గృహమును మరచినరీతి మనస్సునకవకాశము లేక మనసు శక్తితో ప్రయత్నముతో జాగ్రత్తతో గుర్తించి మతిగతిని [illegible] నాడు మనఃప్రేరణమాగి మంచిగతిననుసరించసాగును.

దృశ్యసందర్శనశక్తి నరునిమనోగతిని ప్రోత్సహింపజేయును. ఆత్మబలముతో సాధనదశనుదాటి కార్యసిద్ధినొంది కర్తృత్వ [illegible] ప్రకృతిని ద్వైవాకృతిగభావించి సర్వసముడై సత్యశక్తిని తనలో [illegible] నొందించి సత్యమూర్తియై సత్యముతానై తానేసత్యమై [illegible] కర్మఫలవర్జితుడై కర్మశేషములేని దివ్యజీవితమును [illegible] కర్మము ధర్మము ద్వైవాకృతితో వెలుగొందును.

కృతకర్మలబలముతో దుష్టమానవుడు సంఘమును వంచించి [illegible] కర్మపరిపక్వదశయందు బలహీనునికివశమై ప్రాణములను కోల్పోవును.

నాలుక రుచికై కామవాంఛాసిద్ధికై కానిపనులొనర్చిన నరుడెంతగొప్ప వాడైనను, దుర్మరణమునకు గుఱికాకతప్పదు. ఆత్మశక్తిపై మాయ కమ్మిననాడు మానవుడు దానవుడగును.

ఈశ్వరశక్తి, విష్ణుశక్తి, బ్రహ్మశక్తి యనిలోకము సహజముగా వాకొనుచున్నది. శక్తి లేదు. రూపములేనిశక్తి రూపమునాశ్రయించి జగత్తునాడించుచున్నది.

పసిపాపకెట్టిమాటలు రావు. ఐనను మాటలన్నియు పాపమస్తకము నందు శక్తిస్వరూపముతోనుండును. కాలము విష్ణుస్వరూపము. కాలక్రమమున పాపమస్తకమునందుగలశక్తి బాహ్యరూపముగా బహిర్గతమై వాగ్రూపముదాల్చి వివిధగతులలో భాసించుచున్నది—

శక్తికి వ్యక్తికి గొప్పసంబంధమున్నది. శక్తిలేనివ్యక్తి, వ్యక్తి లేనిశక్తి నిరుపయోగమైనవి. సతిపతినిస్వాసు కలసిననాడే పిండమై ప్రకృతిశక్తిద్వారా శిశువులోకమునకవతరణమొందును.

శక్తిలేనినాడు దేహము కదలదు. నోరాడదు. కర్మలులేవు. కార్యములులేవు. ఆ నిత్యసత్యనిర్వికారమహనీయశక్తి దేహమునుండి లేచిననాడు దేహము దహనసంస్కారమున కుపయోగపడును.

అదేమిశక్తియోగాని వేలాదిప్రజలు వ్యక్తిమహోపన్యాసమునకు మంత్రముగ్ధులైనారని లోకమువాకొనును. శక్తివిజృంభిచనినాడు హస్తిమశకమై శక్తివిజృంభించిననాడు మశకము హస్తియై పరిణామమొందుననుటలో సందేహమువలదు.

శక్తిలోపించిననాడు పరమేశ్వరుడు పాషాణమగును. శక్తికృప కల్గిననాడు పాషాణమేపరమేశ్వరుడగును. శక్తివలన వ్యక్తిమహాత్ముడై వెలుగొందసాగును.

విత్తనము పరమేశ్వరరూపము. విత్తనములోనిసూక్ష్మబీజము శక్తిస్వరూపము. విత్తనమువేయించగా శక్తినశించును. ఆ కారణము

చేత వేయించి నవిత్తనము మొలకెత్తదు. శక్తిసూక్ష్మధాతురూపమై ప్రతివస్తువునకు మూలమైయున్నది.

శక్తి నిజస్వరూపము ప్రకృతిబద్ధులైన నరులకగోచరము. శక్తికృపలేని నరునకు కార్యసిద్ధి చేకూరదు. శక్తిని నరుడు భక్తితో నారాధించిననాడు కవచమై రక్షించగలదు. శక్తిని నరుడు ద్వేషించిన నాడు గరళమై భక్షించగలదు.

శతావధానియై సభావేదికలపై వేదోపన్యాసవాహినిచే లోక మంతటిని తనవశమొనర్చుకొన్న ఘనుడైన నరుడు నిత్యాహారవిహార ములలో లోపముచేసిననాడు దేహధర్మముచెడి దుస్థితినొందగలడు. చేతిలోని దర్పణము జారకముందే జాగ్రత్తపడెడిమానవుడు తెలివైన వాడు. ఇదేరీతి శరీరమురోగములపాలై మందులబారికి గురికాకముందే కర్మలలో లోపములులేక మెలగిననాడు సుఖజీవనుడగును.

కామినీకాంచనములనాశించి పరితపించెడి మానవుడు ధర్మకర్మ నిర్వహణమొనర్పజాలడు గురుపూజచేసెడిభక్తుడు మున్ముందు గురూప దేశమును శిరసావహించవలెను.సద్గుర్వాదేశసందేశములను ముముక్షువు నిత్యాచరణమునందుంచజాలక, సద్గురుఛాయాచిత్రములను ఘనమర్యా దలతో పూజించి తీర్థప్రసాదాదుల వినియోగమొనర్చినను సద్గురుకృప గలుగదు. ప్రత్యక్షముగ సద్గురువులు శిష్యునికన్నులకు సాక్షాత్కరించి దివ్యప్రబోధమొనర్చినను హృదయములో సత్పరిణామముకన్పట్టదు. నీటితోతడిపి వత్తినివెలిగించినను కాంతివంతముగాని రీతి, శిష్యుని హృదయములో "స్త్రీ-ధన"ములపై హద్దులేనిమమకారముగల్గిననాడు హృదయగుహాంతర్నివాసియైన శ్రీ నృహరిదివ్యకృప ప్రసరించదు. ఆర్తులావేదనలను హరించెడి కల్యాణగుణస్వరూపుడే గోవిందుడు. సర్వులకు వందనీయుడై ఏడుకొండలపై భాసిల్లెడి దివ్యస్వరూపుడు గోవిందుడు. సర్వకాలసర్వావస్థలయందుభువిపైగలమనుజుడుభక్తితో

శక్తికితగినసత్కర్మలనాచరణమొనర్చుచు కర్తృత్వాదీక్షను సడలనీయక చరించిననాడు తప్పక తిరుమలనాథుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి యపారకరుణకుపాత్రుడై తనకన్నీటిని పన్నీటిగామార్చుకొని భగవద్విశ్వాసముతో జగన్నాటకమందొక పాత్రధారియై నటనమొనర్చి కృతకృత్యుడగును.

జీవులొనర్చినకర్మలకనుగుణ్యములైన ఫలములనుప్రసాదించుచు దేవుడుసాక్షియై కదలకవీక్షించుచున్నాడు. ఇదిదైవలీల. దేవునిలీల తెలియగతరమా! పాపులకీయిలలో యనెడిగానమువిన్నాము. పాపులకు దేవునిలీల ప్రారంభదశలందు తెలియదు.తుదిదశయందవగతమై కాలము జారిపోయినది. వయసుతూలిపోయినది. కథమారిపోయినదని వగచుచు కన్నీరుకార్చసాగుదురు.

నరుడు ప్రాప్తములేని ఫలమునాశించి యావేదనలపాలగును. ప్రాప్తాప్రాప్తములకై ముముక్షువు పొంగక కృంగక దేవునిభజించ సాగును. దేవునికరుణకలగిన మధుర క్షణములలో నరుడువాంఛాతీతుడైనను ఫలమువరించి తరింపజేయును. ప్రతినరుడు వివిధసద్వాంఛలతో ఫలానుభవకాంక్షతో సమయమునకై నిరీక్షించుచు తహతహలాడసాగును. ఐనను ఫలమూరుడగును. ఫలప్రాప్తి నరుడుకాంక్షించిన నాడు చేకూరదు. కాంక్షించకుండినను ఫలము చేకూరుచున్నది. ఇదియేకర్మసిద్ధాంతరహస్యము. ఈ విచిత్రమైనకర్మస్థితిని నరులు గుర్తించక తాపత్రయమగ్నులైక్రుగ్గుచుందురు.

నరుడు నిజమును తనతోడినరులతోవాకొనుటకు స్వార్థత్యాగి కావలెను. స్వార్థత్యాగికిసంపద చేకూరదు. లేనిదోషమును, రోగమును, తప్పిదమును తోడినరులపైమోపి స్వార్థముతో నీఛమానవుడు వారి యర్థమును సంగ్రహణ మొనర్చుచున్నాడు.

మానవుడు కలసివచ్చెడి రోజులలో స్వార్థమును పెంచుకొనుచు ధర్మవిరహితుడై ధనార్జనమొనర్చి ధనవంతుడై కారులలో షికారు లొనర్చుచున్నాడు. కారులు వాని షికారులు కొంతకాలము మాత్రమే.

అసత్యవాక్యములతో యక్రమకార్యములతో నేటికలికాలమున కొందరు వ్యాపారోద్యోగ వైద్యాధికారులు సమాజమునువమొనర్చి వారి రక్తమునుపీల్చి పిప్పిచేయుచున్నారు. అసత్యములు లేనివాని కాదాయమేలేదు. సత్యము, ధర్మము, నీతి, నిజాయతీలతో లోకమున చరించెడి వ్యాపారోద్యోగ వైద్యాధికారులకు సదావిలాసాలకు వినోదాలకు పసందైన విందుభోజనాదిసౌకర్యములకు కావలసినంత ధనసంపత్తి చేకూరదు. "వైద్యోనారాయణోహరిః" యనెడిసూక్తికి నిదర్శనముగా నూటికొక్కరిద్దరుగలరు. వేడిచేసి దగ్గెడినరునిజూచి "క్షయవ్యాధి" యని, శరీరములోరక్తములోపమై కాళ్ళు చేతులు తిమ్మిరితో బాధపడెడి వ్యక్తినిజూచి "కుష్టువ్యాధి" యని, వేసవి కాలమున శరీరముపైలేచి బాధించెడి గడ్డగలనరునితో "వ్రణము" కోతవేయవలయునను వాక్యములతో తోడి పౌరుల మనస్సులకు భయాందోళనములనుకల్పించి వారియర్థమును కొల్లగొట్టి పేటలలో విశాలమందిరనిర్మాణము లొనర్చినను, మోసవృత్తి నిసాగించిన నీచులైనవారెల్లరకు కన్నీరుదప్ప పన్నీరులభించదు. ఇదిలోకమునందు జరిగెడి ప్రత్యక్షకర్మ.

దయ, ధర్మము, సత్యము, కరుణ, ఓర్పు, నేర్పు, శాంతము, భూతదయాదిగుణసంపత్తితో లోకమున వెలుగొందెడి వ్యాపారోద్యోగ వైద్యవిద్యాధికారులెల్లరు ధనవంతులై మితిలేనిభోగాల నొందజాలరు. ఐనను "గంగగోవుపాలుగంటెడైననుచాలు కడవడైననేమి ఖరము పాలు" అనెడిరీతిగ పరులను మోసముచేసి యార్జించిన ధనముతో నరుడుపాయసభక్షణమొనర్చినను కడకగచాట్లకు గుఱికాకతప్పదు.

లోకాపకారములేని వినిర్మల ధర్మజీవిత గమనమును సాగించెడి నరునకెట్టి యశాంతిగలుగదు. నిత్యానందముతో విరాజిల్లుచుందును.

నిద్రానిరోధమునకు మందులు సేవించినరుడు ధనార్జనచేయుట కారంభమొనర్చసాగును. "రకరకములైన పిండివంటలుచేయు నరుడు దృష్టితోడనే సంతృప్తిచెందెడికీర్తి" రాత్రింబవళ్ళార్జనాశక్తితోడనే నరుడుకాలమునుగడపి లక్షలాదిధనము త్యాగమూర్తులు సుఖజీవను లైన తన సంతతికి వదలి భువివీడి దివికేగును. ఇట్టి పట్టులందు లోకము "పాచిపండ్ల వాడు సంపాదించ బంగారుపండ్ల వాడనుభవించు" ననెడి వాక్యములాడుచుందురు. లోకోక్తులుసమాజశ్రేయస్సునకుసోపానపంక్తి.

వ్యక్తికి ధనముపెరిగినకొలది బాధ్యతాభారము, శ్రమ పెంపొందు చున్నది. వందలాది సినిమాలలో గేయగానములొనర్చిన శ్రీఘంటసాల వేంకటేశ్వరరావుగారు జీవితచరమదశవఱకాకళకే జీవితమంకిత మొనర్చిరి.

ఏవ్యక్తి యొనర్చెడి కర్మమావ్యక్తికి బంధమై ప్రాణాపాయము వరకు వెంటబడి వేదించుచున్నది. కర్మబంధములను నిష్కామకర్మ శక్తితో జయించవలెను. కర్మ సుకర్మమై నిష్కామకర్మమై చివరకు జన్మరాహిత్యమునకు మూలమైన మహాకర్మమై భాసిల్లుచున్నది.

నిరపేక్షతో సాగించెడి నరుని కర్మమువలన జన్మసార్థకమొంద గలదు. నరుడెట్టి కర్మలొనర్చినను ధనమార్జించినాడాతని నెన్నియో రీతుల తనకైనవారు కానివారెల్లరెంతో గౌరవాదరణములతో ప్రేమించుచుందురు.

ధనములేనిదైనమైన శంకరుడు శ్మశానమున కధిపతియని, లక్ష్మీదేవికి పతియైన మహావిష్ణునిలయము వైకుంఠమని కథలద్వారా తెలిసికొంటిమి. "ఐశ్వర్యములేనినాడందరు పగవారే!" ఏదిలేకుండినను సత్యముగల నరుని దైవము దయతో రక్షించగలడు. సతిసుతాది

బంధువర్గమంతయు ధనములేని నరుని దయ్యమని తఱిమివేయ సాగెదరు. ధనమే దైవమై లోకమున చలామణియగుచున్నది. వివిధాలంకరణలులేని శిల్పము శిల్పమే. వివిధాలంకరణలతో వెలుగొందెడి శిల్పమే దేవుడై భక్తుల ప్రసాదసమర్పణాది నీరాజనము లను పొందుచున్నది.

నరుడు సృష్టించిన శిల్పమునకిట్టి తరతమ భేదములున్ననాడు దేవుడు సృష్టించిన నరులకు తరతమ భేదములు గౌరవాగౌరవములు సంభవించుటకెట్టి యాశ్చర్యము కన్పట్టదు.

ఈ అనంతమైన విశ్వమును సృష్టించిన శక్తిని గుఱించి వివిధ రూపములైన వాదనలు శాస్త్రములందు, మతగ్రంథములందు మనకు కన్పించుచున్నవి. విశ్వవిజ్ఞాన పరిశోధకాగ్రేసరులనెందఱినో కాలము కబళించినది. అట్టి మహామేధాశాలురైనవారెల్లరేశక్తినుండి యావిర్భ వించి తిరిగి యేశక్తియందు తాదాత్మ్యము నొందుచుండిరనెడి పరమ సత్యమును యథాతథముగా పాత్రములందు వ్రాయగలిగిన సాహస చక్రవర్తి నేటికి వ్యక్తము కాబడలేదు. ఆ నిత్య సత్య సనాతన శక్తి వాగ్రూపములకందక చేతివ్రాతలకు చిక్కక యంత్రపరిశోధనల కగమ్యమై యలరారుచున్నది.

తరతమ భేదములకు హెచ్చుతగ్గులకు కర్మకు గొప్ప సంబంధ బాంధవ్యమున్నది. కర్మచేసెడి లోకము భిన్నప్రవృత్తులతో చరించు చున్నది. భిన్నప్రవృత్తుల మూలమున భిన్నములైన కర్మములు వాని ప్రతిఫలములు భిన్నములై గోచరములగుచున్నవి.

ఒకేనరుని మస్తకమునందే భిన్నములైన సంకల్పములుద్భవ మొందుచున్నవి. నరులొనర్చెడి కర్మములకు మూలములైన సంకల్పము లకు మూలమైన సంస్కారప్రభావమే భిన్నమైయున్నది. ఈ భిన్న భావము నరుని మస్తకమునందులేని నాడు సర్వము బ్రహ్మస్వరూపమని

సత్యమును తెలిసి తత్త్వవేత్తయై ద్వంద్వాతీతుడై మహాత్ముడై భాసిల్లు చుండును.

'నీ-నా' యనెడి ద్వైతదృష్టి నరునకు నశించనంతదనుక శాంతి చేకూరదు. కైలాసశిఖరముచేరినను చెప్పులపై గల భ్రాంతిని వీడజాలడు. ఈప్రకృతిశక్తికి నూటికి తొంబదితొమ్మిదిమంది స్వాహా! యగుచున్నారు.

నీతులనెడి మెట్లన్నిటిని నరుడు క్రమముగ సాధనతో నధిరోహణ మొనర్చి తుదివరకేగి 'పసిడి-పడతి-కీర్తి' యనెడి మెట్లయొద్ద కాలుజారి పరిటీగొట్టి గరతమునబడి దుఃఖమునొందుచున్నాడు.

సాధకుడు సాధనతో క్రమముగ తన మనోగత దోషములను నిశ్శేష మొనర్చి పరమాత్మదర్శనమునకు మనస్సునుపయోగించవలెను. బాహ్యసుఖములకలవడిన నరుని మనస్సు నారాయణునియందు లీనము కాజాలదు.

ఆత్మాఽనాత్మ విచారణతో సత్యాసత్యముల తెలిసికొనెడి ధ్యేయముతో మనస్సును పరిశోధన చేసిననాడు సత్యవస్తువగు పరమాత్మవైపునకు మనస్సు మరలి స్వాధీనమగును.

ఎవ్వరికివారు పరమాత్మశక్తి సందర్శనానంద రసానుభూతి నొందవలసినదే. అఖండయోగస్థితియందు పొందిన దివ్యావ్యయానంద మును నరుడు బాహ్యస్థితియందు వ్యక్తముచేయుటకు వీలులేనిదై యున్నది.

దివ్యచైతన్యతత్త్వదర్శనమును నరుడు కాంక్షించుటలేదు. ఆ దివ్యశక్త్యాత్మదర్శనానందానుభూతి సులభసాధ్యముగాదు. మనస్సునకు లొంగని మహావ్యక్తికి మాత్రమే తత్త్వదర్శనము సాధ్యమగును.

అరిషడ్వర్గ భంజనము చేయని మానవుడు ముక్తిధామము నందదుగిడజాలడు. కాలమును కాయమును కామ్యకర్మలకే నరుడు దుర్వినియోగ మొనర్చుచున్నాడు. తల తెల్లనై వయస్సుముగిసెడి

చరమదశయందు సైతము నరుడు ప్రకృతివ్యామోహపాశ బంధనము నుండి విముక్తిని చెందజాలకున్నాడు.

ప్రతిదినము మానవుడు గీత, బైబుల్, ఖురాన్ గ్రంథములను పఠనమొనర్చినను, మాయను జయించి మహాత్ముడై పరిణామమును చెందజాలక మొదటిదశయందే పరిభ్రమణము నొందుచున్నాడు.

పవిత్రగ్రంథపఠనము, నరుని నిత్యకర్మలలో యొక కర్మగ సాగుచున్నది. ఆ పవిత్రగ్రంథాదేశపఠనము నరుని జీవితగమనమునందు గల యొడిదుడుకులను సరిచేసి సద్గతికిమార్చి ముక్తిని చేకూర్చెడి మహత్తర కర్మగ మారుటలేదు. ఇందులకు కారణము భయములేని కర్తవ్యమెరుగని ప్రవృత్తితో నరుడు చరించుటయేననిబుజువగుచున్నది.

ఆంధ్రవాఙ్మయమునందెందరో మహాకవిసార్వభౌములవతరణము నొంది, నరుని మతిని సద్గతికి మార్చి సత్యవ్రత శీలునిగా రూపొందించి సమాజమునకెంతో మేలుచేకూర్చవలెననెడి ధ్యేయముతో రమణీయములై నీతిప్రధానములై సంఘక్షేమంకరములైన మహాకావ్యరాజముల నెన్నింటినో నిర్మాణమొనర్చి వర్ణనలకందని కృషిచొనర్చి కీర్తికాయులైరి. ఆనాటి మహాకవులు వారి మహనీయరచనలు నేటికిని రసజ్ఞుల మస్తక వీధులలో స్థిరరూపములై విలసిల్లుచు వెలుగొందుచున్నవి. ఇదివారి స్వార్థత్యాగనిరతికి నిదర్శనము.

కవులులేనినాడు కావ్యములులేవు. కావ్యములులేనినాడుకథలు లేవు. చరిత్రలుగానరావు. కథలులేనినాడు, చరిత్రలు తెలియనినాడు సమాజమునకు పురోగతిలేదు.

సమాజ పురోగతికి సమాజ వికాసమునకు సమాజపరమైన సాంఘికాది ధర్మరక్షణమునకు మహాకవుల మహనీయ గద్యపద్యాది రచనములే పునాదులై విలసిల్లినవి.స్వార్థత్యాగనిరతులైన మహాకవుల దివ్యరచనములు వారిశక్తిస్వరూప ప్రతిభావిశేష కీర్తిచంద్రికలు త్రికాలస్మరణీయములు.

మహాకవులెందరో భారతావనియందావిర్భవించి వారివారి యుపాస్యదైవశక్తిప్రసారయోగ్యములైన వివిధరచనములను రూపొందించి సమాజమునకందించి సాహితీప్రియులైన పెద్దల హృదయముల కానందరసానుభూతిని కల్పించి ధ్రువతారలై నేటికిని చిరస్మరణీయులైరి.

సృష్టియారంభమునుండి లోకమున మహాకవులావిర్భవించుచునే యుండిరి. ప్రాచీనకాలమునుండి నేటివఱకెందరో భువిపై నవరతమొంది వారివారి మేధాసంపద్విభూతితో లోకోపకారములై, మానవ హృదయరంజకములై భగవానుని దివ్యశక్తియందు చేరి తరించుట కుపయోగములైన దివ్య గద్య పద్య గేయ ద్విపద తత్త్వ కందార్ధాది మహనీయ రచనములనెన్నింటినో సృష్టించి గణనీయమైన గౌరవ సన్మాన సమాదరణములను సంఘముచే పొంది పునీతులై పూజనీయులై పుష్పమాలాలంకృతులతో మంగళతూర్యారావములతో వేనోళ్ళ కీర్తింపబడుచు భువివీడి దివికేగి దివ్యశక్తియందు తాదాత్మ్యము నొందిరి.

సద్యశోశీలురై మృతజీవులై వర్ధిల్లెడి మహాకవుల జీవిత చరిత్రాంశములన్నియు యథాతథముగా తెలిసి యానందించవలయు ననెడి రసజ్ఞులెల్లరు సంఘసంస్కర్తలైన మహాకవిపుంగవులైన శ్రీ కందుకూరు వీరేశలింగముపంతులుగారిచే రచనచేయబడిన ''ఆంధ్ర కవుల చరిత్రము'' ను పఠించిన యానందించగలరు.

కవిసింహములై జగత్తుకే వారికవితాశక్తితో యానందము కల్గించిన మహామహులెందరో పడరాని బాధలకుగుఱియైరని, కవుల చరిత్రలు పఠించినవారెల్లరకు విశదమగుచున్నది. దీనికొకేకారణము. కవులు వ్రాసిన ధర్మోపదేశములకు వ్యతిరేకములైన కర్మలను సాగించుటయేనని తెలియబడుచున్నది. నోటితో ''కాశీ'' యనుట చేతితో వ్రాయుట నరులకు సులభమే. కాశీపట్టణమునకు వెళ్ళి శ్రీ విశ్వనాథుని

దివ్యదర్శనభాగ్యమును పొందుట చాల కష్టసాధ్యము. ఇదేరీతి "సత్యంవద-ధర్మంచర" యనెడి ధర్మసూక్తులను నరులు నోటాడుట చెవులతో వినుట చేతితో వ్రాయుట సులభమే. ఆ ధర్మసూక్తి ద్వయమును నరులు తమ తమ నిత్యజీవితాచరణములందుంచుట బహుకష్టతరమైనది. నిత్యజీవితాచరణములందు నరులుంచిననాడు కష్టములనొందక సుఖశాంత్యానందములను పొందగలరు.

నరుల మనోవాక్కర్మములు సత్యములై ధర్మవిహితములై లోకమున విలసిల్లిననాడు సమాజమెట్టి బాధలులేక శాంతిశుభశ్రీలతో వెలుగొందుచుండును. సత్యాదర్శ ధర్మకర్మ వినిర్మల జీవితమును సాగించెడి నరునిశక్తి ద్విగుణీకృతమై శుక్లపక్ష శశాంకునివలె లోకమునకు హాయినిచేకూర్చగలదు.

ఇట్టి ధర్మకర్మనిర్వాహకునకు సంభవించెడి పెనుకష్టపరంపర లన్నియు సమూలముగ కాలక్రమమున సమసి సంతసమునొనగూర్చును. భగవద్విశ్వాసముతో ధర్మబద్ధమైన కర్మలతో కృషి యొనర్చెడి భక్తవతంసునకు లేమి చేకూరినను శాశ్వతముగ నిలువక కలిమిగా పరిణామమొందగలదు.

నేటికలికాలమున తండ్రి కుమారుని, కుమారుడు తండ్రిని, సతిని పతి, పతిని సతి, విటుని వెలకాంత, వెలకాంతను విటుడు, అన్నయ్య తమ్ముని, తమ్ముడు అన్నయ్యను, బావమరదిని బావ, బావను బావమరది, గురువు శిష్యుని, శిష్యుడు గురువును వీరెల్లరు యెంతో ప్రేమతో సత్యభాషణములొనర్చి, యనర్థహేతువగు ధనాశకు లొంగి బానిసలై వీరిని వారు, వారిని వీరు కుతంత్రములతో కక్షలతో సాధించి ధన మాన ప్రాణములను హరించుటయు కొందరిలో కన్పించు చున్నది.

తరతరాలనుండి కలసి మెలసి నెయ్యము వియ్యములను కొనసాగించెడి మేధావులైన నరులు సైతము, ధనాశజిడ్డునకు గుఱియైన

నాడు వియ్యాము నెయ్యాములకు తిలోదకములొసగి సిగ్గువిడి కయ్యాముల కుపక్రమణమొనర్చి కోర్టులపాలై లోకపు తెగడ్తలకు గుఱియగుచుందురు లోకపుగతి బహువిచిత్రముగ ముందునకు సాగుచున్నది. దీని తుది పరిణామము విజ్ఞులకు బహుభయంకరమగురీతి పొడకట్టుచున్నది. నిండిన పాపభాండము బ్రద్దలుగాకతప్పదు. పండిన దుష్క్రియాఫలము భల్లున బ్రద్దలుకపోదు. పన్నీరువెంట కన్నీరు, కన్నీరువెంట పన్నీరు ప్రవహించకతప్పదు. ప్రపంచము దాని స్వస్వరూపము కష్ట నష్ట సుఖ లాభముల సమ్మేళనము. ఈ విచిత్రకర్మగతిని తెలిసి ధర్మమును వీడక స్త్రీ, ధన, కీర్తి తపనలపాలుగాక భగవానుని మరువక కర్తవ్య కర్మ సాగించిన ప్రతినరుడు చింతలకతీతుడై వెలుగొందగలడు. కర్తవ్యకర్మ మనోలయమేనని తెలియవలయును. మనోలయమునకు సరియైన మార్గము, స్వానుభవసిద్ధులై యోగానందానుభూతితో వెలింగెడి శ్రీ సద్గురుస్వాముల దివ్యచరణసన్నిధి. ఇంతకుమించిన మార్గ మేలేదు. పుస్తకపాండిత్యముతో నరులకు యోగవిద్యయలవడదు.

సకలప్రాణులలో సర్వశ్రేష్ఠమైన మానవజన్మను విషయవాంఛ లకు బలిచేసి వ్యర్థముకానీయక ధర్మమార్గమున నడచుచు భగవ త్ప్రాప్తినందుటయే జీవితపరమావధి. భవబంధమునుండి విముక్తి గాంచి ఈశ్వరసాక్షాత్కారమునందుటకు కుండలినీజ్ఞానయోగమను రాజయోగము యోగములన్నిటిలో ఉత్తమమైనది, సులభమైనది. ఇట్టి దివ్యమైన యోగమును ఉపదేశించు గురువరేణ్యులైన యోగీశ్వరులు లభించుటయే నరుని కర్తవ్యకర్మసిద్ధించుటకు మూలమునైయున్నది. వాగ్రూపయోగవిద్యాప్రబోధప్రచారకులవలన సాధ్యముగాదు.

అసలైన ఆదర్శమైన సంప్రదాయసిద్ధమైన సద్గురువుల స్వానుభవ దివ్యశక్తికి నిలయమైన శ్రీ కుండలినీజ్ఞానయోగమువలన ప్రాచీన కాలమునందెందరో మహర్షులై మహామనీషులై విలసిల్లిరి.

సకల ముక్తి మార్గములకు మూలమైనదీ కుండలినీజ్ఞాన యోగము. ఈ గ్రంథరచయితను కథకునిగ కవిగ సవిమర్శకాగ్రేసరునిగ యోగ విద్యాపిపాసకునిగా పరిణామమునొందించిన కపిలగిరి శ్రీ లక్ష్మీనృసింహో పాసకులైన శ్రీ శ్రీ శ్రీ సద్గురుయోగానంద నరసింహస్వామివారీ కుండలినీయోగశక్తిని కరతలామలకము చేసికొనిరి. ఏ జప తపములు చేసినను లక్షణగ్రంథములను కంఠస్థమొనర్చినను సర్వస్థల సంచారము లొనర్చినను మనస్సు నరుని స్వాధీనము గానేరదు. యోగానుభవముతో మనోవృత్తుల నిర్మూలనమొనర్చి కర్తృత్వసిద్ధిని బడయగలడు నరుడని శ్రీ యోగానందస్వామివారు వారి దివ్యబోధలలో యెన్నియో యోగ విద్యారహస్యములు ముముక్షువులైన ప్రియశిష్యులకు వ్యక్తమొనర్చు చుండెడివారు.

అనాదికాలమునుండి యెందరో ఋషులు మునులు సంవత్సరాల తరబడి ఘోరతపములాచరించి కుండలినీశక్తిని మేల్కొల్పి శివజీవైక్య స్థితిని పొందిరి. ఈ కుండలినీశక్తిని మేల్కొల్పెడి యోగవిద్యా విధానమతిరహస్యముగ లోకమునందక్కడక్కడ నేటికిని కన్పించు చున్నది.

మూలాధారమునందు కుండలినీశక్తి మేల్కొని భ్రూమధ్యభాగ మగు త్రికూటమునను పిదప సహస్రారమునందును నిలిచి ప్రకాశించును. నవ్య దివ్య భవ్య జీవనము ప్రారంభమగును. ఈ యోగాభ్యాసము వలన శరీరములోనుండు కొన్ని వ్యాధులు దూరమగుటయేగాక రక్తము పరిశుభ్రమొంది నాడులు సక్రమపద్ధతిలో నుండి నాయురారోగ్యములు వృద్ధియగును. భక్తి, దృఢవిశ్వాసములు పెరుగును. అద్భుతమైన మేధాశక్తి సర్వజనాకర్షణశక్తి కలుగును. నిశ్చలచిత్తముతో విడువక యీ యోగమునభ్యసించువారికి దివ్యశక్తులు కలుగగలవు. లౌకికముగ నిట్టి ప్రయోజనములు సిద్ధించి సాధనచేయుకొలది ఏకాగ్రత పెంపొంది ధ్యానసమాధి - అవస్థలుయేర్పడి తనలో తానుండుచో ఖేచరుకై

గవత్సాక్షాత్కారభాగ్యము గల్గును. ఈ రీతిగ సాధనసాగించి సిద్ధి నొందినచో ఇహపరసౌఖ్యహేతువగు ఈ యోగమునకు మించినది లేదు.

ఇది రాజయోగముగాన, దీనిని అడవికిబోయి ఫలాదులు భుజించి శారీరకముగ నానావిధములై బాధలకు లోనుగావలసిన అవసరము లేదు. గృహస్థాశ్రమమునందుండియు సులభపద్ధతితో నభ్యసించ వీలున్నది.

ఈ యోగమును కుల మత వర్గ భేదము లేక ముముక్షువులైన నరులెల్లరు సాధనచేయవచ్చును. ఇరువదొక్కటి సంవత్సరము నుండి డెబ్బది సంవత్సరములవయస్సు గల వారందరు తమ తమ మతలక్ష్య ప్రకారముగానుండియు సాధించవచ్చును. శివ కేశవాది భక్తులెల్లరు యోగాంక్షతో దృఢమైన దీక్షతో సాధనక్రమణమును పాటించిననాడు యోగకుండలినీశక్తిని సాధించవచ్చును.

మనస్సు అధోముఖమున నుండునప్పుడు విషయములకుపోవును. ఊర్ధ్వముఖముగా నుండునేని విషయములకుబోక నిర్విషయమగును. బ్రహ్మానందమున మునిగి తేలుచుండును. అజ్ఞానులై, నహంకారులై, భక్తిశూన్యులై చరించెడి జనులందరి మనస్సధోముఖమై విషయ సుఖాల తపనతో చరించుచున్నది. అట్టి మనోమర్కటమును యా స్థానమునుండి తప్పించి యూర్ధ్వముఖముగ నిలుపుటయే యోగము నుపదేశమనబడును. ఇదియే గురుమంత్రార్థ రహస్యము. ఇట్టి మహోత్తమ స్థితియందు తీర్ణులైనవారినే సద్గురువులని కారణా చార్యులని తెలియవలెను.

మూలాధారమునందు వీర్యశక్తియంతయు గూడుకట్టియుండును. అది త్రికోణాకారముగ నుండి దానికొక చిన్న సర్పముచుట్టుకొని యున్నట్లు యోగులు చెప్పుదురు. ఈ పాము నిద్రపోవుచుండును. ఇదియే కుండలిని. దీనిని మేల్కొల్పుటయే రాజయోగ ధ్యేయము.

కర్మసిద్ధాంతము. కుండలినీశక్తి సుషుమ్నాద్వారము ద్వారా సహస్రారమునకు వెళ్ళుటయే ముక్తి.

ఈ కుండలినీశక్తి, వాచారూపమగు వేదాంత ప్రసంగములు కోటియుగములొనర్చినను మేల్కొనజాలదు. దీనిని స్వానుభవపరులై యోగ్యులై సద్గుణసంపద్విభూతివిలాసపరులైన దేశికుల దివ్యపాదపద్మ సన్నిధి చేరిననరునకు మాత్రమే సాధ్యముకాగలదు.

"కుండలినీజ్ఞానయోగి" శ్రీ అవధూత గోవిందగిరిస్వాములవారు ఆంధ్రప్రదేశ్-కరీంనగరముజిల్లా, కోరుట్లగ్రామమున శ్రీకుండలినీజ్ఞాన యోగాశ్రమమును స్థాపించి నిస్వార్థ సేవాపరాయణులై ప్రశాంత హృదయులై శ్రీ కుండలినీజ్ఞానయోగము నాశించినట్టి ముముక్షువు లెల్లరకు సాధనక్రమముద్వారా ప్రబోధములొనర్చి యోగానుభవ పరుల నొనర్చుటకు సంసిద్ధులై నేటికిని వెలుగొందుచునేయుండిరి.

శ్రీ అవధూత గోవిందగిరిస్వాములవారి దర్శనము యోగతత్త్వ ప్రబోధ ప్రదర్శనమును, ఈ గ్రంథరచయిత గుప్తభాగవతుడు దైవ కృపాప్రేరణమహాశక్తితో కరీమ్నగరమునకు మూడుమైళ్ళదూరమున వెలంగెడి శ్రీసచ్చిదానందాశ్రమమునకుజని స్వామివారిదర్శన సంభాష ణాది మహద్భాగ్యమునకు పాత్రులైరి. 1976 వ సంవత్సరమున ఆగస్టు పదియేడవతేదీన రాత్రి గం. 9 కు "భక్త = ప్రహ్లాదచరిత్ర" కథాగానమొనర్చి, ఆశ్రమకార్యక్రమనిర్వాహకులు, ప్రశాంత గంభీర హృదయులైన శ్రీసత్యానందస్వామివారి దివ్యాశీస్సహిత పారితోషిక మును, శ్రీ నృసింహపురాణమునుపొంది యాత్మానందమునొందిరి.

వ్యక్తి సర్వశాస్త్ర విశారదుడైనను, నిరహంకారియై సత్యమును తన జీవితాచరణమునందుంచి ఉపాస్యదైవమునే వివిధమూర్తులందు దర్శించి తాదాత్మ్యము నొందుచు పెద్దలందరిలో పెద్దలకుపెద్దయైన పరమేశ్వరుని గుర్తించి గౌరవభక్తిపురస్సరమగు సరస సాత్త్విక

సంభాషణములొనర్చుచు లోకమునచరించిన నాడాబాలగోపాలము వశమై సర్వసంరక్షణము చేకూర్చుచుండును.

కాసులు సమకూరిననాడు నరుడు, భగవానుని కృపనాపై ప్రసరించినది నేను గతమునందొనర్చిన నిస్వార్థపరోపకారప్రభావమని యెఱింగి, తనకు తెలిసిన ధర్మసూక్తులకు వ్యతిరేకముగ జీవితమును సాగించక శివ కేశవ భేదములేక మూర్తులనుదర్శించుచు భజించుచు జన్మను సార్థకత నొందించవలెను.

భగవానునియఖండశక్తి, భగవానునినమ్మి భజించెడి పరమ భాగవతుని, ప్రకృతి దురంతర దుర్భర దుస్సంఘటనలనుండి విడివడచేసి రక్షించుననెడి నుడి ప్రత్యక్షానుభవమైనదని పాఠకులు గుర్తించవలెను.

నేటి యాంత్రిక యుగమున నరుడొనర్చెడి ప్రతికర్మము నందపాయమెంతేనిగలదు. మానవుడిల్లువీడి మరలచేరువఱకు నమ్మకము లేదు. కన్నుమూసి తెరచెడి కాలవ్యవధిలో కాటికిచేరినవారినెందరినో కన్నులార గాంచుచున్నాము.

ఇట్టి భాగ్యమునకు నరుడెంతోకాలమువ్వ కెన్నియో నాలోచన లను మననముచేసి ధనకాంక్షాతపనతో తీరికలేని కార్యక్రమములను సృష్టించుకొని పలుబాధలతో పరిభ్రమణము నొందసాగును.

సూర్యచంద్రాంగారక గ్రహతారకాది గోళముల నెన్నింటినో నేటికాలపు భౌతికవాదియగు మానవుడు స్వయంశక్తి ప్రభావమహిమా నిర్మాణములైన యంత్రసహాయముతో పురోగమనమొనర్చి స్వస్థల మునకు చేరుచున్నాడు. ఐనను క్షణకాలమునకు సంభవించెడి ప్రకృతి పరిణామమును గుర్తించలేక పరిశోధనలకే కాలమును కాయమును వ్యయమొనర్చుచున్నాడు.

లోపల వెలుపల వ్యాపించి వెలుగొందెడి మహత్తరశక్తి సందర్శ నమునకై నరుడు కృషి యొనర్చుటలేదు. చంద్రమండల యాత్రా

పర్యటనములకంటె కష్టతరమైనది తన స్వరూప సాక్షాత్కార మహాకర్మమేనని ఋజువగుచున్నది.

భౌతికవాంఛాసంతృప్తికై సదానరుడు మనోసంకల్పములకు బానిసయై చరించి యపాయములకు గుఱియై తీరని చింతలకులోనై కన్నీరుగార్చుచు మనోశక్తిప్రభావమున కచ్చెరువొందుచున్నాడు. జీవిత చరమదశవరకు మనోదుర్గతిని నిర్జించి పరిపూర్ణ సత్యశక్తి సందర్శనమునకు ప్రాకులాడుచు విఫలుడగుచున్నాడు. కారణము? జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ సుఖ సంతృప్త్యానంద పారవశ్యమే శాశ్వతమని భావనచేయుటయే. దైవమును స్మరించుచు దయ్యపు బుద్ధులను ననుసరించినన్నినాళ్ళు మనుజుడు మహాత్ముడు కాజాలడు. నరుడు ధర్మమును త్యజించి యక్రమ కర్మలను సాగించుటయే పతనావస్థకుమూలమై కన్పట్టుచున్నది.

లోకమున సర్వశాస్త్రపఠనమంతయు ధర్మద్రోహికి వ్యర్థమేనని ఋజువగుచున్నది. గట్టిపట్టుదలతో త్యాగహృదయముతో ధీరుడై ధర్మకర్మ నిర్వహణమునకుపూని, తన కాయమును మతిని నొకే త్రోవయందు పయనింప చేసిననాడు జీవిత రహస్య పరిశోధనము సంపూర్తినొందిగలదు. కర్మసిద్ధాంతమును బట్టబయలొనర్చిన మహనీయుడై లోకవంద్యుడై విరాజిల్లుచుండును. ధర్మ కర్మనిర్వహణ మునకు పూనినవ్యక్తికి, ప్రతిస్థలము, ప్రతిక్షణము ప్రతిదృశ్యము తోడునీడయై వజ్రకవచమై కాపాడగలదు. ఇది త్రిలోక త్రికాలసత్యమై నిత్యమై సజీవమై సత్యాత్ములకనుభవయోగ్యమై విశ్వమునందు వ్యక్తమగుచున్నది.

ఏనాటికెవ్వని కెయ్యది ప్రాప్తమో తెలియజాలము. సర్వ శాస్త్రముల పఠించిన ప్రజ్ఞాశక్తితో నేనే గొప్పవాడినై తిననెడి దుర్గర్వ ముతో మనుజుడు ధనమునకై యతిజాగ్రత్తతో మాయోపాయము లతో తనతోడి మానవులనెందఱినో కబళించి వారి సర్వస్వమును

స్వాహాచేయుచున్నాడు. నోటాడిన నుడిని దప్పినమాటే సత్యమని వాదించుచున్నాడు. మొండి వాగ్వాదబలముతో ధర్మవిరహితమగు ధనార్జనతో జీవితగమనము సాగించి పెద్దవాడనై తిననెడి దురహంకారముతో తోడి సమాజమును వమ్మొనర్చి సొమ్మును గ్రోగుచేయుచున్నాడు. ఇట్టి దురహంకారి యార్జించిన పరాపకారవిత్తము నయాపైస మిగులక వోటికుండలోని జలమువలె తనకు తెలియకనే దుర్వ్యయమగుచున్నది.

భువివీడి దివికేగెడి సమయమున, నరుడు సర్వమును త్యజించి శ్మశానమునకు పీనుగై చేరి దహనముగాకతప్పదనెడు యథార్థ భవితవ్యస్థితిని తెలిసియు ధనాశాపిపాసాయత్త చిత్తుడై మతిచెడిన శునకమువలె వివిధస్థలముల కేగుచున్నాడు. పరాపకారకర్మములొనర్చుచున్నాడు.

జీవితమంతయు నొకరోజుపొందిన స్వానుభవగతమైన లోకానుభవమునే మానవుడు పొందుచున్నాడు. 'పాడినది పాడరా! పాచిపళ్ల దాసుడా!' యనెడిలోకోక్తి లోకులందరికివిధిగవర్తిల్లుచున్నది. మరణ సమయమువఱకు కలిమలహృదయుడైన పాపపుమానవుడు పరార్థసంగ్రహనోద్యమమునందే సతమతమగుచున్నాడు. నానాటికి మానవుడు దానవుడై పరిణామమొందుచున్నాడు.

నరునిమతి బాహ్యాబంధములవైపునకే పరుగులుతీయుచున్నది. రాగ భోగ రోగాలతో జీవితమును నరక ప్రాయమొనర్చుచున్నాడు. 'ఎవరుచేసినకర్మ వారనుభవించక నెవరికైనను తప్పదన్నా! ఏనాడు యేతీరు నెవరుచెప్పగలరు యనుభవించుటసిద్ధమన్నా!' యనెడి సినిమాగేయముసైతము కర్మసిద్ధాంతసందేశమునే హెచ్చరికచేయుచున్నది.

వ్యక్తి, రోజులతరబడిగ లోకమునందెన్నియో హెచ్చరికలను చూచుచు పతనములొనర్చుచున్నాడు. ఐనను తనకు తాను హెచ్చరిక

నొనర్చుకొనుటవీడి తనతోడివారిని 'ధర్మగమనముసాగించి తరించు డనెడి' హెచ్చరికనొనర్చుచు సత్యదూరుడగుచున్నాడు.

సద్వాంఛ సత్యదీక్ష సత్యకర్మనిర్వహణాశక్తిగల మనుజులేదేశ మేగినను దైవకర్మాసక్తులై ధర్మమార్గాచరణులై లోకోపకారకర్మ పరాయణులై మెలగుచుందురు.

ఆత్మశక్తిలేని స్త్రీ పురుషులెల్లరు, నిత్యజీవితజీవన కర్మకలాపాదులలోని బహుసూక్ష్మపరిణామమునకే తలక్రిందై తబ్బిబ్బై తందనాలతో వీధులందు పరుగులుతీయసాగుదురు.

ఇట్టి యల్పహృదయులతో విజ్ఞులైన నరులు నోరువిప్పక మౌనభావముతో మాధవుని దివ్యనామస్మరణము సాగించుటంతో శ్రేయోదాయకము.

సంఘనీతినివీడి వ్యక్తిత్వమును గోల్పోయి పెద్దల నిరసించి దైవమునుమరచి భయభక్తిశూన్యులై మానమర్యాదలను మంటగలిపి పిశాచప్రవృత్తితో శారీరసుఖములకు మరగినట్టి స్త్రీ పురుషులెల్లరు యసత్యములాడుచు చోర వ్యభిచార జూద సురాపానాది నీచకర్మలనే సాగించుచు లోకమున నేటికలికాలమున చలామణియగుచున్నారు.

ఇట్టికర్మలొనర్చెడి స్త్రీ పురుషులకెల్లరకు వారివారికర్మపరిపక్వమై యనుభవమునకు వచ్చిన దుష్టదివసములందు నింటబయట హేయముగా చూడబడుచు కఠినకర్కశ క్రూరవ్యాధులకు లోనై కన్నీటితో స్నానములు చేయసాగుదురు.

'మిడిసిపడిన మిడుతలగ్నిపాలై మసిమైన' రీతి దుష్టమనః ప్రవృత్తితో పెద్దలసూక్తుల నిరసించి, దేహధనవయోసంఘబలములతో హద్దుమీరాటిన నడతలతో కన్నుమిన్నుగానని ప్రవృత్తితో చరించెడి మనుజులెల్లరు గాసినొందెదరు.

భగవదారాధనాపరులెల్లరు ప్రకృతిశక్తికిలొంగక కడుజాగరూకతతో దుష్టహృదయులైన స్త్రీ పురుషుల దరిదాపులకు వెళ్ళక వారినిభయంకర విషసర్పములవలె చూచుచు జీవితనడకలను సాగించిననాడెట్టి యపవాదులకు గుఱికాక సద్యశశ్చంద్రికలతో భువిపై వెలుగొందుచుందురు.

తనలో వెలింగెడి దివ్యాత్మతత్త్వదర్శనమునకై నూటికొక్కరు కృషియొనర్చుచున్నారు. తదితరులెల్లరు బాహ్యసుఖములనాశించి యెడతెగని కర్మలొనర్చుచు కర్మ ఫలానుభవములతో దుఃఖితులై లోకమున కన్పట్టుచున్నారు.

దేవుడు లేడు–పరలోకము లేదు–యముడు లేడు – స్వర్గనరకాదిలోకములు లేవు, సమాజమును క్రమమార్గమునందు నడపించుటకు పెద్దలు నిర్మించిన కట్టుకథలనివాదించెడి సాహితీసమరాంగణ సార్వభౌములై నాస్తికత్వమును ప్రచారమొనర్చినట్టి శ్రీ గోపరాజు రామచంద్రరావు (గోరా) గారివంటి పెద్దలుసైతము 'కర్మసిద్ధాంతము' ను కాదనక మౌనమువహించిరి.

మాటలులేక చలనముగాక స్థిరముగానుండిన పాషాణమును దైవమనెడి భావనతో నరులు నమ్మి సేవించి పూజించి భుజించిననాడు రోగవిముక్తులై ప్రశాంతినొందుచున్నారు. ఇందునకుకారణము మనుజుడు తన మనోవాక్కర్మముల నొక్కటిచేసి విశ్వాసముతో చరించుటయే ప్రధానమై కన్పట్టుచున్నది.

శ్రీ ఏసుక్రీస్తు ప్రభువు లోకమున చరించిన రోజులలో నాటి సంఘమునందుగల వివిధరోగగ్రస్తులైన వారెల్లరు విశ్వాసముతో మావ్యాధులునిర్మూలనము కాగలవని శ్రీ ఏసుక్రీస్తు ప్రభువువారిని స్పర్శించి రోగవిముక్తులై సంతసమునొంది ప్రార్థించిరని బైబిలు గ్రంథమునందున్నది.

మానవుల సకలబంధములకు సంబంధములకు బంధవిముక్తికి వారి వారి మనోభిప్రాయములే ప్రధానములని తెలియవలెను. ప్రగాఢమైన భక్తివిశ్వాసములబలముతో నరులుద్ధరణ మొందగలరు.

నరుల రాగభోగరోగాదులకు, కీర్త్యపకీర్తి గౌరవాగౌరవములకు త్యాగ యోగ ముక్తులకు మనోవాక్కర్మములే ప్రధానములు. శక్తి వంతములైన మనోవాక్కర్మములను విజ్ఞులైన నరులు ధర్మబద్ధమొనర్చి పురోగతినొందెదరు. జ్ఞానహీనులైన మనుజులు ధర్మవిరహితకర్మలొనర్చి తిరోగతిచెందెదరు.

పూర్వకవులు లోకమును గొఱ్ఱెలగుంపుగావర్ణించిరి. వారివర్ణన లందు నిత్యసత్యమున్నది. గొఱ్ఱెల గుంపులోగల యొక్క గొఱ్ఱె నేదో దృశ్యమును దర్శించి బెదరి చెదరిన నాడు గుంపుపూర్తిగా నొకదాని వెంటనొకటి చెదరిపోవురీతి, సత్యప్రవర్తకుని యొక్క వ్యక్తి యసత్య వాదియని వాదించిననాడు సంఘమంతయు నిజమని వాకొనుచుండును. సమాజమునకు దూరదృష్టి సత్యాలోచనము చాలతక్కువగానుండును.

సమాజమునందు తక్కువసంఖ్యగలస్థితిలో మంచి వెలుగొందు చున్నది. ఈ కారణముతో లోకమును లోకదృష్టిని కవులుచెడ్డగ పాత్రములందు వర్ణించిరి.

లోకమున చెడ్డ క్షణములో వ్యాప్తినొందును. మంచిమన్వంతర మునకైన వ్యాప్తినొందదు. భక్తిగానములను విన్న లౌకికజనులు రచ్చలనుండికదలరు. ద్వేషరోషాలతో కలహధ్వనులు వీనులకువిన్పించి నంతనే సర్వాలావేశముతో కలహస్థలములకు పర్వులుతీయసాగుదురు.

వ్యక్తి, సత్కర్మనిరతుడై శక్తివంచనలేని కృషియొనర్చిననాడు విధిగఫలసిద్ధినొంది ద్వేషించినవారిచే ప్రేమించబడి గౌరవసన్మానము లకు పాత్రుడుకాగలడు. కర్తవ్యదూరుడై కృషినివీడి ప్రారబ్ధము సక్రమముగాలేదు కార్యసిద్ధి చేకూరదని నరుడు భావించుట గొప్ప పొరపాటని తెలియవలెను.

వ్యక్తి, సోమరితనము, స్వయంశక్తిని పొగడుకొనుట పరులను హేళనమొనర్చుట, గతమునకువగచుట, భవితవ్యమును మరచి చరించు టాదిగాగల యజ్ఞానపు కర్మలను పూర్తిగా త్యజించి గురు దైవములను నమ్మి శక్తివంచనలేని కృషి యొనర్చిననాడు కృతార్థుడై సంఘ గౌరవమును పొంది ధ్యేయసిద్ధి నొందగలడు.



## "ధర్మాత్ముడే! దైవకృపాపాత్రుడు"

మనుజుడు ధర్మాత్ముడుగానిదే పుణ్యాత్ముడు గాజాలడు. ధర్మాత్ముడుగాక పుణ్యకర్మలుచేసినను ప్రయోజనములేదు. ధర్మాత్ముల వలన లోకముద్ధరణ మొందగలదు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాశ్రమ వాసులు సైతము ధర్మమును నిర్వర్తించుట మిక్కిలి శ్రేయోదాయకము. ధర్మము పదిలక్షణములతో ప్రకాసించుచున్నది. ఈ పదిలక్షణములు గలవారే కైవల్యమును బొందగలరు.

"ధృతిక్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః।
ధీర్విద్యా సత్యమక్రోధో, దశకం ధర్మలక్షణమ్ ॥

(1) ధృతి=సదాస్థైర్యముగలిగియుండుట. (2) క్షమా=నిందా స్తుతి, మానావమాన, లాభనష్టాది దుఃఖములు సంభవించినను సహన శీలుడై యుండుట. (3) దమః=మనస్సును సదా ధర్మకార్యములందే ప్రవర్తిల్లజేసి యధర్మకార్యములుచేయకనిరోధించుట.(4) అస్తేయమ్= పరుల సొత్తును దొంగిలింపక యుండుట వేదవిరుద్ధముగ నితరుల ధనమును గ్రహించకుండుట. (5) శౌచమ్=రాగద్వేషపక్షపాతము లను వదలి లోపల వెలుపలను బవిత్రముగాయుండుట. (6) ఇంద్రియ నిగ్రహః=ఇంద్రియములను యధర్మాచరణమునుండి నిరోధించి ధర్మ మందే సదా నడుపుట. (7) ధీ=మత్తు పదార్థములు సేవించక దుష్టుల

సాంగత్యము చేయక, ధర్మవిరుద్ధగ్రంథపఠనము గావర్పక, శ్రేష్ఠపదార్థములసేవించుచు శ్రేష్ఠవాక్యములనేయూడుచు సత్పురుషులచెలిమితో యోగభ్యాసముచేతను బుద్ధినిశుద్ధమొనర్చుట. (8) విద్యా=పృథివి మొదలుకొనిపరమేశ్వరపర్యంతముయథార్థముగాచరించుటయు, త్రికరణశుద్ధితో లోకమునమసలుటయువిద్య. దీనికివిపరీతమైనదియవిద్య (9) సత్యమ్=ఉన్నదియున్నట్లుగాచూచుట సంభాషించుట చేయుట. (10) అక్రోధము=క్రోధాదిదోషములను వాక్యములనువదలిశాంత్యాది గుణముల గ్రహించుట, యనునవి ధర్మలక్షణములు. ఈ దశలక్షణ యుక్తపక్షపాతరహిత న్యాయాచరణమును, ధర్మమును నాలుగాశ్రమములువారును సేవింపవలయును. సమస్త దోషములనువదలిహర్ష శోకాది సమస్తద్వంద్వములకు క్రుంగకపొంగక యుండుటే ధర్మాత్ముని విధి.

ధర్మాత్ముడుగానినరుడు, పుణ్యకర్మలనిర్వహణమునకు వాగ్దానములొనర్చియు మాటదప్పిధర్మమునకు తిలోదకములొసంగుచుండును. ఇట్టియసత్యవాదికెన్ని యుగములకైనను సంసారబంధవిముక్తి చేకూరదు. ధర్మాత్ముని ముఖబింబదర్శనముతో పాపాత్ములుపావనులుకాగలరు. కారణమేమి? ధర్మాత్మునిసన్నిధికిచేరిన ప్రతివ్యక్తికిధర్మోపదేశ సందేశ వాక్యములనువినెడి మహద్భాగ్యముచేకూరి హృదయపరిణామము చేకూరగలదు.

సత్కర్మనిరతుడై ప్రయత్నశీలుడై శక్తి వంచనలేనికృషియొనర్చిన నాడేవిద్యయందైనను నరుడున్నతోన్నతస్థితినొందగలడు. ఇట్టియథార్థమును తెలియని మానవులు, 'శాస్త్రిగారబ్బాయి కవిత్వములోచాల గొప్పవాడు, శ్రేష్టిగారబ్బాయియుక్తిశక్తితోవ్యాపారమెంతోనేర్పుగా జేయగలడు, దొరగారికుమారుడు రావుగారుచాలపౌరుషశాలి, కోటిగాడికొడుకునకుచదువేరాదు' యని వదరుచుందురు, ఇదిచాల తెలివితక్కువతనము.

ఆదికాలమునందు మన ఆర్యావర్తదేశమెంతో మహోన్నత గుణసంపదతో సర్వసమత్వసత్యదృష్టితో వెలుగొందినది. కులమత వర్గభేదములేని సర్వజనక్షేమంకర ధ్యేయముతో విరాజిల్లినదని దేశ చరిత్రలవలన బోధపడుచున్నది. ఐనను నాటి సద్యశస్సును నేడు స్మరించుచు కర్తవ్యకర్మలనువీడి గొప్పవారలమని మీసములు మెలి వేయుచు భుజములు చరచినంతనే సరియైన ప్రయోజనమును బడయ జాలము.

చదువు సంస్కారములేని, కృషిచేయనివారిని గురుగా నుడువుచు మీరెల్లరు జ్ఞానహీనులు, మేమే విజ్ఞులము బ్రహ్మదేవుని ముఖమునందుద్భవమొందితిమి మీరు బ్రహ్మపాదములయందుద్భవ మొందినారనెడు తెలిసీతెలియని వాక్యములాడుచు కర్మసిద్ధాంతము గుర్తించక ఒకవేళగుర్తించినను వంశానుగతముగ జీర్ణించిన స్వార్థమును వీడజాలక నేటికిని లోకమునకర్మబ్రాహ్మణులు, యథార్థవిషయములైన పవిత్రవేదమంత్రములకు వ్యతిరేకములైన వ్యాఖ్యానము లొనర్చి గుణ వ్యవస్థను వమ్మొనర్చుచు వర్ణవ్యవస్థకు బలమును చేకూర్చుచు సమాజమునకు గొప్పకీడొనర్చుచున్నారు.

గుణగణముల విలువను గుర్తించి గౌరవించెడివారు నేటి కాలమునకన్పట్టుటలేదు. ఆనాటి పెద్దలు నోటాడిననుడికై సతిసుత ధనాదిసుఖాలను తృణప్రాయముగ త్యజించి ఘోరకాననసంచారము లొనర్చి ధర్మాత్ములై లోకపూజ్యులైరి.

ఈకలియుగమున మాయాపిశాచి వాడికోరలకుచిక్కిన నరులు మానమర్యాదలనువీడి ధర్మమును పూర్తిగా త్యజించి స్త్రీధనాశా పిపాసాయత్త చిత్తులై మేకవన్నెపులులై సంఘాపకారులై చరించు చున్నారు.

ఎన్ని యసత్యములాడియైనను, యధర్మకర్మములు చేసియైనను ధనము నార్జించుటే ప్రధానధ్యేయమని, కర్తవ్యకర్మమని సర్వసుఖ సంతోషకీర్త్యానందముల కుపాధియని, యజ్ఞానులైన మనుజులు దలంచి కుకర్మలొనర్చి కడకగచాట్లకు గురియై కన్నీరుగార్చుచు వర్ణనలకు వీలుపడని మనోవ్యధలతో మరణించుచున్నారు.

ధర్మము సత్యము న్యాయము నీతి సహనమాదిగాగల గుణములతో జీవితగమనము సాగించినవాని జీవితచరితమునే, కవులు కథగా నవరసములు వెలుగొందెడిరీతి రచన చేయుటయు నాయూరచనమును కథకులు సంగీత సాహితీసొగసులతో గానము చేయుటయు, ప్రజలు భక్తితో యాసక్తితో విని సహకారమొనర్చి కథకులకు జీవనోపాధి కల్పించుటయు లోకమున దర్శించుచున్నాము. కవి వ్రాయుటకు కథకుడు గానముచేయుటకు సమాజము హాయిగావిని కథాకథనములోని నీతులనాచరణమునందుంచి ధర్మాత్ములై చరితార్థు లగుటకు సైతము ప్రధానము ధర్మకర్మనిర్వాహకుడైన మానవుడే.

ధర్మాత్ముడెట్టివిపరీతవాతావరణమునందైనను ధర్మమునకువ్యతి రేకమైనకర్మలనాచరించడు పసిడిపడతిలోకమున పాపిష్టివానినేపాడొన రించును. ఈర్ష్యాసూయాదిగుణములుగల బంధువులెంతగొప్పస్థితిమంతు లైనను ప్రయోజనములేదు. 'చెడిస్నేహితునింటికేగుదువుగాని చెల్లెలింటి కేగకు'మని లోకమువాకొనెడివాక్యము సత్యమై స్వానుభవమై యల రారెనది. స్నేహితుడునరునిబంధవిముక్తికి తోడ్పడిసంతసముకల్గించును. బంధువుధనాశతో బంధములనుకల్గించును. బంధువులలో కొందఱు మంచివారు, స్నేహితులలోచెడ్డవారును లోకమునగలరు. అట్టి మహా త్ములుబంధువులుగాక యాత్మబంధువులని, యట్టిస్నేహితులను దురి తాత్ములనిభావించవలెను. నిజమైనమిత్రుడెన్నడు తనమిత్రునకు హాని యపకారములు చేకూర్చక క్షేమములనేచేకూర్చుచుండును.

ప్రతివృత్తియందు దుష్టశిష్ట మనఃప్రవృత్తులుగలవారున్నారు. నరునకుమంచిచెడ్డలు మాతృగర్భమునందుత్పత్తి సమయమునందే సూక్ష్మబీజములై కాలక్రమానుసరణముగా దేహబలవయోపరిణామములతో కలసియే వృద్ధినొందుచున్నవి.

ఊరుపేరు తెలియని క్రొత్తవ్యక్తులుసైతము కవికథకగాయక కళాకారులనెంతో యోర్పునేర్పులతో వెంటనంటి సహాకారమొనర్చుచుందురు. "పండుగనాడుపాత మొగుడు" యనెడి సామెతగా పాత కళాకారు లెంతటిప్రతిభాశాలురై పేరొందినవారైనను సమాజము, క్రొత్తకళాకారులయెడ మిక్కిలియభిమానము ప్రేమ త్యాగములు గలిగిమెలగు చున్నది "క్రొత్తొకవింత పాతొకరోత" యనెడి లోకోక్తి సమంజసమైకన్పట్టుచున్నది—

మతికుదిరినచోట మందుశక్తిని చేకూర్చుచున్నది. ఆలయము లోని సర్వస్వము పాషాణములే. గర్భాలయమునందు పీఠముపై వెలుగొందెడిశివలింగముపాషాణమే. ఐననుశివలింగముపైగలభక్తిమనుజులకు తదితరములైన పాషాణప్రతిమలపైగలదా? లేదు. కారణము, నరుని మనోనిర్ణయములోగల ప్రగాఢ భక్తి విశ్వాసములే. భక్తిలేనినాడు శక్తిలేదు. శక్తిలేనినాడు భక్తికుదురదు. శక్తి, భక్తి రెండింటికి గొప్ప సంబంధమున్నది. దీనినే భారతీయ సంస్కృతియని తెలియవలెను. పరిసరముల ప్రభావము వ్యక్తినిమార్చి వమ్ముచేయుచున్నది. మధురపదార్థ దర్శనముతో మానవుని జిహ్వాపై మార్పు కలుగుచున్నది. దిగంబర మగువదర్శనముతో నరుని మతి, గతితప్పి గరతమున బడద్రోయును. పదిమంది తిరునాలకు ప్రయాణమైన సన్నివేశమును జూచిననాడు ప్రయత్నములేని నరుడు ప్రయత్నమొనర్చి ప్రయాణోన్ముఖుడగును.

ఈ కార్యకారణ దృశ్యదర్శన మహాశక్తికి నరుడువశమై కర్మలు సాగించసాగును. ఇట్టి విచిత్ర కర్మస్వరూపమును భక్తి విశ్వాసములతో

ధర్మకర్మలొనర్చెడి ప్రతి వ్యక్తి బహుజాగ్రత్తతో లోకమువ చరించ వలెను. లేనిచో కర్మ దుష్కర్మమై మారణకర్మగామారి మానవుని దానవునిగా చేయుచున్నది.

కొండశిఖరమునందుండి గమనముసాగించెడి వ్యక్తి మనస్సును దృశ్యదర్శనములవైపు ప్రసరింపచేసిన వెంటనే పతితుడై ప్రాణములను గోల్పోయినరీతి దైవము ధర్మము నీతి సత్యములనే నమ్మి కర్మల నొనర్చెడి ముముక్షువు సంసార ఘోరారణ్యమున భ్రాంతి యనెడి కొండపై చేరిననాడు తన మతిని స్థితినుండి గతిదప్పనిరీతిలో సంచార మొనర్చుచున్న నాడెట్టి యాపదలకు గురిగాక యానందముతో విహ రించగలడు. మతిగతిదప్పిననాడు నరుడు వానరుడై శునకమై సూకరమై నీచాహారములతో నీచకర్మలతో నీచమానవుడై సంఘాపకారియగును.

మనోప్రవృత్తులలోని సత్యాసత్యములను ధర్మాధర్మములను నరుడు సద్గుర్వాదేశవాణిని సంస్మరణ మొనర్చి నిజము తెలిసి నిబ్బర ముగా తానుసాగించెడి ప్రయాణమును గమ్యము చేరువరకు విడువని నాడెట్టి యాటంకములుండ నేరవు. లాభనష్టముల పరిగణనతో లాభము గల్గెడి తెరవు లేదని మనోధ్యేయసిద్ధికై సాగించెడి ప్రయాణమును నరుడు కాదని స్వస్థానమునకుచేరి సుఖమును పొందెదనని వెనుకకు మరలిననాడు సత్యశక్తి వెంటనే విజృంభించి మనోవిభ్రమము కల్గించి తప్పటడుగు వేయించి కన్నిటికి కారణమైన దుస్థితిని చేకూర్చగలదు. ఈ దుస్థితినుండి విముక్తి కల్గించి నరుని యుద్ధరణమునొందం చెడి వారెవ్వరు కన్పించరు. ఏ సత్యశక్తిని, మనోధ్యేయమును కాదనెనో నరుడద్దాని నాశ్రయించి "అన్యథాశరణమ్నాస్తి త్వమేవశరణంమమ" యని హృదయపూర్వకముగ ప్రార్థించి తన తప్పునుతా నెఱింగి గడచిన దానికై చింతించక ధైర్యముతో సత్యధ్యేయ కర్మాభిముఖుడై గమించిననాడుసత్యశక్తియే పతితునిపావనునిగామార్చి భగవద్గుణకీర్త నానంద రసానుభూతికి పాత్రునిచేసి పరిరక్షించగలదు.

ఇట్టి చిత్రవిచిత్రకర్మగతి స్వరూపకర్తయగు శ్రీమన్నారాయణ మూర్తి దివ్యలీలా విలాస వినోద ప్రదర్శములన్నియు, భక్తుని హృదయ గత దోష సంస్కరణ మొనర్చి శుద్ధజీవనకర్మ విధాతగా పరిణామము కల్గించును. 'బంగారమును కొనెడి వ్యక్తి చూచిన బంగారమంతయు తీసికొనక వన్నెవాసి పరీక్షకై నిప్పులలోవేపి కాల్చి సుత్తెతో కొట్టి కొట్టి తదుపరి గీటురాయిపై గీచి సక్రమముగా తానొనర్చిన పరీక్షలకు తగ్గక వన్నెతో వెలంగిననాడు బంగారమును క్రయధనమొసంగి తీసి కొనెడి'రీతిగ విశ్వస్వరూపుడు సర్వవ్యాపకుడు సత్య నిత్యసనాతనుడైన భగవానుడు తన భక్తునిగా నరునెన్నుకొనెడి ముందుగా కఠిన పరీక్ష లకు గుఱిచేసి. "పరీక్షలకు లొంగక క్రుంగక తెగడక సత్యాదర్శకర్మ నిరతుడై జీవితగమన మొనర్చెడి భక్తవతంసుని" కరుణతో కాపాడి తన వానిగా ముద్రవేసి ముద్దిడుకొనును.

ఈ భగవద్రహస్యస్థితి నెఱుగని యజ్ఞాన మానవులెల్లరు, 'భక్తి గలవానికి కన్నీరు భక్తిలేక దైవకార్యములకు జనక నింద్య కర్మలలో మునిగి తేలెడి లౌకికునకు పన్నీరు' యని లోకమున పలురీతులలో పలుకుచు భక్తిగలవారిని గేలిసేయుచుందురు.

దైవభక్తిగల వ్యక్తియైనను, చీకటి త్రోవయందు పయనమై పాదరక్షలు లేక మార్గమును చూపెడి దీపములేక భగవన్నుతితో నడక సాగించిన ప్రమాదములకు గుఱియగును. ఇట్టి సమయములందు లౌకిక జనులు 'ఓహో! భగవానునినమ్మి స్మరించెడి భాగవతుడుసైతము కాలుజారి తలక్రిందై ప్రమాదమునకులోనై కన్నీరుగార్చుచున్నాడు. దేవుడేమైనాడు? ఏమైన రక్షించేనా? లేదు. ఇవన్ని బూటకములు నాటకములు దేవుడులేడు దయతో రక్షించెడివాడుకాడ'ని భక్తులతో వాగ్వాదము లొనర్చుచుందురు. విషయద్వంద్వములలోని లోతులను తెలియని సామాన్య భక్తులెల్లరు 'నిజమే! మనము దైవమని ప్రార్థనలు

చేయుట దైవకార్యములకు విరాళమొసంగుటాదిగాగల సత్కార్యము లన్నియు చేయుట మిక్కిలి తెలివితక్కువ' యని భావించి దైవ విశ్వాసమును గోల్పోవుదురు.

ప్రతికర్మయు కారణములేక జరుగనేరదు. భక్తుడైన మనుజుడు కర్మలోపముతో ప్రమాదముపాలై భగవానుని నిందించి దైవదూరు డగుచున్నాడు. ఇట్లు భావించుట భక్తుని హృదయ దౌర్బల్యము విషయరహస్యమును గుర్తించని లోటని తెలిసికొనవలెను.

భగవానుడనంతశక్తి సంపన్నుడు. భక్త రక్షణ దీక్షాకంకణధారి. ఒక్కొక్క సమయమునందు భక్తి-శక్తి దూరాలోచనగల ముము క్షువు సైతము 'నేనాడిన నుడి ననుసరించనినాడు నాకేమి లోటని, యెక్కడైన దేవుడు గలడు శ్రీశైలము తిరుమలమొదలైనక్షేత్రాలకు శ్రీవ్యాసాశ్రమము శ్రీకపిలగిరిసిద్ధ తపోక్షేత్రము, శ్రీరామతీర్థ సేవాశ్రమములకు వెళ్ళుట భజన లొనర్చుట కథాగానము లొనర్చుట మిక్కిలి ప్రయాస శరీరశ్రమ ధననష్టము కల్గుచున్నవి. ఎక్కడకు వెళ్ళక పైసా ఖర్చుగాని పద్ధతితో నాగృహమందే దైవపీఠము చెంత కూర్చుని దేవదేవుని దివ్యగుణకీర్తన మొనర్చిన నాడేమి దైవాప రాధములేదని' భావించి దైవకార్యక్రమ నిర్వహణ మొనర్చును.

దైవమునుస్మరించినను ముముక్షువునకు శ్రమ బాధతప్ప మరెట్టి ప్రయోజనముచేకూరదు. ఇందలిరహస్యమేమియని సత్యాలోచన చేసిన నాడు దానిపరమార్థము ప్రతివానికర్థమగుచున్నది.

శ్రీ భగవానునిదివ్యగుణకీర్తనాది కార్యక్రమనిర్వహణ మొన ర్చెడివారితో, సాధుపురుషులై శ్రీలక్ష్మీనృసింహోపాసకులైనపెద్దలతో, సత్యాదర్శకర్మనిర్వాహకులైన కవిపుంగవులతో నరుడాడిన నుడిన స్వార్థముతో తప్పిచరించిన తప్పిదమేముముక్షువైనను, వీడక వెన్నంటి దుస్సంఘటనలపాలజేసి కన్నీటికిగురిచేయుచున్నది.

భగవానునినమ్మి భజించుచు ధర్మకార్యాచరణుడైన ముముక్షువు హృదయదర్పణమున కావరించిన యసత్యకర్మప్రభావ ధూమమును, జగత్పతి వెంటనే సూక్ష్మరూపములైన కష్టనష్టములను చేకూర్చి కర్మదోషపరిహారమొనర్చి భక్తునికి దివ్యజాగృతి కల్గించి సంరక్షించుకొనును. భక్తునిపైగల కరుణతో భగవాను డిట్టి దుస్సంఘటనల నేర్పరచి పరిరక్షణ మొనర్చుచున్నాడు.

దేవునికరుణ నరునిపై ప్రసరించిననాడు కష్టనష్టములకులోనై కన్నీరుగార్చసాగును. ఎన్నికష్టములుచేకూరినను భక్తుడుధర్మమునుదప్పక చరించిననాడు ధర్మస్వరూపుడైన దేవదేవుడైన గోవిందుడే తోడు నీడయై సర్వమును సమకూర్చి సంరక్షించుచుండును.

వినయవివేకసౌజన్యాదిగుణసంపత్తి లేక, పరువుప్రతిష్ఠలనుమంట గలిపి ధనకాంక్షతపనతో, తెలిసినసామాన్యధర్మమునువిడచి పదిమందికి వెగటైనవాక్యములతో నడివీధిలో చిందులుత్రొక్కెడి నీచహృదయులైనస్త్రీ పురుషులు, పర్వములందు పదిమందికిమిన్నయై భగవన్నామభజనలుసాగించినను 'గాడిదకెత్తినగంధపుచెక్కల' రీతిగ పరిణామమొందెదరు. ఇట్టికుటిలహృదయులొనర్చెడి నామభజనాదికార్యక్రమము చేత, నిజమైననడవడితో ప్రశాంతమతులై జీవిత గమనములొనర్చుచు భగవానునిభజించెడివారి హృదయములకెంతో బాధయాందోళనలు గల్గుచున్నవి. ''పథ్యములేనిమందులెంతకాలము సేవించినను రోగి రోగవిముక్తినొందజాలనిరీతి''—ధర్మచ్యుతితోనరులు సాగించెడి దైవకర్మల వలనయెట్టిశాంతినొందజాలరు. దుష్టవాతావరణమునందు నివసించెడి సజ్జనులెంతయో తగ్గియొగ్గిపరులొనర్చెడినిందాస్తుతులకు పొంగకక్రుంగక సమాయత్తచిత్తులైజీవితములను 'తీగపైనడక' వలె గడుపవలెను. లేనిచోబాధలకు గురికావలసియుండును. ఇట్టిచోటులయందు నివసించుటయు వారి ప్రారబ్ధకర్మప్రభావమని తెలిసి, శిష్టవాతావరణముగల స్థలమునకు చేరుటెంతయో ముదావహమని సమయముకొఱకు వేచి

సర్వేశ్వరుని భజించవలయును. సర్వముసర్వేశ్వరుడే సమకూర్చి సజ్జనుల సంరక్షించగలడు. "పదుగురాడు మాట పాడియై ధరజెల్లుచొక్క-డాడుమాట యెక్క-దెందు" యనెడి వాణియెంతయో లోకానుభవమును చాటుచున్నది. పరమసాత్త్వికమూర్తి శ్రీ విభీషణుని కెట్టి యిక్క-ట్లు చేకూర్చెను నాటి రావణుడు. సద్గుణమూర్తియైన శ్రీ ప్రహ్లాదమూర్తిని కన్న తండ్రియైన శ్రీ హిరణ్యకశ్యపుడు ఘోర హింసల పాల్జేసెను. ధర్మశాస్త్ర కోవిదుడైన శ్రీ విదురుని నీతి వాక్యములను 'రాజరాజు' పెడవాదనలతో ఖండించి దుష్టుడని నిందించి కడకు సర్వమును గోల్పోయి దిక్కు-లేని మరణమునకు గురియయ్యెను.

నాటినుండి నేటివరకు లోకమున దుష్టజనులు కండకావరముచే, సంఘబలముతో శిష్టజనులను గౌరవములేని పరుష వాక్యములతో గేలిచేయుచు హింసలకు గురిచేసి కడకు వారొనర్చిన కర్మ పరిపక్వమై, నాటి రావణ హిరణ్యకశ్యప దుర్యోధనాదులవలె దిక్కు-చెడి మనో వేదనలపాలై బలవన్మరణములకు గురియై చరిత్రలో దూషింపబడు చుండిరి.

"చేపలవాని సహవాసముకంటె అత్తరువానితో కలహము మేలు" యనెడి సామెతగ, గుణవంతునితో నరులొనర్చెడి నెయ్యము వియ్యము హాయిని యానందమును చేకూర్చును. గుణహీనునితో నరులొనర్చెడి నెయ్యము వియ్యము కడకు కయ్యముగా పరిణామమొందించి కన్నీటికి గురిచేయుచున్నవి.

దుష్ట హృదయులైన స్త్రీ పురుషులతో సాత్త్వికహృదయు లెంతయో జాగ్రత్తగా మెలగుచు, పనిబడి తమయొద్దకుచేరి వినయముతో సంభాషించినను వారితో మనసిచ్చి మాట్లాడక మంచి మాటలతో వారినిసాగనంపి బహుదూరముగా వారికి మసలుటెంతయో శ్రేయోదాయకము.

"ఒట్టి బర్రె కరుపు లెక్కువ" యనెడి లోకోక్తి యంతెంతయో సత్యమున్నది. సమర్థుడైనవ్యక్తి తనతోడి సమాజముతో నెంతయో వినయ వివేక సౌజన్యహృదయుడై సరససాత్త్విక సంభాషణము లొనర్చును. అల్పప్రజ్ఞతో దూరదృష్టిలేని దుష్టమానవుడే పెద్దలతో పరుషవాక్యములాడుచు అంకెలు వేయసాగును. ఇట్టి దుష్ట సంస్కారులైన మనుజులను సాకుగా నెన్నుకొని పూర్వీకులైన తత్త్వవేత్తలు "అంకెలేసెదవేమి? 'రామ రామ' యనక, గుంటనక్కలపాలౌ కుంక, నీ దేహము" యని వారి రచనలందు పేర్కొనిరి.

మేధాశక్తి, ఓర్పు నేర్పు నిదానము నిగ్రహము ప్రశాంత హృదయము సత్య వాక్యాచరణముగల వ్యక్తి వయస్సున పిన్నవాడైనను వానినే పెద్దలెల్లరు పెద్దగ నెన్నుకొని వాని సలహాలను పాటించిననాడే సంఘము పురోగతి నొందగలదు.

లోకమున జనులు మధ్యవర్తియొద్దకుచేరి వాని సలహా సహకారములతో వారికిగల పేచీలను నివృత్తి చేసుకొనుచుందురు. మధ్యవర్తినే సంఘము పెద్దమనిషి పెద్దశెట్టి పెద్దకాపు పెద్దరెడ్డి యని పేర్కొనుచుందురు. ఈ మధ్యవర్తికి వయస్సు సంపదతో పని లేదు. 'కాటాముల్లువలె' పక్షపాతములేక ధర్మముగల మనుజుల పక్షముననే మేలుం చేకూర్చవలయును.

నేటి కాలమున యెక్కువ సంఖ్య పెద్దమనుష్యులు ధర్మపక్షపాతమునువీడి దైవముగలడనెడి భావనలేక ధనాశతో నధర్మపరులై దుందుడుకు కర్మలనే చేయుచున్నారు. ఇట్టి వారికే నేటి లోకమున పలుకుబడి పరపతి హెచ్చుగా చేకూరుచున్నది. ఇది కలి ప్రభావమని తెలిసి ముముక్షువులు నోరు విప్పక వారి వారి విధ్యుక్తకర్మలొనర్చుచు పరోపకారపరాయణులై మెలగవలయును.

త్రికాలములందును ధర్మకర్మ నిర్వాహకులనే దైవము తోడు నీడ్పైమై కాపాడుచుండెను. ధర్మమే దైవము. దైవమే ధర్మము. ధర్మమును విడచి నరుడు దైవమును భజించినను ప్రయోజనములేదు.

ధర్మమునుదప్పకచరించిన శ్రీహరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవాది చక్రవర్తులు సతిసుతాదులను రాజ్యలక్ష్మిని గోల్పోయి కడకు కష్టములనుండి విడివడి సర్వసుఖ భోగ సామ్రాజ్యాది సుఖములను పొందిరని చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది.

నవకోటి శివాలయములలో పరమేశ్వరు నర్చించి పూజించి భక్తితో భజించిన నాటి శ్రీరావణబ్రహ్మ సైతము పరకాంతాసక్త చిత్తుడై ధర్మభంగ మొనర్చి సకుటుంబ ససైన్యముగ శ్రీ రామ బాణాగ్ని కాహుతి చెందెను.

ధర్మమును రక్షించిన నరుని తిరిగి ధర్మమే రక్షించుచున్నది. ధర్మమును శిక్షించిన నరుని తిరిగి ధర్మమే శిక్షించుచున్నది. ధర్మము దప్పక నరులు లోకమున చరించిననాడు కలియుగము ధర్మయుగ మగును. ఏ గృహమందు గృహాధికారి గృహిణి ధర్మబద్ధులై కర్మల నాచరించెదరో యాగృహము సర్వశుభ శ్రీలతో వెలుంగుచుండును.

ధనాశకు నరుడు బానిసగాని నాడే ధర్మమును కాపాడుకొన గలడు. ధనాశాబద్ధుడైన మానవుడు ధర్మమును త్యజించుచున్నాడు. సర్వశాస్త్రములను కంఠస్థ మొనర్చిన పెద్దలే, ధనార్జన జిడ్డులోచిక్కి, పవిత్రములైన ధర్మాదేశములతో వేదాంత భావములతో విరాజిల్లెడి గ్రంథములపైగల క్రయములను పెంపొందించి వ్యాపార దృష్టితో విక్రయ మొనర్చు టెంతటి శోచనీయమో?

గీర్వాణభాషలోగల నీతులను, రకరకములైన రూపములతో మహావ్యాఖ్యలతో వ్రాయుట పఠించుట సులభము. ఆ నీతి వాక్య

సముదాయమునందొక్క వాక్యమునైన యాచరణమునందుంచు టెంతయో కష్టమైనది. వ్యక్తి వాగ్రూపమునకనుగుణమైన యాచరణముతో జీవితము సాగించిననాడు పూజనీయుడగును. భక్త జనుల కుపయోగమైన పవిత్ర గ్రంథములపైగల వెలలను దిద్ది వెలపెంచి విక్రయించుట హైందవమునకే కళంకమాపాదించినట్లనిపించుచున్నది. "ఎక్కడైనా బావా! యనెదవుగాని వంగతోటవద్ద యనరా"దనెడి సామెత హిందూమత గ్రంథములను విక్రయ మొనర్చెడి వారిలో స్వార్థపరులయెడ సార్థకత నొందుచున్నది.

ఏ మహత్తరశక్తి వ్యక్తిచే వ్రాయించి భక్తులచే విరాళము లిప్పించి ముద్రణచేయించి వేలాది ప్రతులను భక్త జనుల కమ్మించి యర్థసంపత్తిని తుష్టిగా చేకూర్చినదో? ఆ శక్తిని మరచి స్వయం ప్రజ్ఞతో లౌకిక భక్తుడు గ్రంథక్రయములను తారుమారొనర్చి విమర్శకుల దృష్టిలో తేలికయగుచున్నాడు.

గ్రంథరచయితలలోను, విక్రయమొనర్చెడి వ్యాపార సంస్థాధీశులలోను కొందరు ధనమే ప్రధానధ్యేయముగానెంచి శ్రీ గీతాది మహోగ్రంథములను సైతము, సంతలో కూరగాయలవలె కాలాను గుణముగా గ్రంథములపైగల వెలలను పెంచి విక్రయ మొనర్చు చున్నారు. ఈ సూచనను ఆధ్యాత్మిక పెద్దలలోగల కొందరు విధిగ గుర్తించి ధనాశకు తిలోదకములొసగి త్యాగజీవనులై తదితర మతస్థుల విమర్శలకు గురికానిరీతిలో నేటినుండియైన చరించి ముముక్షు జన సహస్రములలో 'ధర్మమే నరుని రక్షించును. ధనము కాద'నెడి దివ్య భావనకు బలము శక్తిని చేకూర్చెదరని హృదయపూర్వకమైన ప్రార్థన.

క్రైస్తవమతప్రబోధ గ్రంథములు హిందూమత ప్రచార గ్రంథములకంటె తక్కువ వెలలకు సంఘమునకు విక్రయ మొనర్చుట

సర్వులకు తెలిసినదే. దైవదర్శనము సద్గ్రంథ పఠనము తీర్థయాత్రా పర్యటనమాదిగాగల సాత్త్విక కర్మలు తేలిక రూపముతో యున్న నాడే సర్వులు సంసిద్ధులౌట నేటికాలమున చూచుచుంటిమి.

పూర్వకాలమున కాశీ రామేశ్వరాది యాత్రలు చేయుట లోకమునందు నూటి కొక్కరిద్దరు. సర్వసౌకర్యములు సమకూరిన నవీన కాలమునందు తీర్థయాత్రా పర్యటన మొనర్చెడి భక్తుల సంఖ్య పెంపొందినది. వ్యక్తి కాశీ రామేశ్వరాది యాత్రలు చేసివచ్చుటకు మూడువందల రూపాయలు ఖర్చగుచున్నది. ఇట్టి యాత్రలు చేయు వారి సంఖ్య చాల తక్కువ. ఐనను మూడువందల రూపాయలు ఖర్చుతోచేసెడి కాశీ రామేశ్వరాది యాత్రా పర్యటనము ప్రత్యేక బస్సుల నిర్వహించెడి వ్యాపారులు సతిపతికి కలిసి కాశీ రామేశ్వరాది యాత్రా పర్యటనము మూడువందలరూపాయలని ప్రచారము చేసినచో చేయవలసిన పనులకు స్వస్తిచెప్పి వందలాది దంపతులు కాశీ రామేశ్వరాది యాత్రా పర్యటనమునకు సంసిద్ధులై తహతహలాడు చుందురు.

శ్రీ కాశీవిశ్వనాథునిపై యచంచల భక్తితోకాదు, శ్రీరామే శ్వరములో భోళాశంకరుడైన శ్రీరామలింగేశ్వరునిపై విశ్వాసముతో కాదు. మూడువందలరూపాయల ఖర్చుతో దర్శించెడి దృశ్య దర్శన మహాద్భాగ్యమును సగము ఖర్చుతో వ్యక్తి దర్శించవచ్చుననెడి లాభదృష్టితో యాత్రలు చేయుటవలన ప్రజా హృదయములలో సత్పరిణామము చేకూరదు.

మన పెద్దలైన పూర్వులు తీర్థ యాత్రల సృష్టించినది లాభ నష్టముల దృష్టితోకాదు. వివిధ ప్రాంతములందుగల జనుల స్వభావ స్వరూప కర్మాదికములను, వారి వారి దుష్ట శిష్టగుణ వృత్తి ప్రవృత్తుల లోని పరిణామదశలను, బీద పేద బాధలుగల నరుల స్థితిగతి నిహాసాది విశేషములను, దేశకాలపాత్రానుగుణమైన కర్మలను, దివ్యశక్తి

స్వరూపులైన మహాత్ముల దివ్యాత్మ ప్రబోధరీతులను, యాత్రాపర్యటన ములందుగల శరీర కష్టమును, వ్యవసాయ వ్యాపారాది కర్మలులేని రోజులలో దైవ సన్నిధిలోచేరి ప్రశాంత మతితో నరులు భక్తితో ప్రార్థనచేయు మహావకాశముగలదనెడు మహోన్నతాశయములతో తీర్థయాత్రా పర్యటనములను సృష్టించి పుణ్యము పురుషార్థమని ప్రబోధము లొనర్చిరి.

వ్యక్తి, క్షేత్రము లెన్ని దర్శించినను హృదయక్షేత్రమునందు గల భౌతిక సుఖపిపాస తగ్గని నాడెట్టి ప్రయోజనములేదు. సాత్త్విక సంపత్తి దైవ భక్తిగల ముముక్షువులు పరమ పవిత్రములైన దివ్య పుణ్య మహాక్షేత్ర రాజములను, విరాగమును చేకూర్చెడి సుందర ప్రశాంత ప్రకృతి వాతావరణములో దివ్యములై విరాజిల్లెడి శ్రీ తిరుమల తిరుపతి, శ్రీశైలము, శ్రీ సింహాచలము, శ్రీ ఎగువ అహో బిలము, శ్రీ యాదగిరిగుట్ట, ఋషీకేశము యాదిగాగల క్షేత్ర రాజములను భక్తితో దర్శించి భగవద్భజనము లొనర్చిననాడు విధిగ సత్పరిణామము నొందగలరు.

తీర్థయాత్రలు శ్రీ భగవద్గీతాది మహాగ్రంథ పారాయణములు శ్రీ ఏకాదశి వ్రతాది పుణ్యకర్మలు. శ్రీరామ – శ్రీకృష్ణ, నామ భజన సప్తాహ కార్యక్రమములు, శ్రీ శివరాత్రి జాగరణ మహా పర్వములందొనర్చెడి శ్రీ శివాభిషేక మహాకర్మములన్నియు సమాజమునందు "దయ, కరుణ, సత్యము, అహింస, బ్రహ్మచర్యము, మౌననిష్ఠ, ధ్యాననిష్ఠ, సత్యదీక్ష" మొదలైన సాత్త్విక కర్మలను యలవరచి దుర్గుణరహితుల నొనర్చి భక్తమూర్తులుగా పరిణామము నొందించుటకే సమాజక్షేమంకరులైన పెద్దలు సువిశాల దృష్టితో కర్మసిద్ధాంతమునందిట్టి తాత్త్విక కర్మలను నిర్ణయమొనర్చి ప్రచార మొనర్చి ప్రమోదమును చేకూర్చిరి.

సదసద్వివేకముగల సద్గుణ సంపత్తిచే మానవుడనాదినుండి నేటి వరకు గౌరవ మర్యాద సత్కార సన్మాన పూజాదుల కర్హుడై వెలుగొందుచున్నాడనెడి సత్యమునే గత చరిత్రాంశములు ధృవపరచు చున్నవి. గుణముచేతనే జాతిని గ్రహించవలయును. మోక్షాసక్తులై సత్కర్మనిరతులైన వారెల్లరు బ్రహ్మవిద్య కర్హులే. ఇందులకు దృష్టాంతము సూతాది మహామునులు విదుర ధర్మవ్యాధాదులు వీరందరు గుణముచే బ్రహ్మవిద్య కర్హులై బ్రహ్మజ్ఞాన సంపన్నులయిరి. ఎందరో బ్రాహ్మణేతరులు పరమశ్రేష్ఠులై నిషిద్ధాహారములను సేవించక సదాచారపరాయణులై గీతాపారాయణ జప తపాదులను సలుపుచు బ్రహ్మవిద్యాసంపద్యశోవిరాజితులై పవిత్రముగ కాలమును గడుపుచున్నారు. వీరలు వృత్తి గుణము స్వభావము సంస్కారము చేతను యథార్థ బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానసంపన్నులు. ఈవిషయము నెవరును నిషేధింపజాలరు. ఇది పరమసత్యము. ఈ యథార్థ తత్త్వమునే ప్రస్తుతకాలమున పందొమ్మిదవ శతాబ్దమున శ్రీ వ్యాసాశ్రమ సంస్థాపకులు శ్రీ సద్గురు మళయాళ మహర్షివర్యులు లోకమునకు పరమదయామతితో పదే పదే పలువిధ గ్రంథములలో బహువిధ ప్రమాణములతో ప్రబోధమొనర్చి గణనీయమైన గుణములతో దివ్యాచరణమూర్తులై సాధుస్వరూపులై విలసిల్లెడి శిష్యుల నెందరినో బ్రాహ్మణేతరులలో తయారుచేసి గుణవ్యవస్థకెంతో గౌరవ మర్యాదలు చేకూర్చి, కుమతులైన బ్రాహ్మణుల గర్వమునణచి బ్రాహ్మణత్వము, సత్త్వగుణ సంపద్విభవమేనని ఎలుగెత్తి చాటి పరమపదము నొందిరి.

శుద్ధ సాత్త్విక తత్త్వమునే బోధించెడి శ్రీ మహాభాగవత గ్రంథమునందు నారదుడు దాసీ పుత్రునుగానుండి, ఆషాడశుక్ల యేకాదశినుండి కార్తీకశుక్లయేకాదశి వరకు. చాతుర్మాస్యకాలమునందే పరమహంసలగు మహర్షులద్వార బ్రహ్మోపదేశమునుపొంది బ్రహ్మ

జ్ఞాన సంపన్నుడయ్యెనని కలదు. ఇట్టి కథల స్వరూపములకుగల పునాది యగు గుణవ్యవస్థను విమర్శనాబుద్ధిచేత నరుడు గుర్తించి సర్వజనా సమాదరణముతో జనతా జనార్ధనుని సేవించిననాడు మహోన్నత దశను పొందుచున్నాడు.

భువనమోహిని సంతాపకారిణియైన మాయా స్వరూపిణియగు శక్తిని నిర్జించి భక్తజనసంకటహారణుడై జగజ్జనస్తోత్రపాత్రుడై వేద స్వరూపుడై సర్వశక్తులకు మూలకారణుడైన శ్రీమన్నారాయణుని భజించుట మరచి, క్రొత్తగా వెలసిన వ్యక్తిగత శక్తులనే విషయము తెలియని జనులు ప్రేమించి భజనలు సాగించుచు, భవబంధ విముక్తిని చేకూర్చెడి కార్యక్రమములను త్యజించి తలకొకరీతి సంభాషణలు సాగించి విజ్ఞుల తాత్త్విక సంభాషణముల నిరసించి, పునాదిలేని, యజ్ఞులు సృష్టించిన, గత కాలమునాటి కట్టుకథలనే విశ్వసించి 'దారములేని గాలిపటముల' రీతిగ వికృత భావోన్మత్తులైన మానవులు స్వేచ్ఛావిహారము లొనర్చుచుండిరి.

నిజమును గుర్తించెడి నిజభక్తమణులకు కట్టుకథలలో, గట్టి కథలలోగల ప్రధానాంశమైన ధర్మకర్మ రహస్య మొక్కటియే. 'పచ్చికాయలను రకరక పదార్థ సమ్మేళనముతో వండి, తినెడి వారికి పాకశాస్త్ర నిపుణుడందించి సంతృప్తి నొందించిన' రీతిగ, కవి సంఘ క్షేమాభిలాషతో తనకుగల సరస సుందర సారస్వత శక్తితో, తన లోకానుభవమును స్వానుభవమును తానుపాశించెడి దైవశక్తి ప్రసార బలముతో కథలను నిర్మాణ మొనర్చి తనతోడి సమాజమునకందించిన నాడు వివిధ సంస్కారములతో లోకమున చరించెడి మానవులు వారి వారి మనస్సులకు నచ్చిన విషయములు సత్యములనుచు తదితర విషయ ములు కవి కల్పితములని నిరసించుచుందురు.

ఆ నాటి అయోధ్యాపురీశుడైన శ్రీరఘురామచంద్రుని భగవదవతారమని ధర్మరక్షణ కరుదెంచిన మాయా మానవ వేషధారియని శ్రీ వాల్మీకి మహర్షి శ్రీరామాయణ రచన మొనర్చిన కారణముతో సర్వలోకారాధ్యుడై నేటికిని ప్రతి గ్రామమున వివిధ కైంకర్యముల నొందుచు విలసిల్లుచున్నాడు.

లోకమెంతో విచిత్రమైనది. శక్తిలేని భక్తిలేని ధర్మకర్మాచరణములేని సామాన్య వ్యక్తిని, ఏ కవిపుంగవుడైన సాహితీ సమర మార్తాండుడైన, 'భగవదవతారము మహాశక్తివంతుడు వీరాగ్రేసర చక్రవర్తియని, లోకమంతా మోకరిల్లి ముక్తి నొందినదని' రచన లొనర్చి ప్రచారముచేయరు.

సాక్షాత్ భగవదవతారమై భారతావనియందవతరణమొంది సర్వజనక్షేమంకరుడై స్వార్థత్యాగియై సత్యవాక్పరిపాలకుడై కష్టనష్టములకు గుఱియై దుష్టజన మారణ మహాకర్మ ధర్మనిర్వాహకుడై భూపతియై బహుకాలము వర్ధిల్లినను, కవి ఆ భూపతి జీవిత చరిత్రాంశములలోగల సూక్ష్మదోషములను తొలగించి భూపతి నిర్వర్తించిన సాత్త్వికకర్మ ప్రభావశక్తులను వర్ణనాత్మకముగ పదిరెట్లు పెంపొందించి పవిత్రపద భావసంపుటీకరణమొనర్చి మహాకావ్యముగ రూపొందించి లోకమునందు సాహిత్యాభిలాషులైన పెద్దలకందించనినాడు గతకాలమునందవతరణమొందిన మహావ్యక్తుల మహోత్తమకర్మలు వాని విశేషములు నేటి లోకమునకు వ్యక్తముకాజాలవు.

ఈ కార్యకారణసంబంధమునకు పునాదికర్తలు చరిత్రనాయకుడు చరిత్ర రచయిత, "జననీజనకులు లేనినాడు సంతతికవకాశము లేని" రీతిగ కవికల్పనాశక్తిలేనినాడు కథానాయకుడు సమాజమునకు తెలియబడడు. కథానాయకుడులేనినాడు కవి శక్తిసామర్థ్యములు లోకమునకు తెలియజాలవు.

ఆదర్శకవుల కవితలే లోకపురోగతికి దివ్యసోపానపం క్తి. దుస్వార్థపరులై నాస్తికహృదయులై కీర్తితపనతో పరితపించెడి కుకవుల కవిత్వములెల్ల లోక తిరోగతికి ప్రధానములై యున్నవి.

ఆదర్శవినిర్మలజీవిత గమనములోనచ్చెడి మహాకవుల రచనలలో నిరాడంబరత నిత్యసత్యనిరతి లోకక్షేమంకరదృష్టి వివిధ శాస్త్రార్థ రహస్య వివరణములు, భక్తిజ్ఞానవైరాగ్యతత్త్వముక్త్యుపదేశములు తాండవించుచుండును.

ధర్మశాస్త్రపరిజ్ఞానము కావ్యపరిచయము సద్గురుభక్తి నిత్యధర్మ కర్మానుష్ఠానము నిరాడంబరత పాపభీతిలేనికవుల రచనలలో, నాస్తికత స్వార్థపరుల వాగ్వాదమునకవకాశము, పాపకర్మాశక్తి ధర్మకర్మలపై విరక్తి, నింద్యకర్మలలోరక్తి గల్గుటకెంతోయవకాశము విజృంభించు చుండును.

మహాకవి శ్రీ బమ్మెరపోతనామాత్యుడెంతో భక్తిరస ప్రపూర్ణ హృదయుడై నిశ్చలచిత్తుడై నిరాడంబర గృహస్థాశ్రమ నిర్వాహకుడై పతితపావనుని భగవానుని దివ్యాదర్శ మహాగుణగ్రహణ పారీణుడై శ్రీరఘురామపదకమల సేవానిరతుడై లోకమునకెంతో గుణపాఠ మొనర్చి పావనజీవన విధాతలగా రూపొందించనెంచి, మధురగాధా మహాభాగవత నిర్మాణమునకు శ్రీమన్నారాయణుని కర్తగా నెన్ను కొని జీవన్ముక్తిసామ్రాజ్యమునొంది సర్వభక్తజన స్తోత్రపాత్రుడై మహాకవియై తెలుగువారి హృదయములలో భక్తిని మేల్కొల్పి చిరకీర్తివర్ధనుడై వెలుగొందెను.

నరుడు కర్మసిద్ధాంతములను నిరసించి నిత్యజీవితాచారణమునం దుంచనినాడాతని భక్తిజ్ఞాన యోగాది మహాకర్మలన్నియు నిష్ఫలములై పనికిమాలినవాడగును.

సద్గురూపదేశకాలమున ముముక్షువు గుర్వాదేశములను నిర్వ ర్తించగలనని ప్రమాణములొనర్చును. పెండ్లికుమారుడు తన వివాహ కాలమున పెండ్లి పెద్దలు, పురోహితుని సమక్షంలో మంగళధ్వనుల సందడిలో మంగళసూత్రధారణ సమయమున "అర్థేచ కామేచ మోక్షేచ నాతిచరామి" యని ముమ్మారు ప్రమాణములొనర్చును. కాలక్రమమున నరుడు నిత్యజీవితజీవనకర్మనిర్వహణ సమయములందు పెద్దలతో నెరవేర్చగలను, నిర్వర్తించగలను, పూర్తిచేయగలను, మీతో నుడివినప్రకారమే మీ సన్నిధికిరాగలను, కార్యక్రమమును విజయవంతముచేయగలను, ఆరుమూడైన మూడారైన మాట తప్పెడివాడనుకాదు, నామాటకు తిరుగులేదు, మీరు నిర్వహించెడి ధర్మకార్యమునకు నేను నూటపదహారురూపాయలు విరాళము బంపిస్తాను నాపేరు వేయించండి బాబూ! యని వాగ్దానముచేయుటయు, మొద లైన తాత్త్విక సాత్త్విక కర్మలలో తప్పటడుగువేయుచున్నాడు. ఇట్టి యసత్యవాది కర్మసిద్ధాంతమును పాటించక భక్తిజ్ఞాన వైరాగ్య ప్రబోధములు తనతోడివారికి చేసినను ప్రయోజనములేదు. కర్మ యోగమునందు నిర్వర్తించవలసిన సత్యవాక్యాచరణము పరధన కాంతా విరక్తి పరోపకారమాదిగాగల కర్మలను త్యజించి లోకమున చరించిన నాడు తరించలేడు.

ధర్మమునుత్యజించి దైవములేడని స్వయంప్రజ్ఞతో మాయకు బానిసమైన మానవుడు యసత్యకర్మలతో ధనాకాంక్షాతపనతో రాత్రింబవళ్ళు సమాజపరమైన ధనమును స్వాహాచేసినను సుఖజీవన మొనర్పజాలడు. పైపెచ్చు కష్టనష్టములపాలగును. "దొంగతనము చేసెడివ్యక్తి భార్యమెడ కాళీగాయుండవలసినదే" యని పెద్దలు పలుకుచుందురు. వ్యక్తి కష్టార్జితమే నిలువగలదు.

పాపము పుణ్యము మనము సృష్టించినవే. నరుల కృషితో నిర్మాణమొనర్చిన గుడిలో దేవతా విగ్రహమును ప్రతిష్ఠించినది

మంత్రాలు తంత్రాలు యంత్రాలు తెలిసిన పెద్దలే. గట్టిగట్టి వాక్యములను మంత్రాలనుచు దేవభాషయనుచు తెలివి విద్యగలవారు లోకమున వాకొనుచుందురు. దేవుడే నిజమైనచో శక్తి యంత్రమునకు మంత్రమునకు యుండినచో గుడిలోగల పాషాణప్రతిమ నోరువిప్పి యెప్పుడైన మాట్లినదా? సదాయర్చించెడి పూజించెడి పూజారి వినెనా? దుష్టవృత్తిగల దుండగులు దేవునిపై గల సకలవిధ సువర్ణరజితాభరణాది వస్తుసంపత్తిని దొంగలించిననాడు దేవుడులేచి వారిని శిక్షించి సంరక్షించుకొనెనా? వేదపారాయణ మొనర్చెడి పండితులు దైవార్చకులైనను జరుగనున్న దొంగతనమును గుర్తించి జాగ్రత్తపడి దైవాభరణములను నిలుపుకొనగల్గితిరా? అనెడి ప్రశ్నలతో నరుడు సమస్యా పరిష్కారమునకు సరియైన సమాధానముచిక్కక సతమతమగుచున్నాడు.

పరమపవిత్రములై మహాశక్తివంతములై మహిమాసంపద్విభూతితో లక్షలాది భక్తుల నాకర్షించెడి గొప్ప దేవాలయములనెడి సద్యశస్సుతో విరాజిల్లెడి శ్రీ తిరుమల-తిరుపతి, శ్రీకాళహస్తి, శ్రీశైలము, శ్రీ భద్రాచలము, శ్రీ యాదగిరిగుట్ట మొదలైన దేవాలయములలో నొక్కటియై నిత్యపూజాదికైంకర్యములతో గిరిపై ప్రశాంతవాతావరణముతో విలసిల్లెడి శ్రీ సింహాచల వరాహ నృసింహ స్వామివారి దేవాలయములో నిరువది శతాబ్దమునందు దుండగులు నిలువుదోపిడిచేసినారనెడి పత్రికాసమాచారమును విన్న ముముక్షువుల కెంతో బాధ యాందోళనలు చేకూరినవి.

ఆందోళనలేకాక, ఎంతోకాలమునుండి దేవుడని సమాజమెంతో భక్తితో బహువిధకైంకర్యములొనర్చి భజించి వారివారి యిక్కట్లనుండి విముక్తినొంది దైవారాధనతో జీవితములను గడపెడిస్థితియందిట్టి దైవాపరాధకర్మల విషయములు విన్ననాడు దేవుని శక్తి యేమైనది? ఆలయప్రాంగణమునందడుగిడిన వెంటనే దుండగుల నేత్ర దృష్టిని నాశనమొందించలేదా? అక్రమ మార్గానువర్తులైన సేఛ

మానవులచేతులను స్తభింపచేయలేదా? యనెడి సందేహాస్పదములైన ప్రశ్నలెన్నో భక్తుల హృదయములందుద్భవించి సంతాపమునకు గురి యగుట కవకాశమున్నది.

అనేక దేశములయందెంతో గొప్పగ ప్రచారమునందున్నట్టి క్రైస్తవ మతమునకు మూలపురుషుడు మతకర్తయైన శ్రీ ఏసుక్రీస్తు ప్రభువువారినానాడు యూధులెంతో కఠినమైన శిలువ శిక్షవేసి బాధించిననాడు రక్షించుకొను శక్తిలేదా? యనెడి ప్రశ్నలు సమాజమునందున్నవి.

ఇట్టి దైవకర్మల విచిత్రలీలలు నరులెల్లరకు తెలిసికొనుటకు సాధ్యముకాదు. ఇందులకు సరియైన సమాధానము పెద్దలు నిత్యము పలికెడి సూక్తులయందే తాండవించుచున్నది. "దేవునికి తెలియనిదేది యునులేదు. దుష్టాత్ములైన చోరుల మనోగత సంకల్పమూన్నియు దేవుడు గుర్తించి శిక్షించగలడు. ఏనను సాక్షిగ నిరీక్షించుచుండును. సామాన్య మానవుని జేబులోగల ధనము నెవ్వరైన దొంగిలించినచో నాతనిమతి తారుమారై తందనాలు త్రొక్కసాగును. దొరలను దొంగలను సర్పాలను వారివారి కర్మలకనుగుణముగ సృష్టించి జగత్తు నాడించెడి నరసింహస్వామికి రత్నాభరణములపై భ్రాంతి చోరులపై ద్వేషముగలుగునా? సర్వజీవులు దేవుని సంతతి. ఆసంతతిలో కొందరు భూషించినను కొందరు ద్వేషించినను సంతోష సంతాపముల నొందెడి వాడు దేవుడుకాజాలడు.

జగన్నాథుడైన దేవునికి నరులలంకారమొనర్చెదరా? ప్రసాదము లర్పించెదరా? భక్తిగల మానవులు సంకల్పించుకొనిన కర్మలు కర్తవ్యములు. దేవదేవుడైన మహనీయమూర్తి శ్రీలక్ష్మీనృసింహ మూర్తి కన్నుమూసిననాడు, సప్తపాదోధులేకమై సర్వజగత్తును తనలో కలుపుకొనగలడు; అట్టి యవ్యయుడైన నరసింహదేవుని శక్తి

లేనివాడని తెలిసీతెలియని నరులు వదరుచు కాలమును దుర్వ్యయ మొనర్చుచుండిరి.

నరులొనర్చెడి పాపకర్మలఫలము కాలగమనమునందనుభవము నకువచ్చి సర్వవిధముల పతనమునొందించి పడరానిపాట్లకు గురిచేయ గలదు. దొంగవాడు తానుసాగించెడి చోరకర్మ విజయవంతము కావలెనని మ్రొక్కుబడి చెల్లించుకొనెదనని ప్రార్థనచేసియే దొంగతన మొనర్చుచున్నాడు. ఆ కారణముతో దేవుడు పేక్షవహించుచున్నాడని లోకమున కొందరు పలుకుచున్నారు.

ఇట్టి విపరీతవ్యాఖ్యానము సమంజసముగానేరదు. కారణమేమి? కన్నతల్లి నర్థించినతఱి తనబిడ్డకువలసిన వస్తువుల నొసంగి గౌరవముతో బ్రోచుచున్నది. ఆతల్లినే కన్నబిడ్డ పరుషవాక్యములతో బలవంతముతో వస్తుసంగ్రహణ మొనర్చిననాడు తల్లి కోపావేశముతో "ఓరీ! నీవు పుత్రుడవుకాదురా! పుత్రరూపముతోయున్న పగవాడివిరా! నీకు వినాశము తప్పదురా! నీ పాపముపండిననాడు కన్నీటితో కృంగి కృశించెదవురా!"యని వెగటు వాక్యములాడురీతిగ, నరుడు భక్తితో విగ్రహారాధనయొనర్చి దేవుడని భజించి కానుకలర్పించి మనః పూర్వకముగా సత్యశక్తిగలదనెడి యపారవిశ్వాసముతో జోహారు లొనర్చి సకలబంధములనుండి విముక్తినొందసాగును. అట్టి శక్తిగల దేవతావిగ్రహములపై తళతళ కాంతులతో మెరసెడి సువర్ణరజిత రత్నాభరణములను, నరులు స్వార్థముతో, "దేవుడు నరుడుచేసిన ప్రతిష్టించిన సుందరపాషాణప్రతిమయే! మేము సంగ్రహించిన మమ్మేమి చేయుననెడి" దురూహలతో దుష్టకర్మ కుపక్రమించి దైవాపరాధ కర్మలు సాగించిన నాడా ప్రతిఫలమూరకపోదు.

కొంతకాలము భువిపై చరించి కాటికేగెడి కఠిన సమస్యా పరిష్కారమునకు మార్గమన్వేషించక, పొట్టకూటికై తగినకర్మలనువీడి

సులువుగా నోరులేని దేవతలపైగల బంగారమును కబళించనెంచి వక్రకర్మ లతిజాగ్రత్తతో నిర్వర్తించి గుడివీడి దూరప్రాంతముల కేగినను, కంటికి కన్పించని సర్వగతమై శక్తివంతమై భాసిల్లెడి దైవ శక్తి వీరవిజృంభణముతో విశ్వవ్యాప్తమై దుష్టకర్మలుసాగించిన దుండగుల వెంటనంటి పట్టి బంధించి పరితపింపచేసి నిష్టదరిద్రులుగా మార్చి ఘోరవ్యాధులకు గుఱిజేసి జీవచ్ఛవముల కరణి చావుగాని చావుతో సతమత మొనర్చి దైవశక్తి లోకమునకు ఋజువుచేయు ననుటలో నెవ్వరికెట్టి సందేహమువలదు. కాలమే క్రమముగ సాక్ష్యమివ్వగలదు.

ఘోర క్రూర వ్యాధులతో వికలాంగులై తినుటకు తిండిలేక కట్టుటకు బట్టలులేక నివాసమునకు గేహములులేక వీధుల కిరుప్రక్కల లోను దేవాలయసోపానపంక్తులలోను కేకలువేయుచు 'బాబో! పాపకర్మలుచేసిన పాపులము నయ్యాపైసా ధర్మముచేసి పుణ్యము నార్జించుడి' యనెడి రోదనధ్వనులు సర్వులకు విన్పించుచు వారి దురంతదుస్థితి కన్పించుటలేదా! వారెల్లరు గతకాలమున కన్నుమిన్ను తెలియక దేవుడు లేడని నాస్తికులై దైవాపరాధకర్మ లొనర్చిన వారేనని మహాత్ములైన శ్రీ భగవాన్ రమణమహర్షి శ్రీరామతీర్థ స్వామి శ్రీ మహాత్మాగాంధీ తదితరులైన ప్రవక్తలెందరో నొక్కి చెప్పిరి.

తాత్కాలిక సుఖభోగ సంతృప్తికై లోకమున యజ్ఞులైన స్త్రీ పురుషులు భవతవ్యస్థితులను మరచి హేయకర్మలొనర్చి ధనమును "తేనెటీగలవలె" నిల్వచేయుచున్నారు. దుష్టకర్మార్జిత ధనమువలన నరులు లోకమున సుఖములను బడయజాలరు.

పేద పౌరులలో సంస్కారముగల పుణ్యాత్మాదయులు పరుల కపకారములేని కర్మలనే సదాయొనర్చుచు హాయి యానందములను

పొందుచు తృప్తితో శాంతితో నిద్రించుచుందురు. ఈ కష్టజీవుల కెన్నటికి రోగములు రాజాలవు. నష్టములులేని రోగాది బాధలులేని ప్రపంచ రాజకీయములతో పనిలేని నిరాడంబర జీవితములనే గడపు చుందురు.

ఏకష్టములులేని కష్టములోనర్చని పట్టణజీవితములోనర్చెడి సుఖ భోగలాలసులైన నరులకేరోగాలు సంప్రాప్తములై పసగలపదార్థములను తినుటకు వీలులేక పేదవాని భోజనమునకునైతము తక్కువైన సాద ముతో భోజనము గావించెడివారు నేటి కాలమున కోకొల్లలుగా కన్పించుచున్నారు. దీనియంతటికి కారణము క్రమశిక్షణములేని డాంబిక దైవాపరాధకర్మలను సాగించుటేనని పాఠకులు తెలియవలెను.

ఏ కష్టములేని యైశ్వర్యవంతుల బిడ్డలు శ్రమచేసెడి పనులులేక యారోగ్యహీనులై యాహారమునుతిని జీర్ణించుకొనజాలక చివరదశలో తప్పనిసరియై వ్యాయామాదికర్మలలోప్రవేశించి తమతమ కండలను కఱగించి మిక్కిలిశ్రమతో కడకారోగ్యవంతులై పరిణామమొందు చున్నారు. కర్మయొనర్చి కష్టించకతప్పదనెడి నిజమీరూపమున వ్యక్తమగుచున్నది.

సర్వము తనయందేయున్నది. తానే సర్వమునందున్నాడు. ఈ యద్వైతతత్త్వమును తెలియక కొందరు తెలిసియు స్వార్థ వ్యామోహమునకు బానిసలై కొందరు, సంఘవ్యతిరేకములైన హేయ కర్మలతో చరించుచున్నారు.

జననీ జనకులు బంధుమిత్రాది సోదరులు గురుదైవము మొద లైన వారెవ్వరైనను కారణములేక నరుని కరుణతో చూడరు. "అట్టు పెట్టినమ్మకే యట్టున్నరలభించు" ననెడి యార్యోక్తి సర్వులకు వర్తించుచున్నది.

భూమిని దేవతనియు, భూనాథుడైన శ్రీమన్నారాయణుని దేవుడనియు సర్వమానవులు సహజముగా సంభాషించుచుందురు. ఇందెంతో విశేషార్థము వ్యక్తమగుచున్నది. ప్రతి ప్రాణి గర్భమునుండి బయల్వెడలి భూమిపైపడి "క్వా" యని ప్రార్థనచేయుట కారంభము చేయును.

మాతృ గర్భమునుండి విడివడిన నరుడు, భూమిపైపడి పొరలుచు కాలక్రమమున పెంపొంది పెద్దవాడై చరించి యాభూమి నేనమ్మి కర్షకుడై కష్టించి పాటలు పండించసాగును. కొందరు వ్యాపారులై యాభూమిపై పండిన వస్తుసముదాయమునే కొనుగోలుచేయుచు తదితరుల కమ్మకము చేయుచు జీవనముచేయసాగుదురు. కొందరీ భూమిపై పెరిగి పెద్దలై ఘనమైన చదువులతో యున్నతోద్యోగములోనర్చి హాయిగ షికారులు చేయుచుందురు. కొందరు భువిపై పెరిగి పెద్దలై కవులై పండితులై కథకులై, గాయకులై, జ్యోతిష వాస్తుశాస్త్ర విశారదులై భూపతులై, యోగులై, స్వాములై, మహాత్ములై పరగుచుందురు. ఇన్ని రూపాదులతో విలసిల్లెడి నరులలో నూటికి తొంబదిమంది, భూనాథుడై జగత్పతియై సర్వశక్తితో వెలింగెడి దేవుని పూర్తిగా మరచి, సంసారమే సత్యమని, సతిసుత ధనాది సుఖ సంతోషాదులే నిత్యమని దిన దినాభివృద్ధిచెందెడి దేహములే, శాశ్వతానందమునకు నిలయములని నమ్మి, మరణ మొకనాడు గలదనెడి మాటను మరచి దైవదర్శనమున కెట్టి తాత్త్విక కర్మలను చేయక నానాటికి శక్తిక్షయమై రోగాలపాలై మాయకులోనై కడకు వృద్ధులై ప్రాణములను గోల్పోయి భూమిపై పడి శవములై కాటికి మోయబడి కాష్టములలోచేరి యగ్ని కాహుతియై భూతిరాశిగామారుట సత్యము. కాదనగలమా ?

ఇట్టి భాగ్యమునకు కలి మాయాగ్రస్తుడైన మానవుడు నీది నాది సర్వము నాదే యనెడు దుర్భావముతో ధనాశతో ధర్మ కర్మ

లను త్యజించి ధనము నార్జించి దైవమును మరచి నయాపైసేనియు తనవెంట తీసికొని చనుటకు సాధ్యముగాక దేహాభిమానముతో సంసారముపైగల మమకార బంధనముతో పాపకర్మార్జిత పాయసాద్ధి పదార్థ భక్షణలతో మధు మాంసాది మత్తు పదార్థ సేవనముతో కండలతో పెంచిన మొండిదేహమునుసైతము గతిలేక మట్టిపై విడచి చరిత్రకు స్వస్తిచెప్పి యెక్కడికో తరలిపోవుచున్నాడు. జనులెల్లరు యేనాడో యొకనాడీస్థితి ననుసరించవలసినదేనని తెలిసి తను మనో ధనాదులను సద్వినియోగ మొనర్చుటెంతో ముదావహాము కర్తవ్య కర్మమని తెలియదగిన సత్యమైయున్నది.

శ్రీ సద్గురు దేవుల మహత్తర మహిమాన్విత శక్తియే భక్తిగల శిష్యుని సంసారసాగరోత్తరణమునొందించి తరింపచేయగలదు. భక్తితో ధర్మాత్ములై సద్గురుశక్తిని సదానమ్మి చరించెడి శిష్యుని పరిరక్షించి భవసాగరమున మునకలువేయనిశక్తిని ప్రసాదించెడి దేశికేంద్రులు శ్రీశ్రీశ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారు. శ్రీ లక్ష్మీ నృసింహస్వామికళావతారమూర్తులై, ప్రకాశముజిల్లా మార్కాపురము సమీపమున శ్రీ కిపిలగిరియొద్ద శ్రీ నృసింహబ్రహ్మైక్యము నొందిరి. మహాశక్తిస్వరూపులై నమ్మి సేవించెడి భక్తులబ్రోచుచు నేటికిని వెలుగొందు చుండిరి. ప్రతి సంవత్సరము శ్రీ పుష్యశుద్ధ త్రయోదశి మహాపర్వ శుభదివసమునందు, భక్తిగల శిష్యుల సేవాసహాకార సంపత్తితో వీరి పుణ్యారాధన మహోత్సవము మహావైభవముగ జరుగు చుండును. భక్తి శక్తిగల హాటెందరో స్వామివారి పుణ్యారాధన కార్యక్రమమునందు పాల్గొనుచుందురు. వారివారి జీవితములను జీవిత పరమైన కర్మలోపములను సంస్కరణమొనర్చుకొనుచు పుణ్యజీవనులై మెలగుచుందురు.

ఆదర్శాధ్యాత్మిక దేశికేంద్రులైన శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి యోగాత్మ మహాశక్తియే "కర్మసిద్ధాంతము"

నీ విధముగా గుప్తలోచేరి వ్రాయించినది. అట్టి దివ్య చైతన్య స్వరూపులైన శ్రీ సద్గురుస్వామివారు లభించినను, మాయా బద్ధులైన శిష్యులు సంసారసాగరతరంగ తాడనములకుగురియై శ్రీసద్గురు నాజ్ఞలను, వారి మహనీయ మంగళ మధురసుందర సత్య సందేశముల లోని లోతుల గుర్తించుట కశక్తులై కాలమును వారికాయములను కామ్యకర్మలకే దుర్వ్యయ మొనర్చి కడకు కర్మశేషముతో లోకమును వీడుచున్నారు.

సంసారఘోరకాననమున విచ్చలవిడిగ సంచారములొనర్చెడి నరులు, వారి గతకాల పుణ్యకర్మల ప్రభావముతోడై సద్గురు సన్నిధికి చేరి సద్గుర్వాదేశ మహామంత్రమునుపొంది, దీక్షతో సత్యనిరతితో నిరంతర జపానుష్ఠానశక్తితో, జీవనభృతికై సంస్కారమునకు తగిన వృత్తితో చరించుచు, కామక్రోధాద్యరిషడ్వర్గమృగభంజనులై సర్వ జన చిత్తరంజనులై ముక్తిమార్గానువర్తనులై సంసారసుఖ పిపాసా విరక్తులై సర్వభూత సమాదరణచిత్తులై సర్వసంశయరహితులై శ్రీ సద్గురుపాదసంసేవనులై చరించిననాడు కైవల్యము నొందెదరు.

మహాకవులై పండితులై గాయకులై గౌరవ ఘన సన్మానముల నొందిన నరులైనను, వారి వయస్సులందొనర్చిన శాస్త్ర నిషేధ సంఘాపకార కర్మలఫలము విడువక వెన్నంటివయస్సుడిగి శక్తి క్షీణించిన రోజులలో విజృంభించి పలురకములైన బాధలకు గురిచేసి పైసా పరపతిలేని దుస్థితిపాల్జేసి కన్నీటిలో కాపురముచేయించును.

నరులిట్టి వ్యక్తులనుభవించెడి కడగండ్లను కన్నారజూచిన నాడైనను కర్మశక్తి విజృంభణ భయంకర స్వరూపమునకు వెరచి వారొనర్చెడి అన్యాయాసత్యాక్రమదౌర్జన్య దుష్టనష్ట కష్ట కర్మములకు తిలోదకములిచ్చి ధర్మకర్మలు నిర్వర్తించిననాడు తీర్థస్వరూపులై యాత్మానందులై భువివర్ధిల్లగలరు.

కార్యసిద్ధిచేకూరెడు సమయమువచ్చెడి వఱకు నరులోర్పు వహించక హృదయాందోళనలతో తహతహలాడినను కార్యనిర్వాహ

ణాధికారులకు జోహారులర్పించినను ప్రయోజనమును బడయజాలరు. నరులొనర్చెడి సత్కర్మలు పరిపక్వమై ఫలమునుచేకూర్చెడి మహాపర్వ శుభసమయములందు నిరాకరించినను నిరపేక్షకుడైనను వీడక వరించి తరింపచేయును. ద్వేషించినవారే ప్రేమతో పూజించి స్తోత్రము లొనర్చుచుందురు.

వ్యక్తి ప్రారంభించిన శాస్త్రవిహితకార్యములందు విఘాతము కల్గినను, ధీశక్తితో ధీరత్వముతో పట్టుదలతో శక్తివంచనలేని కృషితో కర్మమొనర్చిననాడు తప్పక కార్యసిద్ధి చేకూరగలదు.

వ్యక్తి, సాగించెడి శాస్త్రనిషేధకార్యారంభమునందు జయము లాభము సంతోషము సంఘమునందు పలుకుబడి పెట్టుబడికి రొఖ్ఖము లభించినను బహుకాలము నిలువక, వచ్చినలాభమునకు పదిరెట్లు నష్టముచేకూరి పలుకుబడి నశించి పెట్టుబడికరవై పతితుడై పలు బాధలకు లోనగును.

జగత్తున స్వార్థరహితకర్మ నిర్వాహకులైన సత్యాత్ములకే భయము బాధ్యత భక్తి మెండు. స్వార్థపరులై నీతినిజాయతీలను మంట గలిపి విచ్చలవిడిగా సర్వస్థల సంచారములొనర్చెడి కలికాలపు పెద్ద మనుష్యులకు భయము భక్తి బాధ్యత పూర్తిగా శూన్యములైనవి.

ఇట్టివారి నోటిమాటలకు నోటు వ్రాతలకు విలువ నశించినది. కట్టుకున్న సతికన్న, కుమారులు ఇరుగుపొరుగు పెద్దలుసైతము వీరి వాక్యములనమ్మి ప్రవర్తించరు. వీరికి చేతిలో పైసలున్నంతకాలమే భుక్తి. లేనినాడెవ్వరు కరుణతో సంభాషించి సహకరించరు. ఇట్టి దారుణ వాతావరణమునకు గురియైన కలికాలపు మధ్యవర్తులైనట్టి యీ పెద్దమనుష్యుల హృదయములందెట్టి సత్పరిణామము కన్పట్టదు. వీరి జీవితములు నిరర్థకములు ప్రయోజనశూన్యములు భూమికిభారము సమాజమునకు కళంకహేతువు. ధనమునకై యెట్టి నింద్యకర్మలనైన

సాహసముతో చేయుదురు. ఇట్టి పెద్దమనుష్యులనుచూచి సమాజము భయపడుచు తప్పక సంభాషణములు సాగించుచు కాలమునకై కాచి వేచియుండును. శక్తిగల్గియు తనకంటె తక్కువస్థితి బలముగలవారికివ్వ వలసిన బాకీలకు తిలోదకములొసంగి మరణమును మరచి భయమువీడి చరించుచుందురు. ఇట్టి సంఘాపకారులైన పెద్దమనుష్యుల దౌర్జన్య దుష్టకర్మలు పరిపక్వమై వారి పాపము పండిననాడు, సమాజమునందుగల శక్తి యేకమై విజృంభించి పెద్దమనుష్యుల రూపములోనున్న దుష్టనరుల నంతముచేయుచున్నది.

---

## ధర్మశక్తిస్వరూపము

ఈ కర్మచక్రపరిభ్రమణములోని లోతులను నీతులను పరిణామ రీతులను పాఠక సోదరులు గుర్తించి ధర్మాత్ములై దైవభక్తిపరులై ధర్మకర్మలకు ప్రోత్సాహమునుచేకూర్చి ధనమును సద్వినియోగ మొనర్చిన, హైందవమత మహోన్నతాశయములకు బలమునుచేకూర్చి మతోద్ధరణము నొందించిన, గొప్ప పుణ్యమునార్జించి సద్యశస్సుతో కలకాలము వర్ధిల్లగలరు.

స్వార్థత్యాగులై సత్ప్రవర్తనముతో పరోపకారపరాయణులై సంచరించెడి పెద్దమనుష్యులను, సంఘము ప్రేమించి గౌరవముతో సహకారమొనర్చుచు పూజ్యభావముతో చరించుచుండును. సంఘము నందు సంభవించెడి నిత్యజీవనకర్మలలోగల యొడిదుడుకు ప్రమాదము లను, కఠినసమస్యలకు సరియైన పరిష్కారములను, స్వార్థత్యాగాదర్శ మూర్తులైన పెద్దమనుష్యుల సమాధాన సహకార సానుభూతులతో నివృత్తినొంది నిత్యానందముతో సుఖజీవన మొనర్చుచుందురు.

ఆదర్శమూర్తులై సద్గుణసంపత్తితో సంఘ సమస్యలను పరిష్కారమొనర్చెడి పెద్దమనుష్యుల చలువతో బలహీనవర్గముల వారెల్లరు ప్రభుత్వ కార్యాలయములకు వెళ్ళెడి దుస్థితినుండి విముక్తి నొంది శాంతి భద్రతలతో యొరులప్రసక్తిలేని జీవితములను గడుపుచు యానందించుచుందురు.

'వేసవిలో రాలిన విత్తనములన్నియు వర్షఋతువునందుద్భవ మొందినరీతి' సహృదయులతో నరుడొనర్చిన సత్సంభాషణాది సత్కర్మల ప్రభావము నశించక కాలగమనమున రూపధారణచెంది పూర్ణ ఫలమును ప్రసాదించును.

'ఇసుకయందు జల్లిన విత్తనములు బీజమెత్తనిరీతి' దుష్టమనః ప్రవృత్తితో చరించెడివారితో నరుడొనర్చిన ధర్మకర్మ ప్రసంగము లన్నియు వ్యర్థములగును. కృషీవలుని కృషి సారవంతమైన క్షేత్రము నందే ఫలమివ్వగలదు. కవిపండిత విద్వత్కథకగాయకమణులొనర్చెడి సంగీత సాహిత్య విద్వత్కథాకదన పాండితీప్రతిభాదులన్నియు రసజ్ఞ హృదయులైన పెద్దలయెడ గౌరవ మర్యాద పూర్వకములైన బహుకృతులంది పునీతములగును.

కవి కథక పండిత గాయక నృత్య వాద్య కళాకారులాదిగాగల పెద్దల విద్యాప్రదర్శనములశక్తి వారి గత పుణ్యకర్మఫలము తోడుగాని నాడు "మృత్పాత్రలోని మణిదీపమువలె" ప్రజలదృష్టికి గోచరము గానేరదు. ప్రజాదృష్టికి వ్యక్తముగాని నరుని విద్యాసంపదకు ధన గౌరవాదులు లభించజాలవు.

ప్రతి వ్యక్తికి నాని విద్యాశక్తికి ప్రచారమువలన సంఘమున ఘనమైన గౌరవ మర్యాదలు చేకూరగలవు. ప్రచారము ప్రయాణ సౌకర్యము నివాసవసతి లేనినాడు లోకమున గొప్పగొప్ప క్షేత్రము లందు జనసంచారము తక్కువై జీర్ణరూపములై విలసిల్లినవి. ఆ జీర్ణ

క్షేత్రరాజములే ప్రచారములై వసతి సౌకర్యములతో విలసిల్లిననాడు వేలాది ప్రజలు దర్శనానందకాంక్షాసక్తులై ధనవ్యయ మొనర్చి క్షేత్రములకుచేరి జీర్ణోద్ధరణ కార్యక్రమములను త్యాగముగల ధనవంతులు చేబూని సర్వాంగసుందరముగ తీర్చిదిద్దించిరి.

ప్రతికర్మను మానవుడు ప్రయత్నముతో సాధించగలడు. నరుడు ప్రయత్న మొనర్చెడి కర్మ ధర్మవిహితమైననాడు సత్సంస్కారులు చేయూతనిచ్చి విజయవంత మొనర్చగలరు. ధర్మవిరుద్ధములైన కర్మలను నరులు చేబూనిననాడు దుఃఖములొందగలరు.

పరపీడనమే పరులవస్తు సంగ్రహణమే పరాపకార చింతనయే పరకాంతా, ధనాసక్తియే నరుని జీవితమును వమ్మొనర్చి కన్నీటికి గుఱిచేయగలదు. స్త్రీ, ధన, కీర్తులపై నరులకుగల దురాశయే మెల్లగా చల్లగాలాగి గరరమునదింపి నిడుమలపాలొనర్చి దరిద్రులగా మార్చి పరులొసంగెడి ప్రసాదమునకు కాచివేచియుండెడి దుర్భర దీనావస్థలకు గుఱిచేయుచున్నది.

దురాశాపరుడు లోకమునందేమూలకేగినను యేయే కర్మ లొనర్చినను కడకు కన్నీరు దప్పను. నరుడాశాపాశమునకు కట్టువడక నిరంతరము తన మనోవైఖరిలోగలిగెడి దురాశాశక్తిని, ధర్మోపదేశ రహస్య విశేషవివరములుగల సద్గ్రంథపఠన ప్రభావశక్తితో నిరోధించి నిలకడగలమతితో ధర్మాపరాధములేని కర్మను చేబూనిన నాడెట్టి చింతలులేని ప్రశాంత జీవితముతో యాదర్శమూర్తియై వెలుగొంద గలడు.

నేటి లోకపుస్థితి చాల విచిత్రముగ 'రంగులరాట్నము' వలె పరిభ్రమణము నొందుచున్నది. బంగారముతో వస్తువులు చేయించెడి వారి సంఖ్య తరుగుచున్నది. బందరు బంగారువస్తువులు కొనెడి వారి సంఖ్య పెంపొందుచున్నది. కారణము ముందుచూపులేక తాత్కాలిక

సౌందర్యము నాశించుటయేనని మనకు తెలియబడుచున్నది. ప్రతి వృత్తియందీ తాత్కాలిక లాభదృష్టి గోచరమగుచున్నది.

ఆదర్శమైన భక్తితో సరస సుందర సాహిత్యసంపదతో సంప్రదాయ సంగీత సమ్మేళనముతో విలసిల్లెడి కథలను గానముచేయువారిని గౌరవముతో ఆహ్వానమొనర్చి కథాకదనముల నిర్వర్తింపచేయు పెద్దలు లోకమున నరుదైరి. ఒకవేళ ఉత్తమ సంస్కారముగల పెద్దలెవ్వరైనయుండి యాదర్శాధ్యాత్మిక కార్యక్రమములను చేబూని నిర్వర్తించిననాడు, లౌకికులు గుర్తించజాలక కార్యక్రమ నిర్ణయ స్థలముల వైపునకే రాలేని దుస్థితితో చరించుటయు, ఉత్తమ సంస్కారము, సుసంస్కృతియందాసక్తిగల విజ్ఞులైన పెద్దలు బహుకొద్దిమంది మాత్రము విజ్ఞాన కార్యములందు పాల్గొని హృదయ పరవశత్వము నొందుటయు నేటి లోకమున కన్పించుచున్నది.

కాముక వాక్యములతో వ్యంగ్యనటనలతో భగవద్భక్తుల హృదయములకు బాధాకరములైన కథాసన్నివేశములతో సాగించెడి, ధనకాంక్షాతపనతో చరించెడి కథకులవైపునకే లోకము మ్రొగ్గి పరువులుతీయుచున్నది.

సర్వసమర్థులై కవిపండితగాయకులై యాదర్శజీవిత గమనముతో విజ్ఞుల హృదయముల రంజిల్లచేసెడి భాగవతోత్తము లొనర్చెడి శ్రీ హరికథాగానములుజరిగెడి స్థలములలో బహుకొద్దిమంది శ్రోతలు కన్పించుచున్నారు. "పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా?" యనెడి మహాకవి శ్రీ వేమనయోగీంద్రులువారి సూక్తియేలోకమున సార్థకత నొందుచున్నది. కాలవాహిని కెవ్వరెదురీదజాలరు. లోకగమనము నానాటికి పాతాళమునకే పరిటీలుగొట్టుచున్నది. ఈవిపరీత పరిస్థితిని కాలమే శిక్షించి సత్ఫరిణామమునొందించగలదు. ప్రజలలోగల దుష్ట వాంఛాఫలితమే లోకమున పెనుతుఫానులు బీభత్సములొనర్చెడి

వరదలు భూకంపాది ప్రమాదములు చేకూరుటకు కారణమా! యనిపించుచున్నది.

దైవకార్యక్రమ నిర్ణేతలలో సైతము కొందరు ప్రజలు కంటి నిండారాని కార్యక్రమములు గణనీయములైనను, మాకేమి ప్రయోజనములేదని ధర్మదృష్టిని పోనాడి దైవశక్తిని మరచి పదిమంది పెద్దలతో నేకీభవించి కవ్వించి నవ్వించెడి కాముకచేష్టా నిపుణులైన కథకులను కథకురాండ్రను యాహ్వానించి దేవుని మహోత్సవ కైంకర్యాదులొనర్చెడి పర్వసమయములలో గౌరవించి ఘన మర్యాద లొనర్చి వారిచే భక్తిలేని సినిమా పాటలతో తిక్కెత్తించెడి రీతిలో కథలను చెప్పించి వయస్సులోగల బాలబాలికల భవితవ్యమును పాడుచేసి కీడు వాటిల్లచేయుటెంతటి విపరీతవర్తనమో? విజ్ఞులైన పెద్దల కవగతమై నవయువకుల ప్రేరణకర్మములను నిరోధించుటకు శక్తిలేక హృదయావేదనల నొందుచుండిరి.

నేటికాలమున ప్రతిగృహమున ప్రతివాని మెడలో రేడియోలు మ్రోగుచునేయున్నవి. ఆ రేడియో ప్రసారములలో సంప్రదాయమైన సంగీతకచ్చేరీలు, సన్నాయి డోళ్ళు మృదంగ వాయులీన వీణాది వాద్యకచ్చేరీలు వినువారరుదైరి. ఆరితేఱిన వాద్యకళాకారులు శక్తితో సంగీత సాహితీ విద్యా ప్రదర్శనములొనర్చుచు భక్తిజ్ఞాన వైరాగ్య తత్త్వముక్తిదాయకములగు శ్రీత్యాగరాజస్వామివారి కృతిగానములు 'రేడియోల'లో ప్రసారములైననాడు వినెడి శ్రోతలు తక్కువై సంగీత కచ్చేరీలనుమార్చి కామవాంఛలు రేకెత్తించెడి సినిమా పాటల ప్రసారమునే మార్చుకొని సంతృప్తినొందుట పెద్దలెల్లకు తిలకించుచునే యుండిరి.

నేటి యువతరమువారు కావ్యకథలను శ్రీమద్రామాయణ మహాభారత భాగవతాది మహాగ్రంథ కథలలోగల మధుర సుందర

మహనీయవర్ణములను గుర్తించి యానందించెడి భారతీయ సుసంస్కార సంపత్తిని పూర్తిగా గోల్పోయి, కామవిలాస విలాప కథలను వినుటకు తహతహలాడుచు పూర్వ సంస్కృతిని ద్వేషించుట కారంభించిరి.

ఆదర్శ కవిపండిత గాయక కథకోపన్యాసకు లొనర్చెడి సంగీత సాహిత్య నృత్యగీతాది కార్యక్రమములను రసజ్ఞులైన పెద్దలు విని హర్షపులకాంకిత దేహులై బహుముఖముల ప్రశంసించి గౌరవ మర్యాదలతో సన్మానించి నిజకళాకారుల హృదయముల కెంతో యానందమును చేకూర్చుచుందురు.

యథార్థ దృక్పథముగలవారు నేటి యసత్యయుగమున బహు తక్కువ సంఖ్యలో కన్పట్టుచుండిరి. సాంఘిక నైతిక రాజకీయ సంగీత సాహిత్య దాన ధర్మ భౌతికాధ్యాత్మిక రంగములలో చరించెడి నరులలో నూటికి తొంబదిమంది సత్య న్యాయ ధర్మ శాంతి సహనాది సద్గుణములను త్యజించి చరించుచున్నారు.

అన్యాయాక్రమ దౌర్జన్య హింసాపకార దుష్టకర్మములనిన లోకమున భయము భక్తి నశించినవి. ఇందులకు కారణము, కామినీ కాంచనములపైగల దురాశ. ఏదోయొక రూపముతో ధనార్జనచేసి భౌతిక సుఖభోగలాలసులై మత్తుతో మంచిని చిత్తుచేసి చరించుటే జీవితముల ధ్యేయమని నరులు భావించి వికృత వర్తనులగుటయే ప్రధానముగా కన్పించుచున్నది.

ఇట్టి వికృత వర్తనులైన నరులు లోకమున యున్నంతవరకు నిజమైన ధర్మసత్యాహింస శాంతిజ్యోతులు ప్రకాశింపజాలవు. దేశకాల పాత్రములనెడి భేదములేక 'నిప్పు' సర్వకాలములందు సమస్తవస్తువుల నేరీతి కాల్చి బూడిదచేయునో? అదేవిధముగ సత్యమును మనువక ధర్మము తప్పక స్వార్థత్యాగులై చరించెడి యాదర్శమూర్తుల కెగ్గు

దలచి కఠినకర్మలతో కీడొనర్చెడి మనుజులను, సర్వగత యదృశ్య సత్యపరాక్రమ శక్తి విజృంభించి సర్వవిధముల పతితులనొనర్చి కన్నీటిలో మునుకలు వేయించగలదు.

త్రికరణశుద్ధిలేక కలికాలమహాకర్మలను నరులెంతటి ప్రజ్ఞా ప్రాభవములతో నిర్వర్తించినను పురోగతిచెందక తిరోగతినొందెదరు. శాస్త్ర నిషేధకర్మారంభమునందిట్టి సవిమర్శ సత్యసందేశములు మూర్ఖులైన మనుజులకెంతో బాధాకరములై కనపట్టుచుండును. కర్మ ఫలానుభవముతో కన్నీరుగార్చెడి దుష్కరదివసములందిట్టి కర్మ సిద్ధాంతము విశేషములెంతో గణనీయములై కనపట్టుచుండును.

పరమపవిత్రములై భవబంధలతాలవిత్రములై సంసార తరుచ్ఛేద యంత్రములై ముక్తిని చేకూర్చుటకు మూలమంత్రములై భక్తజన హృదయముల కానందసింధువులై, సర్వజీవకోటి సద్గతికై మహర్షులుప దేశించిన మహనీయ గీర్వాణభాషాసమన్వితములైన శ్రీ ప్రస్థాన త్రయాది మహాగ్రంథోపదేశములన్నియు, నరులకు ప్రకృతిపైగల దుర్వ్యామోహమును నశింపచేసి, స్వస్వరూపజ్ఞానానుభవమునుకల్గించి శుద్ధచైతన్య తత్త్వమునందేకమై మాయాతీతులై జ్యోతిస్వరూపులై వెలుగొందుటకేనని కర్మసిద్ధాంత ము వెలుగెత్తిచాటుచున్నది.

మనుజుడు తన మనస్సునంతర్ముఖము చేయజాలని దుస్థితికి గురియై సదా ప్రాకృతకర్మలలోచరించి మనస్సుకు బానిసై మసలు చున్నాడు. వేదోపనిషద్గీతాది శాస్త్రములన్నియు 'జీవుడవుగావు నీవు శివుడవు నిత్యసత్య సనాతనుడవు. పరమాత్మవు.' నిర్గుణ చైతన్య తత్త్వమైన నీ స్వస్వరూప సందర్శనానంద దివ్యరసానుభూతికై యెట్టి ప్రయత్నముచేయక, దేహ ధన దారాసుతాది సుఖజీవన విలాసాలకై కాలమును కాయమును దుర్వ్యయ మొనర్చుట తగదని శాసించు చున్నవి.

ప్రకృతి వ్యామోహమునకు బానిసలైన నరులు తన దేహాంతర్గత స్వస్వరూప తేజోదర్శనమునకై యెట్టి ప్రయత్నములు చేయక "దారి తెలియని బాటసారుల" వలె నెక్కడికో పర్వెత్తుచున్నారు.

ఈగ సకలపదార్థములపై వ్రాలి షికారులు చేయగలదు. కాని నిప్పుపై వ్రాలుట సాధ్యముగానిరీతిగ, నరుని మనస్సు నాశరహితుడైన నారాయణుని దివ్యరూప సందర్శనమునకై ప్రయత్నమొనర్పజాలదు. కారణమేమి ? ఈగ నిప్పుపై వ్రాలినచో మాడి నిప్పులో కలసిపోవును. అదేరీతిగ నరుని మనస్సు నారాయణునియందు చేరిననాడు మనోనాశమై పరమాత్మమై ప్రకాశించగలదు. ఇట్టి మహోత్తమ కర్మనిర్వాహణము నరులందరికి సాధ్యముకాదు.

నరుడట్టి మహానిర్వాణస్థితి నొందుటకై మున్ముందు దోష రహితుడై శ్రీ సద్గురు దివ్యచరణకమలముల సన్నిధికిచేరి కర్తవ్య కర్మనిరతుడై చరించి జీవన్ముక్తి నొందవలెను. కర్తవ్యకర్మ దీక్షా దక్షుడై భక్తితో చరించెడి శిష్యుని సర్వసంశయ గ్రంథులను శ్రీ సద్గురుస్వామివారు తన నిజబోధఖడ్గసంఘాతముచే నశింపచేయును.

వ్యక్తి తనకు తెలిసినదే సత్యము, తానే సర్వజ్ఞుడననియెడి స్వశక్తి స్తవములతో చరించిననాడు, తనకుగల నిజశక్తిని సైతము లోకులవహేళన మొనర్చి ద్వేషించసాగెదరు.

అందరిలోగల తత్త్వామభేదమనెడి బోధలు రచనలు ప్రచారములుసాగించెడి వారిలో కొందఱు తమశక్తి తమ కవిత్వము తమ యుపన్యాసములే గణనీయములని వేదికలపై వాకొనుచుందురు.

లోకమున సర్వజ్ఞులని పేరుచెందినవారిలో సైతము మాయా శక్తి ప్రవేశించి కామినీ దాహమొ ? కాంచన దాహమొ ? కీర్తి దాహమో? రేకెత్తించి వారి సద్యశమ్మును వమ్మొనర్చి దుర్దశకుదించి లోకపు హా! హా! రవములకు గురిచేయుచున్నది.

సర్వజ్ఞుడు, నిరాడంబరుడై ద్వంద్వముల కతీతుడై, లౌకికుల కగమ్యుడై విజ్ఞుల సన్మాన సత్కార పూజాదుల కర్హుడై గణనీయ సద్గుణములతో నొప్పుచు సాత్త్వికమూర్తులొనర్చెడి భక్తి పూజలతో వెలుగొందుచుండును.

ఇట్టి సర్వజ్ఞమూర్తుల నందరు గుర్తించి గౌరవించజాలరు. "దివియందు వెలింగెడి రవిని భువిగలయంధులు దర్శించి యానంద మొందజాలనిరీతిగ" అజ్ఞానాంధకారులై మాయాశక్తి వాడికోఅలకు చిక్కిన మానవులెల్లరు మహాత్ములశక్తిని గుర్తించి గౌరవముతో సేవించజాలరు.

ప్రకృతిబద్ధులై గడ్డము మీసములు కాషాయాంబరధారణాది బాహ్యవేషములు గలవారై మహోపన్యాసములొనర్చి వేలాది ప్రజల హృదయముల నుర్రూతలూగించిన వారెల్లరిని మహాత్ములనియెంచి పాదపూజలు చేయుటయు నవివేకము. ఉపన్యాసములు గంటలతరబడి చెప్పెడి శక్తి లేకున్నను సర్వజనాకర్షణశక్తి లోపించినను, దయ సత్య త్యాగ సహన బ్రహ్మనిష్ఠ లోకోపకారకర్మ నిర్వహణమున యోగశక్తి గల పెద్దలే మహాత్ములై విరాజిల్లుచుందురు. ఇట్టిమహాత్ముల దివ్య కృపావీక్షణమే, కలిమలహృదయులైన నరులకు సద్గతి చేకూర్చి స్వామిదర్శనమునకు సోపానమై భాసిల్లగలదు.

లోకమునకు దూరదృష్టిలేదు. యోగానందులై ప్రశాంత మనస్కులై సర్వసములై సమాజపరమైన గౌరవ సన్మాన సభా పూజ్యాదికార్యక్రమముల కతీతులై యోగమహిమా విభూతి వాగ్విలాసులై వర్ధిల్లెడి మహాత్ములను గుర్తించుట కశక్తులై, గ్రంథానుభవ పరులై లోకమును వశమొనర్చుకొని సర్వస్థల సంచారము లొనర్చెడి ధనకీర్తి దాహములతో చరించెడి వారినే, అజ్ఞానులు మహాత్ములని ఘనసన్మాన గజారోహణాది మహోత్సవము లొనర్చుచు వేలాది రూప్యములను వ్యయమొనర్చుచున్నారు.

శ్రీ రామకృష్ణపరమహంస శ్రీ రమణమహర్షి శ్రీ రామతీర్థ స్వామి, శ్రీ అరవిందయోగి, శ్రీ మళయాళస్వామి, శ్రీ శివానంద స్వామి, శ్రీ యోగానంద నరసింహస్వామి మొదలైన మహాత్ము లెందరో కర్మసిద్ధాంతములలోని లోతులనెఱింగి, లోకమునకు దెలి యని రహస్యముల నెన్నింటినో వారి జీవితాదర్శకర్మలతో ప్రబోధము లొనర్చి దారి తెలియని గమనముతో నెక్కడికో పయనించెడి ప్రజా కోటికి గొప్ప మేలును చేకూర్చి నేటికిని యాదర్శమూర్తులై భక్త కోటి కారాధ్యులై ధ్రువతారలై వెలుగొందుచున్నారు.

కర్మయోగులైన భక్తమూర్తులెల్లరు, జ్ఞాన స్వరూపులై మహాత్ములైన పెద్దల యడుగుజాడల ననుసరించిననాడు, కర్మసోపాన క్రమనిర్వహణ మొనర్చువారై కర్మసిద్ధినొంది కర్మాతీతులై నిత్య సత్య నిరతిసయానందులై ప్రకాశించెదరు.

ఎన్ని నేర్చినను యెంతజూచినను యెంతవారలైన కీర్తి, కాంతా, కనకములకు దాసులు కావలసినదేనది పెద్దలెందరో రచనములొనర్చిరి. వారి రచనలు నిత్య సత్య ప్రవచనములని సర్వుల కవగతములగు చున్నవి.

దురాత్మునిసైతము దురాత్ముడని సంబోధించక, దురాత్ముని ప్రేమించి దివ్యబోధాశక్తితో హృదయపరిణామముచేకూర్చి ధర్మకర్మ నిర్వాహకునిగా రూపొందించెడి మహావ్యక్తి మహాత్ముడై, లోక మంతటిచే కీర్తింపబడును. కొట్టినవానిని కోపించక కీర్తించిననాడే మహాత్ముడగును. ప్రేమించి ప్రబోధమొనర్చెడి మహాత్ముని ద్వేషించిన వాడే దురాత్ముడు. ఇట్టి దురాత్ముల కర్మలు పరిపక్వములైననాడే, ధర్మశక్తి విజృంభించి దురాత్ముల పన్నీటిని కన్నీటిగామార్చి, 'కర్మఫల మనుభవించక తప్పద'నెడి పెద్దల నుడి, యీ సమాజమునకు ఋజువు చేయుచున్నది.

ఈ కర్మప్రభావము, సంస్కారము శక్తిగల మహామహులైన పెద్దలమస్తకములందు సైతముతాండవ మొనర్చుచున్నది. ప్రశాంతితో ప్రతి విషయ రహస్యమును పరామర్శదృష్టితో విచారణ చేసినచో సత్యమవగతమగుచున్నది.

గొప్ప తపస్సంపన్నులై లోకోత్తర శక్తుల నార్జించి బ్రహ్మ రథము పట్టించుకొన్నట్టి పెద్దలలోను గత సంస్కార ప్రభావచ్ఛాయలు సర్వుల దృష్టికి గోచరములగు చున్నవి.

ఒక స్వామి తమ యొద్దకుచేరిన ముముక్షువుల పాపములను స్వాహాచేసి పుణ్యకర్మ నిర్వాహకులుగా తీర్చిదిద్దుచున్నాడు. మరొక స్వామి సన్నిధిచేరిన సాత్త్వికజనుల ధనకీర్తి గౌరవాదులను స్వాహా చేయుచున్నాడు. "ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు చూడ చూడ రుచులజాడ వేఱు। పురుషులందు పుణ్యపురుషులువేరయా! విశ్వదాభి రామ వినరవేమా!" యనినరీతి లోకమునకు వ్యక్తమగుచున్నారు.

ప్రతి విషయమునందు మంచిచెడ్డలు కలసియే కాపురముచేయు చున్నవి. లోకప్రస్థితి గతిమతి సంస్కారముల స్వరూప విభవాదులు బహువిచిత్రములై కన్పట్టుచున్నవి.

ఈ లోకములోని సత్యాసత్యముల నిజస్వరూపములను విజ్ఞులు మాత్రమే గుర్తించగలరు. ఒక వ్యక్తి తనతోడి వారితో నెంతో వినయముగా ప్రశాంతముగా సంభాషణలు సాగించి పరాపకార కర్మలనే నిర్వర్తించుచుండును. ఒక వ్యక్తి పరుషముగా తనతోడి వారితో సంభాషణాదికముల సాగించినను తోడినరులకే యపకారమును దలంచక పరోపకార కర్మముల నొనర్చుచున్నాడు.

ఒక స్త్రీ యెంతోవినయముగా యోర్పుగ నీతివాక్యములాడుచు పరులకర్థముగానిరీతిలో సంఘాపకారములైన వ్యభిచార చౌర్య సురా పానాదికర్మలను నేర్పుగా చేయుచుండును.

ఒక స్త్రీ పరుషముగ వేగముగ తోడివారితో ప్రసంగము లోనర్చినను యే విధములైన పాపకర్మలోనర్చక శాస్త్రవిహితకర్మలనే నిర్వర్తించుచున్నది.

లోకమున "పెద్దకోడలు నలుపైన కులమంతయు నలుపే!" యని వాకొనుచుందురు. ఇట్టి లోకోక్తులు హైందవమున కోకొల్లలు. ఈసూక్తిలోనిభావము చాలగణనీయమైనది. ఆనాటి మన తాతయ్యల దృష్టిలోపెద్దకోడలునలుపుయనెడివాక్యమున కెంతోయంత రార్థమున్నది. పెద్దల దృష్టి బాహ్యదృష్టికాదు. విశాల దృష్టితో ప్రతి వాక్యమును సమాజమునకు ప్రబోధముచేయుచుందురు. పెద్దకోడలు నలుపుయనెడి వాక్యములోని పెద్దలయుద్దేశమేమి? శారీరరూపముకాదు. వారిలోగల గుణస్వరూప ప్రభావమని తెలియవలెను. నలుపునకు చిహ్నము దుర్గుణము. పరపురుషులపై యువతికిగల కామవికార గు ప్రభావమును నలుపుయనెడి నామముతో వాకొనిరి. నీచ గుణములుగల యువతి యందము యాకారము నవీనవిధానము వాక్శక్తి ధనము పలుకుబడి సర్వము నిష్ఫలమని పెద్దల వాక్యముల తాత్పర్యము.

స్త్రీ, పురుషుల దేహవర్ణములు, యాహార విహారాది కర్మల వలన వ్యక్తములగుచున్నవి. సత్త్వరజస్తమోగుణములకు మనము సృష్టించుకొన్నట్టి కులమత వర్ణాదికములు ప్రధానములు కాజాలవు. జీవులు గతకాలము లండొనర్చినట్టి సుకర్మ కుకర్మల ప్రభావ సంస్కారములేనని గుర్తించవలెను.

ఇందుమూలముననే లోకమున గొప్పవారలనెడి వారి వంశము లందు నీచహృదయులు, తక్కువ వారని యంటరానివారనెడి వారి వంశములందు మహోత్తమ సంస్కారులైన పెద్దలావిర్భవించుచుండిరి.

త్రికాలములందును సద్గుణ సత్సంస్కార విభవులైన స్వార్థ త్యాగులైన మహాత్ములనే సమాజ మారాధించుచున్నది. ఆధ్యాత్మిక

తత్త్వవేత్తలైన ఋషివర్యులేనాడో మానవునిలోగల చైతన్య తత్త్వ దర్శనులై యోగవిద్యాశక్తులతో తత్త్వశాస్త్రముల లోతులను గుర్తించి సమాజమున కందించిరి.

అవ్యయమైన వేదసంపదను గుర్తించి చరించెడివారు నేటి కాలమున బహుతక్కువ సంఖ్యలో కన్పట్టుచుండిరి. నేటికాలమున భౌతిక విజ్ఞానము పెంపొందుచున్నది. దైవము లేదు సర్వము నరుని స్వాధీనములోయున్నది. చంద్రమండలాది యాత్రా పర్యటనముతో నరుడే నాశరహితుడై మరణయాత్రా సమస్య కతీతుడై వెలుగొంద వచ్చుననెడి సంకల్పముతో పురోగమన మొనర్చుచున్నాడు.

గుండెకాయలనుమార్చి నరులను జీవింపచేసెడి నిరువది శతాబ్దాంతమైన యాంత్రికయుగదశయందును గొప్పగొప్ప మేధాశాలు రెందరో గుండెగడియారములాగి భువివీడి దివికేగుచుండిరనెడు పత్రికా ప్రకటనలు మిక్కుటమై వీనులకు విన్పించుచు భయాందోళనలు చేకూర్చుచున్నవి.

భౌతికవాదియగు మనుజుని మేధాశక్తిసంపదకందని యజ్ఞాత విషయములెన్నో వేదపాఠములందు వ్యక్తములగుచున్నవి. నరుని శక్తి పరిమితము. నరుని బుద్ధికి సాక్షియై ప్రకాశించెడి నారాయణుని శక్తి యనంతమై స్వయంసంపన్నమై యలరారుచున్నది.

నేటికాలపు మానవుడు శక్తి నంతటిని దేహ సుఖమునకే ధనార్జనకే వినియోగ మొనర్చుచు, తన యాత్మోద్ధరణమునకై చేయదగు విధ్యుక్తధర్మమును మరచి చరించుచున్నాడు. ఇది కాల ప్రభావముకాదు. నరునకుగల మితిలేని భోగవాంఛాపర స్వార్థావేశ ప్రభావమని తెలియదగినది.

విషయసుఖ పిపాసాయత్తచిత్తుడైన నరునకెట్టి ధర్మోపదేశ ప్రసంగ ప్రస్తావనలు మనస్సునకు చొరజాలవు. 'పాషాణముపై బడిన వర్షధారలులోనికి చొచ్చుజాలనిరీతి' పాపము కరడుగట్టిన దుష్ట మానవుని మస్తకమున మహాత్ముల మహనీయ సూక్తులు ప్రవేశించ జాలవు.

'కుక్క కాశికిచేరినను గంగలో గతకవలసినదే,' 'కాకి యాకస మున కెగిరినను దాని చూపు మలినవస్తువులపై ప్రసరించవలసినదే,' 'లౌకిక ప్రజ్ఞతో భక్తిలేక చరించెడి వ్యక్తి బాహ్యదృష్టికి భాగవత మహాగ్రంథమునందును దోషములుగోచరించుచుండును.' 'వ్యభిచారిణి యెన్ని యాత్రలు సేవించినను మహాత్ముల వాక్యములను మండలము లాదిగ విన్నను నైజవ్యభిచార కర్మమునువీడి బ్రతుకజాలదు. లోభి యగు మనుజున కెంత సంపదయుండినను పుణ్యకర్మల కాధనమును వినియోగమొనర్చి యానందము నొందజాలడు. జన్మతో వెంటనంటి కరడుగట్టిన గుణసముదాయము నరుని వీడక తుదివరకు కాచివేచి వేధించి వేటాడసాగును. జన్మసిద్ధ సూక్ష్మదోషములు నరులొనర్చు సత్కర్మ శక్తికిలొంగి వర్తించసాగును.

చేదు విత్తనములను పాయసమునందిడి పాకమొనర్చినను సహజ తత్త్వ శక్తిని త్యజించక పాయసమునుసైతము పాడొనరించును. దుష్ట మనస్సుగల మానవుడు దేవుని సన్నిధిచేరినను దుష్టకర్మలైన చోర జారసురాపానాది నింద్యకర్మలకే ప్రయత్న మొనర్చుచుండును.

దుర్గుణములైన, సద్గుణములైన నరుల మస్తకములందు సూక్ష్మ బీజములైయుండును. ఆ సూక్ష్మబీజ ప్రభావములే దేశకాలపాత్రల కనుగుణముగా విజృంభించి వ్యక్తులకు సుఖ దుఃఖాది ద్వంద్వములను చేకూర్చుచుండును.

జన్మాంతర సుకృతఫల విశేషముతో భువి నవతరణము నొందిన పెద్దలు దుష్టమనుజులలో మెలగినను పాపకర్మలొనర్చెడి నీచస్థలములం దుండినను వారి సహజభక్తి శక్తినుండి దిగజారక మహోత్తమ కర్మములందే మెలగుచు ధీరోదాత్త చరిత్రల కథినేతలై విలశిల్లు చుందురు. పూర్వపుణ్య సంస్కారములేక పెద్దల పరిచయముతో సద్గ్రంథపఠనములతో లోకమున చరించెడివారెల్లరు, పరిసర ప్రభావము లకు బానిసలై శాస్త్రనిషేధకర్మలలో ప్రవేశించి తిరోగతినొందెదరు.

నరుని సాధనదశ పరిపక్వముగానినాడు త్యజించక కర్మసాగించ వలయును. పరిపక్వమొందనిస్థితిలో నరుడు కర్మచేయక నిరసించిననాడు ఫలదూరుడై పనికిమాలినవాడగును. మృదంగ వాయులీనాది కళాకారు లెంతటి గొప్పస్థితి పొందినను వారివారి విద్యావిధానములను వీడక నిత్యము సాగించురీతి, ప్రతిముముక్షువు భక్తుడు వారివారి సంస్కారాను గుణములైన కర్మలను నిత్యము సాగించుచు మనస్సులందుగల రొుడి దుడుకులను యెప్పటికప్పుడు తెలిసి జాగ్రత్తతో సరిచేసికొనుచు భగవాను నారాధించవలయును.

నరునిస్థితి పక్వదశనొంది పరమపదసోపానమున భాసిల్లెడి మహర్దశయందు కర్మలుత్యజించియు నాదర్శమూర్తియై వెలుగొందు చుండును. సువర్ణము బొగ్గులలోచేరినను, మృత్తికలోకలసి శతాబ్దములు చెలిమియొనర్చినను, తన సహజ సౌందర్యశక్తిని విడువనిరీతి, ఆధ్యాత్మిక దివ్యతత్త్వ దర్శనానందపారవశ్య మహానిర్వాణస్థితితో మాయాతీతులై సుప్రసన్న స్వరూపులైన పెద్దలు, యెట్టి విపరీత దుష్కర భయ వాతావరణమునందున్నను, స్వయంశక్తితో నిష్కళంక నిర్వికారి చిత్తులై ద్వంద్వాతీతులై మహామహిమోపేతులై ప్రకాశించుచుందురు.

ఘడియకు సంభవించెడి కాలుని కఠోరశాసనపరమైన కాల మృత్యువును నరుడు గుర్తించలేక తనకనువగు కార్యక్రమముల

నెన్నింటినో నిర్ణయ మొనర్చుకొని విశ్రాంతిలేని కర్మనిర్వహణ మొనర్చసాగును.

ముక్కోటి యాంధ్రుల మనస్సుల రంజింపజేసెడి మేధాసంపద్విభూతితో నలరారెడి మహావ్యక్తి సైతము భవితవ్య జీవితమున రానున్న మహాపదలను తెలిసికొనెడి విజ్ఞానశక్తికి దూరుడగుచున్నాడు.

దంతములూడి తల తెల్లనై వయసు తూలిపోయి శరీరము సోలిపోయినను మనుజునికిగల ధనకీర్తి గౌరవ లాభకాంక్ష తిరోగతి నొందక పురోగతి చెందుచున్నది.

ఈ జనన మరణ సమ్మోహనమగు సంసారచక్ర పరిభ్రమణమునుండి విడివడి సనాతన సత్యస్వయంశక్తిమై వెలింగెడి పరమాత్మ తత్త్వము నందే తాదాత్మ్యమొందుటకై కర్తవ్యకర్మయొనర్చెడి మహాపురుషుడు నూటికొక్కరో? కోటికొక్కరో?

సర్వోపనిషత్సారాంశ సంగ్రహసూక్తి, దేహమనిత్యమని దేహధారి, దేహమును వీడకముందే దేవదేవుని దివ్యదర్శనానంద రసానుభూతిచెంది తరించవలెననెడి సత్యము వ్యక్తమగుచున్నది.

నిజమైన భక్తితో భువిపై చరించెడి మానవుని, పిన్నలు పెద్దలు ప్రాజ్ఞులు సర్వులు ప్రేమించి సహకరించుచుందురు. సకల లోకనాథుడైన శ్రీ నారసింహస్వామి సర్వులలోచేరి నిజభక్తవతంసుని సంరక్షించుచుండును.

ఉన్నవాస్తవమును సాధకుడు గుర్తించినను దాని కనుగుణముగ నడచుకొనజాలడు. శక్తికి మించిన కోర్కెల వలలోజిక్కి విముక్తి నొందక లేనిపనులను సృష్టించుకొని ప్రయాణములు సాగించి ధన వ్యయమొనర్చి కడకు కన్నీరుగార్చసాగును.

కన్నీరుగార్చుచు ముముక్షువు గతమునందొనర్చిన కుకర్మల ఫల స్వరూపాదులను మనస్సునందు చింతనచేయుచు గతకాల ధన వ్యయమును కర్తృత్వకర్మలద్వార సంపూర్తిచేసి సంతృప్తి నొంద సాగును.

దీనంతటికీ కారణము, కర్తవ్యకర్మను త్యజించి, బుద్ధికి దోచిన రీతిగ నరుడు ప్రవర్తించుటయేనని సత్యము తెలియబడుచున్నది. భక్తి శ్రద్ధలతో ముముక్షునర్చిడి సాత్త్వికకర్మ ప్రభావముతోడై తొట్రుపాటును తొలగించి ప్రశాంతిని చేకూర్చుచున్నది.

లోకమునందు వివిధకాలములందు మహోత్తమ సంస్కారగుణ విభవులగు సాహితీవేత్తలెందరో దేశకాలపాత్రోచితరీతులలో మాయాశక్తి వశులైన యజ్ఞుల హృదయములను సంస్కరణ మొందించి ధర్మకర్మనిరతులై చరించి తరించుటకు దోహదములొనర్చెడి రచనల నెన్నింటినో వాగ్దేవి కృపతో నిస్వార్థదృష్టితో సమాజమున కందించిరి.

అట్టి మహోన్నత రచనలను పఠించెడు వారరుదైరి. భారతీయ సంస్కృతిని ద్వేషించుచు పరధర్మావలంబకులై స్వధర్మమును త్యజించి నానాటికి బాహ్యదృశ్య దర్శనానంద కాంక్షారతులై కాలమును కాయములను దుర్వ్యయమొనర్చెడు నరరూప రాక్షసులే దినదినాభివృద్ధి నొందుచుండిరి.

ఎక్కడ జూచినను గొప్ప గొప్ప కట్టడములు నిర్మాణ మొనర్చెడు వారిసంఖ్య మిక్కుటమగుచున్నది. సువిశాల సత్యదృష్టితో బ్రహ్మవిద్య నభ్యసించి బ్రహ్మానుభవముపొంది పరబ్రహ్మమునం దైక్యమై వెలుగొందవలెననెడి నరులరుదైరి.

నామరూప క్రియారహితమైన పరతత్త్వమేదో సర్వమునకు మూలమైనదని భారతీయ సంస్కృతి వాకొనుచున్నది. నిజమైన

ప్రశాంతి నరుని మస్తకమునందే పొందుట కవకాశమున్నది. ఐనను యన్యాయకర్మ లధికములగుచున్నవి. కర్మలధికములగుకొలది మనుజున కశాంతి మిక్కుటమగుచున్నది. మనుజునకు కాలము గడచుకొలది తన దేహ వయోబలాది యారోగ్యసంపత్తి క్షయమగుచున్నది. తన జీవిత క్షయమును గుర్తించక తన మనోగతి ననుసరించుచు కాల వాహినిలో నీదుచు నిలకడలేని కర్మలను సదానిర్వర్తించుచు కర్మ బంధమును త్రెంచి భక్తిజ్ఞాన వైరాగ్య తత్త్వములందు మనస్సును జొప్పించక, తుదిలేని కర్మబంధములందే మసలుచు దివినుండి భువికి దిగి వచ్చిన కర్తవ్యమును తెలియకనే దేహమును వీడి పలాయన మొందెడి జీవుని దుస్థితి యెంతటి విచిత్రమైనదో? విజ్ఞులు గుర్తించ గలరు.

కొట్లు వ్యాపారమునందుగల సేవకునికిగల శాంతి, యజమానికి గలుగదు. మహావేదికలపై కథాగానములొనర్చెడి కథకులకు వినెడి శ్రోతలకుగల యానందము చేకూరదు. పతికిగల యానందము సతికి లభించదు. ఆలయప్రవేశమైన భక్తునకుగల యానందానుభూతి యర్చకు నకు గలుగదు. బాధ్యత బరువుగల వ్యక్తికి భయము. అదేవిధముగ, సర్వము నా స్వశక్తివలన జరుగుచున్నది. నేనే సర్వాధికారిననెడి భావనతో చరించెడి నరున కెల్లవేళల భయము బాధ్యత బాధ యాందోళనలు మిక్కుటమగుచున్నవి.

సర్వాధికారి సర్వనియంత సర్వకార్యసిద్ధిని చేకూర్చెడి పరమాత్మయే! సర్వులయందు నాయందుగలడు. నేనా పరమాత్మ సేవకుడననెడి భక్తితో సర్వాత్మభావనతో ధర్మకర్మాచరణుడై లోకమున చరించెడి నరునికెట్టి బాధలు గలుగవు.

ఈ చిత్ర విచిత్ర గారడి జగత్తునందు పాత్రధారులైన నరులు తమ వేషములే శాశ్వతములని భ్రమించి తమతోడి వేషధారుల

నవహేళన మొనర్చుచు రాత్రింబవళ్ళు శ్రమించుచు ధర్మకర్మలను త్యజించి సత్యవాక్యదూరులై స్త్రీ ధన కీర్తి కాంక్షాసక్తచిత్తులై మరణ మొకనాడున్నదనెడి నిత్యసత్యమును విస్మరించి వివేకహీనులై తమ దేహముల నాడించెడి భగవత్తత్త్వ దర్శనమునకెట్టి ప్రయత్నము లొనర్పక శక్తియుక్తులను జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ చాపల్య తాత్కాలిక సుఖపారవశ్య సంసిద్ధికై దుర్వ్యయ మొనర్చుచు గాసి నొందుచున్నారు.

ప్రపంచ దృష్టితో జూచిననాడు ధనము ధాన్యము గలవారికే ఆనందము ప్రశాంతి చేకూరగలదని తోచుచున్నది. ఐనను సత్య మాలోచన చేసినచో ధనధాన్య సంపదలతో నిజమైన సుఖశాంతి యానందములు లభించజాలవని ఋజువగుచున్నది.

నరుల సుఖశాంతి యానంద సౌఖ్యములకు వారికిగల యుద్యోగ వ్యాపారైశ్వర్యాది వస్తుసంపత్తి కారణముకాదని, లోక వర్తనములందున వ్యక్తమగుచున్నది. నరులొనర్చెడి పుణ్యకర్మల ఫల ప్రభావ ప్రసారశక్తియే ప్రధానకారణముగ గోచరమగుచున్నది.

అన్యాయాక్రమ దౌర్జన్య హింసాదికర్మల శక్తితో లోకమున యజ్ఞాన మానవులు ధనమార్జించి నిలువచేసినను, తది తరములైన భూగృహ వసతుల నేర్పరచుకొన్నను సుఖశాంతుల నొందజాలరు.

నోటాడిన నుడులను పోనాడి ధనార్జనకు మరగిన వ్యక్తి ధన వంతుడుగాజాలడు. ఒకవేళ గతకాలకర్మ ప్రభావశక్తితోడై ధన వంతుడైనను, కర్తవ్యకాలమునందొనర్చిన యసత్యాదిదోష ప్రభావము వరించి తన జీవితమును కష్ట నష్ట పరంపరలకు గుఱిచేసి గాసినొందించి కన్నీటితో స్నానము చేయించగలదు. ఈ కర్మసిద్ధాంతము గణనీయ మైనది. దీని నెవ్వరు కాదని ద్వేషించుటకు ధైర్యముజాలదు. ప్రతి వ్యక్తికి త్రికాలసత్యమై ఋజువుచేయుచున్నది.

"మహారాజ మందిరమునందైనను దీపము లేనినాడున్నట్టి వస్తువులు కంటికి కన్పించనిరీతి" మహాపండితుడైనను సద్గుణ సంపత్తి లేనినాడు పనికిమాలినవాడై యజ్ఞానకర్మలొనర్చి లోకపు తెగడ్తలకు మనోగత చింతలకు గుఱియగును.

పరోపకారబుద్ధితో తాత్త్విక దృష్టిగల ముముక్షువు నిస్వార్థముతో కర్మలొనర్చిన నాడాకర్మఫలశక్తి వృధాగా నేరదు. సర్వభూతాంతర్గతుడై సమస్తమును గుర్తించెడి పరమాత్మ, ముముక్షువునకుగల సర్వసంకటములను సమూలముగా రూపుమాపి నిత్యానందమొనగూర్చును. ఈ నిరాకార నిత్యసత్య మహాశక్తి నాస్తిక నరులకగమ్యమై యలరారుచున్నది.

ప్రత్యక్షరూపముతో పరతత్త్వ ప్రబోధమొనర్చిన నాటి కృష్ణావతార తత్త్వమును యహంకార స్వరూపులైన కంస శిశుపాల దుర్యోధనాది పెద్దలు గుర్తించజాలక యజ్ఞానమనెడి పెనుగోతిలోబడి పతితులైరి.

పతితపావనుడు పరతత్త్వ స్వరూపుడు జగన్నాటక సూత్రధారి మాయామానవ వేషధారియగు జగద్భర్త వేణుగోపాలుని దివ్యలీలా విభూతి మహిమా విశేషాంశ రహస్యములను శ్రీ సనకసనందనాది ముని బృందములవారే గుర్తించి భక్తితో సగుణారాధన మొనర్చి ముక్తిధామమున కేగి తిరిగిరాని దివ్యపద మలంకరించిరి.

నిష్కల్మష నిర్వికార నిరాడంబర హృదయముతో లోకమునందు ధర్మజీవిత గమనమును సాగించెడి మనుజులకు, వారి కుటుంబములకు, జగత్ప్రభువు శ్రీమన్నారాయణమూర్తి వ్యక్తులలో మహా పేరణమును కల్పించి సర్వసంరక్షణ మొనర్చు సద్గతిని గల్గించి సంతసమును చేకూర్చి పరమాత్మశక్తిని వ్యక్త మొనర్చి, శ్రుతి స్మృతుల

యీ దేశోపదేశములు నిత్యజీవిత సత్యములని సనాతన సందేశములని యపార భక్తి విశ్వాసములను స్థిరతర మొనర్చి విశ్వశ్రేయస్సును చేకూర్చుచుండును.

గృహము భూములు ధనము సతిసుతాదివర్గముగల గృహస్థుడు భగవద్భక్తుడై యుండవలయును. భగవద్ధ్యానమే యాతనిజీవితవరమావధి. సదాసత్కర్మనిరతుడై తన విధ్యుక్తధర్మములను నిర్వహించుచు కర్మ ఫలముల నీశ్వరార్పణ మొనర్పవలయును. ఇట్టికర్మ నిరతుడైన గృహస్థుడు గొప్పవాడని తెలియవలెను. సంసారమును పరిత్యజించి స్వేచ్ఛగా, సుఖముగా జీవించుటకంటె సంసారమున మెలగుచు పాప కర్మలు ప్రస్తావనలేక భగవానుని ధ్యానించుచు పరహితకర్మాచరణుడై మెలగుటయే కష్టతరము మిక్కిలి శ్రేయోదాయకము.

ఈ ప్రపంచము నరులకు స్థిరనివాసమనియెంచి కోట్లురూపాయలు వెచ్చించి ఘనమందిర నిర్మాణములనొనర్చి యందందు నివసించుచు వచ్చినపనిని మరచి భువివీడి దివికేగి మోసపోవుచున్నాడు. శుద్ధ బుద్ధితో సత్యాలోచనతో గమ్యమును గుర్తించిననాడు జీవుని బహు దూర గమనమునందు ప్రపంచమొక సత్రశాలయని సత్యము బోధపడు చున్నది.

ఈ ప్రపంచము సత్రమనెడి సత్యమును విస్మరించి సదా లౌకిక కర్మలొనర్చుచు ద్రోహబుద్ధినివీడి బ్రతకజాలక సదా తాపత్రయముతో మానవుడు కర్మలొనర్చుచు కడకు కాటికేగుచున్నాడు.

ముందు గతించిన జననీ జనకులు గురువులు పెద్దలు మిత్ర సత్తములు, వ్యక్తికి స్వప్నమున సాక్షాత్కరించి ప్రేమరస వ్యాక సంభాషణములొనర్చి సంతసమును కల్గించిన కల, కల్లమైనరీతి, నేడు మనమనుభవించెడి సర్వసౌఖ్యనిలయమైన జగత్తు సైతము పెద్ద

స్పష్టమై కన్పించుచున్నదని ప్రతి వ్యక్తి గుర్తించి గాలి గగనమున కేగకముందే మాయా నిద్రనుండి మేల్కొని తన కర్తవ్య కర్మమైన యాత్మసాక్షాత్కారమునకై కృషి యొనర్చుటయే కర్మసిద్ధాంతము లోని మూలమునై యున్నది.

దేశకాలానుసరణముగా పరిణామము చెందిన కర్మవిధి విధానము లను దూరదృష్టితో వివేకబుద్ధితో యోచన చేసిననాడు సర్వులకు బోధపడెడి సత్యమొక్కటున్నది.

గతారంభ కాలమునుండి నేటివరకు జరుగుచువచ్చిన కర్మల ప్రభావ ప్రవాహములో నాటి ధర్మకర్మ నేటి కధర్మ కర్మమై కన్పించుచున్నది. నేటి ధర్మకర్మ నాటి యధర్మకర్మయని చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది. ఈ ద్వంద్వకర్మ సమన్వయ మేరీతి సిద్ధించ గలదు? పాపమేది? పుణ్యమేది? యని కొందఱికి సంశయము కల్గుట సమంజసము.

నాటికీనాటికేనాటికైనను ధర్మము ధర్మమే! త్రికరణశుద్ధితో ప్రేమించి పరిగ్రహించిన పత్నియే ధర్మపత్నియని పెద్దల సూక్తి. ఏకాలమునందైన త్రికరణశుద్ధితో యొనర్చినట్టి కర్మను ద్వేషబుద్ధితో పరిత్యజించిన నాడది యధర్మమని గుర్తించదగినది.

నీతోడి మానవునితో నీవాడిన నుడిని సార్ధకత నొందించి సంతసమును చేకూర్చుటే ధర్మము. నీవాడిన నుడిని స్వార్థ ప్రయోజన బుద్ధితో విస్మరించి చరించుటే యధర్మము.

మానవుడు నిర్ణయమొనర్చుకొన్నట్టి ప్రతి ధర్మకర్మయు సమాజమునకు క్షేమమును చేకూర్చుటకేనని వ్యక్తమగుచున్నది.

అసత్యములాడినను పరులకు పన్నీరు ప్రసాదించిన నరునకు పుణ్యమేకల్గును. సత్యములాడినను పరులకు కన్నీరు ప్రసాదించిన నరునకు పాపమే కల్గును.

వైద్యునకు రోగి బ్రతుకడని నిజము తెలిసినను రోగితో నీకేమి భయమువలదు జీవించగలవని యసత్యముచెప్పినను వైద్యునకు పాపములేదు. సరియైన మందులువాడి రోగి దుస్థితిని వైద్యుడుమార్చి మహోపకార మొనర్చి సత్కీర్తి, తగిన ప్రతిఫలము, పుణ్యము నార్జించినరీతిగ, కర్మసిద్ధాంతము, పాఠకులకు సవిమర్శ సత్యాంశసూక్తి సుధనే ప్రసాదించుచున్నది.

రోగనివృత్తికై సేవించెడి మందు చేదని రోగి పరిత్యజించ గలడా ? పరిత్యజించక భయముతో పానమొనర్చును. అదేరీతి మహాత్ముల ప్రవచనములు నరులాచరణమునందుంచుట కష్టమైనను, సాధనతో పట్టుదలతో ధీరత్వముతో వీడక సాగించిననాడనంతమైన యాత్మానందమును పొందగలరు.

తన ధర్మమున వర్తించు ప్రతి వ్యక్తియు మహనీయుడేయని శ్రీ వివేకానందస్వామివారు యెలుగెత్తి చాటిరి. వనిత, లత, కవిత యీ మూడును మంచి యాశ్రయము లేనిదే శోభించవు. వనితకు గుణముగలిగినపతి, లతకు బలమైన వృక్షము, కవితకు రసగ్రహణ పారీణులైన పెద్దలు లేనిదే ప్రకాశింపజాలవు.

కాలగమనమునందు గొప్ప పరిణామము కల్గినది. కుల మతవర్గ జాతిభేదములను విడనాడి కులాంతర మతాంతర వివాహములను నేటి తరమువారు స్వేచ్ఛగా జరుపుకొనుచున్నారు. పూర్వాచార పరాయణులైన పెద్దలు యువతరమువారి సర్వసమైక్య వివాహకర్మలను కన్నులారచూచి కాదనుటకు శక్తిచాలక కాలప్రభావ పరిణామమున కచ్చెరువొందుచున్నారు.

యువతీయువకుల గుణములుకలియని గొప్పగొప్ప సంబంధములు కడకు బంధములై కన్నీటికి గురియై యెవ్వరికి వారే విడిపోయిన సంఘటనల నెన్నింటినో నేటి సమాజమున గాంచుచున్నాము.

కాలవాహిని కెవ్వరు ఎదురీదజాలరనెడి నిత్యసత్యమును సర్వులు గుర్తించి ప్రేమ కరుణ హృదయ పవిత్రతాది సద్గుణములనే గౌరవించి సుఖశాంతులతో వర్ధిల్లగలరు.

ఉత్తమ సంస్కారము సత్య శాంతి ప్రేమాదరణములు పరోప కార పరాయణత్వము లోకమున ప్రతివర్గమునందు ప్రతివృత్తియందు కొందరియెడ సార్థకతనొందుచు మతమునకు మహోన్నత కీర్తిని చేకూర్చుచున్నారు. రాళ్ళు రత్నాలొక్కటిగ లోకదృష్టికి కన్పించు రీతి దురాత్ములుండెడి స్థలములందే మహాత్ములు వెల్గొందుచుందురు.

జన్మకర్మల సంస్కారశక్తి నరుల హృదయములలో మరుగై యున్నది ఆ సంస్కారముల కనుగుణములైన కర్మములనే లోకమున మానవులు నిర్వర్తించుచుందురు. స్వార్థపరులై కొందరు స్వార్థ త్యాగులై కొందరు జగత్కర్మలను విధిగ చేయుదురు. వారికి వీరికి

పొత్తుకుదురదు. కాకి భాష హంసకు; హంసభాష కాకికి వ్యర్థ ప్రలాప ములుగా గోచరించును, రామరావణ జీవిత చరిత్రాంశములను యధా తధముగ తెలిసిన పెద్దలలో కొందరు రాముడే మాయావి, రావణుడే నీతివంతుడని, కాదు రావణుడే దుర్మార్గుడు రాముడే సన్మార్గుడని, కొందరు సంభాషణలు సల్పుచు చివరకు వాగ్వాద విజృంభణముతో సత్యదూరులై సతమతమగుచున్నారు.

నేటికాలమున యెక్కువమంది తమ కర్మ లోపములను తామొనర్చెడి సంఘాపకార సంభాషణములను త్యజించుటకు శక్తి చాలక, గతకాలమునగల కధలను కల్లలనుచు విజ్ఞుల రచనలను కువిమర్శకులై ఖండించుచు సత్యమును నిర్ధారణమొనర్చి సంఘమునకు మేలొనర్చెడి స్థితిని గోల్పోయి నిలకడలేని మతులతో కుకర్మలొనర్చు చుందురు.

అనాదికాలమునుండి నేటివరకెందరో విజ్ఞానవేత్తలావిర్భవించి నిస్స్వార్థ హృదయములో సంఘక్షేమంకరములైన కర్మవిధులను వారాచరణమొనర్చి వాని ప్రతిఫలముల ననుభవించిన వారి స్వానుభవ సత్యములనే రచనముల పేరిట లోకమునకందించి జీవితములనుచాలించిరి.

అట్టి యాదర్శమూర్తుల జీవితగతులను వారొనర్చిన దివ్య రచనా విశేషములను, నేటికాలమున యజ్ఞులు విజ్ఞులవలె చలామణి యయ్యెడి వదరుబోతులకు విమర్శాపరమైన దుందుడుకు సంభాషణము లను, ముముక్షువులైన వారెల్లరు విస్మరించి ప్రస్థానత్రయాది మహా గ్రంథ రచనములను భక్తితో పఠించి సర్వసంశయ రహితులై సత్యాన్వేషకులై సత్యకర్మనిరతులై నిత్య సత్య సనాతన తత్త్వస్వరూప సందర్శనానంద దివ్యరసానుభూతిపొంది తరించెదరుగాత.

బ్రహ్మ విష్ణు శివ దేవ గంధర్వలోకాదులలో సైతము ద్వేష రోషాది వాగ్విలాపాదికర్మలొనర్చి వాని ప్రతిఫలమును విధిగ యనుభవించిరనెడి సత్యము చరిత్రాంశ పఠనములవలన వ్యక్తమగు చున్నది.

శ్రీ దుర్వాసమహర్షి విశ్వామిత్రమహర్షి మొదలైన పెద్దలలో కోపము విజృంభించి దురదృష్టవంతులైన వారినెన్నో నిడుమల పాలొర్చినరీతిని చరిత్రలు సుస్పష్టముగ ప్రబోధమొనర్చుచున్నవి.

ముందు చూపులేని నరుడెంత గొప్పవాడైనను సమాజ దూష ణకు గురికాక తప్పదు. తెలియని విషయములనుగూర్చి వాదించుటయు తెలిసిన విషయములనుగూర్చి సంభాషించక మౌనము వహించుటయు మానవునకు తగదని మహాత్ములాదేశించిరి.

వేదవేదాంగ రహస్యములనూ తెలసిన విజ్ఞానధనులైనను ప్రేమ భక్తి యాసక్తిగల నరులడిగిన సుసమయములందే ప్రబోధమొనర్చ

వలెను. తెలిసిన విజ్ఞాన వాక్యములైనను సమయము సందర్భములేక ప్రబోధము సాగించినచో యజ్ఞులు నిరసించుచుందురు.

"జ్ఞానిమరు గజ్ఞానికే మెరుక" యనెడి యార్యుల వాక్యము త్రికాలసత్యమై భాసిల్లుచున్నది. కవిని నిత్యము సమీపమున చూచెడి వారు కవిగారి కవిత్వము గణనీయమై సర్వజనోపకారమై యాదర్శ మైనను గౌరవభావముతో పఠనమొనర్పజాలరు. కవిని ప్రేమాదరము లతో గౌరవ సత్కార సన్మాన మొనర్పజాలరు.

మహాకవుల పోకడలతో గద్యపద్యాత్మక సమ్మేళములైన విద్వత్కవితారీతులను వెలయించి దూరప్రాంతములందు విజ్ఞుల ఘన సన్మానములకు పాత్రులైన కవి పండితాది పెద్దలను, తాముండెడి చోటులందు గలవారెల్లరు గుర్తించి గౌరవించజాలరు. ఇదిలోకపుతీరు.

కవి కాలవాహినిలో లీనమై పునరావృత్తి రహితమైన దివ్య పదవి నలంకరించిన రోజులలో కవితను పఠించి కవితలోని లోతులను పదరీతులను తెలిసి యాత్మానందము నొందుచు కవిగారి నెంతయో గొప్పగా పొగడుచుందురు. మాయా ప్రభావముచే కంటికి ప్రత్యక్షముగ కన్పించెడి కవి పండిత గాయకాది పెద్దలను సమాజము ప్రేమించి పూజించచాలదు.

కవితలోని శక్తిసామర్థ్యములను గుర్తించగల మేధాశాలులు కవిన్ని గౌరవించి వారి కవితను ప్రేమించి శక్తికి తగినరీతిలో కవికి సన్మానమొనర్చి సంతసము చేకూర్చెదరు.

యుగములు గడచినను నశించని సత్యశివసుందరాత్మక దివ్య చైతన్య తత్త్వము భాసిల్లుచునేయున్నది. ఆతత్త్వమిట్టి దట్టిదనివర్ణించు టకు నలవిగానిదై విశ్వవ్యాప్తమై విశ్వమునకే మూలమై వెలయు చున్నది. ఆ యఖండ తత్త్వ సుందర మహామహిమాన్విత నిత్యసత్య పరమాణుశక్తినుండియే సకల జగదుత్పత్తికాబడినది. అట్లుత్పత్తి

కాబడిన జగత్తు కాలక్రమమున వివిధపరిణామములతో పలురకములైన సంస్కారములుగల మానవ సమూహముతో దినదినాభివృద్ధినొంది నొంది, పునాదిని మరచి భవనమునే పునాదియని విశ్వసించెడి యజ్ఞానాహంకారాది గుణములతో సత్యదూరమై విజృంభించసాగినది.

ఇట్టి యవాస్తవిక దుష్టమహావాతావరణమునం దభివృద్ధిచెందెడి లోకమునకు దివ్యజాగృతి నొందించుటకై లోకమునం దచ్చటచ్చట మహాతత్త్వజ్ఞు లావిర్భావమునొంది, విశ్వశ్రేయః కాంక్షాసక్తచిత్తులై సర్వమత సమ్మేళనమగు సత్యనిత్య వినిర్మల వేదాంత సారస్వతవాహినీ తరంగములను విశ్వమెల్లెడల ప్రవహింపజేయుచుందురు.

అట్టి మహాపురుషులలో, నేటి నిరువదవ శతాబ్దమున సైతము అనంతపురముజిల్లా పుట్టపర్తి గ్రామమున, శ్రీ ప్రశాంతినిలయమునందు వేదవీధులలో విహరించెడి భువనమోహన సౌందర్యమూర్తియగు శ్రీమహావిష్ణువే కలికల్మష హృదయులైన నరులనుద్ధరణమొందించుటకై దివినుండి భువి కవతరణమొందిర నెడి సత్యాంశమును, సత్యమూర్తులైన భక్తాదులెందరో గుర్తించి శ్రీశ్రీశ్రీ భగవాన్ సత్యసాయిబాబాగారి దివ్యపాదపద్మముల సన్నిధికిచేరి భక్తితో పూజా ప్రణామాది సత్కర్మ నిరతులై శ్రీవారి దివ్యకృపాశక్తికి పాత్రులై సర్వసంశయ రహితులై దివ్యజీవనపథగాములై సంసారబంధ విముక్తి నొందుచుండిరి.

అ సుప్రశాంత సుందర శుద్ధాద్వైత తత్త్వ ప్రచారోద్యమ పవిత్ర శుభసమయ మహాపర్వములందుపవిష్ణులై విశేష మానవులెల్లరు భగవానుని మహాకరుణకు పాత్రులైనవారని తెలియవలయును.

పుణ్యఫలములేని నరులెన్ని యుగములకైనను భగవత్కైంకర్య ములు జరిగెడి ప్రవిత్రస్థలములం దడుగిడజాలరు. 'దివియందు వెలిగెడి రవినంధు డెరుగజాలనిరీతిగ' వేదవిజ్ఞాన రహస్య విశేషాదుల నెలుగెత్తి

చాటెడి "శ్రీ భగవాన్" సత్యసాయీశుని దివ్యమహిమా విభూతి తత్త్వరహస్య విశేష వివరము నెందరు గుర్తించుచున్నారు ?

అనాదికాలమునుండి నేటివఱకు లోకమునందు ఏశక్తిగలవారా శక్తిగలవారిని గుర్తించి గౌరవించి గణనీయ కర్మములొనర్చి సంతసము నొందుచుందురు.

"కవిని గన్నతల్లి గర్భంబు ధన్యంబు; కృతిని జెందువాడు మృతుడుగాడు; రాజుల కథలకు మిన్నలై కవిరాజుల కథలు విలశిల్లిన వనెడిమాట లతిశయోక్తులుగావు. ఏనాటి వాల్మీకి? ఏనాటి వ్యాసుడు? భాస కాళిదాసు లెప్పటివారు ? ఎందరో రాజులు చరిత్ర గర్భముననో ధరిత్రి గర్భముననో కలసిపోయారు. అయినప్పటికి, ఇప్పటికి 'జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః' వారికి మృతిలేదు. వారికి మాత్రమే కాదు వారిని కన్న జననీ జనకులకు మృతిలేదు. వారి నామములు రవి శశితారకముగ సమాజపు మస్తక వీధులలో చరిత్ర పుటలలో స్థిరరూపములై విలసిల్లుచున్నవి

ఉత్తమ కవులూ, ఉత్తమ కళాకారులూ ఉత్తమ సంస్కృతికి సృష్టికర్తలు. జాతికి జీవగఱ్ఱ సంస్కృతి; కవులు, వారి మేధాసంప ద్విభూతితో నలరారెడి మహాకావ్యరాజములు లోకమున లేనినాడు సమాజమునకు భవితవ్య మహోన్నతస్థితి మృగ్యమగును.

ఆదర్శమై లోకోద్ధరణమునకు మూలమైన మహాశక్తి మంతము లగు రచనలను కవులెందరో స్వార్థములేని ధర్మకర్మ నిర్వహణమొనర్చి గొప్ప మేలొనర్చి భువివీడి దివికేగిరి.

లోకోపకారకర్మ పరాయణులైన కవుల ఋణము సమాజము తీర్చుకొనజాలదు. నిరాడంబరులై యాదర్శమూర్తులై లోకవాసనా తీతులై, లోకేశ్వరుని దివ్యగాథలనే సదా పఠన మొనర్చుచు, పునరా వృత్తి రహితమైన ముక్తిపథగాములై చరించెడి సత్యకర్మాచరణ

మూర్తులైన కవి పండిత కథక గాయక విద్వద్వరులైన భక్త హృదయులను, వారి సతి సుతాది బంధువర్గ మజ్ఞానావరణముతో ప్రజ్ఞానవిహీనతనొంది నిరసన దృష్టితో తెగడుచుందురు.

కవుల జీవితపు నడకలలోని హెచ్చుతగ్గులను గుణకర్మవిధులను జాతి మత కుల వర్ణ వర్గ స్థలముల వ్యత్యాసరీతులను లౌకికులైన నరులు చూచుచు, వారి మహోన్నతాదర్శాధ్యాత్మిక భావసంపద్వాగ్వైభవాది సౌందర్యాతిశయ శక్తిని చవిచూచెడి సాహితీశక్తిలేక విజ్ఞాన దూరులై యజ్ఞానాహంకారాదులతో నవివేక చూడామణులై భువిపై చరించుచుందురు.

ఈ మాయాలోకమున చరించెడి కలిమానవుడు నేదో యొకానొక భ్రాంతితో తికమకచెందుచు నివారణోపాయమును గానక యన్వేషించక మాయయనెడుబ్బలోపడి యధోగతి నొందుచున్నాడు.

భ్రాంతి నివారణకు మందుయేది ? శ్రీ సద్గురు ప్రబోధామృత పానమే. సత్య సనాతన నిత్య శివసుందర శక్తియందు నరుడు తాదాత్మ్యము చెందుటయే నిజమైన స్థితి. ఇట్టి మహనీయ మధుర సుందర సుకుమార దివ్యస్థితినొందుట సామాన్యమా? కాదు. అనేక సహస్ర జన్మార్జిత ఫలసముదాయ మొక్కటియై నరుని వరించుటచే సాధ్యము కాగలదు.

లోకోత్తరస్థితియందుండి దివ్య పారవశ్యముతో రోజులు కొలది కాలగతిని కాయముస్థితిని మరచి వెలుగొందెడి విరాగ విద్యుత్కాంతి స్వరూపు లక్కడక్కడ ఒక్కరిద్ద రెవ్వరో దర్శనీయులై సాక్షాత్కరించుచున్నారు. ఇట్టివారి జీవిత చరిత్ర లతి పవిత్రములు. సర్వజన సంసారబంధలతాలవిత్రములు. వీరు లోకమున చరించెడి కాలమునందుగల జనులెల్లరు వారిని పిచ్చివారని తక్కువ

జాతికి చెందినవారని చదువురాని వారని శాస్త్రచర్చలు చేయజాలరని వెగటుభావముతో త్యజించిరి.

ఆ పిచ్చివారే లోకమును వీడి లోకేశ్వరునిలో నైక్యమై కనుమరుగైన రోజులలో వారి సమాధులపై పడి మోకరిల్లుచు మ్రొక్కుబడులు చెల్లించుచు భక్తితో ప్రార్థనలు సల్పుచుందురు.

లోకమునువీడి దివ్యావ్యయ మహోజ్వల స్థితియందు వెలింగెడి యా మహనీయమూర్తులకు పిచ్చియా? దీపము పోయిన తదుపరి చీకటిలో వెదకుచు కోర్కెలకు బానిసలై విలపించెడి నేటి లోకమునకు పిచ్చియా? నిజము తెలిసి వర్తించి హృదయ పరివర్తనము చెంది లోకపు పిచ్చికి తిలోదకములిడి భయభక్తులతో, జగత్పతి పతిత పావనుడు భక్తజన రక్షణ దీక్షాకంకణధారియగు పరమాత్ముని భజించి తరింపుడు.

నిజ భక్తుడు, లోకులు వాదించెడి మాయా రూపములైన వ్యర్థ వాగ్వాదములకు దిగులొందక మౌనముతో జీవితమును ధర్మ మార్గమున పయనింపచేసి పతిత జనోద్ధరణమునకై నావిర్భవించెడి తత్త్వవేత్తల స్వానుభవ సందేశములను శిరసావహించి జీవితగమనము నందుగల వక్రమార్గవిధులనుసరిచేసికొని జీవన్ముక్తినొందును. ఇది నిజ భక్తుని కర్తవ్యకర్మము.

జనన మరణ జన్యమై ద్వంద్వసంకులసమరమై కోపపాపతాపాది కర్మలకు నెలవై నరకమునకు హేతువైన ఘోరసంసార సాగర తరంగ తాడనములకు గుఱిగాక, నరుడు తన బుద్ధిని వక్రమార్గములకు జన నీయక శ్రీ సద్గురు సుప్రసాదిత మహామంత్ర ధ్యానానందపారవశ్య స్థితితో కాలమును కాయమును పవిత్రీభూత మొనర్చి భవతరణ మొందుటయే! కర్మసిద్ధాంతములోని సారసంగ్రహము.

# "ప్రశాంత నిలయమేది ?"

ఈ లోకసృష్టి చిత్రమైనది. లోకమున జరుగుచున్నట్టి కర్మలు విచిత్రములైనవి. పరమ సాధువుపతికి పాపిష్టిసతి. పరమ సాధ్వీలలామకు పాపకర్మలొనర్చెడిపతి. పరమలోభికి పెట్టెబడిమూల్గు ధనరాసులు. ఔదార్యమూర్తికి పేదరికము. వలదు వలదను వానికిల్లు నిండుసంతతి. అలమటించెడివాని కసలుసున్న. తినలేనిరోగికి దివ్యమృష్టాన్నము. మూడువానికి వట్టిమాటుచెక్క. పండిత ప్రకాండునిపట్టి బండమొద్దు. శుద్ధసాత్త్వికు లిల్లాలు షోకులాడి. కోడలుత్తమురాలు కొంటెవియత్త. ఆచార సంపన్నుడన్న తమ్ముడనాచారి. ఆదర్శవాది కందరూ విరోధులే. సద్గురుస్వాములశక్తి సత్యాత్ములకేయెఱుక. సర్వజన సభాపూజ్యులై ఘనసన్మాన గ్రహీతవాక్యముల విలువ తానున్నచోట జనులు గుర్తించజాలరు. నిరాడంబరులై జితేంద్రియులై బ్రహ్మనిష్ఠ సల్పెడి మహాత్ముని దురాత్ములు గుర్తించి గౌరవించజాలరు. వినయ వివేక విద్యాశక్తులున్న వానికి ధనలోపము. ధనముగల వానికారాటము మెండు. ధనము విద్యగలవారికి త్యాగగుణముసున్న. ధనము విద్య త్యాగగుణము గలవారికి సతిసుతుల పొత్తుకుదురదు. ధనము విద్య త్యాగగుణము సతిసుతులపొత్తుకుదిరినవారి కాయుర్దాయలోపము. ఇవన్ని సమకూరిన మనుజులకు శ్రీహరిభక్తి యగుదు.

సర్వసుఖ భోగలాలసులైన వారికిసైతము మనస్సునకు ప్రశాంతి లభించదు. భోగములతో కొన్నాళ్ళు రోగములతో కొన్నాళ్ళు, ఆలోచనలతో కొన్నాళ్ళు ఆందోళనలతో కొన్నాళ్ళు. ఆర్జించిన ధనముపైగల గాఢమమకారముతో నరుడు తన జీవితాంతము వఱకు తీరికలేని కర్మకలాపములతో చరించినచో, ప్రశాంతిరాదు ప్రమోదము లేదు.

"దాహశాంతికై ఘృతము పానముచేసిన మూర్ఖునివలె" ఆశలకు తిలోదకములిడి చిత్తశాంతిని పొందుమని వాచా వేదాంత ప్రబోధము లొనర్చు కలికల్మష హృదయుడైన మానవుడు, మాయాశక్తి ప్రభావమునకు బానిసయై భౌతిక సుఖభోగ వాంఛాబద్ధుడై ధనార్జన మునకే తీవ్రకృషి యొనర్చుచున్నాడు.

వ్యక్తి లోకోపకారకములైన ధర్మకర్మల నిర్వాహణమునకై ముముక్షువులైన జనుల ధనమును సేకరించుట ఉత్తమమార్గము. ఈ రూపముగా ధన సేకరణ మొనర్చిన ధర్మకార్యక్రమములకు యెట్టి యాటంకములు రాజాలవు. త్వరితగతి కార్యక్రమము విజయవంత మగును. ధర్మమార్గ గమనముతో శ్రీనృహరిభక్తిపరాయణుడై జీవనోపాధికై, దైవచిత్తమైన సంగీత సాహిత్యముల కృషితో పరుల హృదయములలో భక్తి శక్తి ధర్మమార్గ తత్పరతలబెంపొందింపచేసి వారి ధనము నార్జించుట మధ్యమమార్గము. దీనియందొక సూక్ష్మత యున్నది. శ్రీనారాయణుని దివ్యనామమునే దివ్యకరుణాశక్తినే మదినమ్మి తనశక్తికి తగినరీతి సంగీత సాహిత్య కవిత్వాది విద్యా కళా ప్రదర్శనములనిచ్చి సభికులయొద్ద వెలరూపముతో గ్రహించక వారివారి హృదయాంతర్గతశక్తి ప్రేరణతో రాబడిన యర్థమును స్వీకరించి సంతుష్టినొందిన నాడీమార్గము సైతము ఉత్తమమార్గ మనబడుచున్నది. అసత్యములతో లోకమును మెప్పించి దేవునిపేరుతో పుణ్యాకార్యక్రమ నిర్వాహణరూపముతో వారి ధనమునులాగి స్వప్రయోజనములకు స్వాహాచేయుట యధమమార్గము. త్యాగహృదయులైన భక్తులు లొసంగిన ధనముతో దేవాలయ మఠసత్రకూపాది పుణ్యకార్యము లొనర్చి సంపూర్తినొందించిన వానిని పాపభీతిలేక దుష్టహృదయులైన మనుజులు దొంగతనముచే సంగ్రహించి యనుభవించుట యధ మాధమ మార్గము. యధమమార్గముతో యధమాధమమార్గముతో చరించెడి నరులెన్ని శతాబ్దములకైన ధనవంతులుకాజాలరు. పైపెచ్చు

వచ్చినదేకాక యున్నదకూడ యదృశ్యమై గంజికి గతిలేనిస్థితిలో సమాజమున హేయముగ చూడబడుదురు. ఇది నిస్సందేహము. "బలవంతమైన సర్పము చలిచీమల చేతజిక్కి చావదెసుమతి" యని నుడివిన శ్రీ బద్దెన మహాకవి సూక్తి నేంతో లోకానుభవమును చాటుచున్నది. బలవంతుడై ధనవంతుడైనట్టి నరుడు గుణవంతుడు గానినాడు తనకంటె తక్కువస్థితిలోయున్నట్టి నరులెల్ల రొక్కటియై గుణహీనుడైన ధనబలోపేతుని ప్రాణములనే హరించివేయుదురు. "గుణములేని ధనమెందులకోయ్-ధనములేని సద్గుణమే బలమోయ్" యని ఈగ్రంథ రచయిత గేయామృతములో పేర్కొనిరి.

అధమ, యధమాధమ మార్గములతో లోకమునకు టోపీలువేసి నరులెంత ధనార్జన మొనర్చినను కడకు "వోటికుండలోని జలమువలె" దుర్వ్యయమగును. ధర్మముదప్పక సత్యముపీడక తనతోడినరుల హృదములకెట్టి బాధయందోళనలు చేకూర్చక దైవమునునమ్మి ధనార్జనచేయు పుణ్యపురుషుల కెల్లవేళల పురాణ పురుషుడైన శ్రీలక్ష్మీ నారాయణుడు సమాజరూపముతో తోడునీడయై కవచమట్లు ధర్మ కర్మదురంధరుని సర్వసంరక్షణ మొనర్చును.

శ్రీ భగవద్గీతా గ్రంథములోని "పరిత్రాణాయ సాధూనాం" అనెడి సూక్తిలోని భావమిట్టిదేనని ముముక్షువులు తెలియందగినదై యున్నది. తియ్యని మామిడిఫలమును గురించి గద్యపద్యములు రచనలు చేసిన కవికి, కవిగారి రచనలు చదివిన పాఠకునకు, భక్తితో వినిన శ్రోతకు, తియ్యని మామిడి ఫలమును తిని యానందించిన నరుని యనుభూతి గలుగనిరీతి, భగవద్రహస్యములను నరుడనుభవమునకు తేగలిగిననాడే నిజమైన యాత్మానందామృతము పానముచేయగలడు తదనుభూతిని పొందగలడు.

నరుని నోటిమాటలకు చేతివ్రాతలకు కపటముతో సాగించెడి కర్మలకు భగవానుని కరుణ ప్రసరించదు. నిష్కామముతో నిర్మల

హృదయముతో నిర్వర్తించెడి సద్గురూపదేశ మహాకర్మలవలన నరుని మనస్సు పరిశుద్ధమై హృదయమునకు ప్రశాంతి చేకూరును.

సత్కర్మల నిర్వహణమే నరుని గొప్పవానిగామార్చి సంఘ గౌరవమునకు పాత్రునిచేయును. నరుని జీవితమునందు మనోవాక్కాయ కర్మలు ధర్మబద్ధముగానినాడు కొండగుహాలందు నివసించినను కానన సంచార మొనర్చినను పుణ్యానదీతీరములందు భగవన్నామ సప్తాహము లొనర్చినను, భారతదేశమునందుగల సిద్ధక్షేత్రములలో మహారుద్రాభి షేకములుచేయించి కోటిబిల్వార్చనలుసాగించి సంపూర్తి నొందించినను ధర్మప్రబోధ గ్రంథములు నిత్యపారాయణ మొనర్చినను పరమాత్ముని కరుణ ప్రసరించదు. ప్రశాంతిలభించదు. నిజము తెలియనిలోకము 'మహాత్ముడని కొన్నాళ్ళు దురాత్ముడని కొన్నాళ్ళు' గుసగుసలాడు చుండును.

ప్రశాంతనిలయము సద్గుణసంపత్తిగల నరుని హృదయము. మానవులమస్తకములందు జీర్ణించిన దుష్టగుణ ప్రభావశక్తి ప్రశాంత మందిరముల కేగినను తిరోగతిచెందదు.

ధర్మవాక్యములు వేలాదిగ పఠించినను వానియందొక్క వాక్యమైనను ముముక్షువు తన నిత్యజీవిత జీవనకర్మములందాచరణము నందుంచని నాడెట్టి ప్రయోజనము లభించదు.

శ్రీ గురుహరిహర పూజలెన్ని యొనర్చినను పూజలుచేయు స్త్రీ పురుషాది పెద్దలెల్లరు వారివారి హృదయగత దోషపుంజములను గుర్తించి జాగుచేయక భయముతో సంస్కరణమొందించుకొనవలెను. హృదయగతదోషపుంజములను తొలగించుటకు యత్నించక బిగ్గరగా భగవన్నామమును శ్రుతి లయలు దప్పక వివిధ రాగాలాపనలతో స్మరించినను శ్రీ గురుహరిహరమూర్తుల కృపగలుగదు. ఇట్టి గురుగోష్ఠ్య విధులను విధానములను మతగ్రంథములందు గాంచుటరుదు. కారణ

మేమి? యథార్థవాది లోకవిరోధి యనెడి సూక్తిని గమనించి కవు లెల్లరిట్టి రచనావ్యాసాంగములకు సాహసముచేయ నొల్లరు.

పాపకర్మల ప్రభావముతో విజృంభించెడి మనోవైఖరులుగల స్త్రీ పురుషులు పవిత్రములైన దివ్యస్థల తీర్థరాజములకు మహాపర్వము లందు వెళ్ళినను సర్వపాపహరమైన హరనామ భజనారావములు వీనులకెంతో విందొనగూర్చుచున్నను పుణ్యకర్మల నిర్వర్తింపజాలక గతకాలమునందలవడిన నీచకర్మలైన చౌర్య వ్యభిచార జూద సురాపానాది కార్యములందే లగ్నమయిన వారిమనస్సులు సత్కర్మల చేరనీయవు. సత్కర్మలు చేయుటకు మనస్సొప్పక దుష్కర్మలనే చేయసాగుదురు.

నరులకు ఒకరుకట్టిన చద్ది చెప్పిన సద్బుద్ధి బహుకాలమునిల్వదు. వ్యక్తికి జన్మతోవచ్చిన వినయ వివేక సత్యదయాహింసాది సత్త్వగుణ సంపత్తి, కారణాంతరములచే దుష్టుల సాంగత్యముతో లోపించి పెడ దారులుపట్టి దుష్టులతోకలసి చరించినను, మహాత్ముల ప్రబోధ వాక్యములచే పుణ్యస్థల నివాస మహిమతో సత్య సిద్ధాంత రహస్య గ్రంథపఠనమువలన సరియై ప్రకాశించగలదు. వ్యక్తిని మహోన్నతస్థితి యందుంచగలదు.

ఏ దేశమునందైనను మతమునందైనను యేకాలమునందైనను పరకాంతాసక్తి పరుల ధన సంగ్రహణాసక్తి యసత్యములాడుట యన్యాయకర్మ లొనర్చుట దొంగతన మొనర్చుట జూద సురాపానాది మత్తు పదార్థముల సేవించుట పరులను వాగ్రూపముగా హింసా రూపముగ మనోవేదనలకల్పించియేడ్పించుట తగదని పాపమని పెద్దలు శాసించిరి. పరుల కష్టములలో సాయమొనర్చుట, కన్నీరు గార్చెడి వారిని యోదార్చుట, సత్యపథమున పయనించుట, బీదవారిని కరుణతో సాదమొనర్చి సంతృప్తి నొందించుట, వృద్ధులకు చేయూత నిచ్చుట

ధర్మ దైవ పుణ్య కర్మలకు ధనమర్పించుట, తన తోడివారికెట్టి యపకారము చేయకుండుట, తదితర ప్రాణికోట్లను హింసించక యోర్పుతోనుండుట మహాత్ముల బోధలువిని జీవితాచరణమునందుంచు టాదిగాగల సత్కర్మల పుణ్యమని బుధులు వాకొనిరి.

రకరకములైన భాషలతో పలికినను చక్కెర స్వరూపము గుణ మొక్కటియే. శ్రీ భగవద్గీత, ఖురాన్, బైబుల్, మహా గ్రంథములలోని శ్లోకముల సూక్తుల వాక్యముల సార సంగ్రహ స్వరూపమునందెట్టి భేదము కన్పించదు.

ఎన్నడో కురుక్షేత్రసంగ్రామారంభమునందు శ్రీకృష్ణపరమాత్మ పార్థుని హృదయదౌర్బల్యమును నశింపచేసి క్షాత్ర ధర్మ కర్మనిర్వా హకునిగాతీర్చిదిద్ది రక్షించుటకై యొనర్చిన ధర్మప్రబోధారూపమైన "గీత"కు నేటికాలమున మహాత్ములెందరో వివిధరహస్యసిద్ధాంతోప మానాదికథలతో మహావ్యాఖ్యానములొనర్చి ముముక్షుజనసహస్రముల కందచేయుచున్నారు భవితవ్యమునచేయనున్నారు.

ఆ భగవద్గీతారహస్యవిశేష వివరణమంతయు మూడింటితో ముడివడియున్నది. "కర్మ–భక్తి–జ్ఞానము" ముముక్షువు, సాధువు, సంసారి, కవి, కథకుడు, గాయకుడు, విద్వాంసుడు, పండితుడు, ఉద్యోగి, వ్యాపారి, కార్మికుడు, వ్యవసాయకుడు, భాగవతుడు, ఆచారి, పూజారి, ఆధ్యాపకుడు, ధనికుడు, పేద, గురువు, శిష్యుడు, భక్తుడు, ఆరాధకుడు, విరాగి, యోగి, జోగి, భోగి, రోగి, మొదలైనవారెల్లరు వారివారి విధ్యుక్త కర్మలను నిర్వహణ మొనర్చవలెనని శ్రీ భగవద్గీతా సుందర సందేశము.

నరుడునిరహంకారియై నిత్యసత్యవ్రతశీలుడై కర్మయోగమును నిరాటంకముగ నిర్వహించినచో భక్తియోగమై ముందునకుసాగి పోగలదు. భక్తి యోగముపరిపక్వమై జ్ఞానయోగమైవర్ధిల్లగలదు.

నరుడునిరహంకారియై నిత్యసత్యవ్రతశీలుడై కర్మయోగమును నిర్వహించవలెను. ఇదిసోపానమార్గము. నిరహంకారియై నిత్యసత్యవ్రత శీలుడై కర్మయోగమును నిర్వహించవలెననెడి వాక్యములోని సత్యాంశమేమి?

ఈ కుటుంబ నిర్వాహణాధికారినినేనే. నేను లేనినాడు నాసతి సుతాదివర్గము నెవ్వరు పోషించెదరనెడి భ్రాంతిని విడనాడిననాడు నిరహంకారికాగలడు. అట్టి స్థితిలో నిత్యసత్య సనాతన శక్తిస్వరూపమై నట్టి తనయాత్మ సాక్షాత్కారమునకు తీవ్రకృషిసల్పిననాడు కర్మ యోగమును నిర్వహించినవాడై కృతార్థుడగును.

ఈ రూపమైన కర్మయోగమును నరుడు నిర్వర్తించుట కశక్తుడై తన సతి సుతాదివర్గ రక్షణమునకై తానే కర్తననెడి దుర్భావముతో "తేనెలోపడిన ఈగరీతి" దిక్కుతోచక దరి తెలియక తన స్వసంకల్పము లతో తనకుతానే "సాలెగూడువలె" సృష్టించుకొన్నట్టి ఘోర సంసారకూపమునబడి విషములని తెలియక విషయసుఖములే నిద్యానందములని భ్రమించి విరక్తిచెందక విముక్తి తెలియక తన పెత్తనములేకనె నొకనాడు సర్వమును విడచి దేహముతో వెళ్ళుటకు వీలులేక యెక్కడికో తరలి పోవుచున్నాడు.

వెళ్ళిపోయెడి వ్యక్తినిచూచి వెళ్ళుటకు ప్రయాణమయ్యెడి లోకపు నరులు వెఱ్ఱిగా నేడ్చుచున్నారు. మాయాబద్ధుడైన మనుజుడు మాధవదర్శనానంద దివ్యరసానుభూతిని పూర్తిగా మరచి నాసతి, నాసుతులు, నాయిల్లనెడి మమకార పాశబంధనముతో శాంతిలేక ధనాశ జిడ్డులోబడి కట్టకడవరకు వ్యామోహ సుడిగుండమునందే పరిభ్రమించుచున్నాడు.

పరమాత్ముడైన శ్రీ నృసింహునినమ్మి ధర్మదృష్టితో సత్యా న్వేషణతో శ్రీ లక్ష్మియెడ లక్ష్యములేక జీవితగమనము సాగించెడి

భక్తవతంసుని రక్షించుటకై సంసారసాగరమునందు కష్ట నష్ట బాధలనెడి పెనుతుపానులను సృష్టించి భక్తవతంసుని హృదయమునందుగల సంసార వ్యామోహమును సూక్ష్మదోష ఫలానుభవములను తుద ముట్టించి తన కృపతో తన సన్నిధికి చేర్చుకొని కన్నతండ్రియైన తానే సంరక్షించి సంతసమొందుచుండును.

కల్లకపటములేని కరుణాహృదయులైన నరులొనర్చెడి లోకోప కారకములైన కర్మలను వారి సతిసుతాదులు సైతము రోషావేశములతో ద్వేషించి తెగడుచుందురు.

ఇందులకు కారణమేమి ? వ్యక్తి, లోకమర్యాదలను పాటించక ధనాన్వేషణయందు నిర్లిప్తుడై ధర్మదృష్టితో తాత్త్విక చింతనతో సంసారముపై మమకారములేక సాత్త్విక కర్మలకై ధనవ్యయ మొనర్చుటయే ప్రధానకారణము.

తాత్త్వికచింతనతో భగవద్దర్శనాకాంక్షతో చరించెడివ్యక్తి సంసారమునందుండి గౌరవమర్యాదలనొందజాలడు. "వాయససమూహమునందు చేరినకోకిలవలె" హేయముగాచూడబడును.

ఆకాశగమనమొనర్చెడి రాజమరాళము కోడివలె దిబ్బలందున విహరించరీతి, "బ్రహ్మసత్యము-జగన్మిథ్యా" యనెడివేదవాణిని సంస్మరించెడిముముక్షువైనమానవుడు సంయోగవియోగసుఖదుఃఖాది ద్వంద్వసంకులసమరమైన మాయాసంసారమునందుండజాలడు.

కలికల్మషహృదయుడైన మనుజుడెన్నికష్టపరంపరలనొందినను సంసారముపై విరక్తినొందడు. భగవానుని దర్శనమునకాసక్తిచెందడు. ఇదిమహత్తరమైన మాయాప్రభావము.

"పేడలో నివసించెడి పురుగునుతీసి పన్నీరులోవేసినచోప్రాణము లనుగోల్పోవురీతి" పనికిమాలినవ్యాసంగములతో వ్యర్థవాక్ప్రలా

ఘములతో హేయకర్మలతో చరించెడి లౌకికనరునిమనస్సు మనస్సున కధిపతియైన మాధవుని దివ్యనామస్మరణము నందుండజాలక గిజగిజలాడ సాగును.

అనంతకోటిగ్రంథములసారము మహాత్ములైన సద్గురుస్వాముల నోట వెలువడెడి స్వానుభవ వేదాంతసూక్తియందు తాండవించుచున్నది. అట్టివిజ్ఞానభాస్కరులైన శ్రీ సద్గురుయోగానంద నరసింహస్వామివారి దివ్యాచరణానుభవ సూక్తులలో సారాంశసుధయే! మీరు పఠించి మనస్సుతో చవిచూచెడి ఈ "కర్మసిద్ధాంతము".

శ్రీ యోగానంద నరసింహస్వామివారు తమ వినిర్మల ధర్మబోధారహస్య విశేషవివరములన్నింటిని లోకమునకందించి లోకోద్ధరణ మొందించెడి మహోన్నత ధ్యేయముతో తన పాదపద్మద్వయమునే సదాయర్చించుచు సర్వదేవతామూర్తులలో తనరూపమునేదర్శించుచు సమస్తనామములతో తన పవిత్ర నృసింహనామాక్షరముల నేసంస్మరించుచున్నట్టి తనపాదసేవకుడైన సుబ్బరాయగుప్త భాగవతుని చేతి కలమునందు సిద్ధతపోయోగ మహామహిమాన్వితశక్తిని మేళవింపచేసి లోకమునకందించెనని సదాజ్ఞప్తినుంచుకొని భక్తితోపఠించి నిత్యజీవిత జీవనకర్మలలో దయాచరణమునందుంచి జీవన్ముక్తినొందెదరుగాత!

ఈ పరమపవిత్రభారతావనియందెన్నో మతములావిర్భవించినవి. మతప్రవక్తలు, సిద్ధతపోయోగవిభవాన్వితులు, అఖండశక్తిదర్శనానందహృదయులు, ఆదర్శదీక్షాదక్షులై నిస్వార్థసేవాపరాయణులై లోకక్షేమంకరులై అద్వైతదృష్టితోభగవదుపాసకులై సాగించిన దివ్యరచనాదక్షులైనపెద్దలు ఈ మహాజనకల్లోల వాతావరణమును శుద్ధమొనర్చిసుప్రశాంతిని ప్రసాదించుటకెంతోకృషియొనర్చిరి.

"సర్వేజనాస్సుఖినోభవంతు" అనెడివేదవాణినే మన పెద్దలెల్లరు పాటించి లోకోత్తరకృషియొనర్చి ధ్రువతారలై విలసిల్లిరి. అట్టియామహన్మూర్తులు ప్రవచించిన నీతులను వారొనర్చిన ప్రబోధసూక్తులను

వారాచరించినకర్మలలోనిలోతులను ముముక్షువులైనవారెల్లరుగుర్తించి సర్వసంశయరహితులై నిత్యాచరణములందుంచిననాడు హృదయము లన్నియు ప్రశాంతనిలయములే.

ఎవ్వనిహృదయముశాంతికినిలయమో! అట్టిప్రశాంతనిలయమైన హృదయమునందే దేవుని దివ్యజ్యోతివెలుంగుచు దివ్యరహస్య సందేశములు లోకము కనువిప్పుకై వ్యక్తములై సత్పరిణామమునుకల్గించ గలవు.

స్వార్థప్రయోజనములకై యజ్ఞానులైన నరులుతప్పొప్పులవివరము లెఱింగియు తమతోడినరులకన్యాయమును చేకూర్చికన్నీటికిగుఱిచేసి వారుపన్నీటితో కాలమును గడపుచున్నారు. పన్నీటితో కాలము గడపిన యానరులే కర్మపరిపక్వదశలలో కన్నీటితో పరితపించుచున్నారు.

నరులుదారులై సత్కర్మలొనర్చుట కుపక్రమించినను గతము నందొనర్చిన కుకర్మలఫలమనుభవమునకువచ్చి కర్మగతితిరోగతినొంది హృదయావేదనల చెందసాగుదురు.

"కృషితోనాస్తిదుర్భిక్షమ్" అనెడిసూక్తి నరునిజీవితమునందు గతకర్మఫలమెదురైననాడుఫలించదు. జీర్ణస్థలములందుమట్టిపనిచేయు వానికి వరహాలకుండప్రత్యక్షమైధనవంతుడైనరీతి గడచినకాలమునందు నరులొనర్చిన మంచిచెడ్డకర్మలఫలములన్నియు కర్తవ్యకాలమునందను భవమునకువచ్చిఖేదమోదములను చేకూర్చుచుండును.

ఈ కర్మసిద్ధాంతములలోని రీతులతి విచిత్రములై విన్పించినను కాదనుటకవకాశములేదు. ఒకవ్యక్తిని లోకమునగల జనులలోకొందరు ప్రేమించి పూజించుచుందురు. కొందరుద్వేషించి దురూక్తులాడు చుందురు. ఇందులకుకారణ మావ్యక్తికాదు. ద్వేషించిదురూక్తులాడెడి సంఘముకాదు. నిదానముగా నిబ్బరముగా దూరదృష్టితోయోచనచేసి సత్యముగుర్తించినవారికి బోధపడగలదు.

ఒకేనాణెమునకు చిత్తుబొమ్మయుండుట సహజమైనరీతి వ్యక్తి జీవితము మంచిచెడ్డలసమ్మేళనము. నారికేళముపీచుతో, టెంకతో, కొబ్బరితోయుండెడిరీతిగ వ్యక్తిజీవితమునందును, సాత్త్విక, రాజస, తామసగుణములుకలసి కాపురముచేయును. లోకమునగలజనులు సత్త్వరజస్తమోగుణములతో నొప్పారుచుందురు. ఏ యేగుణములు గలనరులు వ్యక్తులజీవితములందా యా గుణములనుగుర్తించి గుర్తుంచుకొని లోకమునవాకొనుచుందురు. లోకమునకు దుష్టుడని ఋజువైనవ్యక్తి పుణ్యకర్మప్రభావమనుభవమునకువచ్చి దుష్టబుద్ధుల విడనాడి శిష్టాచారవిధులనునిర్వర్తించి మహాత్ములై వెలుగొందిన వారెందరో చరిత్రపుటలలో కన్పించుచున్నారు. శ్రీ వేమన్న నిజలింగ చిక్కయ్య, చింతామణిమొదలైనవారి స్థితిగతులన్నియు నిట్టివేనని పాఠకులుగమనించవలెను.

పనికిమాలినపాషాణము,మహాశిల్పిచేతిసుత్తెదెబ్బలప్రభావముచే శివలింగమై దేవాలయమునచేరి భక్తజనుల పూజలనందుకొనుట కాదన గలమా? ఇదేరీతి పతితమానవుడు గురుహరికృపాబలముచే పావనుడై పూజ్యుడగును.

కవి, కవితాశక్తిని, కవితాహృదయులై రసజ్ఞులై స్వపరభేద శూన్యులైనపెద్దలు గుర్తించి యానందించుచుందురు. కవిగారి గుణ గణ వంశమర్యాదలను లౌకికజనులు పరామర్శించుచుందురు. కవిగారి స్థిరచరాది యాస్తివివరములను బంధువర్గము యంచనాలువేయ సాగుదురు. కవిగారి రచనాముద్రణమునకై సాత్త్వికభక్తులాలోచనలు చేసి కావ్యసిద్ధికి జేయూతనిచ్చి కవిహృదయమునకానందమొనగూర్చు చుందురు.

సుకవి, భగవదేచ్ఛతో నిస్వార్థదృష్టితో లోకప్రజల మనుగడనుతీర్చిదిద్ది కర్మబంధవిముక్తినిచేకూర్చి కర్మఫలప్రదాతయగు

దేవునికృపకు పాత్రులచేయుటకై తీవ్రకృషిసల్పి తనకర్తవ్యకర్మనిర్వహణమును సంపూర్తిచేసి సంతృప్తినొందుచున్నాడు.

ఇట్టి కవితల ముద్రణభాగ్యమునుచేకూర్చెడి, చేకూర్చెడివారి పరిచయమొనర్చెడి త్యాగభక్తిహృదయులైన నరులెల్లరు సాత్త్విక సంస్కార గుణవిభవులని సర్వులు తెలియవలసిన సత్యసూక్తి.

ధనముగలవారెల్లరు ధర్మకార్యములకాధనము సద్వినియోగ మొనర్పజాలరు. బలముగలవారెల్లరు తమ బలముతో తోడినరులకు సహాయసంపత్తినిచేకూర్చజాలరు. విశ్రాంతిగలవారంతా విష్ణుసంకీర్తనమునందు పాల్గొనలేరు. దేవాలయాధికారులందరు దైవకార్యములందు పాల్గొని నామభజన పారాయణములొనర్పజాలరు. సద్గ్రంథములను పఠించిన నరులెల్లరు సాత్త్వికమూర్తులై విలసిల్లజాలరు. తీర్థయాత్రా పర్యటనమొనర్చిన యాత్రీకబృందమంతయు సద్గుణసంపత్తితో వెలుగొందలేదు. ప్రపంచమునంతటినితిరిగి విజ్ఞానవిషయ దృశ్యములను దర్శించివచ్చినను లౌకికహృదయుడు పరివర్తనము చెందడు. ధర్మ కార్యములపేరుతో పరులధనమును ప్రోగుచేయు బహువిధప్రజ్ఞాశాలి తన ధనమును లోకహితకర్మలకు సద్వినియోగముచేయలేడు. పరుల గృహములలో ప్రసాదములను భక్షించెడుభాగవతుడు తనగృహమునకు వచ్చిన యతిథికి ప్రసాదమిచ్చుటకు మనస్సుకుదురదు. తనతోడివారికి ధర్మశాస్త్రరహస్య విశేష వివరములను ప్రబోధముచేయు పండితుడు తానాచరణమునందుంచుటకెట్టి ప్రయత్నముచేయడు. ఈ వ్యత్యాస గుణ ప్రవృత్తులకు మూలకారణము వ్యక్తుల జన్మసిద్ధమగు కుసంస్కార ప్రభావమే.

జన్మాంతరపుణ్యఫలసంస్కారముతో యీ భువి జన్మించిన వారే జాతికి చెందినను సత్యశౌచ దయాధర్మ సహనశీలములు వారి మనుగడలలో ప్రతిబింబించుచుండును.

జన్మాంతరపాపఫలసంస్కారముతో భువి జన్మించిన వారే జాతికి చెందినను నీతి నిజాయితీ సత్య ధర్మ న్యాయాదిగుణములు మచ్చునకైన వారిహృదయములందు కన్పించవు.

జాతిచండాలునకు సత్కర్మలవలన ముక్తిలభించును. గుణచండాలునకు కోటిజన్మలకైన ముక్తి లభించదు.

లోకమున గుణచండాలుడైన మానవుడు వ్యాపారమొనర్చి లక్షలార్జించినను, వ్యవసాయమొనర్చి తుష్టిగా పుష్టిగా పంటలు పండించినను, గొప్పగొప్పచదువులుచదివి యున్నతోద్యోగములు చేసినను, కవితావాహినిని గద్యపద్యాదులతో లోకమెల్లెడల ప్రవహింపచేసినను, ధర్మోపన్యాసములనే కోపమానములతో మండలములాదిగా సాగించినను, సంఘబలముతో ప్రభుత్వమునందుపలుకుబడి, వాక్చాతుర్యము, సర్వజనవశీకరణశక్తిగల్గినను, మంత్ర తంత్ర యంత్రశక్తులతో లోకమంతటిని పాదక్రాంతమొనర్చుకొనినను, తనకుగల క్రూరవాంఛాపిపాసతో కామినీ కాంచనములయెడ వక్రమార్గము నవలంబించి లోకపువెగటువాక్యములకుగురియై సంఘదృష్టికి నీచమానవునిగ కన్పట్టుచున్నారు.

అన్యాయాక్రమదౌర్జన్యహింసాదికుకర్మలతో నరులెంత ధనమార్జించి నిల్వచేసినను వారికి వారి కుటుంబములకాధనమువలన సుఖశాంత్యానందములు లభించజాలవు. "గంగగోవుపాలు గంటెడైనను చాలు కడవడైననేమి ఖరముపాలు" యని నుడివిన శ్రీ వేమన యోగీంద్రులు వారి మహావాణియెంతటి నీతిని సంఘమునకు ప్రబోధము చేయుచున్నదో గమనించితిరా?

కులకాంతకన్న వెలకాంతమిన్నయని వ్యభిచరించినవ్యక్తిగతి దుర్గతిపాలగుచున్నది. నీతిమార్గమున నడచిన నరుడేకర్మయొనర్చిన మిక్కుటమగులాభమురాదని నీతిని విడనాడి సంఘభీతిని పోనాడి

దైవమునువిస్మరించి ధనమే ప్రధానముగానెంచి శాస్త్రవిరుద్ధమైన కర్మలనాచరించినవాడు కృష్ణపక్ష శశాంకమువలె దినదినమునకు సర్వ విధము లక్షయమై గంజికికఱవై దుర్భరదినావస్థలపాలై కడవలకొలది కన్నీరుగార్చి కడకు కాటికేగుచున్నాడు.

ఈ సిద్ధాంతములన్నియు నరుల నిత్యజీవిత జీవన కర్మా కర్మములలోని స్వానుభవసత్యములని నమ్మి పఠించినవారెల్లరు యాచరణములందుంచి తత్ఫలితములనుపొందిన హృదయములన్నియు ప్రశాంతనిలయములై ఆదర్శమణిదీపములై వర్ధిల్లగలవు.

---

## —"మనస్సు = మాయ = మాధవుడు"—

ఎనభైమూడులక్షల తొంబదితొమ్మిదివేల తొమ్మిదివందల తొంబదితొమ్మిదియోనులనుండి బహిర్గతమై భువిపైపడి పొరలి పెరిగి పెరిగి మరణించినజీవుడు చివరదశకు మనస్సుతోకూడిన మానవునిగ యవతరణమొందునని శ్రుతి స్మృతి శాస్త్ర పురాణములు విజ్ఞులైన పెద్దలు ప్రవచించిరి.

నరుడు నారాయణునిలో లీనమగుటకవకాశమున్నది. తదితర జంతుజాలమునకట్టి మహావకాశములేదు. నర, అనగా మనస్సని యర్థము. అయనమ్, అనగా అధిష్ఠానమని, అధిపతి, యని. మూలమని యర్థములు గలవు. నారాయణుడు, అనగా మనస్సునకధిపతియని భావము.

మనస్సుతోకూడినవాడగుటచే మానవశబ్దముసార్థకత చెందినది. మానవునికిదక్క తదితర జీవకోట్లకు మనస్సులేదు. బుద్ధిబలముతో విచక్షణాజ్ఞానములేని కర్మలోనర్చి యాహార నిద్రాభయ మైధునము లతో కాలమును గడిపి మృత్యువు పాలగుచున్నది.

మనస్సు కమలమువంటిది. దళముల సమూహామే కమలము. సంకల్పములసముదాయమే మనస్సు. కమలమునకుగల దళములను నొకదాని వెంటనొకటి తీసివేసినచో కమలము కన్పించదు.

నరుడు గొప్పమేధావియైనను గతకాలమునందలవడి బలము కూర్చుకొని మనస్సులోదాగి మోసముచేసెడి ధూమపానాది మత్తు పదార్థములశక్తిని, చోర, జారాది కర్మల బలములను జయించలేక విరోధించెడి ప్రయత్నములతో పుష్కరములాదిగ కృషిచేయుచు విఫల మనోరథుడగుచున్నాడు.

ఇట్టి పతితుడైన నరుని రక్షణము లోకమునందెవ్వరికి సాధ్యము గాదు.

సౌబరిమహర్షి ఋష్యశృంగమహర్షి సైతము మనోవేగమునకు బానిసలై దృశ్యసందర్శనాకాంక్షతో శరీరసుఖాభిలాషతో జడలు త్రెంచుకొని కాముకదృష్టితో ధర్మవ్యతిరేకములైన కర్మలొనర్చి పతితులై నేటికి చరిత్రపుటలలో కన్పించుచున్నారు—

మనస్సులోని కల్మషమును ముముక్షువు యావేదనాపరమైన కన్నీటితో కడుగుకొని మనస్సులోగల బలమైన కుసంస్కార ప్రభావ శక్తిని జయించుటకు శ్రీ నరసింహనామస్మరణధ్యాన భజనపారాయణ లేఖనములనెడి దివ్యౌషధ సేవనతత్పరులైననాడు పరిశుద్ధహృదయులై పరిణామ మొందగలరు.

పరమాత్మపై మనస్సులయమైననాడు కర్మలులేవు కర్మఫలములు లేవు. జన్మలులేవు జరామృత్యుభయములులేవు. పరమాత్మయందు నరుల మనస్సులు లగ్నముచెందక ప్రకృతిసుఖకర్మలలో లీనములైన నాడు కష్ట నష్ట యావేదనాది మహాబాధలకులోనై శాంతిదూరులై నరకలోకయాత్రాహ్వానముల కెదురుచూచుచుందురు.

నరుని కోర్కెలను చుట్టిముట్టి మనస్సుతిరుగాడసాగును. మనస్సువెంటనంటి కర్మేంద్రియములు ప్రవృత్తి యత్నించును. కర్మేంద్రియ వృత్తుల సంచారవేగమునకాగలేక శరీరము పయనము సాగించును. శరీరము కదలికతో కర్మ ప్రారంభమగును. కర్మకు సంస్కారశక్తితోడై దుష్కర్మ సత్కర్మలొనర్చుటకు నరుడుద్యుక్తుడగుచున్నాడు.

'గొడ్రాలికి బిడ్డలకనెడిబాధ తెలియనిరీతి' నరుడు విషయసుఖములనుభవించనినాడు విషయసుఖములప్రసక్తికి మనస్సు పరుగిడజాలదు. మాంసభక్షణచేయని మనుజులు మాంసపువర్ణనలను రుచుల జాడలను యెన్నాళ్ళు వినిన కనిన మనస్సుచలించదు. బాల్యమునందే గతజన్మపుణ్యాఫలశక్తి నరుని వరించి సంసారముపై విరక్తిచెంది జప తప ధ్యానాది కర్మల సాగించిననాడు మనస్సు బానిసమై "ఇంటికుక్క" వలె చరించి యెంతయో మేలొనరించి దివ్యవైకుంఠమునకు దారి చూపగలదు.

నరునిమనస్సు దర్పణమువంటిది. దర్పణమునకు మసిక్రమ్మినచో రూపము ప్రతిబింబించదు. నరునిమనస్సునకు కామినీ కాంచనములనెడి ధూమముక్రమ్మినచో ధర్మశక్తిని గోల్పోయి యధర్మకర్మలను పాపభీతి లేని రీతిలో 'పిచ్చికుక్క' వలె చేయసాగును. "పిచ్చికుక్కకు ప్రసాద మిడిన కాళ్ళతోచిమ్మి స్మశానమునందుగల యెముకలను గొఱికెడి" రీతి దుష్టవ్యభిచార చోరాది దుష్కృత్యములొనర్చెడి స్త్రీ పురుషులు, దైవకర్మల కాహ్వానములొనర్చినను రాజాలక పాతపద్ధతులయందే మసలుచు కడకు శరీరములోని జవసత్త్వములుడిగి యెవ్వరికి పనికిరాక పరుల పరుషవాక్యములను వినజాలక వైద్యాలయములందే కన్నీటి స్నానములతో జీవితములను పరిసమాప్తినొందించెదరు. ఇంతటి ఘోర విపత్తునకు నరులు గురియగుటకు వయస్సులో భయభక్తులనువీడి

పెద్దలమాటలను పెడచెవిబెట్టి దుష్టకర్మలలో స్వేచ్ఛావిహారులగుటయే ప్రబలకారణములు. —

దర్పణమునకు క్రమ్మిన మసిని వ్యక్తి, శుద్ధవస్త్రముతో తుడిచి పరిశుద్ధమొనర్చినరీతి, నరుల మనస్సులకలవడిన దుష్టగుణ వికారములను శ్రీ సద్గురు కృపాప్రసాదమహామంత్రధ్యానప్రభావముతో యెవ్వారికి వారే సంస్కరణ మొనర్చి శుద్ధమనస్కులై వినిర్మల కర్మయోగ నిరతులై నిత్యానందనిలయమైన పరమాత్మయందు మనస్సులను యేకముచేసిననాడు మాధవస్వరూపులై ప్రకాశించెదరు.

ధర్మ సత్య దయా నీతి గుణకోవిదుడైన మానవుడు ప్రారబ్ధ కర్మ ప్రేరణతో పరిసర విపరీతవాతావరణముతోడై మతిచెడి పరకాంతనుపొంది పతితుడైనను, మహాత్ములబోధలచే సత్య సవిమర్శ సద్గ్రంథపఠనలచే అంతరాత్మప్రబోధములచే దివ్యజాగృతినొంది గత కర్మ దోషపుంజములను గుర్తించి యావేదనతో చింతించి మనోగతిని మందలించి మంచిత్రోవకు పయనింపచేసి మాధవకృపకు పాత్రుడై సమాజగౌరవాదరణములనుపొంది పునీతుడగును.

లోకములన్నింటిని ఘడియలో జయించి తానే సర్వాధికారినని మృత్యుంజయుడనని మురిసిపోయిన నాటి హిరణ్యాకశ్యపుడంతటి మహావ్యక్తి తన మనస్సుకు బానిసయై, "సద్గుణనిధియై సర్వభూతములను శ్రీనారాయణుని స్వరూపములేనని సంభావించిన బాల భక్తప్రహ్లాదమూర్తి మహనీయాద్వైతశక్తిని" గుర్తించజాలక ద్వైత దృష్టితో యహంకృతితో కఠినశిక్షలకు గురిచేసి భక్తరక్షణకై సభాస్తంభమునందే దివ్యావిర్భావమునొందిన మహోగ్రమూర్తి శ్రీ నృసింహస్వామి చేతులలో ప్రాణములను గోల్పోయిన విషయము సర్వలోకవిదితము.

అట్టి త్రిలోకభయంకరుడైన దానవసార్వభౌముడు సైతము దైవ ధిక్కారములో భక్తజనాపకారియై యంతిమదశలో సర్వవిధముల

పతితుడై ప్రాణములను గోల్పోయెను. నేటికాలమున దైవ ధర్మ దయాపకారులైన దుష్టకలిమానవులస్థితియెంత!

ఇంతటనైన మాయానిద్రనుండి యజ్ఞానులైన స్త్రీ, పురుషులు మేల్కాని గతకాలమునందు తెలిసి తెలియక యొనర్చిన రాక్షస కృత్యములకు తుచ్ఛశరీరకసుఖములకు తిలోదకములిడి శ్రీప్రహ్లాదమూర్తి చరించి తరించిన కర్మసూత్రములనే సదా యాచరించి సద్గురువుల సంప్రదాయములకు భారతదేశపు విలువలకు వన్నెలుచేకూర్చి మీరాత్మానందమును పానముచేయుడు.

ముముక్షువులెల్లరు ప్రతిరోజు సూర్యోదయమునకు రెండుగంటల కాలము ముందుగాలేచి దేవునియెదుట సుఖాసనాశీనులై తమలో తామే గతదివసమునందొనర్చిన కర్మలన్నింటిని నెమరువేసుకొని 'మేమొనర్చిన మనోవాక్కర్మగతులన్నియు పాపములకు కారణమా? పుణ్యములకు కారణమా? స్వార్థ సహితములా? స్వార్థ రహితములా? యనెడి మనోమథనముతో సత్యము తెలిసి దోషకర్మములను సంకల్పము లను సంభాషణములను నిర్మూలన మొనర్చుచు 'నీ–నా' భేదభావము పూర్తిగా త్యజించి ధర్మపథమున పయనము సాగించుటే జ్ఞానయోగము నకు మూలము. కర్మయోగమునకుపునాది.

మనుజులు మంచిచెడ్డల విషయము తెలిసియు పాపకర్మల నిర్వహణమునకుద్యుక్తులై నిర్వహించుటకు కారణమేమి? మనోనేత్ర మున కజ్ఞానమనెడి పొరపెరుగుట. హృదయదర్పణమున కైహిక సుఖవాంఛాపిపాస యనెడి ధూమముక్రమ్ముకొనుటయే ప్రధాన కారణములు. ఈ కార్యాకారణసంబంధమునే సద్గురువులు "మాయ" యని వాకొనిరి.

ఈ "మాయ" నశించుటకు నరులకుతగిన వైద్యమేది? సరియైన వైద్యమొనర్చి చిత్తశాంతిని, యాత్మానందమునుచేకూర్చెడి

వైద్యవిద్వన్మణియేడి! సాధనచతుష్టయసంపత్తియే వైద్యము. ఇట్టి వైద్యమునుచేసి భవరోగగ్రస్తులైన నరులకు యమృతత్త్వమును కల్పించెడి వైద్యవిద్వన్మణి సద్గురువే. అట్టి సద్గురుస్వరూపమెట్లుండును? ఆయన బ్రాహ్మణుడా? బ్రాహ్మణేతరుడా? సంసారియా? సన్యాసియా? గ్రామవాసమొనర్చునా? కొండబిలములందుండునా? యనెడి సంసయములు భవరోగగ్రస్తులైనవారెల్లరికి కలుగవచ్చును. వైద్యునిశక్తి, మందులోని గుణము తెలిసి భయభక్తులతో సేవించిన రోగులకే సంపూర్ణారోగ్యము లభించగలదు.

భవరోగవైద్యవిద్వన్మణి సద్గురువే! యనెడి నుడిని పఠించిన ముముక్షువులైనపెద్దలెల్లరు సద్గురుస్థితియెట్లుండునో ప్రశాంతమనస్కులై పఠించి గుర్తించి వెంటనే మరువక యన్వేషణలొనర్చి సద్గురుస్వామిని దర్శించి సేవలొనర్చి వారి కరుణగలిగిన సుభసమయమునందే సంశయములను నివర్తిచేసికొని బోధలోని తత్త్వమును తెలిసి యాచరణమొనర్చి తరించండి.

సంసారనిర్వహణాశక్తిలేక త్యజించి ఉదరణపోషణార్థమై గ్రామసంచారములొనర్చెడి వారెల్లరు సన్యాసులుగారు. వేషభాషలతో యుక్తిశక్తులతో ధనకాంతాతపనతో శాస్త్రవాక్యపటుత్వముతో ధనమునునిల్వచేసి బౌతికబంధాలతో సతమతమయ్యెడి వారెల్లరు సద్గురువులు గారు.

సద్గురువులు ఏకులమునకుచెందినను, యే మతమునందు వర్తించినను, వేదోపనిషద్గీతాశాస్త్రార్థ చర్చలు చేయకుండినను దేశమంతట పర్యటనమొనర్చి మండలములాదిగా మహోపన్యాసములొనర్చక యున్నను వివిధగ్రంథములలోని సారాంశమంతయు క్రొత్తపేరుతో వేఱొకగ్రంథముగ రచనలుసాగించి ముద్రణచేయించి ప్రజలకందించక నిర్లిప్తముగనుండినను లోకమునకు పూజనీయులనెడి యథార్థమును మరువకుము.

భవరోగవైద్యవిద్వన్మణులై లోకారాధ్యులై భావితరములవారి కాదర్శమూర్తులైన సద్గురుస్వాములెట్టివారు?

నిష్కామబుద్ధితో నిర్వికల్పసమాధితో నీశ్వరధ్యానముగావించి మనోలయము చెందుటయే సద్గురుధర్మము. బాగుగా నంతర్దృష్టిని సుషుమ్నానాడియందుంచి, భయభ్రమలనువిడనాడి స్వబుద్ధితో నంతర్దృష్టిని సహస్రారకమలమున చేర్చి సాధించి నరసింహశక్తి సాక్షాత్కారమునుపొంది యాత్మానందముతో కాలమునుమరచి యుండెడి యఖండస్థితియే సద్గురుస్థితి. —

నాడీచక్రమును పరిశీలించిచూచినచో పదినాడులుముఖ్యములు. ఆ నాడులన్నింటిలోన నాశికకుండలిపైన ఇడ, పింగళ, సుషుమ్న అను మూడునాడులు గణనీయములు చాలాగొప్పశక్తిగల్గినవి. ఈ నాడీక్రమమును చక్కగానెఱింగి ఇడా, పింగళ, సుషుమ్నా నాడుల ద్వారా రేచకపూరక కుంభకముల క్రమరీతిజరుపుటయే సద్గురువుల ధర్మము. నాదబిందుకళల నభ్యాసముతో కనుగొని యాత్మబలముతో బ్రహ్మరంధ్రమునందు ప్రకాశించు జ్యోతిర్మండలమున మనోదృష్టు లనేకంబుగావించుశక్తిగల మహనీయుడే సద్గురుమూర్తి. ఇట్టి స్థితిలో నుండెడి మహావ్యక్తియేదైవము. నరుడే నారాయణుడై జీవుడే శివుడై మనస్సేమహాశక్తియై స్వయంజ్యోతియై వెలుగొందుచుండును.

ఇట్టి యోగశక్తిస్వరూపులైన సద్గురు శ్రీ యోగానంద నరశింహస్వామివారు మనస్సునుజయించి మాయనునిర్జించి జితేంద్రియులై మాధవుడై సుప్రసన్నముఖారవిందుడై నేటికిని ప్రకాశముజిల్లా మార్కాపురసమీపమున కుండికానదీతీరమున కపిలమహర్షి తపోనిష్ఠ యందున్న గిరిసన్నిధిలో మహాయోగసమాధియందు, సహస్రకోటి మణికాంతపుంజప్రభావిరాజితులై యుండిరి. నిష్కల్మషహృదయములతో నమ్మిభజించుచు ధర్మపథమునందు జీవితరథగమనములను భక్తితో దీక్షతో సాగించెడి శిష్యప్రశిష్యబృందముల మనోవాక్కర్మలకండగా

యుండి కాచి సర్వసంరక్షణమొనర్చుచున్నారు. ఇది ప్రతిసంవత్సరము శ్రీకపిలగిరియందు శ్రీవారి శిష్యప్రశిష్యబృందములు తదితర భక్త శేఖరులు పుష్యశుద్ధత్రయోదశి తిథిపర్వమున శ్రీ సద్గురుదేవుని పుణ్యారాధనమహోత్సవమతివైభవోపేతముగ చేయుచుందురు.

---

## "ప్రయత్నము = ఫలము"

"యత్నేనఫలమ్‌సిద్ధిర్భవేత్" నరుడొనర్చెడి ప్రయత్నమువలన కర్మపరిపక్వమై ఫలవంతమగును. ఇదినిత్యలోకానుభవము. నరులు వారి వారి జన్మాంతరవాసనలబలముచే లోకమునకర్మలు చేయసాగుదురు. గతమునందు సాగించినట్టికర్మలశక్తి సంస్కారరూపమున నరుని యందణగిమణగియుండును.

ఆ సంస్కారశక్తి ప్రస్తుతము సాగించెడి కర్మల వలన మేల్కొల్పబడి కర్మమునకు బలముచేకూర్చి పురోగతి కల్గించును.

జన్మాంతరవాసనలు నరునికర్మలకుపునాది. ఆ పునాదిని వీడక దానిననుసరించిననాడు కర్మభవనము సంపూర్తినొందును.

ఒకతల్లికి నల్గురుబిడ్డలుగల్గినను వారెల్లరొకేకర్మననుసరించరు. ఒకడు పరిపాలకుడగును. మఱొక్కడు బంట్రోతుగామారును. కవియొక్కడగును. కిరాతకునిగా వేఱొకడుతయారగును. ఈ తరతమ భేదములకు తల్లిదండ్రులు కారణముగాదు.

ఒకేపాషాణమును శిల్పి మర్కటముగ, మారుతిగ తను సంకల్పించినదానికనుగుణమగు కర్మనుసాగించి సంపూర్తిచేయగలడు. శిల్పితయారుచేసిన మర్కటము, మారుతికిగల భేదము ఫలము చాలా వ్యత్యాసమై చూపరులకు కన్పించగలదు.

మర్కటమైనపాషాణము గుడిముందు పారవేయబడి నరులదృష్టికి హేయముగకన్పించుచున్నది. గుడిలో గర్భాలయమున పవిత్ర పీఠముపై యంత్ర మంత్ర మహాప్రతిష్ఠాదికర్మలతో మారుతాత్మజుడైన శ్రీ ఆంజనేయస్వామివారిశిల్పముగ వెలుగొందిననాడు భక్తజనుల నిత్యదీపారాధనప్రసాదాది మహాకైంకర్యములకు పాత్రమై భాసిల్లుచున్నది.

మర్కటముగ మారుతిగ పాషాణము పరిణామము చెందనిస్థితిలో 'నేను మర్కటముగ మారుతిగ మారగలనని సంకల్పించలేదు'.

ఏ సంకల్పమున కవకాశములేని పాషాణముసైతము శిల్పి సంకల్పప్రయత్నకర్మప్రభావముతో శ్రీ ఆంజనేయస్వామియై పూజలందుకొన్నది. వేలాదిగ నరులామూర్తిని స్తోత్రపాఠాదికర్మలతో నారాధించుచున్నారు.

ఇట్టి స్థితితో వెలుగుటకుకారణము మహాశిల్పిమనస్సే! పనికిమాలినపాషాణమే ప్రతిమయై భక్తజనులొనర్చెడి పూజలనందుకొన్నది. ఆ పాషాణము మహాశిల్పి యులులదెబ్బలుతిని తిని రూపధారణ చెందినది. రూపధారణమైనకారణముతో జనమనః ప్రీతిపాత్రమై రాణించినది.

ఆ రూపధారణలోను గౌరవాగౌరవములు చేకూరినవి. మారుతి రూపము నొందినపాషాణము గర్భాలయమునందు కాంతివంతమై భక్తజనుల నేత్రోత్సవమునకుమూలమై యానందాశ్చర్యములను కల్గించుచున్నది.

మర్కటరూపమునుపొందిన పాషాణము గుడివెలుపల పాషాణముగనే పడియున్నది. ఈ ద్వంద్వవిషయరహస్యవివరమును నరులు తెలిసికొన్ననాడు సర్వమును తెలిసినవారయ్యెదరు.

ఏమిటీరహస్యము? మనుజుడు పవిత్రసంకల్పము పవిత్రదృష్టి పవిత్రసంభాషణము పవిత్రకర్మప్రభావముచే పూజనీయుడై చరిత్ర నాయకుడై యాదర్శమూర్తియై లోకోత్తరపురుషుడగును.

రూపములేనిపాషాణము ప్రతిమయై గర్భాలయమునచేరి గ్రామ ప్రజల పూజలందుకొన్ననాడు, మానవుడు తనమనస్సును పవిత్రభావములతో పవిత్రకర్మలతో మేళవింపచేసిననాడు పురుషోత్తముని కరుణకు పాత్రుడై లోకపూజ్యుడై వర్ధిల్లుటకెట్టిసందేహములేదు.

"శుద్ధవస్త్రమునకలుముకొనిన దుర్వాసనలన్నియునరుడొనర్చెడి శుద్ధకౌళనముతోవీడిపోయినరీతి" నరుడు తనమనస్సునకలవడిన దుర్వాసనముల దుందుడుకుకర్మలను,మహాకవుల దైవప్రబోధాత్మక నీతి వేదాంత తత్త్వ రచనలను నిత్యపారాయణమొనర్చినశక్తితో, శ్రీసద్గురుస్వాములొనర్చెడి నిస్వార్థ నిర్వికార నిరాడంబర నిత్య సత్య సద్ధర్మ మహాబోధలను భక్తితోవినిన బలముతో సర్వహృదయాంతర్గత సనాతనజ్యోతికి తనలోనిపరంజ్యోతికెట్టిభేదములేదనెడి యద్వైతతత్త్వ దర్శనుడైననాడు ప్రయత్నము ఫలవంతమై వర్ధిల్లగలదు.

నరునికర్మసిద్ధికి ప్రయత్నమెంతోయవసరము. ప్రయత్నముచేసి ఫలసిద్ధినొందగలననెడియూహాలతోడనే కాలముగడపిన నరునకెన్ని సంవత్సరములకైనను కర్మసిద్ధిచేకూరదు.

కర్తవ్యకర్మనిర్వహణమును జాగుచేయక నరుడు దీక్షతో పాగించిననాడు కర్మరంగమునందు పురోగతిని బడసి ధ్యేయసిద్ధినొందగలడు. ఒకసంవత్సరకాలములో కృషిచేసి నరుడుసాధించగల పారత్రికకర్మమును ప్రయత్నశీలుడుకాని నాడెన్నివత్సరములకైనను సాధించజాలడు.

పురుషప్రయత్నమునువీడక పరమాత్మునినమ్మి స్వార్థమున కాశించక చరించెడి నరుని సత్కార్యములన్నియు పూర్ణ ఫలములై వర్ధిల్లగలవు.

మనుజుడు లోకమునందు సాధనతో సాధించలేనిదేదియులేదు. ప్రకృతియందలి ప్రతివస్తువునునరుడు ప్రయత్నశీలుడై కర్మలనాచరించిన నాడు విధిగ పొందగలడనుటలో యెట్టిసందేహములేదు.

కుల మత వర్గ భేదములనుపోనాడి శ్రీహరి కథాగానములందరిచే చేయించవలెననెడి లోకోత్తర మహోన్నతాదర్శ మహాధ్యేయముతో "విద్యాదానకర్ణ" శ్రీ తెల్లాకుల వేంకటేశ్వరగుప్త భాగవతులుగారు యఖండారాధన కర్మమునుసాగించి వందలమంది శిష్యులను' శిష్యు రాండ్రను తయారుచేసి వారికి వారికుటుంబములకు జీవనోపాధిని సద్గతి నొందెడియవకాశమునుచేకూర్చి భువివీడి దివికేగి రవి శశితారకముగ చిరయశమును గణించిరి.

మనస్సును వ్యక్తి తనస్వాధీనమునందుంచుకొన్ననాడెట్టి పవిత్ర కర్మములనైనను సాధించి సంతసమునొందగలడు. మనస్సువెంటనంటి చరించెడి నరుడెంత మేధావియైనను కష్టనష్టములనుపొంది కడవలకొలది కన్నీరుగార్చక తప్పదు.

అంతరాత్మప్రబోధములను నరుడు నిదానముగా వినినచో సత్య సందేశాదేశములు బోధపడగలవు. బోధపడిన సందేశాదేశములను నిత్యజీవితజీవనకర్మగతులలో మేళవింపచేసిననాడు సుఖ శాంత్యా నందములనొంది పునీతుడగును.

సాత్త్వికవిద్వద్దానకళాత్మక కర్మములందు సాత్త్విక సంస్కార ముతో భాసిల్లెడిమనుజులు కార్యనిర్వహణమునందుపాల్గొనిశక్తివంచన లేని కృషితో దిగ్విజయమొందుచుందురు.

సాత్త్వికసంస్కారములేని మనుజులే యే కుల మతములకు చెందినను సాత్త్వికశక్త్యాత్మకకర్మములైన సంగీత సాహిత్య నృత్య వేదాంతాదిగోష్టులందుపాల్గొనజాలక బహుదూరముగ మసలుచు పైపెచ్చు వెగటువాక్యములాడసాగుదురు.

దుష్టసంస్కారులైన జనులయొద్దగలధనము దైవ ధర్మ పుణ్య కార్యములకు సద్వినియోగముగాజాలక నీచములై సంఘాపకారము చేకూర్చెడి ద్యూత వ్యభిచార సురాపాన వ్యంగ్య కళాభిమాన క్రూర కర్మములకు దుర్వినియోగమగుచున్నది భవితవ్యమునందునుగానున్నది.

ఆదర్శభక్తిభావకవితాప్రచారోద్యమ నిర్వాహకులైనపెద్దలు సాగించెడి కార్యక్రమములకు ధనము సమర్పించుట, వారికిచేయూతగ నుండుట, గతజన్మపుణ్యకర్మఫలప్రభావపాత్రులైన వ్యక్తులకుమాత్రమే సాధ్యమగుచున్నది.

“పేడలోచరించెడిపురుగును పన్నీరులోవేసిన మరణించురీతి” సదా లౌకికకర్మలందుపాల్గొనుచు విజ్ఞానదూరుడై లోకమున చరించెడి భౌతికవాది భగవానుని కార్యములందుపాల్గొనజాలడు.

నరులజీవితములు క్షణభంగురములు. కనురెప్ప వేయునంతటి కాలములో సర్వసంపదలనుత్యజించి తనకు తెలియని స్థానమునకు నరుడు తరలిపోవుచున్నాడు.

వ్యక్తి, క్షణకాలమునకు సంభవించెడి దుస్థితిని గుర్తించక దుర్విచారముతో దురాశాపాశబంధనమునుండి విముక్తి చెందుటకెట్టి ప్రయత్నముచేయక విఫలమనోరథుడై లోకగతిననుసరించుచున్నాడు.

భగవానునినమ్మిచరించెడి నరుడు తనకర్తవ్యమును విస్మరించి సర్వము భగవానుడే సంపూర్తిచేయగలడు. నాదేమున్నదనెడు భావనతో కర్మసాగించక మౌనవ్రతముతో యున్ననాడాకార్యము సంపూర్తిచెందదు.

వ్యక్తి ప్రారంభించినకార్యము లోకోపకారములేనిదై వ్యక్తిగతలాభములేని భక్తికార్యక్రమమైననాడు విధిగ ఫలవంతమై కార్యసిద్ధిచేకూరగలదు.

మానవులు నిర్వర్తించవలసిన ప్రయత్నములనువీడి శ్రమకుతాళజాలక లాభములేనికర్మలకై మాకెందులకీకష్టనష్టములనెడు ప్రాకృతభావనలతో చరించిననాడు సత్కర్మలైనను ఫలవంతములు గాజాలవు.

లౌకికమానవులు తమ తమ కుటుంబముల నిర్వహణములకై పడెడిపాట్లు వర్ణనాతీతములు. శివరాత్రి, శ్రీరామనవమి, సంక్రాంతి, ముక్కోటి, తొలియేకాదశి, శ్రీ లక్ష్మీనృసింహస్వామివారిజయంతి, మొదలైన మహాపర్వములందు దైవధ్యానాది సత్కర్మములను నిర్వహింపజాలక పెరిగిపోయెడిధనరాసులు జాలవనెడు దురాశకుచిక్కి వేళకు సాదము ప్రసాదములను తినుటకు తీరికలేక ధనార్జనమునకే తహతహలాడుచు దారములు తెగిన గాలిపటములవలె లోకయాత్రాన్వేషణలతో లాభములకై పరిభ్రమణమొందుచున్నారు.

సంసారముపై విరక్తికలిగి సన్యాసస్వీకారమొనర్చిన పెద్దలలో కొందరు ధనాశజడ్డులోపడిపరుగులుతీయుచున్నారు. జన్మతః త్యాగగుణములేని మానవుడు ధనవంతుడైనను పవిత్రాశ్రమాధికారియై వెలుగొందినను, శతాధిక గ్రంథములను రచనయొనర్చిన మహాకవిపుంగవుడైనను, పైసాలే ప్రాణాధారమనెడి దుర్భావముతో చరించుచు సత్పురుషుల హృదయముల కాశ్చర్యమును కల్గించుచుండిరి.

ఎంతో తెలివితో కుయుక్తితో తమాషావాక్యములతో పదిమందిపెద్దలకు టోపీవేసి ధనమేదైవము, సతియేవైకుంఠము సతిసుతాదిబంధువర్గమే తనజీవితమునకు రక్షాకవచములని, తెలివిని సృష్టించిన సర్వేశ్వరుని విషయము మదిజొరనీయక సర్వకాలసర్వావస్థలయందు తనదేహ సతిసుతాదులందుగల గాఢ మమకారముతో

క్తినంతయు దుర్వ్యయమొనర్చి జనసత్త్వదూరుడై రోగాలపాలై
ోగాలపై విరక్తిచెందక కడకు కన్నకొమరుల కట్టుకున్నసతియాడెడి
రుషవాక్యములకు లోలోనవగచుచు సంసారము స్వర్గమనుకొన్నట్టి
ామతికి నరకమయ్యెనే! నా యోగక్షేమములగతి గనెడు వారెవ్వరా?
యనెడు చింతతో గురుహరిస్మరణమొనర్చుచు గతకాలపుకర్మల
ఫలమనిభవించుచు వయసుతూలిపోయినది కాలముపూరిపోయినది కథ
సమాప్తముకానున్నదనెడి తన యదార్థభవితవ్యపరిణామ దుస్థితిని
పర్తించిన ప్రతినరుడు కన్నీరుగార్చుచు తప్పక సర్వమునకుస్వస్తి చెప్పి
కానెక్కడికో తరలిపోవుచున్నాడు. తాను తరలిపోయిన వెంటనే
ఒగిలిపడియున్న దేహమును శవమని క్షణమైననుజాగుచేయక శవ
సంబంధమగు పెద్దలెల్లరాశవమును స్మశానమునకుచేర్చి కాష్టము
పంచుంచి యగ్నిముట్టించి బూడిదచేసి వారివారి నిలయములకు
చేరుచుందురు.

ఈ భువిపై జన్మించిన ప్రతిప్రాణి యేనాడోయొకనాడు శవమై
యగ్నికాహుతియై భూతిరాశిగా మారకతప్పదనెడి సత్యము సర్వులకు
తెలిసినదే.

ఇట్టి ఘోరాపదకు నరుడుగుటినై శవముగాకముందే తనలో
శివమున్నదనితెలిసి సర్వములో శివమేవెలుగుచున్నదని గుర్తించి
తోడివారికెట్టి యన్యాయాక్రమములనుచేయక క్రమమైననడవడితో,
ఆహార విహార వ్యవహారాదికర్మలను సాగించుచు కష్టనష్ట సుఖదుఃఖ
శరీరభోగరాగ రోగ యోగ త్యాగాదికములందు విధిగ భాగస్వామినియై
యనుభవించెడి తన ధర్మపత్నికెట్టి యన్యాయమొనర్పక యామె
యోగక్షేమముల నెల్లవేళలచూచుచు భగవదారాధనమును భక్తితో
చేయుచు సతిమతిని భగవదున్ముఖమొనర్చి నిర్వురు తమ జీవితములను
సార్థకతనొందించెడి మహాప్రయత్నమే శక్తివంతమై ఫలవంతమై
భగవత్కృపాపాత్రమై విలసిల్లగలదు.

తననిజసతి యొకవ్యక్తి కన్నబిడ్డయని తనుకన్నబిడ్డలే రక్షణ మొనర్చి సంరక్షించెదరని మానవుడు తనశక్తిని యుక్తి తానార్జించిన సంపదను కన్నకొమరులకప్పగించి యున్నరొఖ్ఖమంతయు కుమార్తెల వివాహాది కర్మలకు వ్యయమొనర్చి తాను మిగిలిన నాడెవ్వరు కన్నెత్తి చూడరు.

లోకముధనాసక్తమై కర్మబద్ధమై కోర్కెలకుబానిసయై తత్త్వాన్వేషణలేక దైవమునుపూర్తిగామరచి ధనమునాశించి ధర్మవిరుద్ధమైన కర్మలతోమునుగుచు తేలుచు కష్టనష్టతాపాదులకుగురియై పరుగులు తీయుచున్నది.

ఇట్టి లోకమునందు జనించి జీవించెడి ప్రతిమానవుడు నిబ్బరముగా ముందుచూపుతో యోచనచేసి నిజముతెలిసిననాడు 'సతికిపతి పతికిసతి' దప్ప తదితరులెవ్వరు తమకన్నీటిలో భాగము పంచుకొనజాలరని సత్యముబోధపడుచున్నది.

వ్యక్తికి, శక్తి, దేహారోగ్యము, ధనముపై పెత్తనము తోడి సమాజమున పలుకుబడి, మేధాసంపత్తి, పరపతిగల్గిన రోజులలో సత్కర్మలాచరించవలెను. సత్కార్మానుష్ఠానమువలన నరునిమనస్సు శుద్ధమైపరిశుద్ధమై పవిత్రభావములుద్భవమై పరమాత్మ కాంతిపుంజ సాక్షాత్కారమునకై తీవ్రపరితాపము నొందసాగును.

భగవానునికై, తీవ్రపరితాపములేని నరులెట్టివారైనను ఘోర సంసారసాగరోత్తరణ మొందజాలరు. జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ దుష్టచాపల్యములకు నరులు బానిసలై మనస్సులను దుష్కార్యముల యందు జొప్పించి చరించిననాడు శాంత్యానందములను పొందజాలరు.

సంయోగ వియోగనిలయమై సారహీనమైన సంసారమునందు నరునకెన్నిదివసములకైనను ప్రశాంతి లభించదు. ''పంది బురదమెచ్చు

పన్నీరు మెచ్చునా?" అనెడి శ్రీ వేమనయోగీంద్రులువారిసూక్తి గణనీయమైనది.

పనికిమాలిన వ్యాసంగములతో ప్రొద్దులు గడపెడి మాయా మనుజుని మనస్సు మంచిత్రోవల పయనించజాలదు. దాని స్వభావము స్వరూపమట్టిది.

అట్టి చంచలమైన మనోమర్కటదుర్వేగప్రవృత్తిని ముముక్షువు యతిజాగరూకతతో నెప్పటికప్పుడు పూర్వాపర కర్మలలోని మంచి చెడ్డలను సత్యపరిశీలనమొనర్చి తనకుగల తాత్త్వికగుణశక్తితో సంస్కరణమొందించుకొని భవితవ్యజీవిత స్థితిగతులను ధర్మబద్ధ మొనర్చి గతిసాగించిననాడు నిశ్చింతగ సత్యశిఖరమును చేరగలడు.

సత్యమైన పరమాత్మతత్త్వమునందు నరునిమనస్సు తాదాత్మ్య మొందిననాడు నిర్వికారమైన నిత్యానందమొందుచు కాలాతీతుడై లోకపూజ్యుడగును.

ఈ స్థితిని జీవుడుపొందుటకెన్నియో జన్మలనొందుచు గిట్టుచు బహుకాలప్రయాణముచేయవలసియున్నది. ఈ బహుకాలప్రయాణము నందొక రహస్యమున్నది. బీజమెన్నిశతాబ్దములకైన మొలకెత్తుచు వృద్ధిక్షయములతో నొప్పారుచున్నది. ఐనను బీజము నశించిన విత్తనము భూమియందు నాటినను మొలకెత్తనిరీతి మనుజుని మనో సంకల్ప వికల్పములన్నియు సమూలముగ జ్ఞానాగ్నియందు దగ్ధమై నశించిననాడు, మానవాతీతశక్తియందుచేరి మాధవుడై వెలుగొందును.

మాధవుడనగా? మనిషియా? మనీషియా? యని సత్యమరసిన సర్వజగత్తుకు మూలకారణమైన యొకానొక యఖండశక్తియని ఋజువైనది. వేదోపనిషద్గీతాశాస్త్రాదులన్నింటియందు సత్యమే ఋజువైనది.

ఈ గ్రంథములోని వాక్యసముదాయమంతయు గుప్తమై యున్నట్టి శక్తియందుద్భవమొంది పాఠకులహృదయరంజకమైనదన్న వాక్యము సత్యమై సమంజసమైనరీతి, కంటికి గోచరించని యొకానొకాద్భుతపరమాణుశక్తినుండియే సర్వజగదుత్పత్తి కాబడినదన్న నిజము తెలియబడుచున్నది.

సర్వమానవుల సుఖ దుఃఖములకు మూలము వారివారి మనోవృత్తులలోని శిష్ట దుష్టపరిణామరీతులేనని నేటికైన తెలిసి నెవరికివారే శిష్టాచారకర్మపరాయణులై శిష్టరక్షకుడు దుష్టశిక్షకుడైన శ్రీనృహరి దివ్యచైతన్య తత్త్వదర్శనా కాంక్షాసక్తచిత్తులై భువి చరించిననాడు తప్పక తరించెదరు.

ఆహార విహార వ్యవహార వ్యాపారోద్యోగాదికర్మల యందప్రమత్తులై ధర్మవిరుద్ధముతో ధనాసక్తచిత్తులై ధనముతో సుఖభోగ శాంత్యానందములు పొందవచ్చుననెడి జపములతో శ్రీహరి హరాదిమూర్తుల జపములను పూర్తిగామాని, కవిపండిత కథక గాయక భక్తశేఖరులను వారొనర్చెడి లోకోపకారములగుకర్మలను నవహేళన మొనర్చుచు, గొప్పవారమని గృహముల వెంటబడి ధనార్జనము చేయుచున్నారు. మీావృత్తి యిదియేయనెడి వ్యంగ్యవాక్యములతో కుల ధన యౌవ్వన మదములతో విర్రవీగెడి ధనలోభులైన నీచమానవులు సుఖశాంత్యానందదూరులై కృష్ణపక్ష శశాంకమువలె కాలక్రమమున పతితులై పలుబాధలకుగురియై కన్నీటితో జీవితములను గడుపుచుందురు.

ముముక్షువై, మహావాక్యచతుష్టయ పారాయణాపరుడై ధర్మబోధలను వినువాడై మౌనముగా తనపని తానుచూచుకొనుచు, పరులొనర్చు సంభాషణాదికర్మలలో తలదూర్చక సంసారమునకు మూలమైన వివాహమునువీడి యొంటరిగ జీవితగమనము సాగించెడి

మనుజుడైనను త్యాగము కరుణ యోర్పు నిజమైనభక్తి మహాత్ముల సేవలేనినాడు జీవితముద్ధరణమొందించుకొనజాలడు.

'ముల్లును ముల్లుతోతీసి బాధావిముక్తిచెందిననరుని' రీతి మాతాపితాచార్య దైవధర్మశాస్త్రాదేశ సద్ధర్మ సత్య సుందర నీతికి రోధల నిరసించి చరించిన కర్మలప్రతిఫలరూపమగు కన్నీటిని,సత్యాదర్శ ధర్మ కర్మాచరణమూర్తియై క్రమరీతి జీవితముగడపిన ఫలరూపమగు పన్నీటిగామార్చి యానందుడై విలశిల్లుచుండును.

నిజమైన యానందము వ్యక్తి ధర్మ కర్మాచరణమునందే పొందగలడు. వ్యక్తి, సత్యవాక్యాచరణము నుండి దిగజారి యసత్య ర్మయందుప్రవేశించి వ్యక్తిత్వమును గోల్పోయిననాడశాంతికి గురి యగును. మనోనిగ్రహము పట్టుదల సహనము తీవ్రపరితాపము కార్య దక్షత భగవదారాధన సద్గురుభక్తిగల నరుని కార్యక్రమములన్నియు పురోగతిచెంది పూర్ణ ఫలములివ్వగలవు.

సద్గుణసంపత్తి లేని సతిసుతులవలన పతికి సద్గుణములులేని పతి వలన సతిసుతుల కశాంతి యావేదనాందోళనలు సంభవించుచున్నవి. సద్గుణహీనులైన సతిసుతులతో సంసారముసాగించెడివ్యక్తిగతి దుర్గతి పాలై దీనదశకు దిగజారుచున్నది.

ఒక్కరిమనస్సు మరొక్కరుగుర్తించి సౌమ్యముతో సభ్యతతో యోర్పుతో నేర్పుతో సంసారమునిర్వహించెడి వ్యక్తుల కలయిక స్వర్గసౌఖ్యమును చేకూర్చుచున్నది.

సతిమతిని పతి పతిమతిని సతి సతిపతి మతులను సుతాదులు తెలిసికొని నిజము తెలియక యెవ్వరిగతివారనుసరించిననాడు సంసారమే నరకప్రాయమై తీరనియారని దుఃఖమునుకల్గించుచున్నది.

ధనము గుణహీనులను శునకములవలెమార్చి లోకాపకార కర్మలందు ప్రవేశింపచేసి పదిమందితెగడ్తలకు గుఱిచేయగలదు. సద్గుణ మూర్తులను ధనము లోకహితకర్మలనిర్వర్తింపచేసి ధర్మశక్తులను దైవభక్తిని లోకమున నినుమడింపచేయును.

గుణహీనులకు తండ్రియగుట, వ్యభిచారిణికి భర్తయగుట, లోభివానియొద్ద సేవకుడగుట మనుజునకు వర్ణనలకందనిబాధ చేకూరు చున్నది. ఎంతో పుణ్యమొనర్చిన నరులు సతి సుత బంధుమిత్రాది వర్గములయందెట్టి కలతలు కలహములులేని దివ్యజీవితములు వెలార్చుచు భావితరములవారికాదర్శగృహస్థాశ్రమ నిర్వాహకులుగా విలసిల్లుచుందురు.

ఇట్టి గృహస్థాశ్రమములు పరమపవిత్రములు. ధర్మ దయాది పుణ్యకర్మతత్పరులైన గృహస్థాశ్రమజీవనవిధాతలు సర్వజనపూజ్యులై వానప్రస్థ బ్రహ్మచర్యాశ్రమ మూర్తుల క్షేమంకరులై సేవకులై, భగవత్కృపకుపాత్రులై జన్మజరామృత్యుభయవర్జితులై తిరిగిరాని దివ్యవైకుంఠధామమున శ్రీ నారాయణుని పవిత్రపద పద్మముల సన్నిధిలో విలసిల్లుచుందురు.

అట్టి ఆదర్శగృహస్థాశ్రమనిర్వాహకులే శ్రీపండరి భక్తులు భక్తికి నిర్వచనము త్రికరణశుద్ధితో నరుడు లోకమున చరించుటయే. నరుని మనోవాక్కర్మలకు పొత్తుకుదురనినాడు భక్తియనబడదు. 'సున్నము వెన్నవలెయున్నరీతి' త్రికరణశుద్ధిలేనినరుని బాహ్యాడంబర భక్తికర్మలవలన లోకేశ్వరునికరుణయణువైన ప్రసరించదు. నిజము తెలియనిలోకము భక్తుడనికొన్నాళ్ళు దుష్టుడనికొన్నాళ్ళు వాకొన సాగును.

త్రికరణశుద్ధితో నరునిహృదయము పరిశుద్ధమై పవిత్రవంతమై పరమాత్మకాస్థానపీఠమై భాసిల్లుచున్నది. ఇట్టి నిజభక్తవతంసునికి లోకముమోకరిల్లి బోధలకై వేచికాచియుండును.

"దీపములేని గేహమునగల వస్తువులు నరునికంటికి గోచరము గానిరీతి" కామక్రోధాదిగుణములకులోబడిన మనుజుని హృదయాంత రాళమునగల జ్యోతిశక్తిజ్ఞానములు గోచరములు గాజాలవు.

పలుకాడెడి పరుషవాక్యములకు పొగడ్తలకు ముముక్షువు క్రుంగక పొంగక సమదృష్టితో సత్యమునై పునకే పురోగమించినాడు పురాణపురుషుని కరుణకు విధిగపాత్రుడై సుఖశాంత్యానందములనొంది కడకు ముక్తిపథమొందగలడు.

పురుషప్రయత్నముతో ఫలమునుపొందుట తథ్యము ఈ లోకము నందుగల జనులెల్లరు వారివారి మనోగతులకనుగుణములైన కర్మ లొనర్చి కర్మఫలములననుభవించుచున్నారు.

నరులు సద్బుద్ధితోసాగించిన సత్కర్మలవలన సత్ఫలములను, దుర్బుద్ధితో సాగించిన దుష్కర్మల వలన దుష్ఫలములను విధిగ పొందుట, లోకము తిలకించుచు మంచి మార్గముననుసరించి పురోగతినొందుట లేదు. దీనికి కారణము పరమాత్ముని మరచి ప్రకృతి నారాధించుటే. 'వస్తువును వీడి ఛాయనుపట్టుకు ప్రయత్నమొనర్చి విఫలమనోరథుడైన' రీతిగ నిజము తెలియని నరులు భగవానుడైన శ్రీమన్నారాయణుని మరచి భగవంతుని దాసియైన లక్ష్మీదేవికొఅకు యహరహముకృషి యొనర్చి శాంతిదూరులై సతమతమగుచున్నారు.

ప్రకృతిని నడపించెడి శ్రీనరసింహుని నమ్మి భజించెడి భాగవత కవిపుంగవుని సర్వసంసారభార నిర్వాహణ మా రమానాథుడైన నారాయణుడే భరించి భాగవత కవిపుంగవుని గతకర్మఫలానుభవ పరమగు కన్నీటిని పన్నీటిగామార్చి ప్రశస్తమైన తన యభయహస్త కృపాశక్తితో సంరక్షించుట లోకవిదితమై భక్తజనానుభవమై వెలుగొందుచున్నట్టి సత్యము.

తప్పొప్పుల వివరములన్నియు తెలిసిన మనుజులు భగవ దారాధకులై భక్తిప్రసంగములు సాగించుచు మహాత్ముల బోధలు

పఠించుచు మహామంత్రములు స్మరించుచు సత్యవాక్యధూరులై యాహారవిహార క్రమవర్జితులై పాపకర్మ లొనర్చిననాడు రోగాలపాలై భోగాలకు దూరమై యశాంతితి ప్రమగ్గుచుందురు.

ఈ కర్మసిద్ధాంతము పాఠకులకు బోధపడినదా? సంస్కారులై సాహితీ లోతులనెఱింగి భక్తిశక్తిగలవారికి దీనియందుగలరహస్యములు బోధపడి యానందము నొందుచుందురు.

మానవుడు, దైవవిషయమెఱుంగక గురువులసన్నిధికి జనక సద్గ్రంథములనుపఠించక దానకర్మలొనర్చక తీర్థయాత్రలకువెళ్ళక శ్రీహరి హర బాబాది పవిత్రనామస్మరణములందు పాల్గొనకపోయినను లోకాపకారములేని శాస్త్రవిహితకర్మలతో జీవితమునుసాగించిననాడెట్టి కష్టనష్టములు లేక శాంతితో విలశిల్లగలడు. ఇది కర్మసిద్ధాంతము.

విధ్యుక్తకర్మలనిర్వర్తించిన నరునకెన్నటికి రోగాదిబాధలుండ జాలవు. మనోవాక్కర్మములు పవిత్రవంతములైననాడు నరునకెట్టి బాధాయాంధోళనలుండనేరవు. ఎట్టిపరిస్థితులందును వ్యక్తి తన తోడివారితో క్రమముదప్పక ముందుదృష్టితో మనోవేగమును నిరోధించి ప్రశాంతహృదయముతో సంభాషణలొనర్చుటెంతో ముదావహము. ప్రశాంతతలేక ముందుచూపుపోనాడి సమయాసమయ ములనుగుర్తించక తెలియనిస్వతంత్రతతో సంభాషణలు సాగించిన నాడు పెద్దలైనను గౌరవమునుగోల్పోయి సమాజము చేత చులకనగా చూడబడుదురు.

"నూరునోములునోచినపడతి యొక్కరంకుతోపతనమైన రీతి" సర్వశాస్త్రానుభవసందేశరహస్యములను పుక్కిటబట్టిన మహామేధావి యైన పండితుడైనను చోర వ్యభిచార యసత్యాది వక్రకర్మావలంబ కుడైననాడు పూర్తిగా పతితుడగును.

దుష్కరములగు కర్మలు చేయు ప్రారంభ సమయమున నరున కెంతో తృప్తి సుఖ భోగ పారవశ్యము హాయి యానందములు కల్గినట్లనిపించినను కాలముగడచుకొలదిరోగము భయముధనవ్యయము సమాజమున దుర్వ్యశము యశాంతి యారోగ్యహీనత చిత్తక్షోభ చేకూరగలవు.

"పాపమనగవేరేపర దేశమున లేదు తాను చేయదుష్కర్మములందే పొంచియుండు" అనెడి యార్యోక్తి చాల గణనీయమై సమాజానుభవమై యున్నది.

పాపము నిప్పువంటిది. నిప్పుత్రొక్కినవ్యక్తి యెట్టివాడైనను బొబ్బలకుగురియై భరించలేనిబాధనుపొందినరీతిగ, పాపకర్మలొనర్చిన స్త్రీ పురుషులు పాపఫలానుభవమునుండి తప్పించుకొని లోకమున బ్రతుకజాలరు.

ఈ లోకమునందుగలమానవులు తమముందువారెల్లరు పాపకర్మ లొనర్చి పడినపాట్లను వారనుభవించిన దుర్భరదుఃఖయాతనలను కన్నులారదర్శించుచు తామొనర్చెడి దుష్టకార్యక్రమములనుండి విడివడి ధర్మజీవితములనుగడపజాలకున్నారు. అజ్ఞానపిశాచివాడికోఱలకుచిక్కి క్రమముగా "కృష్ణపక్ష శశాంకమువలె" భక్షింపబడుచున్నారు.

ఆదికాలమునుండి మానవుల గుణకర్మవిధులలోగల భేదములే కులముల పేరుతో లోకమున చలామణియైనవి. నేడు మనమూహించెడి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణములకు చెందిన మానవులందరిలో, మలమూత్ర స్వేదరక్త మాంసాస్థి చర్మాములయందును, క్షుత్పిపాసాసంభోగములందును, కామక్రోధాదిగుణములందును, యుక్తి శక్తి భక్తిజ్ఞాన వైరాగ్యములయందును భేదముకన్పట్టదు. సద్బుద్ధులు దుర్బుద్ధులు సర్వమానవులలోవిరాజిల్లుచున్నవి. సద్బుద్ధి బ్రాహ్మణులలో దుర్బుద్ధి శూద్రులలోగలదని నిర్ధారణమొనర్చుటకు వీలులేదు. ఈ సద్గుణ దుర్గుణములు మనము నేడూహించెడి కులములన్నిటియందు

తాండవమొనర్చుచున్నవి. ఈ గుణకర్మ విచిత్ర విధులను సత్య విచారణము సల్పిననాడు సద్గుణములుగల నరులందఱొక్క-జాతియని దుర్గుణములుగల నరులందఱొక్క-జాతి యనినిర్ణయమొనర్చ వలెను. ఇట్టి సత్య నిర్ణయమును సమాజము సమ్మతించగలదా? సమ్మతించజాలదు. దీనింబట్టి నిజముచెప్పవలసినచో యిందేదియు సత్యముగాదని ఋజువగుచున్నది. అసత్యము యన్యాయము యక్రమము సంఘమునకెంతో రుచిగ యాహ్లాదముగా దోచుచున్నది. సత్యము న్యాయము క్రమపద్ధతి సంఘమునకు చేదుగ వెగటుగ యీర్ష్యగా కన్పించుచు విన్పించుచున్నది.

తెలివి యుక్తి శక్తి యార్థిక స్తోమత మేధాసంపద్వైభవము గల నరులేమిచెప్పినను, రచనములొనర్చినను, లేనికథలను సృష్టించి మహాకావ్యరాజములని ప్రచారములొనర్చినను, సమాజముకాదనుటకు శక్తిజాలక నోదలదాల్చి చరించుటయే స్వార్థపరులైన పెద్దలరచనలకు గణనీయమైనకీర్తి చేకూరినది. భాషలోని భావములు సత్యములా? యసత్యములా? లాభములా? నష్టములా? యని తెలిసికొనెడి సాహిత్తీ సత్య సవిమర్శజ్ఞానములేనివారెల్లరు పురాణములలోని కథలన్నియు యున్నట్లుగనే జరిగినవనినమ్మి, స్వార్థపరులై మేకవన్నెపులులైన పెద్దలను పూజించుచు వారి వాక్యరచనారీతులను నీతులుగ భావించి యాచరించి పెనుగోతిలో తలక్రిందుగ పడిపోయిరి.

ఆ పడిపోయిన సమాజముపై జాలి కరుణ త్యాగముగల కవిపుంగవులు సంఘమునందు జీర్ణించినట్టి కుట్ర కుళ్ళు స్వార్థము నీ-నా బేధము మొదలైన యజ్ఞానాహంకారపరమైన స్వార్థ దావానలమును చల్లార్చి సమాజమునకు సత్యమిదియనిచాటుటకై వారివారి యుపాస్య దైవశక్తితో మహోన్నతాదర్శసద్భావ సత్యాంశములైన రచనలు సాగించి సమాజమునకందించి వారు శాంతినిపొంది విశ్వమునకు శాంతిని చేకూర్చి ధృవతారలై సద్యశస్సు నొందిరి.

త్రికాలములందును ప్రతివిషయమున సత్యాసత్యములు కలసి కాపురము చేయుచున్నవి. స్వార్థపరత్వముతో సాగించిన కవితలలో సత్యముమరుగై యసత్యమే సత్యమై చరించినది. అట్టి రచనల నుపమానముగాతీసికొని స్వార్థ భోగాలకు మరగిన పెద్దలు, యజ్ఞానులైన నరులకు ప్రబోధముచేసి వారిని తమవంకకులాగి సత్యమును వమ్మొనర్చి యసత్యములైనకథలనే జనులహృదయములందు జొప్పించి యపార విశ్వాసమునుకల్గించి నిజమునకు గొప్ప కీడొనర్చిరి.

పురాణకథలలో సత్యము లేకపోలేదు. సూక్ష్మముగా జరిగిన కథాభాగములను తలకొకరీతి యెవరిబలము తెలివి వారిదేయన్న సామెతగ రచనలుసాగించి వందలాది గ్రంథములను ముద్రణములు చేయించి లోకమున ప్రచారమొనర్చి భువివీడి దివికేగిరి.

కవులు, కవితలుసృష్టించి కథలనుబిగించి కాదనుటకు ధైర్యము చాలని స్థితిలో గీర్వాణ మహాపద సమాసములతో బంధించి లోకమున స్థిరముగ వెలుగొందునట్లొనర్చి లోకమున వీడిరి —

ఆ రచనములను చదివిన నేటి యువతరమువారిలో వాని యందేదిసత్యమో? యేదసత్యమో? తెలిసికొనెడి ప్రశాంతత ప్రజ్ఞాపాట వములేని వారెల్లరు పురాణములన్ని కల్పితములే! పూర్వఋషులెల్లరు స్వార్థపరులేనని సత్యదూరులై మతధర్మములను త్యజించి కల్లబొల్లి రామాయణ కథలనే పఠించి దేనియందు విశ్వాసములేక 'దారితప్పిన బాటసారులవలె' గమ్యములేని గమనమొనర్చుచున్నారు.

ఇన్ని యనర్థములకు కారణము యేకైక సత్యమైన విషయ మును, పెద్దలు దేశకాలపాత్రాదులకు దగినరీతిలో వివిధరూపములను మంత్రములను ప్రార్థనలను వానిఫలములను సృష్టించుట. ఆ పెద్దల నిస్వార్థ త్యాగాదర్శధర్మగతులలోని మూలమును యజ్ఞులైన నరులు తెలిసికొనలేక తెలిసికొనుటకు యత్నించక కర్మలందుచరించుటయేనని ఋజువగుచున్నది.

వ్యక్తి, తన గుండెగూటిలోని గోవిందుని దర్శించుటకే గుడిలో గోవిందుని నిల్పుకొన్నామనెడి సత్యమును గుర్తించక సగుణారాధన నిర్గుణారాధనలలో గణనీయమైనదేది? యనెడి ప్రశ్నలతో వాగ్వాదములతో ద్వేషరోషాదులతో చరించి చరించి తత్త్వమూఢుడై తానెక్కడికో, తరలిపోవుచున్నాడు.

'ఊరిపెండ్లి పేరిచావుకు వచ్చినదనెడి' సామెంతగా లోకోద్ధరణ దృష్టితో సృష్టించిన సాహితీకథలరీతులలోని నీతులను వాని లోతులను గుర్తించెడి యోగ్యతలేనిజనులెల్లరు దారిదప్పి గమ్యముచేరని త్రోవలలో పయనముసాగించి పతితులగుచున్నారు.

గతమునువిస్మరించి, స్వార్థ పరులు సృష్టించిన కథలలో యథార్థములనే పెద్దలవలన తెలిసి ప్రతినరుడు సత్యమైన త్రోవలలో నడకలు సాగించిననాడు తప్పక పురోగతినొంది దైవమునందుచేరగలడు.

"నారికేళమునకుగలపీచుటెంకను విడనాడి,కొబ్బరిని యందుగల పవిత్రతీర్థమును నరులు స్వీకరించి యారోగ్యమును పొందినరీతిగ" నేటికాలమున విరివిగా కన్పించెడి విన్పించెడి యాధ్యాత్మికాదిగ్రంథములందుగల సత్యమును ముముక్షువులెల్లరు నిదానముగా నిబ్బరముగా, స్వార్థ త్యాగాదర్శమూర్తులైన వారిద్వారా తెలిసి చరించిననాడు జీవన్ముక్తినొంది కడకు శ్రీహరి దివ్యదర్శనానంద పారవశ్యస్థితిని పొందెదరు.

సత్యమునుగుర్తించుటకు సత్యరచనలు పఠించుట, పఠించిన వానిని మననము, తదుపరి ధ్యానము, యనంతరము యోగము, యోగము తెలిసి సమాధిస్థితిచెంది తానుతానై తత్త్వమునందైక్యమగుట. ఈస్థితినొందిన నరుడు కర్మసిద్ధాంత మెఱింగినవాడగును.

ముముక్షువు పతిసుతధనగేహాదులందు బంధింపబడిన మనస్సును తనస్వాధీనమునందుంచుకొని క్రమపరిణామములవరచి పురోగతినొందించి

జితేంద్రియుడై పరిపూర్ణ యోగమభ్యసించి సిద్ధత్వమునొందిననాడు నిత్యసత్య నిర్వికార పరబ్రహ్మానుభవపరుడై కడకు బ్రహ్మమై వెలుగొందును.

దివినుండి భువికిదిగివచ్చిన ప్రతిమానవుడు చేయదగినది చేయవలసినదిట్టి పురుషప్రయత్నమే. ఇట్టి పురుషప్రయత్నమునకు తగిన ఫలము, జరామృత్యుభయ సంకులసమరమైన సంసారమునకతీతుడై పరమాత్మయందు తాదాత్మ్యమొందుటయేనని తెలియవలెను.

అట్టి యమరమైన యఖండస్థితి యందరకు సాధ్యముగాదు. కాంతాకనకములకై శునకమై లోకపరిభ్రమణమొనర్చెడి యజ్ఞానపు నరులకసాధ్యమై, ధర్మ సత్య న్యాయ దయా వితరణ గుణానుభవ మూర్తులై నిరంతరయోగానుష్ఠానపరులై లోకమునుమరచినట్టి సద్గురుస్వాములకు సాధ్యమై భాసిల్లుచున్నది.

అట్టి యాదర్శమూర్తులైన సద్గురుదేవుల పవిత్ర పదకమల ద్వయ సన్నిధిలభించని నరుడెన్నిభవములకైన భవబంధవిముక్తిని పొందజాలడు.

నిరాడంబరులై నిర్వికారులై నిర్విచారులై నిష్టాగరిష్టాత్ములై నిందాస్తుతులకతీతులై నిత్య సత్య సనాతనశక్తిదర్శనులై, ఆదర్శ ధర్మ ప్రబోధకులై యచంచల బ్రహ్మచర్యదీక్షాదక్షులై లోకోద్ధరణ మూర్తులై కుల మత వర్గభేదరహితులై స్వధర్మనిరతులై సద్గురుభక్తి తత్పరులైన శిష్యులకు కల్పభూజమై ముంగొంగుబంగారమై త్రికాలము లందు కవచమై సంరక్షించెడి శ్రీ శ్రీ శ్రీ సద్గురుయోగానంద నరసింహ యోగీంద్రులువారి దివ్యావ్యయ మహోజ్జ్వల మహాయోగశక్తియే ప్రయత్నమునకు తగినఫలము.

ఈ కర్మసిద్ధాంతము సర్వగ్రంథములలోని సారాంశమని తెలిసి చరించిన ప్రతినరుడు సర్వదుఃఖములనుండి విడివడి సుప్రసన్న గంభీర హృదయుడై వెలుగొందును.

భక్తి జ్ఞాన వైరాగ్యతత్త్వ ముక్తి యోగములన్నింటికి మూలము పునాది కర్మయోగమేనని ప్రతిముముక్షువు తెలిసి భయము గలిగినభక్తితో ధర్మబద్ధమైన కర్మలనాచరించిననాడు ముక్తిధామమును చేరగలడు. ఇది ముమ్మాటికి సత్యము.

## క్షేత్రమెరిగివిత్తనము = పాత్రతెరిగిదానము

ఈ లోకమునందు చరించెడి మానవులు వివిధసంస్కారములతో చిత్ర విచిత్ర గతులతో పరిభ్రమణమొనర్చుచుందురు. వివిధ స్థలములందుగల నరులలో యేసంస్కారముగలవారి నా సంస్కారముగలవారు గుర్తించి గౌరవసమాదరణ సంభాషణములొనర్చి సంతసము నొందుచుందురు.

"ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు చూడచూడ రుచుల జాడ వేరు పురుషులందు పుణ్యపురుషులు వేరయా! విశ్వదాభిరామ వినురవేమ" అని చెప్పిన శ్రీ వేమనయోగీంద్రులువారి మహోన్నత లోకానుభవశక్తి సూక్తి గణనీయమై మననీయమై చిరస్మరణీయమైనది.

ఉప్పువలె కర్పూరము కన్పించినను గుణములో శక్తిలో గొప్ప భేదమున్నరీతి, పురుషులువేఱు పుణ్యపురుషులువేఱు. పుణ్యపురుషుల హృదయములతి పవిత్రములై సర్వజన క్షేమంకరములై వెల్గొందుచున్నవి.

పుణ్యసంస్కారులై పురుషులు కుల మత వర్గ ప్రాంతీయ భేదములు చూడక భక్తిభరితములై లోకశాంతికరములై సత్యమును ఋజువుచేసి సద్గతినికల్గించి నిత్యానందరసానుభూతినిచేకూర్చెడి కర్మల నిర్వర్తించెడి బుధజనాళిని వెంటనేగుర్తించి ప్రేమించి యాదరించుచుందురు.

శుష్కవేదాంత ప్రసంగములతో శూన్యహస్తదర్శనములతో స్వార్థముతో లోభగుణముతో పైసాలనేప్రాణమని భావించెడి యజ్ఞులైన నరులిట్టి రచనాముద్రణములకై కవిగారికి విరాళములర్పించజాలరు. ఇట్టిలోకోపకార సాత్త్వికకార్యక్రమములకుధనము సమర్పించుటకు మనస్సొప్పక యజ్ఞులైన నరులు ధనమునిల్వచేసినను నిల్వక మరొకరూపముగ యా ధనము దుర్వినియోగమగును. ఇది ప్రకృతి సహజము.

అజ్ఞానాహంకారాదిగుణములుగల నరులెంత ప్రజ్ఞావంతులై ధనవంతులై పలుకుబడిగలవారైనను విజ్ఞానకార్యక్రమములందు మనస్సులనుజొప్పించక దుష్టవిషయ ప్రసంగ కర్మాదులందే లగ్నమొనర్చి నిషేధకర్మలొనర్చి కర్మపరిపక్వదశలందు కన్నీరుగార్చుచు నెనమొకయుగముగ గడుపుచు కడకు కాలమృత్యువునకాహుతియై శోకపు తెగడ్తలపాలగుచుందురు.

'గూటిలోచిక్కిన సాలెపురుగు వలె' 'పులిగలలోయలోకేగిన మేకవలె' 'రక్షకభటులకుచిక్కిన చోరునివలె' 'పాముబుట్టతెరచిన నరునివలె' 'అగ్నియందుబడెడి మిడుతవలె'లోకమున నరుడు స్వయంకృత నకర్మఫలానుభవభంధమునచిక్కి వదలించుకొనుటకశక్తుడై తన పోషణలో జీవనమొనర్చెడి సతిసుతాదులనువీడి విధికిబానిసయై తనకు తెలియని స్థలమునకు తరలిపోవుచున్నాడు.

వ్యక్తి భువివీడి దివికేగినవాడు వ్యక్తిని నమ్ముకొని జీవించెడి వారి స్థితిగతులను సరిచేసి సంరక్షణమొనర్చెడి నాధుడెవ్వడు? ఎవ్వరు లేరు. సర్వలోకసంరక్షకుడైన సర్వేశ్వరుడేగతి.

జీవులెల్లరు వారొనర్చిన కర్మఫలానుభవమునుండి తప్పించుకొనుటకు సాధ్యముకాదు. కష్టనష్ట సంతాపాగ్నినుండి తప్పించుకొనుటకు మరణమే శరణ్యమని భావించి ప్రాణాపాయమునకు వలయు

కర్మలొనర్చిననాడు కంటికికన్పించనిశక్తి యేదోయొకానొక రూపమున ప్రత్యక్షమై మరణము నుండి తప్పించి కర్మఫలభోక్తలుగ జీవులను పరిణామ మొందించుచున్నది.

వ్యక్తి, ఎవ్వరికి తెలియనిరీతిలో యెంతోకుయుక్తితోకుట్రతో యేకాంతస్థలమున తనతోడిమానవునికి ద్రోహబుద్ధితో ప్రాణాపాయ మును కల్పించి శక్తినంతయు ధారవోసి సుఖ శాంత్యానందములను పొందుటకు యత్నించినను ఫలమును బడయజాలక తానొనర్చిన యజ్ఞాతదుష్టకర్మప్రభావశక్తి వదలక ప్రభుత్వోద్యోగులకు చిక్కించి చెరసాలయందుప్రవేశింపచేసి జీవితమును దురంతర చింతలకు గురిచేయ గలదు.

ఆ మహత్తర మహిమాన్విత కర్మఫలానుభవశక్తి నుండి తప్పించుకొనిన ఘనుడిప్పటికిలేడు. భవితవ్యకాలమునందుండడు. లోకమునగల జనులెల్లరు కర్మలొనర్చుటకుముందే బాగుగ యోచన చేసి మనోవేగమును దైవధ్యాన ప్రార్థన భజన పారాయణాదులచే నిరోధించి లోకాపకారములేని ధర్మకర్మల నిర్వర్తించి శాంతిశుభశ్రీలను పొందవలెను.

ప్రారంభమున మనుజుడు తన మనోసంకల్పముల కనుగుణము లైన కర్మలనొనర్చి కాలముగడచుకొలది కర్మ పరిపక్వమై ఫలాను భవమునొందెడి విషమసమయమున దేవునిదలంచుచు మహాత్ముల సేవించుచు కర్మబంధవిముక్తికై పరితపించుచుండును.

దైవకృప, కర్మఫలవిముక్తికై తహతహలాడెడివానిపై ప్రస రించదు. "చేతులుకాలినతఱి యాకులుబట్టిన ప్రయోజనములేని" తెరగున నరులు కర్మలొనర్చుటకుముందే భగవానుని శాసనములను పాటించుచు కర్మలొనర్చిననాడెట్టి కష్టనష్టశోకభయాందోళనలుండ జాలవు.

నరుడు తన కాలుజాఱకముందే మంచి త్రోవయందు పయనము సాగించుటెంతయో ముదావహము. కాలుజాఱి క్రిందపడి కాళ్ళువిరిగిన యనంతర మెంతవగచినను కాలుకుదుటబడదు. ఇదేరీతి జగతి యందే మానవుడైనను క్షుద్రభోగానురక్తికై జూద చౌర్య వ్యభిచార సురాపానాసత్యాది కర్మలొనర్చి యనుభవమునకువచ్చినతరి యెంత చింతించినను యెందరిని ప్రార్థించి వారి పాదములాశ్రయించినను మతములుమారినను మశీదులందుచేరి నమాజులొనర్చినను, చర్చిలలో చేరి స్తుతిస్తోత్రాదులనుసాగించినను, పవిత్రాలయములందు ప్రవేశించి భక్తిగీతాగాన భజన ప్రార్థనాదిపారాయణములొనర్చినను ప్రయోజనమును బడయజాలడు.

భక్తిగలవ్యక్తి మశీదులో ప్రవేశించినవెంటనే సుప్రశాంతిని పొందగలడు. ఆ సుందర సుప్రశాంత శుద్ధ నిర్గుణ శూన్యస్థలమునుండి బయటకువచ్చిన నరునివీనులకు ప్రపంచకోలాహలధ్వనులు మార్మ్రోగుచు సుప్రశాంతమహాస్థితినుండి మనస్సును భంగమొనర్చి తమ వైపునకు లాగుకొనుచున్నవి.

ఈ సంయోగ వియోగ సుఖ దుఃఖాది ద్వంద్వసంకులసమరమునకు స్థానమైన మాయాసంసారములో కోలాహలము హాలాహలము దప్ప యమృతబిందువులు లభించవు. బిందువులసమూహామేమహాసింధువైనరీతి, నరుని సంకల్ప సముదాయప్రభావస్వరూపమే సంసారముగ పరిణమించినది.

వ్యక్తి మనోవీథియందు పరుగులుతీసెడి కోరికలబలగము మశీదుయందుచేరి సుఖాశీనుడై ధ్యాన ముద్రాంకితుడైననాడు పలాయనమొందగలదు. ఇందుమూలముగ ప్రతి ముముక్షువు తెలిసికొనదగిన సత్యమొక్కటి కన్పించుచు విన్పించుచున్నది. పరిశుద్ధముగ సుప్రశాంతముగ సుందరముగ హృదయాహ్లాదముగ నిరాకారముగ నిర్మలముగ మశీదు సాక్షాత్కరించుచున్నది.

ఈ మశీదులోని మూలరహస్యము ప్రతినరునకు బోధపడదు. మహమ్మదీయులమశీదని, క్రైస్తవులచర్చియని, హిందువులఆలయమని తెలిసీ తెలియని నరులెల్లరు వదరుచు తదితరులకు ప్రబోధము లొనర్చి సత్యమును మరుగుపరచి దైవద్రోహులగుచున్నారు.

ఈ యజ్ఞాన ప్రబోధములతో లోకము పెనుగోతిలోబడి తల క్రిందుగా పరిటీలుగొట్టుచు నధోలోకమున కేగుచున్నది. ఇది, ఎంతటి శోచనీయము.

ఎనుబదినాల్గులక్షల జీవకోటిసముదాయమంతటికి దేవుడొక్కడే! యని శ్రుతి స్మృతి పురాణాములెల్ల వేనోళ్ళ యెలుగెత్తి చాటునట్టి నిత్య సత్య వినిర్మల మధురమహావాణిని లోకము విస్మరించి గమ్యము తెలియని బాటసారివలె యెక్కడికో పరుగులు తీయుచున్నది.

ఆద్యంతములులేని నిరాకార నిర్గుణ నిత్య సత్య శుద్ధ తాత్త్విక జ్యోతిర్మయశక్తియొక్కటున్నది. ఆ శక్తియే సకలచరాచర ప్రకృతికి ప్రాణమై యాధారమై బరుగుచు పరిభ్రమణమొనర్చుచున్నది.

ఆ నిరాకారపరమాణుశక్తియే పరిణామముచెంది సాకారరూపమైన జగత్తుగ నరుని కంటికి గోచరించుచున్నది. నిరాకారమే సాకారమునకు మూలము. అనగా కారణమైయున్నదనిభావము. సాకారమే నిరాకారమునకు మార్గము. సాకారమును, అనగా కంటికి కన్పించి మనస్సునకు తెలిసెడిది యని భావము. సాకారమును సక్రమముగ తెలిసి భక్తుడుపాశించిననాడు నిరాకారాస్థితినిచెంది నిత్యానందమును పొందగలడు.

తల్లి సాకారము తండ్రి నిరాకారము. తల్లి దండ్రిలేనిదే సృష్టి జరుగదు. సాకారము ప్రకృతి నిరాకారము పరమాత్మ. తల్లిద్వారా దండ్రిని దర్శించుటకవకాశమున్నది. దండ్రిద్వారా తల్లిని తెలుసుకొనవచ్చును. ఈ తల్లిదండ్రి సంబంధబాంధవ్యబంధమువలె సాకార నిరాకారములు వెల్గొందుచున్నవి. నిరాకారోపాసకులు మహమ్మదీయులు.

సాకారోపాసకులు హైందవులు. సాకారనిరాకారోపాసకులు క్రైస్తవులు. ఈ సాకార నిరాకారములకు మూలము ప్రణవము. అనగా శబ్దము అట్టి శబ్దబ్రహ్మమునే హిందూ మహమ్మదీయ క్రైస్తవాది మతముల వారెల్లరుపాసించుచున్నారు. సర్వుల మార్గములు, రూపములు, ప్రార్థనలు భిన్నములైనను గమ్యమొక్కటియేయని విజ్ఞులకు సత్యమవగతమగుచున్నది.

కుల మత జాతి వర్గ వేష భాష ప్రాంతాది భేదములన్నియు నరులొకానొకనాడు తమ తమ యుక్తి శక్తుల బలముతో సుస్థిర సుప్రశాంతికొరకు నిర్ణయమొనర్చినారనెడి సత్యమును మరువరాదు. అద్వైతదృష్టిగల నాటి పెద్దల స్థిర నిర్ణయములన్నియు నేటి దేశకాల పాత్రలలోగల వైషమ్యములచే తారుమారై తలక్రిందులైనవి.

ఈ కుల మత వర్గభేదములన్నింటికి ప్రధానము పునాది గుణ వ్యవస్థయేయని యదార్థము తెలియబడుచున్నది. చాతుర్వర్ణ వ్యవస్థ నాటి గుణములవ్యవస్థయని ఋజువైనది. నాలుగు కులములు, నాలుగు జాతులు, నాలుగు యుగములు, బ్రహ్మదేవుని తలలు నాలుగు. ఈ నాలుగు పదములోని భావము నరులగుణములలో వారొనర్చెడి కర్మములలో గల భేదమే. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్వురు సృష్టి స్థితి లయ కర్మలొనర్చెడి పెద్ద దేవతాప్రభువులుగ పూర్వులు పురాణము లందు వర్ణనలొనర్చిరి. పదునెనిమిది పురాణములలోగల కథలన్నియు సూక్ష్మబుద్ధితో చదవి పరిశీలనాత్మకదృష్టితో చూచిననాడు సమాజమునకు ప్రబోధముచేసి మంచిత్రోవలందు పురోగమింపచేసి లోకమున శాంతి భద్రతల నెలకొల్పుటకై వెలుగొందినట్లు బోధపడున్నది.

గోరంతజరిగినదానిని కొండంతగ రూపకల్పనలుచేసి కథల రూపముతో వేలాదిగ్రంథములు హైందవమతమున పెద్దలునిర్మాణము లొనర్చిరి. మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణము, శృంగార నైషథము, మేఘసందేశమాదిగాగల మహాకావ్యరాజములను రాజుల

సహకారముతో శ్రీ అల్లసాని పెద్దనాది మహాకవిపుంగవులు మహత్తర ములైన రచనములను మహాకృషితో రూపొందించి సమాజమున కందించి నేటికి గొప్పసద్యశముతో కీర్తింపబడుచుండిరి. కవియావేదనా పరమైన సాహితీగంగాస్రవంతి సమాజమునకు యమృతవాహినియై విరాజిల్లినది.

విద్య, కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, వాగ్ప్రతిభ, శౌర్యము, త్యాగము, రూపము, సద్గుణసంపత్తి, దేవతాభక్తి, ఓర్పు, నేర్పు, శాంతము, సహనము, పరోపకారపరాయణత్వము మొదలగాగల విశిష్ట గుణగణ సంపత్తి నరులకు గతజన్మ పరంపరాగతముగ సంప్రాప్తమగు చున్నది. కుల మత జాత్యాది హెచ్చుతగ్గులవలన లభ్యమగునది కాదు

నేటి కాలమునందు సద్గుణములేక గొప్ప కులమున్నవానిని సమాజము గౌరవించుటలేదు. పై పెచ్చు "బ్రాహ్మణుడై పుట్టి ప్రయోజనములేదు. క్షుద్రకర్మలొనర్చుచున్నాడు దేనికి వానికులమని?" తెగడుచుండుట సర్వులువినుచున్నారు. సానిగాని దొరసానికే సంఘ గౌరవము.

ఇన్నికులములు, మతములు, కథలు, రూపములు, మార్గములు, విధులు యేర్పడుటకు ప్రధానకారణము జగత్తునందుగల జనుల హృదయక్షేత్రములలోని గత సంస్కారప్రభావములు వానికనుగుణము లైన భావములు కర్మలు భిన్నములగుటయేనని ప్రతి పాఠకసోదరుడు గుర్తించవలెను. గుర్తించి సద్గుణసంపత్తి నలవరచుకొని గుణముగల వారిని గౌరవించి వారికి సహాయమొనర్చుట పాఠకసోదరుని ప్రధాన కర్తవ్యము.

ఈ కార్యకారణసంబంధస్థితి ననుసరించియే మనపూర్వులైన పెద్దలు "క్షేత్రమెరిగివిత్తనము – పాత్రతెరిగిదానము" అని స్వానుభవ సత్యమును సంఘమునకు వ్యక్తమొనర్చిరి.

జన్మతః నరున కలవడిన లోభగుణము తానుపెరిగి పెద్దమై ధనవంతుడై సర్వాధికారియైనను తిరోగతిచెందదు. లోభివాని హృదయము కడుహేయము. తానొక్కరికుపకారమొనర్చక తన సుఖశాంతులకు సైతము ధనము వెచ్చించక "కంచె" వలె కావలియుండి తానొక్కనాడు సర్వమును త్యజించి లోకమును వీడును.

త్యాగగుణము, తాత్త్వికలక్షణము, సాత్త్వికబుద్ధిగల నరుడెల్ల వేళల లోకోపకారకర్మములొనర్చుచు సమాజమునకాదర్శమూర్తియై దైవమునునమ్మి ధర్మజీవితగమనమొనర్చుచుండును. కర్మఫలాకాంక్ష రహితుడై కర్తవ్యకర్మనిరతుడైననాడు భగవానునికరుణకు పాత్రుడై సంసారసాగరోత్తరణము నొందును.

దైవకరుణలేనినాడు నరుడెన్నటికి ధనవంతుడుగాజాలడు. విద్యావంతుడుగాజాలడు. ధర్మకర్మలొనర్చెడి నరునిపై దైవకరుణ సహజముగ ప్రసారమగును. ధర్మము, దైవము రెండుయొక్కటే.

తెలివిగలనరుడు, ధనమేదైవము ధనము సర్వసుఖములకు మూలము. ధనములేనినాడెవ్వరు గౌరవించి సంభాషించరు: కట్టకడకు సతిసుతాదులు సైతము హేయదృష్టితో చూచెదరు. ధనములేనినాడు లోకమున బ్రతికి ప్రయోజనములేదనెడి యంధదృష్టితో సత్యాత్ములకు సత్కర్మలకు నయాపైస వ్యయమొనర్చక పెట్టుబడిలేని దైవకర్మలందు పాల్గొనుచు తనతోడివారికి త్యాగధర్మములను ప్రబోధములొనర్చుచు వాచావేదాంతియైననాడు లోకముప్రేమించి గౌరవించజాలదు.

"సంగీతమునకు చింతకాయలురాలనిరీతి" పైసలువ్యయముగాని ప్రసంగములవలన వ్యక్తికి సంఘగౌరవము చేకూరదు. దైవకరుణయు కలుగదు. శక్తి భక్తిలేనినరుడు యుక్తితో నోరువిప్పక పదిమంది పెద్దలతో మౌనవ్రత మవలంభించుటెంతయో శ్రేయోదాయకము.

సుప్రశాంత సుందర మందిరములకేగినను నరులకు తమ మనస్సులందు దాగియున్న స్వార్థ వ్యామోహ దావానలము పూర్తిగా చల్లారని నాడు ప్రశాంతిలభించదు. ఆ ప్రశాంతవాతావరణ ప్రభావముచే పెద్దల ప్రవచనముల శక్తిచే తాత్కాలిక ప్రశాంతిచే చేకూరినట్లనిపించినను మందిరములనువీడిన మరుక్షణమే మాయాపిశాచమావరించి స్వార్థ భోగాసక్త చిత్తప్రవృత్తి రాగాలాపనమారంభ మొనర్చి నరుని వానరునిగ మార్చివేయుచున్నది. నరుడు నారాయణుడై వెల్గొందుటకు మనస్సు స్వాధీనమై భౌతికసుఖ వాసనలకు తిలోదకములు వదలి భగవానుని శాసనములను పాటించవలెను.

నరుడెంతో యాశతో గట్టితనములోదిట్టరై యదృష్టము కలిసి వచ్చి పైసలువరహాలై కుటీరము మందిరమై సంఘమున గొప్పవానిగ చలామణియై కాలుక్రిందిడక యాంత్రికగమనములొనర్చుచు కళ్ళు తలపైకెక్కినను యీ భోగ విహార వినోదక్రీడలందు బహుకాలము సుఖముల నొందజాలడు.

వ్యక్తి ఉన్నతోన్నతములైన పదవులందుండినను లక్షలాది ధనము పెట్టెలనిండుగ నిల్వలొనర్చినను గతదోషపుంజ ఫలము వరించిన నాడు భరించలేని బాధలకు గుఱియగుచున్నాడు.

నరులకు సంభవించెడి మోదభేదములు పన్నీరు కన్నీరు వారి తెలివియెక్కువవలన తక్కువవలన లభ్యముకాజాలవు. వారు నిత్యము సాగించెడి సుకర్మ కుకర్మల ఫలానుభవములే.

లోకమున కష్ట నష్ట దుఃఖ దరిద్రబాధల నెవ్వరేని యాహ్వానించరు. ఆహ్వానించక బహుదూరముగయుండినను నరునినెత్తిపైకెక్కి ప్రళయనాట్యముచేయుచున్నవి. ఇందులకు కారణము. తాత్కాలిక సుఖ పారవశ్యసంసిద్ధికై మనోతృప్తికై నరుడు ధర్మద్రోహియై న్యాయమును త్యజించి వంశమర్యాదను వమ్మొనర్చి సొమ్మును దుర్వ్యయమొనర్చి పాపకర్మాచరణుడై స్వేచ్ఛాసంచారి యగుటయే.

ప్రపంచమునగల మనుజులు యే కాలమందైనను యే యే పరిస్థితులందైనను తమతమ భౌతికానందములకై ధనమును ఖర్చు చేయుచుందురు. పైసలులేని సమయములందైనను పరులవద్దగల ధనమును ఋణముగ సేకరణమొనర్చి తమకిష్టమైన కర్మలకై వ్యయ మొనర్చి మిక్కిలియానందమనుభవించుచున్నారు.

ఇట్టి వ్యయమొనర్చెడి మనుజులు 'విజ్ఞానకార్యక్రమ నిర్వాహణ ము'లో తమగృహములకు విచ్చేసి విరాళములర్థించిన కవి, కథక పండితులతో "పరిస్థితులు బాగుగలేవు తప్పక బ్రతుకుచున్నాము. ఆదాయములేని వ్యయములతో తారుమారై భవితవ్యస్థితియెట్లనెడి యాలోచనలతోనుంటిమి" అని పెద్దలతోచెప్పి మెల్లగ బయటకు సాగనంపుచుందురు.

పరుల గృహముల కరుదెంచి వారికైచూచి బయటకువచ్చు వరకు వేచి ధర్మకార్యనిర్వాహణమునకు ధనమర్జించిన భాగవతకవిగుప్త నోరువిప్పక కార్యసిద్ధికై మరొకస్థలమునకేగుచున్నాడు.

ఎంతో సుసంస్కారము దూరదృష్టి, సజ్జనులొనర్చెడి నిస్వార్థ సేవాకర్మములను గుర్తించెడిశక్తిగల పెద్దలు బహువిధబాహ్యకర్మ బంధములలో చిక్కియు ధర్మకార్యనిర్వాహకులైన పెద్దలకెంతో యండగాయుండి ధనసహాయమొనర్చుచుందురు.

ఇట్టిపెద్దలు నేటిలోకమున నూటికొక్కరక్కడక్కడ 'తార లందు శశివలె' పరోపకారకాంక్షాసక్తచిత్తులై ప్రకాశించుచున్నారు.

నరుని ప్రయత్నము వృథాకాదు కృషికితగినఫలము కాలక్రమ మున చేకూరగలదు. ప్రారంభించిన సత్కార్యమును వ్యక్తి, దీక్షతో కర్తవ్యమెఱింగి కర్మసాగించిననాడు పరిపూర్తిచెంది సంతసము చేకూరును.

"కాలాయ విష్ణురూపాయ" అనెడి నుడిని నరుడెన్నటికి మరువ రానిదైయున్నది. కాలముకలసిరాని నాడెంతటి మేధావియైనను

దిక్కుఁదోచక దీనుడై లోకమంతయు తిరుగవలసినదే. కాలముకలసి వచ్చిననాడెట్టి ఘనకార్యమైనను నరుడెంతో సులభముగ సంపూర్తి చేయగలడు. కాలమొక్కనాడుమంచిదై మరొక్కనాడు చెడ్డదగునా?

కాలము మంచి చెడ్డల కతీతమై స్వయంశక్తితో వెలుంగు చున్నది. అనంతమైన కాలగర్భమునుండి ప్రాణులుద్భవమై యభివృద్ధి చెంది చెంది కడకు కాలగర్భమునందే కలసిపోవుచున్నవి.

కాలము కలసివచ్చినదనెడి పదములోని సత్యాంశమును తెలిసిన నాడు నరుడు సాగించెడి ప్రయత్నపరమైన కర్మ సంపూర్తిచెందుటయే నని బోధపడుచున్నది.

ప్రారంభకథకుని యెవ్వరు నాహ్వానమొనర్చి కథాగానములు చేయించి కట్నములర్పించరు. కాలగమనమున కథకునికృషి పక్వమైన నాడు పెద్దలెందరో యాహ్వానములొనర్చి ఘనమైనసన్మానములొనర్చి యానందమొందెడిరీతిగ, కాలము కర్మములు పరిపక్వములైననాడు నరుడింతవాడంత వాడై గగనవిహారమొనర్చును.

కవి, యుపాస్యదైవమును ధ్యానించి మనోమధనమొనర్చి ప్రారంభమునందొకొక్కవాక్యమును జతచేసిచేసి కడకు మహాకావ్య ముగ రూపొందించుచున్నాడు. ఆ కావ్యము మహోన్నతభావ సము దాయముతో సంపూర్తినై భక్తహృదయులవిరాళద్రవ్యవ్యయముతో ముద్రణ భాగ్యమునుపొంది పొత్తమై సాక్షాత్కరించిన మహాపర్వ దివసములందు రచనమొనర్చిన కవికి గలిగెడి యానందము వర్ణనా తీతమైనది.

కవికి, తనకవితలవలన సమాజమునగల సాహితీవేత్తలైన పెద్దలచే గొప్పకీర్తిగౌరవాదరణములు చేకూరును. శరీరశ్రమ ధన వ్యయము, సంసారబాధ్యతలకు తిరోగతిగల్గుటాదిగాగల విపత్తు లెదురొడ్డును. ఎన్ని విపత్తులెదురొడ్డినను కవి తన కవితాకార్య

మును, తానుసంకల్పించిన ధ్యేయమును విడువక పట్టుదలతో కృషిచేసి కార్యమును సంపూర్తి నొందించుచున్నాడు.

ఇట్టి లోకోపకార కర్మనిర్వహణముతో చరించెడి మహాకవి నైనను భౌతికదృష్టితో యజ్ఞానాహంకారములతో స్వపరశక్తుల నెరుంగని మూఢమతులగు మానవులు కవిని, కవి కవితలను చులకన భావనతో నిందావాక్యములాడి గొప్పవారమని విర్రవీగుచుందురు. ఇట్టి నీచమతులగు మానవులను కవి యావేదనాగ్ని వెన్నంటి వెతల పాల్జేసి కన్నీటితో పరితపింపచేయకవదలదు.

తామసియైన నరుడు విచక్షణాజ్ఞానమును గోల్పోయి వ్యక్తిత్వ మును వమ్మొనర్చి తనశక్తి తగ్గిన నరుని పరుషముగమాట్లాడి వాని హృదయమునకావేదన కల్పించిన కొన్నాళ్ళకు తనశక్తికి మించిన నరుని పౌరుషవాక్యములకు పాదరక్షతాడనములకు గురియై భరించలేని యావేదనల పాలగును.

నరుడు చదువరియై బహువిధప్రజ్ఞావంతుడైనను తనతోడి నరు లతో ధర్మవిరుద్ధములైన దుర్భాషణములు, సంఘవ్యతిరేకములైన కర్మలొనర్చుటచేత, గౌరవముచెడి మర్యాద మంటపాలై పదిమంది చివాట్లకులోనై సతిసుతాదులచే హేయముగచూడబడి నీచమాన వునిగ సంఘముచే నిర్ణయింపబడును.

నరుడట్టి దుర్గతిని దుస్థితిని పొందుటకు కారణము, తన తప్పు తెలిసికొనుటకు యత్నించక తోడినరునిలోగల తప్పునుగొప్పచేసి క్రోధావేశపాశబద్ధుడై నీచవాక్యములాడుట.

ఆధ్యాత్మిక తృష్ణాతురుడైనకవి యెంతో కృషితో యాదర్శ సవిమర్శాధ్యాత్మిక భావసముదాయముతో పొత్తమును పూర్తిచేసి ముద్రణచేయించి ముముక్షువుల కందచేయవలయుననెడి సద్వాంఛతో స్వాంతపనులకు తిలోదకములిడి స్వార్థము స్వాహాచేసి ధనముగలవైశ్య

పెద్దలయొద్దకుజని విరాళములర్థించ వారిలో కొందరు "ఓ! కవిగారు వినోదకార్యక్రమములకు పలుకుబడిగల పెద్దవారివిందులకు స్వంత ఖర్చులకు ధనమంత వ్యయమైనది. మీ పాత్రము ముద్రణకై ధనము సమర్పింపజాలము. ఐనను మీ యాధ్యాత్మిక సత్యసవిమర్శ రచన సర్వులకర్థ మయ్యేడిరీతిలో లేదు. తేలికపదములతో సులువుగ యర్థ మయ్యేడి రీతిలో రచనసాగించవలసినదని" సలహాలొసంగుచుందురు.

కవిహృదయములోని విశాలభావసముదాయమును, కవియాదర్శ నిస్వార్థ జీవితగమనమును లోకోత్తరధ్యేయమును వైశ్యసమాజములో సాహితీ సంస్కారముగల పెద్దలు గుర్తించి యానందించుచుందురు. ఇట్టివారు బహుతక్కువ సంఖ్యలో లోకమునందు వెలుగొందుచున్నారు సాహిత్యపులోతుల నెఱింగెడి సంస్కారశక్తి, కవి కథక గాయకులపై యపారప్రేమ, కళాహృదయముగల వైశ్య సోదరాధికులకు యార్థిక స్తోమతయుండదు. ఆర్థిక స్తోమతగల వ్యక్తులకేవో చిక్కుసమస్యలు, సత్కార్యనిర్వాహణములలో పాల్గొని ధనవ్యయమొనర్చి తదితర సత్కార్యనిర్వాహకులకు ధనమర్పించెడి శక్తి గోల్పోవుటయు లోకమున సంభవించుచున్నది.

సాహితీచతురులై కవితయందుగల భావగంభీర్యమును మహాపద సమాసములను గుర్తించెడిశక్తిగల వైశ్యసోదరులెల్లరు ఆనందరస హృదయులై "ఆహా మనమెల్లరము వ్యాపారములొనర్చుచున్నాము. మన వైశ్యవంశోద్భవులైన శ్రీ కోట సుబ్బారాయగుప్త భాగవతులు కవులై విజ్ఞానమును చేకూర్చెడి రచనమొనర్చి స్వార్థములేని కర్మ నిర్వాహణముతో మనయొద్దకు విచ్చేసి గ్రంథముద్రణార్థమై విరాళము లడిగినందులకు మనమెంతో యానందము నొందవలెను. వైశ్యులెల్లరు వీరొనర్చెడి కార్యక్రమములకు సహాయమొనర్చుటెంతో ముదావహము ధనముగల మనమెల్లరము వారికృషిలో భాగస్వాములమైవారి కవితా కార్యమును గట్టెక్కించుటయే ప్రధానకర్తవ్య" మని విరాళము

లోసంగి కవి హృదయమున కానందముకల్గించినట్టి పుణ్యమూర్తులు వైశ్యసమాజమునందెందరో వెల్గొందుచున్నారు.

లోకమున వెలుగొందెడి ధర్మ దైవ పుణ్యకర్మల సంసిద్ధికై శ్రీ ఆర్యవైశ్య సమాజమెక్కువగ విరాళములర్పించుచున్నది. ఇందులకు కారణమేమి? దాన ధర్మ పరోపకారాది పుణ్యకర్మలొనర్చు సాత్వికమూర్తులైన నరులకు దేవుడైశ్వర్యమొసగి సంరక్షించుచు ననెడి వేదవాణిని విశ్వసించి జీవితగమనములొనర్చుటయేయని సత్యమవగతమగుచున్నది.

లోకమునగల జనులలో యుక్తిబలము ధైర్యము కార్యదక్షత శేశక్తిగలవారు సైతము ధనములేక ధనార్జన కవకాశముచిక్కక పలుబాధలతో క్రుమ్గుచున్నారు. ఇట్టి దుస్థితి నరులకు చేకూరుటకు గతకాలమునందెవ్వరికి సాయమొనర్చక దానకర్మలనువీడిధర్మమార్గము విడనాడి దైవభక్తిని పోనాడి స్వార్థముతో చరించుటయే యని ఋజువగుచున్నది.

నరులకు భోగములు పెరిగినవెంటనే రోగములు కాచి వేచి వరించి వేటాడసాగును. రోగములకవకాశములేని భోగములతో నరులు తమ శరీరములను కాపాడుకొనవలెను సరియైన యాహార విహారములొనర్చుచు క్రమశిక్షణతో శరీరమును కాపాడుచు సమయమునకు నిద్రించుచు పరకాంతలతో సంగమక్రీడలు సలుపక యసత్యములు పలుకక కులసతితో సంసారయాత్ర సలుపుచు మితాహారియై మితభాషియై వ్యాయామమొనర్చుచు శ్రీహరిసేవ యొనర్చెడి భక్తమూర్తికెట్టి రోగములులేక యోగజీవితముతో సుఖ శాంత్యానందములతో విరాజిల్లుచుండును.

నరుడెంత మేధావియై ధనవంతుడైనను, తిండిపోతై, సోమరిపోతై, పొగరుపోతై, తిరుగుపోతై కన్నుమిన్నుగానక జూద సురాపాన

వ్యభిచారాద్యక్రమ కర్మలొనర్చిననాడు సర్వవిధముల పతితుడై క్రూర ఘోరవ్యాధులపాలై దురంతదుఃఖములకులోనై భూమికి భారమై కన్నీటితో తన బ్రతుకును నరకముగ మార్చుకొని కడకు ప్రాణములను గోల్పోవును.

వ్యక్తి, తనశరీరము రోగములపాలై కృశించకముందే బుద్ధివేగమును నిరోధించి కోడెవయస్సులోగల వేడికోర్కెలను క్రమబద్ధమొనర్చి తను మనోధనముల క్రమశిక్షణాత్మకముగ సద్వినియోగమొనర్చి యున్నదానితో సంతృప్తి చెందిననాడు జీవితము ధన్యవంతమగును.

సమాజోద్ధరణము ధర్మ కర్మ నిర్వాహణధ్యేయములేని ధనవంతులెల్లరు దేవుడు ప్రసాదించిన ధనమును డాంబికములైన భౌతిక కార్యక్రమములకై దుర్వ్యయమొనర్చుచుందురు. ఇట్టి ధనవ్యయమువలన లోకమునకు హాని గలుగును.

నేటికాలమునందెక్కడ జూచినను పెద్దల పెత్తనమకుగంటినది. దూరదృష్టిలేని నవయువకుల పలుకుబడి పెరిగి 'పిచ్చివానిచేతిలోరాయి వలె' పర్వులెత్తుచు విజ్ఞులహృదయములకెంతో బాధలు నాందోళనలు కల్గించుచున్నవి.

లోకమునగల జనులు నాటినుండి నేటివరకు భిన్నములైన మతములతో మనోవృత్తులతో కర్మలతో చరించుటచేత పెద్దలు "క్షేత్రమెరిగినవిత్తము-పాత్రతెరిగిదానము" అని వాకొనిరి.

పెద్దలు సంఘమునకు ప్రబోధముచేసెడి ప్రతిసూక్తియందెంతో సత్యమిమిడియున్నది. కర్మలొనర్చి వాని ప్రతిఫలము లనుభవించిన యనంతరము వారి స్వానుభవములనే సంఘమునకు యాదేశరూపములైన సద్రచనలొనర్చి గొప్పమేలొనర్చిరి.

శ్రీ సుమతిశతకము వేమనశతకము, నారాయణశతకము, దాశరథీశతకము, రాజశేఖరశతకము, కవిచౌడప్పశతకము మొదలైన

శతకములన్నియు సమాజమునకు నీతిని ధర్మమును ప్రబోధముచేసి మానవజాతిమనుగడను తీర్చిదిద్ది గొప్పమేలొనగూర్చుచున్నవి. ఆ శతక కర్తలైన పెద్దల మహోన్నతాదర్శ మహోద్యేయము గణనీయమైనది.

మూర్ఖచిత్తులై మొండివాగ్వాదములొనర్చెడి యజ్ఞాన ప్రజ లెల్లరు నిస్వార్థ సేవాపరాయణులైన పెద్దలసూక్తులను కాదని ఖండించుచు స్వేచ్ఛావిహారులై కాలమును వారి కాయములను దుర్వ్యయమొనర్చి దిక్కు-చెడి దీన హీన హృదయులైన విషమ దివసములందా పెద్దలసూక్తులే సమంజసములైనవి. అజ్ఞానాహంకారా దులతో కన్నుమిన్నుగానక మన్నుపై చరించుచు దుష్టవాక్యములాడి దుష్టకర్మలొనర్చి దురంత దుఃఖమునందు మునిగితిమని చావుబ్రతుకుల మధ్య సతమత మగుచుందురు.

ఏ నరుడైన యే సమయమునందైన పెద్దల ప్రవర్తనలలోని యధార్థము గుర్తించక కుల ధన వయో సంఘబలములతో దుష్టమతులై వెగటు వాక్యములాడిన నాడాఫలము వీడక వెన్నంటి కార్చిచ్చువలె దహనముచేయక మానదు.

నరుని దుఃఖమునకు కారణములు దుష్టభావములు సంభాషణ ములు కర్మలని తెలిసి ప్రతినరుడు తన మనస్సును సద్భావ సత్సంభా షణ సత్కర్మలందు నియోగించిననాడు శుభసంతోషములనుపొంది పునీతుడగును.

మనుజుడు సంఘ ధన వయో స్థానబలములతో మదోన్మత్తుడై తప్పొప్పుల వివరము తెలియక తెలిసికొనుటకుయత్నించక తనతోడి మానవుని నిందావాక్యములాడిన కొన్నాళ్ళకు తనపాపము పండి తనకు మించినవారి నిందావాక్యములకు గురియై వారి నెదిరించె వదరెడి శక్తిలేక వచ్చిన కోపావేశమును తగ్గించుకొని దీనుడై నోరువిప్పక స్వస్థానమునకు చేరుచుండును.

వ్యక్తి, దేశకాలపాత్రతాశక్తులకు బానిసమైననాడు నీతిని విడనాడి సంఘభీతినిపోనాడి యాత్మశక్తిదూరుడై పనికిమాలినవాడై యగౌరవములగు కర్మలకుపాల్పడి లోకనిందలకు చిత్తక్షోభకు గురియగు చున్నాడు.

భగవద్భక్తిగల నరుడు త్రికాలములందును తనతోడి నరులతో నోటాడిన నుడిని తప్పక సమయభంగములేక పాటించవలెను. పరిస్థితుల ప్రభావమునకు బానిసమై స్వార్థప్రయోజనములనాశించి నోటాడిన నుడిని పోనాడిననాడు వానిభగవద్భక్తి నిరుపయోగమై కళంక మాపాదించబడును. ఇట్టి యసత్యవాదిని సమాజము హేయముగ చూచుచుండును. పరపతి పలుకుబడి చెడి పతితుడై దరిద్రముతో తపించుచుండును. నోటి నీతిలేని వ్యక్తికెవ్వరు ఋణమివ్వరు. భార్యపోయినను, యాస్థిపోయినను, యందస్థులుమారినను నరుడు లోకమున బ్రతుకగలడు పరపతి–పరువుపోయిననాడు మనుజుడు సంఘమున బ్రతుకజాలడు.

మాటనిలకడలేని మానవునకు సంఘమున గౌరవము సతిసుత బంధుమిత్రాదులప్రేమ దైవసన్నిధిలోస్థానము లభించవు. స్త్రీ, ధన, కీర్తి, పాశములకు కట్టువడిన నరుడు విముక్తినొందజాలక 'తేనెలోపడిన ఈగవలె' 'బురదలోచిక్కిన మత్తేభము వలె' మిక్కిలి గాసినొందుచున్నాడు.

చావు సమీపించినను మాయాబద్ధుడైన మనుజున కర్థ కాంక్ష తిరోగతినొందక పురోగతిచెందుచున్నది. జపమాలపట్టి భగవన్నామమును జపముచేయవలసిన వృద్ధదశయందున మాయాబద్ధుడైనమానవుడు తాళముచెవులగుత్తిని చేతదాల్చి ధనమును ధ్యానించుచు దురాశలకు లోనై తీరనిచింతలకు గురియగుచున్నాడు.

అరువదిఘడియల సమయములో యరఘడియకాలము దైవ కర్మకు వినియోగముచేయని నరుని జీవితము ముమ్మాటికి వ్యర్థము. పశువులు యాహార విహార నిద్రా మైథునాదికర్మలను క్రమముగా

కాలధర్మము ననుసరించి సాగించుచు శ్రమలేని జీవితములను గడుపు చున్నవి. హద్దులేని యాశలకులోనై తినుటకు తీరుకలేని కర్మలు సాగించెడి యజ్ఞానియగు నరునకు కాకిగలశాంతియును చేకూరుటలేదు. కడకు కట్టుకున్నసతితో సంతోష సంభాషణములొనర్చెడి మహాద్భాగ్య మునకు నోచుకొనజాలదు.

నరుని దేహమునకు సుఖము ప్రాణమునకు హాయి మనస్సున కానందము హృదయమునకు శాంతినొందజాలని నాడెంతధనసంపత్తి యుండినను వ్యర్థమే. ధనమును నరుడర్థములేనికర్మలకు దుర్వినియోగ మొనర్చిననాడాయర్థము వ్యర్థమై గొప్పయనర్థమువాటిల్ల చేయును.

'పాకమైన పదార్థమును తినక తోడినవులకొసంగక లోభియై దాచిన నాడది వ్యర్థమైనరీతి' భగవానుడు ప్రసాదించిన ధన ధాన్య విద్యావస్తుసంపదను నరుడు దాచి యంచనలతో యాలోచనలతో కాలమును గడపిననాడు నిరుపయోగమై మట్టిపాలగును.

దుష్టమనుజుని వైఖరి విచిత్రము. మాటకు లోబడని మతికి బానిసయై దుష్టమనుజుడై లోకమున చరించుచున్నాడు. మనుజుడు కుయుక్తి కుకర్మాలోచనల కనుగుణములైన కర్మలనే సదాయొనర్చి వాని ప్రతిఫలములను విధిగ యనుభవించుచు తబ్బిబ్బై తలక్రిందైన నాడు సైతము నేనొనర్చిన కుయుక్తి కుకర్మలఫలమిట్టిదని తెలివొంది నీతిగబ్రతుక ప్రయత్నించడు. పైపెచ్చు రచ్చలలో పిన్న పెద్ద తారతమ్య భావములేని దుష్టసంభాషణములొనర్చుచు తననైజ మెవ్వరికి తెలియదని భావించుచు లోకమున చరించుచుండును.

లోభగుణముతో పైసాలనే ప్రాణముగ భావించెడి మానవుడు లక్షలాదిధనమునువీడి తనవెత్తనములేక తనకు తెలియక తానెక్కడికో తరలిపోవుచున్నాడు. వ్యక్తి, తనతలపై కాలమృత్యువు కరాళ వక్త్రిముతో కాచివేచియున్నదనెడు యూర్యోక్తినివిస్మరించి బహువిధ

కర్మబాధ్యతాబంధములను తన కంఠమునకు మెలివేసికొనుచు 'నరసింహా! గోవింద! మాధవా!' యని నోటనుటకు మనస్సొప్పక నరకమును కల్పించెడి నీచవాక్యములతో కాలమును దుర్వినియోగ మొనర్చుచున్నాడు.

బాలుడు తన తల్లి, తండ్రి, సోదర సోదరీబృందముతో కలసి పెరిగి పెద్దవాడై వారెల్లరినెంతో ప్రేమ మమకారములతో చూచుచు కడకు తానొకయింటివాడై యత్తమామలు, బావమరదుల ప్రేమపాశ బంధములచే కట్టువడి ప్రారంభమునందెంతో పవిత్రప్రేమ మమకారము లతో వీక్షించిన తల్లిదండ్రి సోదర సోదరీబృందముపై వెగటుభావము గలిగి క్రొత్తబంధువర్గమైన యత్తమామలు, బావమరదులు, మరదండ్రపైగల గాఢమమకారముతో లోకమునుమరచి చరించ సాగును. ఇది లోకనైజము. ప్రకృతిప్రభావశక్తి.

లోకముమరచి చరించిన క్రొత్తపెండ్లికొడుకు కాలము గడుచు కొలది పాతవాడై క్రొత్తబంధువర్గపు నిరసనదృష్టికి నిందావాక్యములకు గురియై పరితప్తహృదయుడై "ఆహా! నా తల్లిదండ్రులు నాక్షేమం కరులై నేనాడిన నిందావాక్యములను క్షమించి నాపైగల పవిత్ర ప్రేమతో నామేలుకోరి సత్ప్రబోధములొనర్చిరి. అట్టివారిని హేయ ముగ చూచి నిందించి గొప్ప పాపమునార్జించితి" నని వగచుచుండును ఎట్టి విషమస్థితులందైనను నరుడు తన బ్రతుకుతెఱువుకై సతి పుట్టింటికి చేరిననాడు యగౌరవింపబడి యావేదన పాలగును. వ్యక్తి, కష్టనష్ట బాధాందోళనలకుగుఱియైననాడు గతమునందొనర్చిన పాపకర్మలన్నియు మనసకవీధులలో షికారులొనర్చి మనస్సునకెంతో సంతాపమును చేకూర్చసాగును.

మూర్ఖముతో తాబట్టినకుందేటికి మూడెకాళ్ళని వాదించెడి నరుడు, కోడెవయస్సు, చేతిలోపెత్తనము, జేబులనిండుగ రూపాయల కట్టలున్ననాడు, తన తల్లిదండ్రుల సత్యసమంజసములగు సద్వాక్యము

లెంతో వెగటుగ విన్పించుచు వారిధోరణ వింతగా హేయముగా కన్పించసాగును.

ఆ నరుడే గృహస్థుడై సంతతినిపొంది కోడంద్రతో కొడుకులతో కలిసియున్ననాడు తన కన్నకొడుకులాడెడి కఠినవాక్యములకు హృదయ మెంతో క్షోభించి 'ఆహాహా! గతకాలమునందు నన్నెంతో ప్రేమతో పరామర్శించి సత్యసూక్తులను ప్రబోధముచేసిన నాతండ్రిని హేయముగ పరుషవాక్యములాడిననాటి కర్మఫలమీనాడు నా కుమారుల రూప ములో ప్రత్యక్షమై పగదీర్చుకొనుచున్నదని' గుర్తించి విచారము నొందసాగును.

ఏ మానవుడైన యేకాలమునందైన యెట్టిపరిస్థితియందైన తన శక్తికితగ్గినవానిని నిందావాక్యములాడి వానిచిత్తమునుక్షోభింప చేసిననాడు తోడినరునిచిత్తక్షోభ వదలక వెన్నంటి యేడ్పించసాగును.

వాచావేదాంతవైరాగ్యసూక్తులకు నరుని మనోవేగము శాంతి నొందజాలదు. నరుడెన్నియో దుస్సంఘటనలపాలై భరించలేనిబాధలకు గురియైనను సంసారమునుండి విముక్తినొందుటకు యత్నించడు. బహు జన్మ పుణ్యఫలసంస్కారపు భావశక్తి నరుని వరించిననాడు సంసారపాశ బంధవిముక్తి చెంది నాశ రహితుడు మోక్షప్రదాతయైన శ్రీమన్నారా యణుని యందైక్యమగును.

సంసారము సుఖదుఃఖాది ద్వంద్వసంకులసమరభూమియని తెలిసిన మనుజుడైనను మాయాశక్తికివశుడై మనస్సునకు బానిసయై మంద మతియై లోకదుర్గతిననుసరించుచు సత్యదూరుడై జన్మపరంపరలకు గురియగుచున్నాడు.

లోకమును తనశక్తితో మేధాసంపత్తితో గడగడలాడించినట్టి మహామాంత్రిణి శ్రీమతి ఇందిరాగాంధీగారి కన్నకుమారుడు మహాతేజో విలాసుడై స్వేచ్ఛాసంచారియైన శ్రీ సంజయగాంధీ యాకాశ

గమనములో క్షణకాలములో మృత్యువుపాలై భువిపీడి దిగికేగిన విషయము లోకవిదితము.

భగవానుని విచిత్రలీలలందు ప్రతినరుడొకపాత్రధారి. పాత్ర పూర్తియైనవెంటనే వేషమునువదలినరీతి లోకమునందెట్టి ఘనుడైనను మరణము నుండి తప్పించుకొనజాలడు. కాలమృత్యువునకాహుతి కావలసినదే.

పెండ్లి పేరంటములేని బ్రహ్మచారియు ధనాశయను జిడ్డులోపడి బయటకువచ్చెడిమార్గము నన్వేషించక నానాటికి మాయాగరతమున బడి పాతాళమునకేగుచున్నాడు. ఆశ్రమస్వీకారమొనర్చి కాషాయాంబర ధారియై మౌనవ్రతములు పాటించుచు సాత్త్వికాహారముతో చరించెడి సాధువులనుసైతము ధనాశాపిశాచి పట్టిపీడించుచున్నది. గొప్పగొప్ప గ్రంథరచనములొనర్చి భక్తమూర్తులవిరాళద్రవ్యముతో ముద్రణములు చేయించిన మహాకవిపుంగవునిసైతము ధనాశాపిశాచి పట్టిపీడించివేధించుచున్నది. ఇట్టివారిలో కొందరువిజ్ఞానముతో ధనాశాపిశాచిని సరిహద్దులదాటనంపి నిత్య సత్య వినిర్మలశాంతితో వెలుగొందుచున్నారు.

నరుని బాహ్య వేష భాషాదులవలన మనోవీధిలో ఛలరేగెడి భోగవాసన నశించదు. ఈ భోగవాసనలేని విరాగహృదయులు నూటికొక్కరక్కడక్కడ 'నివురుకప్పిన నిప్పుకణికలవలె' సమాజమునందే వారి విద్యుక్తకర్మలనాచరించుచు సుప్రశాంతితో వేనోళ్ళపొగడబడుచు యాదర్శ మూర్తులై నిరాడంబరులై భాసిల్లుచుండిరి.

సర్వసౌఖ్యములకు మూలము ధనమనెడి భ్రాంతిగలవారెల్లరు ధనాశాపాశబద్ధులై సర్వశాస్త్రములను పఠించియు మనఃప్రవృత్తి నరికట్టజాలక శారీరసుఖమునకుపాల్పడి స్థితినుండి మెల్లగాదిగజారి గాసి జెందసాగిరి.

మేడిపండువంటిజీవితమునుగడిపెడి మానవుడు తనకు తెలిసిన బంధుమిత్ర కవి గాయక పండితాది పెద్దలను వినయోక్తులతో ధర్మసూక్తులతో నమ్మించి వారిమేధాశక్తిసంపదను తనస్వార్థమునకు వినియోగమొనర్చుకొని వారితో చెప్పిన ధర్మసూక్తులను గంగార్పణ మొనర్చి తానుమిగిల్చుకొనిన పరులకష్టార్జిత ధనమును స్వంతఖర్చులకు స్వాహాచేయుచు పదిమందిలో పెద్దమనిషివలె భాగవతుని వేషముతో షికారులొనర్చుచు తనలోతాను మురిసిపోవుచుండును.

మేడిపండ్లవంటిజీవితములను కొనసాగించెడి సంఘాపకారులైన నరుల యైశ్వర్యమంతయు బాధలకు, కష్టులకు, కోర్టులకు, రోగములకు వ్యయమై కడకు పనికిమాలినవారై బహువిధబాధలపాలై లోకమును వీడుచుందురు.

కోటిశ్లోకములను వాని ప్రతిపదార్థ విశేషవివరములతో మహారచనమొనర్చి బహువిధశ్రమలతో ముద్రణముచేయించి సమాజమునకందించి గొప్పయశస్సుతో తారాపథమలంకరించిన మహాకవిసార్వభౌముడైనను తానొనర్చిన యధర్మకర్మలఫలమనుభవించక తీరదు.

లోకజనక్షేమంకర మహాధ్యేయముతో ధర్మ దైవ భక్తి జ్ఞాన వైరాగ్య తత్త్వప్రచారకులై నిస్వార్థజీవనులైన పెద్దలైనను వారి వారి జీవితవిధులలో యాహార విహార నిద్రాదికర్మలు క్రమబద్ధముగాని నాడు రోగములపాలై బాధలకు గురియగుట తథ్యము.

నరుని రాగానురాగ భోగానుభవములే బహువిధరోగములకు మూలము. నరుని క్రమశిక్షణాత్మక సత్కర్మవిధివిధానములే శాంత్యానందములకు మూలము.

నరుని రాగానురాగ భోగానుభవకాంక్షకు మూలములై యసాధ్యములైనవి రెండు. మొదటిది జిహ్వేంద్రియచాపల్యము రెండవది గుహ్యేంద్రియచాపల్యము. ఈ రెండింద్రియముల శక్తికి లోకము దాసోహమని తలవంచినది.

తలవంచనిపీరుడనగా, వ్యక్తి, తనతలలో నుద్భవమొందెడి సంకల్ప సముదాయమునందు, యాత్మగౌరవమును, వ్యక్తిగౌరవమును, సంఘగౌరవమును పాడుచేసెడి కోర్కెలకు మనస్సును లోబడనీయక గురు దైవ శాస్త్ర సమ్మతములైన కర్మలయందే మనస్సును చొప్పించి చరించెడి నరుని తలవంచని పీరుడని తెలిసికొనవలెను.

వ్యక్తిని, లోకమున త్రికాలములందు కవచమురీతి రక్షణచేసి సంరక్షణమొనర్చునవి ధర్మబలము-దైవబలము. ధర్మమును బోనాడి దైవమును ద్వేషించిననాడు స్థాన సంఘ ధన వయో విద్యాదిబలములు రక్షణ చేకూర్చజాలవు.

ధర్మద్రోహులై దైవాపరాధులై దేవునిసొమ్ము నపహరించిన దుర్జనులను శక్తిచాలక సంఘమువదలినను కాలము కబళించకమానదు ధర్మాత్ములను దైవభక్తులను కాలము కబళించుచున్నదని నరులు దలంచుట యవివేకము. ధర్మ ద్రోహులను దైవాపరాధులను కాలస్వరూపుడైన శ్రీవిష్ణువు కష్టపరంపరలకు గురిచేసి దినమొక్క యుగముగ పరిణామమొందించగలడు.

పుట్టిన ప్రతిప్రాణి గిట్టుటనైజము. ఐనను ధర్మ దైవ సజ్జనాప కారులైన నరులు మాటికి దూరమై చావుబ్రతుకులమధ్య సతమతమగు చుందురు.

సంఘబలములేని సాత్త్వికమూర్తియగు నరుని సంఘబలము, ఐశ్వర్యము, దుష్టబుద్ధి, దురాగ్రహముగల మదోన్మత్తుడగు మానవాధ ముడు దుష్టవాక్యములాడి కొండకేకలువేసి విచారమునుచేకూర్చి తానానందము నొందసాగును.

ఈ దుస్సంఘటనల నాద్యంతము వీక్షించెడి కలికాలపు పెద్ద మనుష్యులు మదోన్మత్తుడగు మానవాధమునివైపు మద్దత్తుగ సంభాష ణలు సాగించుచుందురు. ఈ యన్యాయాక్రమ విషాద సన్నివేశములు

ప్రతి గ్రామమునందు జరుగుచునేయున్నవి. వీటినిపరిష్కరించి సాత్త్విక మూర్తుల హృదయములకు సుప్రశాంతినిచేకూర్చెడి సర్వసమర్థుడు సర్వేశ్వరుడే.

మదోన్మత్తుడగు మానవాధముడు, కలికాలపు పెద్దమనుష్యులు, వారొనర్చెడి దురాక్రమకర్మ పరిపక్వమైననాడు తమకు తెలియకనే సర్వవిధముల పతితులై పరపతి పలుకుబడినశించి పడరాని బాధలకు లోనై కన్నీటితో దుర్భరదుఃఖముతో వారిజీవితములను పరిసమాప్తి నొందించుచుందురు.

నేటి దుష్టకలివాతావరణమునందు ధర్మమూర్తులకు, న్యాయ శీలురకు, నిరాడంబరులకు, సత్యవాక్పరిపాలకులకు, నిజభక్తమూర్తులకు ఆదర్శకవి కథక గాయకాది కళాకారులకు సంఘమునందు సరియైన స్థానములేదు.

సంఘమున వెలకాంతకుగల పలుకుబడి కులకాంతకులేదు. సంఘ దృష్టి సత్యమును గుర్తించజాలదు. ఈ సంఘమును సంఘదృష్టిని, వందలవంవత్సరములనాడే శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి ప్రియశిష్యుడు శ్రీ సిద్ధయ్యగారు తన యనుభవపరమైనసత్యము నీవిధముగ వర్ణించిరి. "ఏ కులమని నన్నివరమడిగితే యేమని తెల్పుదు లోకులకు పలుగాకులకు దుష్టులకు మర్మార్థులకు"

ఆ యద్వైతతత్త్వజ్ఞుడగు శ్రీసిద్ధేంద్రస్వామివారి హృదయము నకు కుల ధన సంఘ బల మదోన్మత్తులైన మనుజులెంతో బాధాందోళ నలను చేకూర్చిరి. ఆ దుష్టనరులొనర్చిన దుశ్చేష్టలఫలమైన తన బాధను, తన జీవితస్వానుభవమును, తనకాలమునాటి లోకవర్తన మును, కుల మత పరమైన ద్వేషాగ్నిని, తన దివ్యకవితాగానముతో మేళవించి లోనకమునకే కనువిప్పుగల్గించిరి.

30)

సంఘబలము స్థానబలములేని స్థలములందు నరునకెట్టి స్థిరచరాది రూపమైన సంపదయున్నను వానివలన సుఖశాంత్యానందములు గలుగజాలవు. అట్టి స్థలములందుండుటయు వారి ప్రారబ్ధమని తెలియవలెను. "పదుగురాడుమాట పాటియై ధరజెల్లు ఒక్కడాడెడిమాట యెక్కదెందు" అనెడి లోకానుభవసూక్తి శ్రీ వేమనయోగీంద్రులు వారేనాడో పేర్కొనిరి.

దైవశ్యపాశక్తిగల మహాకవుల స్వానుభవ మధురవాక్స్రవంతి త్రికాలసత్యమై సర్వజన శిరోధార్యమైయున్నది. లోకోద్ధరణధ్యేయముతో వేదాంతకవి రాత్రింబవలు మనోమథనశక్తితో మహోన్నతాదర్శభావసముదాయముతో పొత్తమును సంపూర్తిచేసినను ముద్రణము గాని నాడది సమాజమునకుపయోగించదు. సమాజమున కందించవలయుననె ప్రయత్నముతో వేదాంతకవి ధనముగల వారిలో తనకు తెలిసిన వారై త్యాగబుద్ధిగలవారై తనని స్వార్థకవితాకర్మమును గుర్తించి గౌరవాదరణ వాత్సల్యాభిమానములుచూపెడి వారి నిలయములకు జని వారికి తీరుకగల సమయములందు తన కవితను విన్పించి వారిమనస్సుల కానందమునుచేకూర్చి హృదయములను గుర్తించి, ముద్రణకు విరాళములను వేయించి వెంటనేయిమ్మని యడుగుటకు మనస్సొప్పక మరొకసారి వారికి హెచ్చరికచేసి వారి విరాళములనుగ్రహించి యా ధనమును స్వంత ఖర్చులకు స్వాహాచేయక భద్రమొనర్చి ధనమంత సంపూర్తిచేసి యా ధనముతో ముద్రణకార్యక్రమ నిర్వాహణముతో తిరిగి తిరిగి విసిగి వేసారి కడకు నరహరి కృపాబలముతో గ్రంథములను తయారుచేయించి ముద్రణవిరాళములర్పించిన త్యాగమూర్తులైన పెద్దలందరకు "కర్మసిద్ధాంతము" అనెడీ మహాగ్రంథమునర్పించి కృతకృత్యుడైన పరమ పవిత్ర మహాపర్వ శుభసమయమున గ్రంథరచయిత పడిన పలుపాట్లన్నియు మరచి మహోదానందము నొందుచుండును.

ఈ గ్రంథకర్తగారి కర్తవ్యకర్మ మెంతటి బాధ్యతతో బాధతో సంపూర్తి మైనదో విజ్ఞులైన పాఠకసోదరులు గుర్తించగలరు. గుర్తించిన పాఠకసోదరులు మరువక నిందలిగహస్య విషయ విశేషములను తదితర సభ్యులకు విన్పించి వారు మీరు ధర్మ కర్మ నిరతులై లోకమున చరించి తరించిననాడు వ్రాసిన కవి, కవికుటుంబము యెంతో యానంద ముతో వెల్గొందగలదు.

ఎన్ని యోలక్షలు వ్యయ మొనర్చి యెంత యోకృషితో గొప్ప గొప్ప దేవాలయములను సంఘము నిర్మాణముచేయించుచున్నది. బహువిధ శ్రమలతో దేవాలయము నిర్మాణముచేయించిన పెద్దలు దేవాలయనిర్మాణానంతరమందు ప్రవేశించి భగవానుని నామమును భజించరు. ఆలయనిర్మాణముతో భక్తులకర్తవ్యకర్మ సంపూర్తి యైనదని భావించుట గొప్పపొరపాటు. విద్యార్థి పాఠశాలప్రవేశము తోడనే కర్తవ్యము ముగియనరీతి, భక్తజనులెల్లరు గొప్ప గొప్ప దేవాలయ నిర్మాణములతోడనే వారికర్తవ్యములు సంపూర్తిగాలేదు. విద్యార్థి పాఠశాలయందుచేరి యాధ్యాపకుని బోధలు శ్రద్ధతోవిని మరువక మనన మొనర్చి మనస్సులో జీర్ణించుకొని పరీక్షలో గెలుపొందిన నాడె వానికర్తవ్యము సంపూర్తియైనరీతిగ, గ్రామములందుగల దేవా లయములన్నియు దర్శించుటకే కాదు. హిందువైన ప్రతివ్యక్తి నిత్యము దేవాలయమునకేగి దేవునిదర్శించి భక్తితోపూజించి స్తోత్ర గాన భజనలతో కీర్తించి యందుగల రహస్యమును గుర్తించి దైవ జీవిత జీవనములను సాగించిననాడే భవతరణోపాయముపొంది భగవత్కృపకు పాత్రులై తిరిగిరాని స్థలములకు చేరగలరు.

బడి గుడి రెండు నరునిపురోగతికి సోపానములు. బడిలో చదివిన చదువు సంస్కారముతో, గుడిలో దేవునిరూపరహస్యమును గుర్తించి 'విశ్వంనారాయణందేవ' అనెడి వేదోక్తిని యనుభవమునకు తెచ్చు

కొన్ననాడు, బడిలోచదివినచదువు గుడిలోచేసినప్రార్థన రెండుసార్థకత నొందును. కర్మసిద్ధాంతమునకు మూలము ముఖ్యములై వెలుగొందునవి బడి, గుడి, నరునినడవడి.

నరునకు సద్గుణసంపత్తి, శక్తికితగిన త్యాగము, భగవానుని యుందు వాని కథలందు నిష్కల్మషముగు నిరాడంబరముగు భక్తిగల్గిన నాడు, నిరాకారమై నిత్యమై సత్యమై స్వయంశక్తితో వెలిగెడి యద్వైత మహాతత్త్వస్వరూపశక్తి సర్వభూతములద్వారా రక్షించుచు కవచమై సర్వసంరక్షణ మొనర్చుచుండును.



# దేవుడున్నాడా? లేడా?

దేవుడున్నాడా? లేడా? అనెడి రెండుప్రశ్నలు ఈనాటివికావు. అనాదికాలమునుండి నేటివరకు క్షీరసాగరమథనమువలె సమాజమును మథనము చేయుచునేయున్నవి.

ఈ విషయద్వంద్వమథన సారాంశరూపమును, దేవుడున్నాడని కొందరు లేడనికొందరు బృహద్గ్రంథములను వారివారి మేధాసంపద్విభూతి ప్రభావముతో సమాజమున కందించిరి.

సమాజమునకందించిననాటి పెద్దలు భువిపీడి దివికేగిరి. నేటి కాలపు పెద్దలవలె నాటికాలపుపెద్దలకు స్వార్థముగలదా? వారి వారి జీవితగమనరీతులను పరిశీలనచేసి సత్యమును గుర్తించినచో స్వార్థము లేదని బోధపడుచున్నది. స్వార్థత్యాగులైన నాటిపెద్దలలో దేవుఁడున్నాడనికొందరు లేడనికొందరు నిర్ధారణమొనర్చిరి. ఈ రెంటియందు దేనిని సంఘము విశ్వసించవలెననెడి విషయమే ప్రధానాంశము.

నిప్పుతో చెరలాటమా! అనెడి సామెతగా దేవుడున్నాడా! లేడా! యనెడీయంశము బహుళప్రయాసాకులము. ఐనను సర్వశక్తి వంతుడగు మద్గురుస్వామియే వ్రాయించగలడు.

ముఖ్యపురుషార్థమగు మోక్షము సంసారమూలకారణ నాశము వలన కలుగును. సంసారమూలకారణాన్వేషణములో ప్రాజ్ఞులు తమ తమ బుద్ధ్యనుసారముగ వేరు వేరు మార్గములను జూపియున్నారు. వారే దర్శనకర్తలు. సంసారమూల కారణనాశకజ్ఞాన సాధనము దర్శనమనబడును.

దర్శనకర్తలలో కొందఱు బుద్ధిబలముచేతనే సంసారమూలమగు మాయను గ్రహింపవలెనని నమ్మిరి. వారే నాస్తికులనబడుదురు. వారిచే వ్రాయబడిన దర్శనములు నాస్తిక దర్శనములు.

పురుషునిబుద్ధిప్రమాదదోషభూయిష్టమగుటచే కేవలబుద్ధిబలముచే నూహింపబడినది సత్యముగానేరదు. మనకులభించెడిగ్రంథములలో బరమ ప్రాచీనములు వేదములు. వాటియుత్పత్తి కాలముమనకు గోచరింపకుండు టచే నవి యనాదులు. అవి పురుషప్రయత్నములేకయే యావిర్భ వించినవి. అట్టి పరమపవిత్రములైన వేదములలో జూపబడిన మార్గ ముల ననుసరించి మనయూహల నుపయోగించవలెను. వానికివిరుద్ధముగ చరించరాదనెడివారినే యాస్తికులందురు. వీరిగ్రంథములే ఆస్తిక దర్శనములు.

ఆస్తికదర్శనములు ఆరు : (1) వైశేషికము, కణాదుడు. (2) న్యాయము, గోతముడు. (3) సాంఖ్యము, ఈశ్వరకృష్ణుడు. (4) యోగము, పతంజలి. (5) పూర్వమీమాంస, జైమిని (6) ఉత్తరమీమాంస, వ్యాసుడు, సూత్రకర్తలైరి. ఈ దర్శనములకు, ప్రశస్తపాదుడు, వాత్స్యాయనుడు, గౌడపాదుడు, వ్యాసుడు, శబరస్వామి, శంకరాచార్యులు. బాష్యకర్తలైరి. ఈ యారును వేదప్రామాణ్యము

లను నంగీకరించినవారిచే వ్రాయబడినవి. ఇవి మోక్షస్వరూపమునకు తత్సాధనములకు మార్గదర్శకములైనవి. ఆస్తికయోగదర్శనముగు సాంఖ్యమును దైవరూప ప్రతిపాదన చేయలేదు. ధ్యానమునకు సుందర ప్రకృతి నెన్నుకొన్నది.

నాస్తికదర్శనములు ఆరు : (1) చార్వాకదర్శనము (2) బౌద్ధ దర్శనము. (3) జైనదర్శనము. (4) ఆర్హతదర్శనము. (5) దిగంబర దర్శనము. (6) సౌమదర్శనము. ఈ యారును వేదప్రామాణ్యము నంగీకరింపనివారిచే వ్రాయబడినవి.

వేదములు వర్గ ప్రాతినిధ్యములై, పరస్పరవ్యతిరేకప్రమాణములై అసహజములై తోచుచుండుటచే వీనిని ప్రమాణముగా గైకొనక బుద్ధిబలముచే నాలోచనచేసి తర్కించి సిద్ధాంతీకరించినవే నాస్తిక దర్శనములు.

నాస్తికులతీరు వీరి విధానము వీరిగ్రంథములలోని సారాంశము. ప్రాణి దేహమున్నంతవరకే సుఖ దుఃఖములనుభవించును. పురుషునికి పుణ్య పాపములులేవు. కనబడని, ఎవ్వరుచూచిరాని స్వర్గనరకములు లేవు. జన్మాంతరములులేవు. కష్టపడుటయే నరకము. ఇబ్బందిపడకుండ సుఖపడుటయే స్వర్గము. దేహము భూమిమీదయున్నంతవరకే కష్టము సుఖము. దేహము పోయినతదుపరి యేమిలేదనెడిభావనయే. వీరి సిద్ధాంతమునకు పునాది.

దేవుడు ఒకవ్యక్తిగ వేరొకస్థలమునందున్నాడు. సర్వజనుల లోనక్సెడి పుణ్యాపాపకర్మలను వీక్షించుచున్నాడు. మరణానంతరము జీవులను విచారణసల్పి వారి వారి కర్మలకు తగినఫలములను విధించు చున్నాడనుట సమంజసముగ సత్యముగ కన్పించుటలేదని కొందరను చున్నారు.

దేవుడు నరునివలె రూపధారణతోయున్నాడనుట మిక్కిలి యవివేకము. దేవునిగురించి దేవుని తత్త్వమునుగురించి గ్రంథములందు

వివిధరీతులలో వ్రాయబడియున్నవి. బహుముఖ సిద్ధాంతములతో వెలుగొందెడివాని యన్నింటియందేది సత్యము?

దర్శనములందే భిన్నములైన రీతులు గోచరించుచున్నవి. అనంతమైన కాలగమనమును కాలగమనములోని వివిధపరిణామములను వాని రీతులను రీతులలోగల లోతులను లోతులలోగల నీతులను సత్యాసత్యములను తేల్చి సంతసము నొందవలెనన్నచో మానవుని మేధస్సున కగమ్యమై యలరారుచున్నది. ప్రపంచభ్రమలను పోనాడిమృత్యుభయమును విడనాడి మృత్యుంజయుడై వెలింగెడి మహనీయమూర్తి మనస్సునకవగతమై భాసిల్లుచున్నది.

సమాజములో నీతిని కాపాడుకొనుటకు సుఖజీవనముచేయుటకు కొందరుకలసి పాపభీతిని, పాపముచేసినవారిని దేవుడు క్షమించడనెడి భయమును, దేవుడొక్కడున్నాడని సృష్టించిన కట్టుకథలేగాని దేవుడు లేడని ఘంటాపథముగా కొందరు గ్రంథములను రచనముల్చొనరి సంఘమున కందించుచున్నారు.

శ్రీరామ, కృష్ణ బుద్ధాదిమూర్తులను దేవునియవతారములని, శ్రీ ఏసుక్రీస్తుప్రభువును దేవునికుమారుడని, శ్రీమహమ్మదుప్రవక్తను దేవునిదూతయని హిందూక్రైస్తవ మహమ్మదీయులెల్లను విశ్వసించుచున్నారనుట సత్యసూక్తి.

దేవుడులేడని వాదించెడివారు. వారి వాదనలను విశ్వసించెడివారేకమై శ్రీరామ, కృష్ణ, క్రీస్తు, మహమ్మదు, లెవ్వరిశక్తితో భువియందావిర్భవించిరో తెలిసి సత్యమును గుర్తించిననాడు దేవుడున్నది లేనిది బోధపడగలదు.

దేవుడు విశ్వస్వరూపుడు. పరమాణుస్వరూపుడు. నరుని కంటికి గోచరముగాని సూక్ష్మరూపమైన పరమాణువుల సమ్మేళన పరమగు పరిణామముతో విశ్వము రూపొందించబడినది.

అట్టి విశ్వమునే నారాయణుడని దేవుడని శ్రుతిమాతగానము చేయుచున్నది. ఆవేదగానమాధుర్యమును చవిచూడని నరునకు దేవుని స్వరూపసాక్షాత్కారమెట్లవగతమగును.

నాస్తికమత ప్రచారకులైన శ్రీ గోరాగారు దేవుడులేడని "దేవునిపుట్టుపూర్వోత్తరాలు" అనెడి చిన్నపొత్తమును ప్రకటించినారు ఆ పొత్తము చిన్నదైనను మానవుల మస్తకములను పరిశోధించు చున్నది.

శ్రీ గోరాగారు గొప్పమేధాశాలురు ప్రతిభాశాలురు. ఉగ్ర విమర్శాగ్రేసరులు. సంఘమునందు జీర్ణించిన అంధవిశ్వాసములను మూఢనమ్మకములను కూకటివ్రేళ్ళతో పెకలించిపారవేయుటకై వారు సాగించిన దీక్షాదక్షతలు శ్లాఘనీయములైనవి.

సంఘములోగల వెట్టివేషములపై, బ్రతుకుతెరవుకై కల్పించిన కల్లబొల్లి కులమత కర్మ సిద్ధాంతములపై శ్రీ గోరాగారి మస్తక వీధులలో రేగిన పెనుతుపాను ప్రభావమే, దేవుడు లేడనుటకు ప్రబల మైన ప్రధానమైన కారణములు.

దేవుడు జనన, మరణములులేనివాడు నామరూపక్రియాతీతుడు ఆదిమధ్యాంతరహితుడు నిర్వికారుడు నిగమాతీతుడు. జగద్భర్త. త్రిలోకవంద్యుడు. నిర్గుణ నిష్కళంకమూర్తి, యనెడి నామసము దాయముతో వేదములు దైవమును గానముచేయుచున్నవి

ఆ పరమ పవిత్రవంతములైన వేదగానధ్వనులనే విశ్వసించిన శ్రీ గోరాగారు "దేవుని పుట్టుపూర్వోత్తరాలు" యనెడి పొత్తము ద్వారా దేవుడు జనన మరణములకతీతుడని విశ్వమెల్ల యెలుగెత్తి చాటి విశ్వాత్మయందు తాదాత్మ్యమొందిరి.

దేశ కాల కుల మత సంఘ ధన పదవీ బల శక్తి యుక్తుల కతీతుడై, దేవుడు వెల్గొందుచు. ధర్మ కర్మబద్ధులై సంఘసేవకులై

సర్వభూతప్రేమవిలాసులై చరించెడి నరులకు రక్షకుడై, జగన్నాటక సూత్రధారియై, సర్వజీవహృదయగుహాంతర్నివాసియై, ప్రకాశించు చున్నాడు.

ఆస్తికులెల్లరు దేవుడు భక్తరక్షణకై అవతారములెత్తి రక్షణ చేయుచుండునని విశ్వసించుచు నా యా మూర్తులనే దేవుడనిపూజించి ధ్యానించుచుండుట వారి వెఱ్ఱితనము, బుద్ధిహీనతయని నాస్తికులు వాకొనుచున్నారు.

విజయవాడలో, "గోరా" పేరుగల శ్రీ గోపరాజు రామచంద్ర రావుగారు 1970 జనవరిలో ప్రథమ అఖిలభారత నాస్తిక మహాసభలు జరిపినారు. 1970 ఆగష్టులో అమెరికాలోని బోస్టన్‌లో జరిగిన,అంతర్జాతీయ మానవతావాదుల మహాసభకు ఆహ్వానింపబడి దారిలో ఇటలీ, పశ్చిమజర్మనీ, హాలెండు, డెన్మార్కు, స్వీడన్, నార్వే, ఫ్రాన్సు, ఇంగ్లండు, ఐర్లండు, అమెరికా, కెనడా, ఫిజిదీవులు, న్యూజీలాండు, ఆస్ట్రేలియా, ఇండోనీషియా, సింగపూర్, శ్రీలంక పర్యటనమొనర్చి నాస్తికత్వాన్ని విపులంగ ప్రచారముచేసిరి. నాస్తికసంఘములను నెలకొల్పిరి.

ఈ శ్రీ గోరాగారి ప్రపంచ పర్యటన ఫలితముగా 1972 డిశెంబరులో విజయవాడ, నాస్తికకేంద్రమునందు ప్రథమ ప్రపంచ నాస్తికమహాసభలు జరిగినవి. శ్రీ గోరాగారు సాగించిన నాస్తిక ప్రచారోద్యమము లోకములో మూఢనమ్మకముల నుండి విముక్తి కల్గించుటకు దారిచూపినది.

మానవుని మరణమునకు ప్రధానకారణము హృదయము మెదడు పనిచేయుట యాగిపోవుటతప్ప మరేమికాదని, ఆగినప్పుడు తిరిగి వాటిని

పనిచేసేటట్లు చేయగలిగితే మరణమును జయించవచ్చునని శ్రీ గోరా గారి విశ్వాసము.

1975 సంవత్సరములో జూలై 26 వ తేదీ సాయంత్రము విజయవాడలో ఒక సభలో ప్రసంగము చేయుచు 'గోరా' గారు అకస్మాత్తుగా నేలకొరిగారు. సెరిబ్రల్ హేమరేజి, మెదడులో అకస్మాత్తుగా రక్తనాళాలు పనిచేయుట మానివేశాయని డాక్టర్లు చెప్పినారు.

ఎన్నో దేశములు పర్యటనము చేసి దేవుడు లేడని బహుళ ప్రచార మొనర్చిన గొప్పధైర్య శౌర్య ప్రతిభాశాలియైన శ్రీ గోరాగారు తన మరణమును మరణసమయమును గుర్తించజాలరైరి.

మానవుని మరణ రహస్యమెంతటి చిత్ర విచిత్ర వైఖరితో యొప్పుచున్నదో శ్రీ గోరాగారి విషయమువలన సంఘమునకు సువ్యక్తమైనది. దేవుడు లేడనుకొన్ననాడే సంఘము తనకాళ్ళపై నిలచి కర్తవ్య కర్మలను కొనసాగించి ఘనవిజయమును పొందగలదనెడి యావేదనయే శ్రీ గోరాగారు సాగించిన నాస్తికత్వమునకు పునాది యైనది.

నరుని సృష్టించినది దేవుడని. కాదు ప్రకృతిపరిణామమని, రకరకములైన వాదనలు గలవు. ఆ వాదనల వలన సంఘమునకెట్టి ప్రయోజనము లేదు. "సముద్రస్నానమునకేగిన యాత్రీకునకు సముద్రము లోతు దానిపుట్టుకేరీతి జరిగినదనెడి ప్రశ్నలు వ్యర్థమని శ్రీ రామకృష్ణ పరమహంసలవారు పేర్కొనినరీతి" దేవునిగురించి వ్యర్థ వాగ్వాదము లొనరించెడి మనుజులకశాంతి యావేదనలే మిగులుచున్నవి.

నరుడు తాళముచెవిలేక, తాళముయొద్దకుచేరి భక్తితో దైవ ప్రార్థనలు చేసిననాడు తాళమురాదుకదా! నరుడు కర్తవ్య కర్మమును వీడి దైవప్రార్థనలుచేసినను కార్యము నెరవేరదు. కర్మను వదలి యహరహము నరుడు 'నారాయణా! గోవిందా! నరసింహా!' యని

ప్రార్థన, భజన, పారాయణాదులొనర్చినను కార్యము నెరవేరదని సత్యము ఋజువగుచున్నదని కొందరివాదన.

ఇట్టి వారివాదనలందు కొంత నిజములేకపోలేదు. తాళముచెవి లేనిదే తాళముతీయుటకు వీలులేనిమాట వాస్తవమే. దీని నెవ్వరు కాదనలేరు. తాళముచెవిలేక నరుడు తాళముయొద్దకుచేరి 'హరిగోవిందా' యని భక్తితో ప్రార్థనచేయసాగినచో యే వ్యక్తియోచూచి తాళముచెవిదెచ్చి తాళముతీసి వానిని సంతృప్తినొందించును. సర్వ భూతములందునిండి వెలింగెడి శక్తి దైవమే. ఈ కారణముతో దేవుడే యేవ్యక్తిలోనైనచేరి దైవభక్తుని కోర్కెను నెరవేర్చగలడని నిజమును తెలియవలయును.

మానవుని ప్రగాఢమనోవిశ్వాసమే శక్తి. ఆ శక్తినే దైవకృప యని మన పెద్దలు పేర్కొనిరి. ఒక భిక్షుకుడు గ్రామ మధ్యభాగమున పదిమందికి కన్పించెడిరీతిలో మౌనముగా కూర్చుండిననాడు యా వ్యక్తిని చూచిన పదిమందిలో యే వ్యక్తియైన, యెవ్వడో కూర్చున్నాడు అన్నమునకు తీసికొని వెళ్ళుదమని సంకల్పించి తీసికొని వెళ్ళి భోజనముచేయించి బయటకు బంపించును. మౌనముగా కూర్చున్నవ్యక్తి పోషణము దేవునిపైబడినది. దేవుడు సమాజరూపముతో చరించుచున్నాడు. ఆ దేవుడే వ్యక్తి మనస్సులో ప్రేరణగల్పించి భిక్షుకునకు సాదము ప్రసాదింపజేయుచున్నాడు.

గజదొంగ యెంతో నేర్పుతో నిద్రించెడు గృహస్థుల గృహమందు వస్తుసంగ్రహణ మొనర్చి యతిజాగ్రత్తతో బయటకుచేరి మెల్లగా సందు గొందులలో పర్యటింపసాగిన సమయమునందెవ్వరో చూచి పరుగెత్తిడి గజదొంగనుపట్టి బంధించి పాదరక్షల తాడనములతో పరాభవమునకు గురిచేయుదురు.

గజదొంగశక్తి దేవుని శక్తికి దాసోహమ్మనరించకతప్పినది కాదు. "విశ్వంనారాయణందేవ" విశ్వరూపముతో వెలుగొందెడి

దేవుడు సమ్మోచరించెడు జ్ఞానిని రక్షణమొనర్చుచు సమ్మోచరించని యజ్ఞానిని శిక్షించుచుండును. ఈ విషయము ప్రతినరునకు నిత్య జీవిత గమనమునందు నిజమని ఋజువగుచున్నది.

నరునియందు నారాయణునిశక్తిగలదు. నరుడాశక్తిని నిత్య సాధనతోపొంది సిద్ధవాడై పదిమందిపొగడ్తలకు పాత్రుడగును. నరుని ప్రగాఢమగు మనోవిశ్వాసపరమగు కర్మయే శక్తినై దేవునియందు చేర్చుచున్నది. నరుడు తన మనోభావనలో శిల్పిచేసిన విగ్రహము దేవుడెట్లగును. ఈ లోహపుబొమ్మ నా ప్రార్థనవిని నా యశాంతిని రూపుమాపుగలదా? యని యూహించిననాడు నరుడొనర్చిన ప్రార్థన ఫలవంతము గాజాలదు.

దేవుడున్నాడో? లేడో? సర్వమానవులు తెలిసికొనజాలరు. ప్రతిమానవునకు మనస్సుగలదు. ఆ మనస్సుతో యాలోచనమొనర్చి విషయములలోని యథార్థమును తెలిసికొనవచ్చుననెడి నిజము ప్రతి వ్యక్తికి తెలిసినదే.

వ్యక్తి, తనమనస్సును పరుల ధన దారాముల గ్రహించుటకై పర్వులెత్తనీయక బుద్ధిబలముతో మనస్సును నిగ్రహించి పరోపకారము లకై సద్వినియోగమొనర్చిననాడు కీర్తి గౌరవాదరణ లాభములను పొంది యానందమునొందసాగును. ఇట్టి తఱి దేవునిదయ కల్గినదని పలుకుచుందురు.

దైవప్రార్థనలలోని భావమువ్యక్తిగత శక్తినివ్యక్తమొనర్చుట లేదు. సర్వజగదుత్పత్తికి కారణమేదైయున్నదో యా శక్తియే ప్రార్థనలందు గోచరించుచున్నది. అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! సర్వలోకరక్షకా! సర్వేశ్వరా! గోవిందా! అనంతా! అచ్చుతా! త్రిగుణరహితా! త్రిలోకవంద్యా! మొదలైన పదములందుగల భావము అనంతమైన దివ్యజ్యోతిర్మయ మహాశక్తి యని సువ్యక్తమగుచున్నది.

మానవులు నూతనగృహ, వ్యాపార, ప్రవేశ, ప్రారంభ శుభ సమయ లగ్నములందు శ్రీ సత్యనారాయణస్వామివారి వ్రతమొనర్చుటకు బంధుమిత్రాదులతో ప్రయాణమై కార్యస్థలములకుచేరి దైవారాధనకుపక్రమించెడి తఱి వారి వారి మనస్సులు మారి మాటలు వ్యతిరేకములై కార్యవిఘాతముచెందిన దుర్దినములందు శ్రీసత్యనారాయణస్వామివారు వ్యక్తుల మతులను సరిచేసి సంతోషమును చేకూర్చలేదు. ఇందులకు కారణము దేవుడా? వ్యక్తులకుగలకుసంస్కార ప్రభావమా?

నరుడు సంకల్పించి నిర్మించిన మండపమునందు గల ఛాయాచిత్రమునందు రమణీయముగా కన్పించెడి శ్రీ సత్యనారాయణస్వామివారేమి చేయగలరు?

నరుడు స్థిరతరమైన బుద్ధితో భవితవ్య స్థితిగతి స్వరూప విభవాదులను గుర్తించి కార్యనిర్వాహణమునకు పూనుకొనవలెను. బుద్ధిలోపము మనోవేగము, ముందు వెనుకలను గుర్తించెడి ప్రశాంతదృష్టిలేని మూర్ఖత్వముగల వ్యక్తి ధనార్జనము సులభముగా లభ్యమగునని యూశించి కార్యక్రమ నిర్వహణమునకుదిగి సాంఘిక సంఘటనల వలన కలిగిన తాత్కాలిక కోపావేశమునకు బానిసయై బంధుమిత్రాది పెద్దలను నిరసనదృష్టితో వెగటువాక్యములాడిననాడు వద్దకుచేరిన రక్తసంబంధముగు బంధువుల మతులుమారి వచ్చినకర్తవ్య కర్మకు తిలోదకములిడి వచ్చినత్రోవలందే పలాయనమొందుచున్నారు. పలాయనమొందెడి తుదిసమయములందు సైతము పట్టుదలవీడక మూర్ఖపు బుద్ధితో మౌనము వహించును.

కార్యనిర్ణేత గత దుస్సంఘటనలకు వగచుచు కార్యము చక్కచేయుటకై, నిరసనదృష్టితో వెగటువాక్యములాడి పలాయనమొందించిన తన బంధువుల సన్నిధిచేరి యూవేదనాపరమైన భేషజముతో తప్పని చెప్పియు వప్పించి యొద్దకుచేర్చుకొనుటకు సాధ్యముగాక స్వస్థలమునకు చేరి వగచుచుండును.

ఎంత తెలివిగలవ్యక్తియైనను, నిదానము నిబ్బరము శాంతము యోర్పు నేర్పు శక్తి యుక్తి భక్తి లేక తాత్కాలిక మతిభ్రమణము నకు గురియై కోపావేశమునకు బానిసైననాడు యనరాని, వినలేని మతి మాలిన పరుషవాక్యములాడి భవితవ్యస్థితిని భంగమొనర్చుకొను చుండును.

నరులు శ్రీ ఆంజనేయుని పూజించిన నరహరిని ప్రార్థించిన మతిమారి తమనోట మాటజారిన తదుపరి వారెట్టి ఘనులైనను ప్రమోదమును ప్రశాంతిని పొందజాలరు. సర్వశక్తివంతుడగు శ్రీ కోటేశ్వరస్వామివారి తిరునాల మహోత్సవమునకు భక్తితో వేలాదిరూపాయల వ్యయమొనర్చి ప్రభలను నిర్మాణము చేయించి బలమైన కోడెలసహాయముతో "హరహరా! చేర్చుకో! కోటయ్యా!" యనెడి సుశబ్దఘోషలతో తిరునాలస్థలమునకు ప్రయాణమై వెళ్ళెడి ప్రభలనాయకులు తప్పత్రాగి యజాగ్రత్తతో భయములేని భక్తితో ప్రభల ప్రయాణము సాగించిననాడు, బలమైన యెద్దులు బెదరి ప్రభలను ప్రక్కకులాగి త్రోవతప్పిననాడు బండ్లు తలక్రిందై ప్రమాద ములకు లోనై ప్రాణములను గోల్పోయిన దుస్సంఘటనలను సర్వులు చూచుచు వినుచు యాశ్చర్యమానసులగుచున్నారు.

ఈ ప్రబలప్రమాదములలో నరులు ప్రాణమునులను గోల్పోవు టకు కోటప్పకొండపై గుడిలో భక్తజనులభిషేకములను పొందుచున్న శ్రీ కోటేశ్వరస్వామివారి దివ్యకృపావీక్షణము లేదా? హరహరా! యని భజించెడి భక్తులను రక్షించెడిశక్తి లేదా? యనెడి ప్రశ్నలు భక్తులకు గలుగుట సమంజసము కదా!

'మాతృమూర్తి వక్షోజములందుగల క్షీరధారలను పాన మొన ర్చెడి పసిపాప పంటితో కొఱికిననాడు మాతృమూర్తి తనబిడ్డను మందలించి లెంపకాయ వేయక వదలనిరీతి' 'హరహరా!' యని

భజించెడి భక్తులైనవారి బాధ్యతను విస్మరించి జాగ్రత్తలేక కర్మ లోపముచేసిననాడు ప్రమాదములకు గుఱిగాకతప్పదు.

నరుని కర్మలోపములేనినాడు యీ కర్మఫలశక్తియే కవచమై రక్షించును. ఈ కర్మసిద్ధాంతమునే కురుక్షేత్ర సంగ్రామారంభమున విషణ్ణహృదయుడై గాండీవమును జారవిడచిన అర్జునునితో శ్రీకృష్ణ పరమాత్మ 'కర్తవ్యంబును గుర్తెరింగి విజయా! గైకొమ్ము గాండీవమున్' అని ధర్మప్రబోధ మొనర్చిరి.

శిల్పి, బండరాయిని లింగాకారముగామార్చి గుడిలో గర్భాలయమున చేర్చిననాడు పదిమంది మహాదేవుడని మ్రొక్కుచుందురు. బండరాయిలో మార్పులేదు. ఐనను పదిమంది భావనలందు గల్గిన పరిణామమే బండరాయి మహాదేవుడై వెలుగొందుటకు కారణమై యున్నది.

కాలగమనములోగల్గెడి మార్పులచే గుడి శిథిలమైననాడు మహాదేవుడని వివిదారాధనలతో పంచాభిషేకార్చనములతో జేజేలు పలికిన యీ పదిమంది శిథిలాలయ స్థలమునకు జనక జేజేలను వీడి బహుదూరముగ మసలుచుందురు.

భక్తితో పూజించిన యీ పదిమంది మానవులే యొకనాడు శివుడుకాదని ద్వేషించిరి. నరులు పూజించిననాడు ద్వేషించిననాడు శివలింగములో మార్పేమి కన్పించలేదు.

పాషాణమైనను పదిమంది పెద్దలు మంత్ర యంత్రాది మహా కర్మలతో మంగళధ్వనులతో పవిత్ర పదార్థ సమ్మేళన తీర్థాభిషేకములతో పవిత్రవాక్శక్తితో సుప్రతిష్ఠయొనర్చిన మహాకర్మప్రభావము వలన పాషాణమును పరమేశ్వరుడని జనులెల్లరు భక్తితో యారాధన లొనర్చి సర్వకార్యసిద్ధులనుపొంది యానందముతో విరాజిల్లిరి.

బండరాయిగయున్ననాడు మానవులు దేవుడని భజించలేదు. గుడియందు మంత్ర యంత్రాది మహాకర్మలతో విలశిల్లిననాడు యీ

మానవులే బండరాయియనుటకు మనస్సొప్పక మహాశివుడని దేవుడని వేనోళ్ళ భజించిరి.

పవిత్రప్రేమ స్వార్థత్యాగము మనోనిశ్చలత, స్త్రీ, ధన, కీర్తి సౌఖ్యముల నాశించక నీతినివిడనాడక ధర్మగమనమొనర్చెడి నరుని హృదయగుహాంతరమున, 'దేవుడు' జ్యోతిరూపమై వెలుంగుచు సుస్థిర సుప్రశాంతిని ప్రసాదించుచుండును.

మానవునితలయందెట్టి సంకల్పములులేక నిర్వికారుడైయున్న నాడు పూర్ణసుఖశాంతి సామ్రాజ్యపట్టభద్రుడై బ్రహ్మానందమునొందు చున్నాడు. దేవుడున్నాడని నమ్మి చరించె యాస్తికుడైనను దేవుడు లేడని స్వేచ్ఛాసంచారములొనర్చెడి నాస్తికుడైనను నిప్పును తాకుటకు భయము ఉప్పును తాకుటకు నిర్భయముతో చరించుటయెట్లు సహజ గుణ ధర్మములైయున్నవో అట్లే సంఘపరమైన ధర్మములందు సమాన ముగా చరించుచునే యుందురు.

ఆస్తికుడు కంటికిగోచరించెడి ప్రకృతినంతటిని దేవుడుసృష్టించెనని నని విశ్వసించుచుండును. నాస్తికుడు దేవుడులేడు. పరిణామసిద్ధాంతము రీతిగ కంటికి గోచరించెడి ప్రకృతి యేర్పడినదని విశ్వసించుచుండును.

కుడివైపునుండి ప్రయాణముచేసినను యెడమవైపు నుండి ప్రయాణముచేసినను యాత్రికులు కొండశిఖరమునకు చేరినరీతి, దేవుడు లేడనెడి నాస్తికులు దేవుడుగలడనెడి యాస్తికులు యీ యిరు తెగల వారెవ్వరైనను మనోవాక్కాయకర్మలు క్రమములైననాడు సుఖమును క్రమబద్ధములుగానినాడు దుఃఖమును పొందవలసినదే.

'వట్టిమాటలవలన ముక్తి లేదోయ్-గట్టిగా గురుకరుణ గలిగి తీరాలోయ్'' యన్ననుడియే సర్వులుపాటించి దేవుని రహస్యమును తెలిసికొనవలసిన యవసరమెంతైనా గలదు.

ఈ గ్రంథరచయితకు కారణాచార్యులు శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానందనరసింహస్వామివారు చదువులు చదువక తీర్థయాత్రలు

తిరుగక మహోపన్యాసముల వినక యేకాంతవాసముతో మహారణ్య సంచారముతో తీవ్రతపోయోగదీక్షాదక్షతతో సర్వభూతాంతర్గతుడగు పరమాత్మనే నాశములేని తత్త్వమని యాతత్త్వమే శ్రీమన్నారాయణు డని సగుణమై నిర్గుణమై నిర్గుణాతీతమై నిశ్చలపరబ్రహ్మతత్త్వమై యా తత్త్వమే సకలజగదుత్పత్తికిమూలమై, యామూలతత్త్వమే, పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించినదై జ్యోతిశక్తిజ్ఞానరూపములతో జగత్తు నాడించుచున్నదని శ్రీ స్వామివారి సందేశము.

ఈ జగన్నాటకసూత్రధారి దివ్యదర్శన సాక్షాత్కారమొందు టకు నరుల కర్మచక్షువులకు సాధ్యముగాదని యోగవిద్యతో విజ్ఞాన నేత్రముతో మాత్రమే సాధ్యమని, తర్క వ్యాకరణ పాండితీ శక్తుల కలభ్యమై అవాఙ్మన సగోచరమై స్వయంశక్తితో వెలుగుచున్నదని యట్టి తత్త్వమునే దేవుడని తెలియవలసినదని శ్రీ యోగానందనరసింహ స్వామివారు తన శిష్యులకుపదేశ మొనర్చిరి.

శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానందనరసింహస్వామివారు ప్రాణ వాయువును పట్టి బంధించి పరమాత్మతత్త్వరహస్యమును గుర్తించి సర్వ మానవ మస్తక రీతులను భవితవ్యస్థితిగతి స్వరూప విభవాదులను సువ్యక్త మొనర్చినస్థితిని యీ గ్రంథరచయిత కన్నులారదర్శించిరి.

దేవుడు శ్రీమన్నారాయణుడని యా నారాయణుని తత్త్వమే భక్తరక్షణకై శ్రీ నరసింహునిగా నవతరణమొందిననాడని యా నరసింహ దేవుడనే నేనని ప్రత్యక్షవ్యాఖ్యానముతో మానవతీతమై మహోజ్జ్వలమై వెలిగెడి యాత్మశక్తిని దర్శించి గుర్తించి తరించుడని కొండశిఖరమునుండి క్రిందికి లంఘించినట్టి భీకరదృశ్యములను కన్నులార దర్శించిన భక్తాదులెందరోగలరు. ఆ మహాత్ముని మహిమావిభూతులను కాలగమనమున పురాణప్రవచనమువలె మార్కాపురపౌరులు నేటికిని

తెలుపుచుందురు. ఆ ప్రాంతమందు 'తోకపల్లిస్వామి' వారన్నచో తెలియనివారుండరు. వేదరహస్యములను వారు నృసింహాశక్త్యావేశ సమయమునందు శిష్యులకు భక్తులకు ప్రబోధముచేయ, వేదబ్రాహ్మణులు విని,సాక్షాత్ నరసింహుని కళావతారమేనని భక్తితో ప్రణామములొనర్చిరి.

ఈ గ్రంథరచయిత బాలుడైననాడే తనమాతాపితృలైన శ్రీమతి వేంకమాంబగారిని శ్రీ లక్ష్మీనారాయణశ్రేష్టిగారిని, ఎంతో యుక్తి శక్తి భక్తి పౌరుషములుగల తాతగారైన శ్రీకోటరామయ్య శ్రేష్ఠిగారిని వీడి యొంటరిగా త్యాగబుద్ధితో పట్టుదలతో వివాహము వద్దని యోగిగాయుండెదనని, ప్రయాణమై మార్కాపురమునకు పశ్చిమ భాగమున మైలుదూరములోగల శ్రీ కపిలగిరిపైయుండెడి శ్రీ లక్ష్మీ నృసింహస్వామివారి దివ్యాలయమునకుచేరిరి. శ్రీ కపిలగిరి శిఖరాల యమునకుచేరి భక్తితో యావేదనతో ప్రార్థించి కన్నీరుగార్చిన తరి సర్వజ్ఞులు యోగవిద్యావిశారదులు మహాత్ములైన శ్రీశ్రీశ్రీ సద్గురు యోగానందనరసింహస్వామివారి కరుణతో సం॥ 1947 జూన్ 19వ తేదీ ఆదివారము సాయంత్రము 6 గంటలకు శ్రీలక్ష్మీనృసింహస్వామి వారి గుడి ముఖమండపమున పద్మముక్రింద కూర్చుండ నియమించి శ్రీ చేవూరి మహాలక్ష్మీదేవిగారు భక్తితో వీక్షించెడి సమయమున శ్రీ నారాయణ మహామంత్రోపదేశ మొనర్చిన మహాపర్వ శుభ సమయమునందే మహోజ్వలమైన భవితవ్యవాణినందించిరి.

"నాయనా! సుబ్బరావు నీవు బ్రహ్మచర్యదీక్షాదక్షుడనై యుండెదనని పలుకుచున్నావు. నీకా యోగములేదు. మీ గ్రామము నకు తూర్పుభాగమున వివాహము చేసుకొనెదవు. యెవ్వరిమాటవినక యాత్మబుద్ధితో స్వేచ్ఛాసంచారముతో యద్వైతభక్తితో సర్వరూపము లందు నన్నే దర్శించుచు నాయందు గాఢమైన భక్తిగలిగిచరించెదవు. వ్యాపారయోగములేదు. మీ పూర్వులార్జించిన ధనమునందు పాప

మున్నది. ఆ ధనమును నీవు వ్యాపారాది కర్మలతో వ్యయమొనర్చె దవు. నీ మనస్సు ప్రహ్లాదభక్తితో ముడివడి పురోగతి చెందగలదు. శ్రీ హరికథాకదన దక్షుడవై కవివై సర్వకాలసర్వావస్థలయందు నన్నే నమ్మి నా యాదేశములనే పాటించుచు కవి పండిత గాయకాది పెద్దల బహువిధ మర్యాద మన్ననలకు పాత్రుడవై ధీరత్వముతో భక్తితో శ్రీ సిద్ధతపోయోగ పుణ్యక్షేత్రరాజములందు పరమపవిత్రము లైన శ్రీ భగవదాలయములందు మహాపురుషుల సన్నిధిలో "భక్త = ప్రహ్లాదచరిత్ర" కథాగానములొనర్చి ఘనమైన పారితోషిక ములతో బిరుదు సన్మానములనుపొంది సదా యానంద హృదయుడవై వివిధ వేదాంత సిద్ధాంత రచనములనొనర్చి లోకమున కందించి సంఘ గౌరవమును పొంది కడకు వైరాగ్యముతో సర్వసంగపరిత్యాగమొనర్చి నా సన్నిధికిచేరి యోగజీవితము గడపి భక్తజనుల పూజలను బడయ గలవు అనెడి దైవవాణిని వ్యక్తమొనర్చిరి.

దేవుని తత్త్వదర్శనులైన శ్రీ శ్రీ శ్రీ సద్గురుయోగానంద నరసింహస్వామివారి మహనీయ మంగళ భవితవ్య మధురవాణి ప్రకారము నాటినుండి నేటివరకీ గ్రంథరచయిత కోటసుబ్బరాయగుప్త భాగవతుని జీవితము దివ్యముగా సాగుచున్నది.

మరుక్షణమునందేమి జరుగునో వేదశాస్త్ర కళాకోవిదులకే తెలియబడదు. కొన్ని పుష్కరములకు నరులకుజరిగెడి భవితవ్యస్థితులను శ్రీ యోగానందనరసింహస్వామివారు దైవశక్తితో యోగదృష్టితో తెలిసికొని యథాతథముగ భక్తజనులకు తెలియచేసిరి.

అట్టి జితేంద్రియులైన శ్రీ యోగానందనరసింహస్వామివారి స్వానుభవ సత్య సందేశముల సారాంశసూక్తి "దేవుడున్నాడు" అని వ్యక్తమై ప్రత్యక్షానుభవము నొందితిమి.

వేదాలసారము శ్రీమహాభాగవత గ్రంథము. ఆగ్రంథములోగల "గజేంద్రమోక్షము" కథ తెలిసి పారాయణమొనర్చిన ప్రతిపాఠకునకు దేవుని పూర్ణతత్త్వస్వరూపమెట్టిదో తెలియబడగలదు.

ఆనాటి గజేంద్రుని కథ నేటిమానవుని కథే.

ఆ భీకరారణ్యసీమయందుగల పర్వతత్రయమందు గజేంద్రుడు చరించి చరించి దప్పికతో మడుగునందదుగిడిన వెంటనే మొసలి గజేంద్రునికాలు నోటితో గట్టిగాపట్టి ఐదువందలయేండ్లు లోపలకు లాగుటయు మరల ఐదువందలయేండ్లు మొసలిని గజేంద్రుడు బయట కీడ్చుకొనివచ్చుటయు పదివందలయేండ్లుగతించుటయు గజేంద్రుని మద బలశక్తులన్నియు పూర్తిగా క్షీణించుటయు గజేంద్రునకుశక్తి లేక దిక్కు లేక దేవుడున్నాడో? లేడో? తెలియక, ఈ చరాచర జగత్తునంతటిని సృష్టించినకర్త యెవ్వడో యొక్కడుండితీరవలసినదే. ఆతడెట్టివాడో? యే రూపముతో యుండునో? ఎక్కడ నివాసమో? నాకు తెలియదు. నాకు తెలియనంతమాత్రమున జగద్భర్త లేకుండునా? తప్పకయున్నాడు. ఉన్నట్టియా జగద్భర్త తప్పక నా ప్రార్థన మాలించి ఓవినుం డిభువికి దిగిరాగలడు. నన్నురక్షించగలడనెడి యాత్మనిశ్చయముతో దేవుని ప్రార్థించెను. దేవుని, గజరాజీ విధముగా వర్ణించుచు స్తోత్రమొనర్చెను.

ఉ॥ ఎవ్వనిచేజనించు జగ; మెవ్వనిలోపలనుండు; లీనమై;
యెవ్వనియందుడిందు? బరమేశ్వరుఁడెవ్వడు? మూలకారణం
బెవ్వఁ? డనాది మధ్యలయుఁ డెవ్వడు? సర్వముఁదానయైనవాఁ
డెవ్వడు? వాని నాత్మభవునీశ్వరునే శరణంబు వేడెదన్.

క॥ ఒకపరి జగములు వెలినిడి
యొకపరి లోపలికిఁగొనుచు నుభయముఁ దానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని, నాత్మమూలు నర్థిఁదలంతున్॥

క॥ లోకంబులు లోకేశులు, లోకస్థులుఁదెగినదుదిన లోకంబగుపెం
జీఁకటికవ్వల నెవ్వం, డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్॥

క॥ నర్తకుని భంగి బెక్కగు
మూర్తులతో నెవ్వఁడాడు! మునులు దివిజులుం
గీర్తింప నేర? రెవ్వని
వర్తన మొరులెఱుఁగ, రట్టివాని నుతింతున్.

ఈ నాలుగు పద్యములతో నాటి గజేంద్రుమూర్తి దేవుని ప్రార్థించెను. యీ పద్యములలోని భావము ప్రతిముముక్షువు తెలిసి కొన్ననాడు దేవుడుయెట్లుండునో? యే రూపముతోనుండునో? యెక్కడున్నాడో? యేమిచేయుచుండునో? బోధపడగలదు.

ఈ సంసారమే భీకరమైనసాగరము. కరి మకరి పోరాటము, మానవునిలో రోజూ సాగుచునేయున్నది. ఏనుగుపైకి సాగాలంటుంది; మొసలి లోపలికి లాగాలంటుంది. ఇది యెప్పుడో జరిగిన కథేకాదు. మన నిత్యజీవితమునందు యింట్లో-వొంట్లో యీ పోరాటము జరుగు తూనే వుంది. భాగవతములోని గజేంద్రమోక్షము యీ జీవిత పోరాటానికి దృష్టాంతకల్పనము.

పరమాత్మనుండి జారి మనము ప్రపంచములోనికి వచ్చాము. తిరిగి మన జీవితము సమాప్తము బ్రహ్మప్రాప్తితోడనే సిద్ధించగలదు. సీమ మనగా బ్రహ్మము; ఆప్త మనగా పొందుట. బ్రహ్మప్రాప్తియే 'సమాప్తము' కాని, చావడము కాదు.

మనుష్యునిలో దైవాంశము రాక్షసాంశము రెండువున్నాయి. మనుష్యుడు తానొనర్చేడి కర్మతో దేవతాకావచ్చు రాక్షసుడు కావచ్చు. మానవునికి కర్మస్వాతంత్ర్యమిచ్చాడు దేవుడు. "నాఖర్మ, నా గ్రహచార"మంటూ యేడుస్తు కూర్చోవలసినపనిలేదు. తనవెంట వచ్చే సంపదను గురించి మానవుడు కించిత్తూ ఆలోచించడు. విడిచిపెట్టి

పోయే సంపదకోసము అహరహము పరితపిస్తాడు. "సత్యాన్నాస్తి పరో ధర్మః" సత్యానికి మించిన ధర్మములేదని శాస్త్రసిద్ధాంతము. సత్యమే దేవుడు. దేవుడే సత్యము.

వ్యక్తికి, లోకమున తన బంధుసంఘమంతయు సగబూని నిరాకరణమొనర్చినిందించినను దేవునికృప ప్రసరించిననాడెట్టి కష్టనష్టములు గలుగవు. దేవుడు జగద్రూపుడు. ఆ కారణముచేత దైవమును, దైవాదేశసందేశములను నరులునమ్మి జీవితనడకలను పాపములులేని రీతితో సాగించిననాడు సమాజరూపముతో సర్వత్రయున్నట్టి దేవుడు సర్వవిధముల చేయూతనొసగి సంరక్షించుచుండును.

లేని వస్తువును గురించి లేదనివాదించెడు వ్యక్తులు లోకమునందుండరు, దేవుడు యున్నకారణముచేతనే లేడని కొందరు వాగ్వాదము లొనర్చుచున్నారు. లోకమునలేనిదాని పేరెవ్వరైన చెప్పగలరా! సృష్టించగలరా? చెప్పజాలరు. సృష్టించలేరు. వాగ్రూపమున వెలువడెడి ప్రతి వాక్యమునకు లోకమునందున్నదై యున్నది.

రైలుబండి ఉష్ణశక్తిచేత పర్వులెత్తుచున్నది. పరుగులు తీసెడి రైలు నరునికంటికి కన్పించుచున్నది. రైలుబండిని నడపించెడి ఉష్ణశక్తి నరునికంటికి గోచరముగానిరీతి, ఈ చరాచర ప్రకృతిని నడపించెడి దైవశక్తి నరునికంటికి గోచరమగుటలేదు. నరునికంటికి కన్పించనట్టి దానిని లేదనుట తగదు. గాలి, నరుని కంటికి కన్పించనంతమాత్రమున లేదనుటకెట్లుపీలులేదో, గులాబి, మల్లె, జాజి, చామంతి మొదలైన పువ్వులనుండి ప్రసరించెడి సువాసనలకు రూపములేదు. రూపములేదని పువ్వుల వాసనలేదనుటకేరీతి వీలుకాదో, యదేరీతి, దేవుడు, నరుని స్థూలచక్షువులకు కన్పించనికారణముచే లేడనుట నిజముకాజాలదు.

ప్రతి నరుడు తనవీపు తనకంటికి కన్పించనంతమాత్రమున లేదనుట తగునా? దర్పణమునందు దర్శించిన నరునకు తనవీపు యేరీతి

దర్శనమగునో! అదేరీతి శ్రీ సద్గురు నిజబోధను భక్తితో విన్న నరుడు కృషిచేయసాగినచో కాలము కర్మము రెండు పక్వమై తనలో వెలింగెడి కాంతిస్వరూపుడైన దేవుడు కన్నులకు సాక్షాత్కరించి దివ్యపరవశత్వ మును కల్గించును.

దేవుడు లేడు. దయ్యము లేదు. వేదములు స్వార్థపరులెందరో కలసి సృష్టించిన సూక్తులసమూహము. భారత, రామాయణ, భాగవ తాది పురాణ కథలన్నియు జరిగినవి కావు. సర్వము స్వార్థపరత్వముతో తెలివిగలపెద్దలు సృష్టించినవి. అనెడి మతితో చరించెడి నరులకు శాంత్యానందములు లభించగలవా! గతకాలమునందుగల కవులరచనము లన్నియు వారి వారి మేధాశక్తితో సృష్టి చేసినవే! ఆ కావ్యములందు గల నామములన్నియు కథజరుగుటకు కల్పించినవే! పెద్దలు వ్రాసిన వ్రాతలు వారినీతులు సర్వముపట్టిదేయనెడి వాదనలతో క్రొత్త తెలివితో సాగించెడి స్వేచ్ఛారచనలే సమాజమునకు మార్గదర్శకములని సర్వులను ద్వేషించెడి నాస్తికునకు శాంతినొందుటకవకాశముకలదా? లేదు.

కొబ్బరికాయ యంతయు కొబ్బరేయనెడి వ్యక్తి వాదన, కొబ్బరి కాయ యందు కొబ్బరిలేదు, యనెడివ్యక్తి వాదన నిరుపయోగములైన రీతి, నేటికాలమున దేవునిగురించి వాగ్వాదములోనర్చెడి యాస్తిక నాస్తిక జనులస్థితి కనపట్టుచున్నది.

కన్నతల్లి తనకుమారుని యెత్తుకొని ముద్దాడి ముద్దాడి 'బాబూ! వీరే మీ తండ్రిగారని చెప్పగ చిట్టిబాబు తండ్రివద్దకు జని సంతోషము నొంది తండ్రిప్రేమకు పాత్రుడైనరీతి' భారతీయులందరికి, వేదమాత, 'మీ యందరిని కన్నతండ్రి విరాట్రూపుడైన శ్రీమన్నారాయణుడే' యని ప్రబోధముచేయుచున్నది. ఆద్యంతములులేని వేదమాత సత్య సూక్తులను సర్వులు విశ్వసించి వేదాచారకర్మ పరాయణులై యనంతునిశక్తియందు తాదాత్మ్యమొందవలెను.

అట్టి యనంతశక్తియందు నరునియాత్మ యేకీభవించినవాడు దేవుడై వెలుంగును. నరుని ప్రయత్నము నారాయణుని కరుణతో సిద్ధినొందును. ఆదర్శకవి సాగించెడి కర్మసిద్ధాంత రచనాముద్రణ ధన సేకరణము, బహువిధశ్రమలకు మూలమైయుండినను తన సంసారభార బాధ్యతలను విస్మరించి కడకు తన శారీరారోగ్యమునైన చూచుకొనక తానుసాగించెడి లోకోపకారమహాకర్మ నిర్వహణమును వీడక కార్య సిద్ధికై పలుచోట్లకు పరుగులు తీయసాగును.

ఆదర్శకవులొనర్చెడి సాహిత్య సద్విమర్శాత్మక కవితాకృషిని గుర్తించి, కవులకివ్వవలసిన ఫలము సంఘమివ్వగలదా? లేదు. సంఘ మంతటిని నడపించెడి సర్వశక్తిస్వరూపుడగు శ్రీ లక్ష్మీనృసింహ భగవానుడు గుర్తించి యే కవికివ్వవలసినగౌరవ మా కవికి త్యాగ హృదయులైన నరులలోచేరి యిప్పించుచుండును.

ఏ నిరాకారశక్తి కవికు స్తకమునందణగియున్నదో. ఆశక్తిని కవి తన మనోబలముతో విజృంభింపచేసి సర్వసిద్ధాంతరహస్యరీతులను, గీత బలముచే యక్షరములను సృష్టింపచేసి యీ యక్షర సముదాయముతో మనోభావనాశక్తిని బంధించి వాక్యములరూపముతో పొత్తమును రూపొందింపచేసి సమాజమునకందించి కృతకృత్యుడగుచున్నాడు.

రూపములేనిశక్తి రూపమునందుచేరిసర్వకర్మలనుచేయుచున్నది. కంటికి కన్పించుచు లోకవ్యవహార కర్మలను చేయుచున్నట్టి దేహము నకు స్వతంత్రశక్తి స్వేచ్ఛాగమనములు లేవు. దేహమొకనాడు యగ్ని యందుచేరి దహింపబడుట తథ్యము.

ఈ పాంచభౌతిక దేహమును యాడించెడిజీవుడు చివరదశయందు యెవ్వారి పెత్తనములేకనే దేహముకుండిలేచి కర్మఫలానుభవము నుండి తప్పించుకొనెడి యవకాశము శక్తిలేక సూక్ష్మరూపధారణముతో దయ్యమై ప్రేతభూములందు భయంకరస్థలములందు చరించుచు

నిప్పులనుగ్రక్కుచు వికటశబ్దోచ్చారణతో పాపకర్మలొనర్చెడి వారి కన్నులకు గోచరమగుచు, దైవదూరులై భౌతికశక్తియే నిజము భగవచ్ఛక్తి లేదనెడి నరపశువుల మస్తిష్కములందు చేరి మతిచెడిన కూతలతో వ్యంగ్యకర్మలొనర్చుచు వికటముగనవ్వుచు వింతగొల్పుచు వారిధనమును దుర్వ్యయమొనర్చుచున్నది.

దయ్యము, దైవారాధకుల దృష్టికి బహుదూరమై భయముతో మసలుచున్నది .భగవదారాధకులైన భక్తమూర్తుల కుటుంబములలో గల వ్యక్తులకు రోగములు సంప్రాప్తములై వైద్యసేవ వలన, ఘనమైన మందుల ప్రభావములకు తగ్గక యభివృద్ధిచెంది తీరనివ్యథ కల్గించెడి చెడ్డకాలములందు, పెద్దలు, గద్దెచెప్పెడి వారియొద్దకు జని ధాన్యము, దక్షిణలర్పించి భక్తితో కూర్చొని బుట్టలోగల బొమ్మకు దండమిడి తమ మదిలోని బాధలను కోర్కెలనుదలంచి చేయిచాచగ ఆ గద్దె చెప్పెడి యెరుకల "కృష్ణవేణి" యావేశముతో 'కొచ్చెర్ల అంకమ్మ' దొనకొండ గంగమ్మ, బెజవాడదుర్గమ్మ, అనెడి ప్రార్థన లొనర్చి 'ఓ! వెంకమ్మగారు! నన్నుమరచారు. నాకొండకు రాలేదు. నాకు రావలసిన మొక్కుబడులు చెల్లించలేదమ్మా! నే నెవరినో కాదు కలియుగ ప్రత్యక్షదైవము శ్రీ ఏడుకొండలవేంకటేశ్వరస్వామిని. యీ రోజే శుచితో నా కొండకువచ్చి తలనీలాలర్పిస్తామని ముడుపుకట్టండే నాతల్లి! మీకువచ్చిన బాధలను తీసివేసి రక్షిస్తానని" పలుకును. ఆ భగవదారాధకులు సోదిచెప్పిన శ్రీ యెరుకలకృష్ణవేణికేమి తెలుసు యనెడి నాస్తికభావములు లేక సాక్షాత్ శ్రీ ఏడుకొండల వేంకటేశ్వర స్వామి వారే చెప్పినారు. స్వామిచెప్పిన విధముగ చేయుదమనెడి సంకల్పముతో స్వామిసేవలో పాల్గొని శనివారము నిరాహారముతో, "మా బాధలను రూపుమాప"వలెననియపారభక్తితో శుద్ధవస్త్రమునకు పసుపుబూసి యా వస్త్రమునకు రూపాయిని గట్టిగాకట్టి దేవునిముందు

ముడుపుగట్టి పొంగలి నారికేళాదులను దీప ధూప కర్పూరనీరాజనము లతో నివేదనచేసి సాష్టాంగ నమస్కృతులొనర్చి, నీ కొండకువస్తాము స్వామి! గండముగాచి రక్షించుమనెడి ప్రార్థనలొనర్చినవెంటనే తమ తమ గృహములందుగల యీతిబాధలు బహువిధ రోగాదులన్నియు సమసి సుస్థిరశాంతి యారోగ్య సౌభాగ్యములతో నలరారిన విషయ ములు లోకమున కోకొల్లలు.

ఈ గ్రంథరచయితగారి జననీజనకులు శ్రీ కోట వేంకమాంబా లక్ష్మీనారాయణమూర్తులిద్వరు శ్రీతిరుమలగిరినివాసుడైన వేంకటేశ్వర స్వామి వారినెంతో భక్తితో యారాధించెడివారు.

దైవారాధకులైన శ్రీలక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు తనగృహము నందుగల పిన్న పెద్దలకే యాపద సంభవించినను వెంటనే దేవునిపూజా మందిరము యొద్దకుజని భయభక్తులతో 'ఓ! వేంకటరమణా! సంకట హరణా! నిన్నేశరణుజొచ్చి సదానమ్మి నీ దివ్యనామమును భజించెడి నీపాదసేవకుడను, ఆపదలనుండి మమ్ముద్ధరణమొందించుడని'మనసారా ప్రార్థనచేయుదురు.

ఈ కోట లక్ష్మీనారాయణగారి భక్తిప్రార్థనలాలించిన జగత్పరి పాలకులైన శ్రీ లక్ష్మీనారాయణులు తనభక్తునకువచ్చిన యాపదను తొలగించి శాంత్యానందములను చేకూర్చినట్టి సత్యసుసంఘటనల నెన్నింటినో పెద్దకొండాయపాలెము గ్రామపౌరులు కన్నులారదర్శించి దేవునిశక్తికాశ్చర్యమానసులైరి.

శ్రీ లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు ప్రతి శనివారము శ్రీనివాసు నకు వక్కప్రొద్దుండి నామస్మరణ భజనపారాయణములతో దేవునకు నారికేళాది పదార్థములు నివేదనచేసి తదుపరి భక్తులకుపంచి పరమాహ్లా దమును పొందుచుందురు. వీరు శ్రీ తిరుమల-తిరుపతి క్షేత్రమున కిరువదిసారులువెళ్ళి భక్తితో దర్శించి భజించిన భక్తమూర్తులు

శ్రీహరికృపతో దక్షిణ దేశమునందుగల శ్రీ తిరుపతి, కంచి, శ్రీరంగము, రామేశ్వరాదిగాగల క్షేత్రములు ఉత్తర దేశమునందుగలదివ్యక్షేత్రములు శ్రీ ఋషీకేశము, బదరీనాథ్ మొదలైన యాత్రలన్నియు సేవించిరి.

శ్రీ సద్గురుయోగానందనరసింహస్వామివారికి శిష్యులై వారి కరుణకుపాత్రులై వారుపదేశించిన మహామంత్రధ్యాన ప్రభావముతో శ్రీ కోటలక్ష్మీనారాయణశ్రేష్టిగారు తన జీవితమున 37వ సంవత్సరమున జరిగెడికాలమున తన గృహమందు అలమరలోచేరి కాటువేయుటకు సిద్ధముగాయున్న నల్లత్రాచుపాము బారినుండి గురుకృపతోరక్షింపబడిరి. ఇట్టిసంఘటనలనెన్నింటినో దేవుని కృపాబలముతో తప్పించుకొని సుఖ జీవనులైరి.

"దేవునినమ్మినవ్యక్తి యెన్నటికిచెడడు" అనెడి వ్యాసము ఈ గ్రంథరచయితగారిచే వ్రాయబడిన "ఏదిసత్యము"? పొత్తమునందు చూచి పఠించి దైవశక్తిని గుర్తించగలరు.

శ్రీ గురు, హరి, చరణకమలములను నమ్మి భజించెడి నరుడు సర్వమునకాధారమైనశక్తిని తెలిసి యానందించగలడు. అనంతకోటి గ్రంథముల సారము, శ్రీ సద్గురుసూక్తియందు తాండవముచేయు చున్నది.

శ్రీ సద్గురుయోగానందనరసింహస్వామివారి దివ్యమహాయోగా శీర్వాదముతో కోటసుబ్బరాయగుప్త భాగవతుడు ఆంధ్రదేశమున వెలుగొందెడి మహాపుణ్యక్షేత్రరాజములైన, శ్రీ కపిలగిరిశిద్ధక్షేత్రము, శ్రీమట్టపల్లి, శ్రీమంగళాద్రి, శ్రీవేదాద్రి, శ్రీభద్రాద్రి, శ్రీయాదగిరిగుట్ట, శ్రీసింహాచలము, శ్రీశైలము, శ్రీఅహోబిలము, శ్రీవేములవాడ, శ్రీకాళహస్తి, శ్రీఅమరావతి, శ్రీతిరుమల, శ్రీతిరుపతి, మొదలైన దివ్యస్థలరాజములందు "భక్తప్రహ్లాదచరిత్ర"ను కథాగానమొనర్చి విజ్ఞుల హృదయములకెంతో యానంద రసాను

భూతిని గల్గించుటయు, శ్రీసద్గురుమహాశక్తిప్రసార ప్రసాదమని, దేవుడు గలడని, దేవుడే సర్వమునందుండి సర్వులలో ప్రేరణము కల్పించి శ్రీప్రహ్లాదభక్తిని ప్రచారముచేయుటకై వివిధాలయములందవకాశము కల్పించి శ్రీహరి కథాకథనమును చేయించినారనెడి ప్రత్యక్షానుభవ సత్యమును పాఠకోత్తములైనపెద్దలు గుర్తించి దేవుడులేనిస్థలములేదని దయాహింసాది ధర్మకర్మనిరతులైన భక్తజనులను 'దేవుడు' సర్వకాల సర్వావస్థలయందు సంరక్షించుచుండుట తిరుగులేని సత్యమని విశ్వసించి, దేవుని నమ్మి భజించి చరించి తరించెదరు గాత!

దేవుడు=ప్రకాశముతోకూడినవాడు. అనగా, జ్యోతిశక్తి జ్ఞానములతో విరాజిల్లెడివాడు. సృష్ట్యారంభమునకుముందే సర్వవ్యాపకమై వెలుగొందెడి మహాశక్తిని దేవుడని తెలియదగినదై యున్నది.

ఈ రవి శశి తారకాది గ్రహసంచారమంతయు దేవునిశక్తిపై యాధారపడి పరిభ్రమణమొందుచున్నవి. దేవుని మహిమ తెలియగ వశమా? పాపులకీ భువిలో! అనెడి వాణి మరువరానిది. ''పాపమనగ వేరే పరదేశమునలేదు తానుచేయుపనుల తగిలియుండు'' అనెడి కవీంద్రుల నుడి సూటిగా ప్రబోధముచేయుచున్నది.

నరుడు పాపకర్మలొనర్చిననాడు ఫలితమూరకపోదు. పాపిని పలుబాధలకుగురిచేయును దేవుడని బైబులు గ్రంథమునందుగలదు.

పాపాత్ములను రక్షించుటకే శ్రీ యేసుక్రీస్తుప్రభువు దివి నుండి భువికి దిగివచ్చెనని క్రైస్తవులు వాకొనుచుందురు.

నరుని పాపకర్మలఫలమునుండికాపాడుటకు దేవుడు సమ్మతించడు దేవుని కుమారుడైన శ్రీ యేసుప్రభువు సమ్మతించడు. శ్రీ క్రీస్తుగారి తత్త్వమేమి? పాపముచేసినవారు తమతప్పు తామెఱింగి వారొనర్చెడి పాపకర్మలను వదలి పరిశుద్ధ జీవనులైననాడు రక్షింపబడుదురని ప్రబోధముచేసిరి.

ఈ లోకమునందు పాపకర్మలొనర్చెడి నరులను దేవుడు రక్షించడు. దయ్యాముక్షమించదు. ఎన్నిరోజులకైన నరులు దుష్టబుద్ధులను వీడి తమతోడి నరులకెట్టి యపకారాదులనుచేయూర్చక సర్వాలలో సర్వేశ్వరుని దర్శించుచు ధర్మాచరితులైననాడు దేవునికృపకు పాత్రులై యానందించగలరు.

నరుడు జాగ్రత్స్వప్న సుషుప్తి అనెడు మూడవస్థలలో జాగ్రత్స్వప్నములను జ్ఞానశక్తితో తెలిసికొనుచున్నాడు. సుషుప్తి యవస్థయందు తెలియని యఖండస్థితియందు చేరి తననుతాను గుర్తులేని స్థితిలోనుండి మేల్కొని "ఎంతో హాయిగా నిద్రించితినని, లోకమున వ్యక్తి వాకొనుచున్నాడు. అదేరీతి జీవుడు శరీరము వీడిననుయఖండమైన దేవునియందు సుసంస్కార సుగుణ సంపన్నమై సంకల్పములుడిగిన మనస్సు విలీనమగును.

భౌతికసుఖములననుభవించెడి దేహము స్థూలదేహము. స్వప్న సుఖానుభూతినొందెడి దేహము సూక్ష్మదేహము. కారణదేహము కాచుకొనియుండును. ప్రపంచమునువీడిన జీవులందరు దేవునితత్త్వమందు చేరి ముక్తిని పొందజాలరు.

నరునికంటికి కన్పించని సూక్ష్మాతిసూక్ష్మములైన ప్రాణిసముదాయమును 'దూరదర్శినియంత్రము' సహాయముతో ఏ విధముగా దర్శించి నిజమని నమ్ముచున్నాడో అదేరీతి, యోగశక్తివైభవముతో ఆర్యఋషులు దైవమును దర్శించి వారిసాధనసిద్ధికి దోహదములైన స్వానుభవములనే సమాజమునకు శ్రుతి,స్మృతుల రూపమున వెలుగెత్తి చాటిరి. స్వార్థత్యాగులైన నాటి పెద్దల స్వానుభవసత్యసూక్తులను ముముక్షువులు తెలిసి యాచరణమునందుంచిననాడు ప్రశాంతిని పొందుదురు.

దేవుడు సర్వభూతములలో సమానమైనశక్తితో కాయములను కదలించుచు నాదమును ప్రసారముచేయసాగును. ఆ దేవుడు జీవుల

అద్వైతమనగా ఒక్కటేయని దాని భావము. ద్వైత మనగా రెండు, విశిష్టాద్వైతి మనగా రెంటికి మించిన దొకటున్నదని భావము.

ఈ ప్రపంచమునందు ప్రతి విషయమును ఔననుట కనేకములగు ప్రమాణములున్నవి. కాదనుటకు తగిన ప్రమాణములు గలవు. ఈ కార్యకారణ సంబంధములగు వివిధ ప్రమాణములతో నిగూఢమై వెలగొందుచున్నదీ భారతీయ సిద్ధాంతము.

ద్వైతాద్వైత విశిష్టాద్వైతముల యథార్థమును పరిశీలనచేసి పరామర్శచేసినచో, ఒకే నరునకు బాల్య యౌవన కౌమార వార్ధక్యములని యెట్లనుచుంటిమో ? యదే విధముగా మానవుని యాచరణ విధానమునందుగల పరిణామదశలనే సిద్ధాంతములని మతములని గుర్తుల కొరకై నామము లేర్పరచియుండిరి.

భగవద్గతి గలిగినవారే భారతీయులు నిత్యసత్య సనాతన నిర్వికారస్థితి భగవంతునిది. అనిర్వచనీయమైన భగవంతుని యందేకమై జన్మజరామృత్యు భయరహితమైన దివ్యానందమైన స్థితిని పొందుటయే జీవిత పరమావధి: ద్వైతస్థితి యద్వైతస్థితియై యలరారును. సత్య శివసుందర దివ్యప్రకాశముతో తాదాత్మ్యము చెందుటయే భారతీయుల కర్తవ్యము,

విశ్వవిజ్ఞాన సంపన్నులైన భారతీయ ఋషులను గన్నట్టి మాతృమూర్తినే భారతాంబ యని భగవతియని శుద్ధసాత్త్విక తాత్త్విక విభవాదులతో వెలుగొందెడి మహాశక్తి స్వరూపిణి యని పరాశక్తి పరాప్రకృతి దేవత యని భారతీయ తత్త్వశాస్త్రజ్ఞులు వేనోళ్ళ వాకొనిరి.

అట్టి పుణ్యాచరితయగు శ్రీ భారతాంబ, మరల నేటి కలివాతావరణమునకు గురియై మానవ మహిషమస్తిష్క క్రూర పశువాంఛలకు బలియైనదని విజ్ఞులు పలుకుచున్నారు.

వివిధరకములగు కులములు మతములు గ్రంథరాజములు ఆలయ ప్రాకార మంటప గోపురాదులు, హైందవమున నే రూపొంది విరాజిల్లుటకు కారణము మానవులలోగల గుణప్రవృత్తులే.

బలిచక్రవర్తి, బాణాసురుడు, జరాసంధుడు, రావణుడు, కుంభకర్ణుడు. హిరణ్యాక్షుడు, హిరణ్యకశ్యపుడు మొదలగు దుష్టవీరుల హృదయములందున్న శక్తి యద్వైతమైనను వారి వారి మనోప్రేరణాపరమగు కర్మలకారణముతో దుష్టులని చరిత్రకారులు, వారిని పేర్కొనిరి. చరిత్రాధారములతో సమాజము వారిని దుష్టులని పేర్కొనుచుండిరి.

అద్వైతదృష్టిగల యాదర్శ కవిపుంగవులు వాస్తవిక సత్యమును సమాజమున కందచేయుటకు వెనుకంజవేయరు. లాభనష్టములు కీర్తి ప్రతిష్టలు చూడక ద్వంద్వముల కతీతులై నిజమును నిజమైన కవితా రూపముననే ఋజువుచేయుట కెంతయో కృషిసల్పుదురు.

కవితాస్రవంతిని సమాజక్షేమంకర దృష్టితో ప్రవహింప చేయు శక్తి భగవత్కృపాసిద్ధులై స్వార్థత్యాగులైన యాదర్శ కవివరులకే సాధ్యమగును.

ఇట్టి కవివరులెల్లరు బ్రాహ్మణులా? లేక బ్రాహ్మణేతరులా? యని చర్చించి సత్యమరసిన బ్రాహ్మణులు కాదు. బ్రాహ్మణేతరులు కాదు. వీరెల్లరు వలువవాణి సంతానమనియే తేలుచున్నది.

వాగ్దేవి వరప్రాద లబ్ధమానసులైన పెద్దలకు కుల మత జాతి భేదములుండునా? యట్లుండిన కవీశ్వరుడన చెల్లునా? కుకవియనక తప్పదు.

ప్రతికళయందు జీవుల సంస్కార యోగ్యతల ననుసరించి వారొనర్చిన సాహితీసేవా ఫలమున కనుగుణముగ యధికారులై రాణించుచుందురు,

యే యే గుణములుగల వ్యక్తుల నా యా గుణములుగల వ్యక్తులు గౌరవించుచుందురు. ఇది లోకప్రతీరు.

గుణమే ప్రధానమని గుణవ్యవస్థయే కాలక్రమమున కుల వ్యవస్థగా రూపొందినదని, గుణముగల వారినే గౌరవించి సహాయము చేయవలెనని సవిమర్శకాగ్రేసర మహాపండితులెల్లరు వేదశాస్త్రాది ప్రమాణములతో నగ్నముగా మహాజన సమక్షమున ఋజువుచేయ మొదలిడిరో యానాడే నీ కృత్రిమ వర్ణవ్యవస్థ కూలిపోసాగినది.

ఇట్టి యాదర్శ యార్షసంస్కృతీ సంజనితములగు మహోప న్యాసములను విని "ఓహో! వర్ణవ్యవస్థ కృత్రిమము గుణముల ప్రాతిపదికపై యొకానొకనాడు మనపెద్దలే నిర్మాణము చేసినా"రనెడి యథార్థమును గుర్తించి కొందరీనాటికిని సత్యదూరులై గుడ్డులకై నిర్ణయించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది నామములనే గట్టిగానమ్మి గుణముగల విజ్ఞులను సైతము గౌరవించని దౌర్భాగ్యము నకు గురియగుచున్నారు.

సత్య ధర్మ న్యాయ శాంతి సహనాది గుణములతో నొప్పారెడి నరులను హృదయపూర్వకముగా గౌరవించి వారి యడుగుజాడలలో చరించిననాడే సమాజమున కద్వైతదృష్టి యలవడి పునీతమై వెలు గొందును.

ఆదికాలమునందు మానవజాతికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది వర్ణ భేదములులేవు. చరిత్ర పూర్తిగా తెలిసినవారికే సత్యము తెలియును. మధ్యకాలమునందే యీ వర్ణ భేదములు కల్పింప బడినవి.

ఇవి యదార్థములైనచో నా యా వర్ణస్థులు వేసికొనిన కృత్రిమ వేషములను తీసివేసి యొకచోట నిలిపినచో వీడు బ్రాహ్మ ణుడు, వీడు క్షత్రియుడు, వీడు వైశ్యుడు, వీడు శూద్రుడు, వీడు పంచముడని తెలిసికొని చెప్పవలయును గదా! అట్లెవరును చెప్పలేరు.

సృష్టియందు మానవాకృతులన్నియు నొకే విధముగ నున్నవి. వారి యిష్టానిష్ట పరిజ్ఞానమునందును వర్ణముల ననుసరించి భేదము కనుపించదు. ఒకచోట పుట్టి యొకచోటనే పెరిగి, యొకే విద్య నభ్యసించి, యొకే సంస్కృతి కలిగియున్న మానవుల వాక్కులు నాహార విహార వ్యవహారములు నొకే విధముగ నుండునుగాని మధ్యకల్పించిన కృత్రిమ వర్ణముల ననుసరించి యుండవు. కొందఱు మానవులను నిరక్షరాస్యులుగను, కుసంస్కారులుగను జేసి, వారు బ్రాహ్మణులవలె మాటలాడలేనియు వారి యాహార విహార వ్యవహారాదికము నీచ మనియు, క్షుద్రయోనియందు జన్మించిరనియు స్వార్థపరులైన యగ్ర వర్ణులు పలికెదరు. మధ్య కల్పించిన కులములలో తక్కువ తరగతి కులమున జన్మించి సంస్కార ప్రభావమున భాష భావము ప్రవర్తనాది కములు గణనీయములై వెలుగొందుచున్న మానవులను, నీచభావ ముతో యహంకారముతో సర్వజ్ఞుల మనెడి గర్వముతో నుండెడి యగ్రవర్ణులు "ఓహో? మనకు తక్కువైన తరగతికి చెందిన యా 'రావుగారు' బ్రాహ్మణబీజముననే యుద్భవమందినాడు. లేనిచో వానికా మేధాసంపత్తి యుండునా? యనెడు దుష్టవాక్యములు పలుకు చుందురు. అట్టివారిని చూచిన బ్రాహ్మణేతరులలో యుక్తిశక్తిగల వ్యక్తి. ఓహో! మీరారెడి వాక్యములే యదార్థములైనచో యగ్ర వర్ణులని చెప్పెడు బ్రాహ్మణులలో కుసంస్కారులై నీచాహారము సేవించి యసత్యము లాడెడివారు శూద్రేతరులకు జన్మించియుందురా? యను టకు యెంతో యవకాశమున్నది. అట్లనుటయు సమంజసమేకదా! యని యనెదరు. ఇట్టి విపరీత వ్యాఖ్యానము వారికి వీరికి సమంజస మైనది కాదు.

ఇట్లనుకొనుట చాల తెలివి హీనమైనదని ప్రతి పాఠక సోదరుడు గుర్తించి గతకాలమునందుగల పరిణామ దశల పూర్ణస్వరూపములను

యేది సత్యమో? యేదసత్యమో? బాగుగా విచారణ సలిపి చివరకు విషయ నిర్ణయము చేసికొనుటెంతో ముదావహము.

వర్తమానకాలమున నన్ని వర్ణములలో పెక్కురు చదువుకొని సత్సంస్కారులై యగ్రవర్ణులకంటె చక్కగా సంభాషించుటయు, సదాచార ఆహారవ్యవహారములు గలిగియుండుట, మఱియు సద్గురుభక్తి బ్రహ్మనిష్ఠ సదా పురాణపఠనము మొదలగు పవిత్రకర్మలు చేయుటయు బ్రాహ్మణాది యగ్రవర్ణులలో ననేకులు చదువు సంధ్యలు లేక కుసంస్కారులై నీచాహారములను సేవించుచుండుటయు కన్నులార గాంచుచుంటిమి కదా!

శుద్ధాహారము పరిణామముచెంది శుద్ధరక్తమై తదితరములగు పరిణామములతో మాతృగర్భమునందు పిండమై వృద్ధిచెంది నవమాసానంతరము గర్భగోళముద్వారా శిశువై భువిపై దొరలి క్రమక్రమముగా వృద్ధిచెందుచున్నాడు.

ఆహార విహారాది సంస్కారముల ప్రభావముతో నరులు దుష్టులై శిష్టులై లోకమున చరించుచుందురు. ఇట్టి పరిణామాత్మకమగు సృష్టిరహస్యములను విడనాడి కులమతముల జిడ్డుతో యొకరినొకరు హేళనగా నీచముగా సంభాషించుకొనుట సమాజమున కెంతటి దుర్గతియో? విజ్ఞులైన వారెల్లరు వాస్తవమైన స్థితిగతులను కాదనక పెడవాదలుచేసి భేదమును పొందక సత్యమును తెలిసికొని సత్యమునే గౌరవించి సత్యదృష్టితో సత్యగమనముతో సర్వేశ్వరుని భజించి తరించుదము.

సర్వమానవులకు పరమప్రమాణములని విశ్వసించు వేదముల యందును మానవులయందు వర్ణభేదము నిరసింపబడినది.

సామవేదీయ మైత్రేయోపనిషత్తునందు "వర్ణాశ్రమాచార యుతా విమూఢాః కర్మానుసారేణ ఫలంలభన్తే. వర్ణాదధర్మం

పరిత్యజంతః స్వానందతృప్తాః పురుషా భవన్తి" మానవ సంఘమునందు వర్ణాశ్రమాచార ధర్మములను కల్పించి వానియందుత్తమాధమ భావములను కలిగియుండెడి మూఢులు వారి పాపకర్మలకు తగిన ఫలముల ననుభవింతురనియు, వర్ణాచారధర్మములను పరిత్యజించి మానవసంఘమునందే భేదములేదని తెలిసి సమభావముతో వర్తించు వారే మానవులనియు, వారానందముతో జీవింతురనియు చెప్పబడెను.

పూర్వకాలమున నద్వైతదృష్టితో మనస్సులేకమై పూర్ణస్థితి పొందిననాడే కులములేదనెడు మార్గమునందే పెద్దలు పయనించిరని మనకు బోధపడుచున్నది.

ఆనాడన్ని వర్ణముల వారికి భోజన ప్రతిభోజనములు, పరస్పర వైవాహికములు జరుగుచుండినవి. బ్రహ్మర్షియగు వశిష్ఠు డరుంధతి యను మతంగకన్యను పెండ్లియాడెను. అతని కొడుకగు శక్తిమహర్షి యదృశ్యంతియను మాలకన్యను పెండ్లియాడెను. అతని పుత్రుడగు పరాశరమహర్షి చెంబడి దానివలన వ్యాసునిగనెను. 'ప్రమత్త' యను బ్రాహ్మణ స్త్రీ మంగలివానిని వివాహమాడి మతంగమహర్షిని కనెను. బ్రాహ్మణులగు శుక్రాచార్యుడు, ఋష్యశృంగుడు, జమదగ్ని, ఋచీకుడు, అగస్త్యుడు, రైక్వుడు, సౌభరి మొదలగువారు క్షత్రియ కన్యలను వివాహమాడిరి. బ్రాహ్మణ స్త్రీలగు బర్హిష్మతి, కృత్వి, దేవయాని మొదలగువారు క్షత్రియులను వివాహమాడిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప వర్ణభేదము ముదిరి యెక్కువ తక్కువలలోకి దిగినది. దానితో బ్రాహ్మణులు క్షత్రియులు మే మెక్కువ మే మెక్కువ యని తగవులాడ దొడంగిరి. వశిష్ఠ విశ్వామిత్రుల కలహమునకు, పరశురామ కార్తవీర్యార్జునుల పోరాటమునకు కారణమిదియే యగును. ధనుర్విద్యావేత్తయగు పరశురామునకు

సైతము, బ్రాహ్మణులకు తప్ప తదితరులకు విలువిద్య నేర్పననెడు కుల సమస్యయున్నట్లు చరిత్ర మనకు ఋజువుచేయుచున్నది.

ఇట్లు ఎక్కువ తక్కువ యను మూఢభావముతో నాటినుంటి నేటివరకు సమాజమునందు కలతలు కన్పట్టుచునే యున్నవి. తనకు తానెవ్వడైనను ఎక్కువ యని సంబోధనము చేసికొనిన, తన ప్రక్క మానవుడు లేచి నీ యెక్కువయేమని యడుగుట కుద్యుక్తుడగును.

శాంతశమదమాది సద్గుణ సంపత్తిగల నరు డన్నివేళల నిండు కుండవలె తొణకక మెలగుచుండును. అట్టి వ్యక్తిని సమాజము విధిగా గొప్పవారని గౌరవించుచుండును. ఇట్టి గొప్పస్థితి ద్వైతమునందు లేదు. అద్వైతతత్త్వమునందే గలదని పాఠకులు గ్రహించెదరు గాక !



## తిరుణాల స్వరూపము - స్వస్వరూపము

కొంతకాలము మాత్రమే మురిపించి ముద్దుముచ్చటలు దీర్చి నడియేట పుట్టి ముంచెడి యీ ప్రకృత్యానందములకై యనర్థములకై యింత మమకారమేమిటో సామాన్యుల కయోమయము.

నిర్వికారుడు నిరంజనుడు నిరాకారుడు నిగమగోచరుడు త్రిగుణ రహితుడు నిత్యానందుడు జీవేశ్వరస్వరూపము నాదిమూల మగు ప్రణవమునకు మూలకారణమగు చైతన్యస్వరూపము, స్వయంప్రకాశ ముతో సదా వెలింగెడి యీ పరశక్తి, నిత్యనూతనకాంతులలో దశ దిశల విరజిమ్ముచు స్వయంప్రజ్ఞతో సకలచరాచరములయందునిండి నిబిడీకృతమై యీ జగన్నాటకము నాడించి పాడించి నవ్వించి ఏడ్పించు చున్నది.

ఆహాహా ! ఆమహత్తర దైవశక్తిని నూటికొక్కరైనను, గుర్తించిరో లేదో యనుమానాస్పదము ! అత్యాశ్చర్యకరము!

సత్వరజస్తమో గుణస్వరూపులగు నరులు పరిసరములయుత్తడి మహిమచేత, వారివారి హృదయ సంస్కారానుగుణముగా మలచుకొని సగుణోపాసనతో రకరకములగు రూపములేర్పరచి, జిహ్వాచాపల్యము నణగించుకొనెడి యాత్మశక్తిని పెంపొందింపక పాపప్రభావములుగలిగి, కులమతవర్గవిభేదములతో నీచసంభాషణలతో మానవత్వమునకు మంగళ హారతులిడి దానవకృత్యములకు బాల్పడి,విజ్ఞుల వాక్యముల నిరసించుచు తలోకరీతి సంభాషించుచు యదార్థసత్యమును గుర్తించి యాత్మోద్ధరణ నొందుటకు ప్రయత్నముచేయక యాత్మశాంతికిదూరులై యశాంతి కధి నాయకులై యాడంబరాట్టహాసములతో తిరుణాలలని,తీర్థములని,ఉత్సవ ములు యూరేగింపులని, ప్రతిజ్ఞలతో,పందెములతో,మతాతత్వములను పెనవేసికొనిమూఢాచారములతో స్వార్థభోగాభిలాషులై పదుగొరొసగిన యర్థము ననర్థకార్యక్రమములకు వెచ్చించును, సాధుహృదయులనుసజ్జన మూర్తులనుదైవభక్తిపరులను గేలిసేయుచు, తా మొనర్చెడి యాజ్ఞాన కార్యములే లోకోపకారములు భగవత్ప్రేరణములని మూఢభావము లతో మొండివాదనలతో 'కామెర్లరోగివలె' తాముచేయునవే సత్కా ర్యములని తమవాక్యములే పరమధర్మములని, విఱ్ఱవీగుచు నిత్యనూతన ప్రభలతో సాధురక్షణకై సర్వస్థలములలో దైవసంపత్తిని రూపొందించిన వేదవేద్యుని జగద్వంద్యుని దృష్టికిదూరులై నానాటికి విజ్ఞానహీనులై యహంకార మమకారములతో సోహంభావమును పోనాడి ప్రగల్భము లాడుచు, పరమేశ్వరుని సన్నిధిచేరియు చలనరహితమగు పాషాణ ప్రతిమకు ప్రమొక్కులిడి "ఓ ఈశా! మహేశా! భూతేశా! మా పాపములను తొలగించి పుణ్యవంతులను పరిశుద్ధులను చేయుమనెడి ప్రార్థన లొనర్చుచు, నవకాశమును పురస్కరించుకొని ప్రక్కవారిని మోసగించుచు, వన్నెచిన్నెలతో నొయ్యారపు నటనలతో తిక్కెత్తిన

రీతి తిరిగెడి పరభామల స్పర్శ దర్శనాభిలాషులై మూలనపడియున్న మనదేవు డేమిచేయుననెడి సంకల్ప వికల్పములతో, వినరాని మాటలతో, కనరాని చేష్టలతో లేనియొత్తిడిని సృష్టించుకొని దయ్యపు కేకలతో 'శాంతిశాంతి' యనుచు, నారికేళ నైవేద్యములను నివేదన చేసి 'శ్రీ ఆంజనేయా! ప్రసన్నాంజనేయా!' యని పలుమారు భజించుచు 'మమ్ము కాపాడవా మారుతీ!' యని కోతిచేష్టలతో, మూలస్థానమును వీడి యారాత్రియంతయు జాగరణ నెపముతో తన తోటి సోదరులను గౌరవింపక తిరుణాలను నిరీక్షించు నాసక్తితో తరతమ భేదములను పాటింపక వక్రమార్గము లనుసరించుచు తృప్తి బడయక రంకులరాట్నమాది సాధనముల నధిరోహణచేసి తనముందు నాసీనులగు యువతీమణుల మేనికాంతులపై ప్రణయదృక్కుల ప్రసరింప చేసి తీపికోర్కెలకు హృదయఫలకమున పందిళ్ళమర్చి ప్రేమభావములతో నూయలలూగు సమయముననే రంగులరాట్నపు టధినేత యొక గోలుసు పుచ్చుకొని పిచ్చిపిచ్చి పాటలు పాడుచు, గిర్రున త్రిప్పుచుండును. రాట్నమందు తిరిగెడు యువతీయువకులదే స్వర్గసుఖమను కొని గట్టిపట్టుతో తిరిగితిరిగి చివరకు దిగిపోయెదరు.

వేలకొలది రూప్యములు ఖర్చుచేసి క్షేత్రపరిసరప్రాంత గ్రామ పౌరులు, వెదురుబొంగుల తడికల నొకరికన్నొక రెత్తుగా నిర్మించుకొని రంగురంగుల పటాలతో రకరకాల పూసకూర్పుల సెట్టింగులతో భరత నాట్యమాది ప్రదర్శనలతో రైతుసోదరులందరు కలసికట్టుగా నేకీభావముతో, రంకెలువేసెడి యాబోతులను ప్రభలకు కట్టి యా పశువుల సహాయముతో ప్రయాణమై, చలిమిడి, పేలపిండి, చలిదిమూటలను ప్రభల కెక్కములకు గట్టి నారికేళనైవేద్య నీరాజనముల నొసగి 'హర హరా ! చేదుకో కోటయ్యా' యనెడి సుశబ్దఘుములతో, గ్రామములు వీడి చంద్రకోలలతో చేతికర్రలతో ప్రయాణములు సాగించి యనేక వ్యయప్రయాసలతో గమ్యము చేరుదురు.

ఏ సదాశయసంప్రాప్తితో మన పూర్వులీ తిరుణాల తీర్థములను రూపొందించిరో కాని, సదాశయములను గుర్తించక నా ప్రభముందు, నాబండిముందనెడి ద్వేషభావములతో నైక్యభావను నావలకు గెంటి, తగాదాలకు తారసిల్లి బడితపూజలతో పశుభావాలకు బానిసలై శాంతికి బదు లశాంతిని పొంది పరుగులు దీయుచు వినోదకార్యములు వీక్షించెదరు. తిరుణాల వినోదములు సర్వులకు ననుభవైకవేద్యములే!

వినోదములకు కట్నములనుపుచ్చుకొని కార్యభానిర్వహణ కరు దెంచిన నాట్యకాంతలు వారి వారి స్వప్రజ్ఞతో జనరంజకమునకై, సిగ్గుబిడియము వీడ పిచ్చిగంతులతో, సినిమా నటనలతో, ఇంగ్లీషు డ్యాన్సులతో, గట్టి గట్టి కౌగిళ్ళతో ప్రజాభిప్రాయములను చూరగొని తిరుణాల ప్రజాసమూహము న్ద్రోతలూగించును. ఇదే మంచి యదు ననుకొని యొద్దలేకపోయినను శ్రమతో పోగుచేసికొని రూపాయల నోట్లను దండలుగా గుచ్చి నాట్యకాంతల మెడలలో స్వయముగా నలంకరణచేసి రసికు డొకడు చప్పట్లు గొట్టును. సమయనిరీక్షణతో న్ద్రులుసాచి యగచాట్లకు గుఱియైన ప్రేక్షకు లమితానందముతో చప్పట్ల ప్రమోతలు మిన్ను ముట్టచేసెదరు,

తిరుణాల నిజస్వరూపమును గుర్తించువా రరుదైరి. తిరుణాల నిజస్వరూప మేమో కాదు. బంధువులను మిత్రుల నొకేసారి దర్శించుట సంభవింపదు. దర్శించవలెననిన నెంతో శ్రమ, యెంతో ధనవ్యయము, ఆకష్టనష్టములులేక మన మందరము నెక్కడెక్కడో నివసించుచు నొకేరోజు, పవిత్రక్షేత్రమున దేవుని సన్నిధిలో ఇట్లు సమావేశమె, మనము యెవరెవరి ఈతిబాధ లెట్లున్నవో తెలిసికొని శక్త్యాను సారము సహాకరించవలెను. దేవుని విషయము సంపూర్ణముగా తెలిసి కొని యాచరణతో నాత్మానందమును పొందిన వ్యక్తు లజ్ఞాన దశలో పరుగులుదీసెడి తన సోదర సోదరీమణులకు వైరాగ్య ప్రబోధముచేసి

వారిహృదయములకు ప్రశాంతిని చేకూర్చువలెను. రకరకములసంస్కార ములుగల ప్రజలందరు శివరాత్రి జాగరణ నిర్వహించెదరు.

ఈ జాగరణ పదార్థ పరమార్థమెంత సదాశయ సంపత్తి ప్రబోధము చేయుచున్నదో విజ్ఞులకే యెరుక.

జాగరణ యనగా, మేలుకొనుటయనెడిలోకోక్తి. సర్వప్రాణులు మాయానిద్రలో మునిగితేలుచు సతమత మగుచున్నారు. మనముందు వారెందరో మనవలె విర్రవీగి క్షణికమగు నీప్రపంచ భ్రాంతితో కంటికి గోచరించెడి ప్రతివస్తువును నిత్యము సత్యమని నమ్మి చివరకు మోసపోయిరి. అసత్యమగు నీ ప్రపంచమును సత్యమనుకొనుట, సత్యమై వెలింగెడి పరమాత్మ నసత్యమను భ్రాంతియే! ఇదే మాయ యనబడును.

అట్టి వట్టిమాయను తెలిసికొని జాగ్రతతో సత్ప్రవర్తనముతో, సాధుభావములు గలిగి చరించిననాడే నిజమైన జాగరణ ఫలితమును పొందినవారయ్యెదరు. ఈజాగరణ రహస్యమును మరచి రెప్పలార్పక మేల్కొనినను, మేలుమాత్రము శూన్యము. వంటికో, కంటికో జబ్బు ర్పడును. మానవత్వమును మంటగలిపి దానవత్వమునుపొంది మాధవత్వమును మరచి యజ్ఞానమార్గమున పరుగులు దీసెడి మానవులు తమ తప్పులసుగుర్తించి తామొనర్చిన పాపములకు పశ్చాత్తాపమునుపొంది యావేదనతో ధర్మపథగాములై తమజీవితములను సార్థకత నొందించిన నాడే శివరాత్రి జాగరణ సత్ఫలితమును పొందెదరు. ఈభవ్య దివ్య నవ్యస్థితిని పొందక యెన్ని సంవత్సరములు జాగరణలు చేసినను రెంటికి చెడినవారై ఇహమునకు పరమునకు దూరులై కాళ్ళ తీపులతో కళ్ళ మంటలతో పాపపుమూటలతో స్వగృహములకు చేరుచుందురు.

— ० —

# అజ్ఞాని -సుజ్ఞాని, సంసారము - సన్యాసము

"అజ్ఞులదృష్టికి – విజ్ఞులదృష్టికి నెంతో వ్యత్యాసమున్నది. అజ్ఞుల దృష్టిలో ప్రకృతి వికృతిగా మారును. విజ్ఞులదృష్టిలో ప్రకృతి వికృతి యీ రెండును, దైవాకృతివలె దోచును.

అజ్ఞాని : సత్యవస్తువగు పరమాత్మను తెలిసికొనక యంతయు తెలిసినవానివలె తిరుగుచు ప్రకృతిని జయించ శక్తిలేక ప్రకృతి విషయ లోలుడై తృప్తిని బడయక దినదినమునకు నాశను పెంచుకొని, రెప్ప పాటున మృత్యువున్నదని గుర్తించక గొంతెమ్మకోరికలతో గాలి మేడలు నిర్మించుకొని హద్దులనుదాటి యాత్మస్తుతితో, పరనిందతో కాలమును వెళ్ళబుచ్చును, వేదవిజ్ఞానమంతయు కరతలామలకము, నాకు దెలియని దేమున్నదని పుణ్యపురుషుల పుణ్యస్థలముల దరిదాపుల కైనను వెళ్ళక స్వప్రజ్ఞతో సర్వవిషయములను తనకుతానే సమన్వయ పరచుకొని యంతయు నిచ్చటనే యున్నది యీచోటు వీడినతజి యేమగునో ఏరికి తెలియదనుచు, పండితప్రకర్షలతో సంస్కృత మూలగ్రంథములన్నియు మామూలనున్నవనుచు, తోటివారిచే మెప్పు వడయుచు తనపైగల కప్పును తొలగింప యత్నించతి వాచా వేదాంత ములను యుపమానములతో వల్లించివల్లించి కాసులను ఖర్చుచేయక నిల్వచేసికొనుచు, నిదేశ్యయమని నమ్మినయాపై సేనియు ధర్మకార్య ములకు వెచ్చించక దినదినము క్షీణించెడి యాయువుమాట మరచి, మనుమల మనుమరాండ్రపై నాటిన మమకార మణగించుకొనుటకు యత్నింపక తన తలపై నంటి వెంటతిరిగెడు నకాలమృత్యువుమాట మరచి, మానవజీవిత మనుగడను దూరముగా గెంటి, శరీరభ్రమతో శరీరస్థితిని పూర్తిగా మరచి తన సంఘమని, తన ప్రాంతమని, తన వంశీయులని, తన తనయులను మమకారములతో తన నిజాకారమును దర్శించుటకు బదులు, కాలక్రమమున శవాకారములను దర్శించుచు

శివమై వెలుగవలసిన తాను శవమై యీ భువి నశించును. జీవిత మంతయు కృషిసల్పిన వేదపఠనము, తర్క వితర్క కుతర్క వాదముల ఫలితము. దేశదేశములు పర్యటనముచేసి యార్జించిన సువర్ణ మణిమయ కంకణాదులు సర్వమును శవాలంకారములై నిరుపయోగమైనవి. ఇట్టి ప్రవర్తనగలిగినవా రెవరైనను నజ్ఞానులే! వీరినే శాస్త్రములందు శూద్రులనిరి.

సుజ్ఞాని: పిపీలికాది బ్రహ్మపర్యంతము పరమాత్మ వ్యాపించి యుండెను. సర్వభూత సమవర్తి శ్రీహరి. అట్టి హరిదర్శనమును పొంద వలె నను వ్యక్తి భయము భక్తి గలిగి, ప్రతి స్వల్పవిషయమునకు కర్మ బద్ధుడుగాక ధర్మబద్ధుడై సూక్ష్మబుద్ధితో పరిశీలనచేయుచు, నొరు లొనర్చిన తప్పులను మన్నించి, స్వార్థమపేక్షింపక వాని సద్ధర్మమును నిర్వహించుచు జాగరూకుడై, యొరుల రక్షణకు తాను కష్టనష్టములకు గురియై ధీరగుణముతో సర్వము నెదుర్కొని కులమతవర్గ విభేద రహితుడై దైవదృష్టితో సదా దైవభావనగలిగి, శక్తివంచనలేక స్వార్థత్యాగులను సంరక్షించుచు సద్గురువుల పూజించుచు 'సంసారము, సారహీనము-సన్న్యాసము సర్వశ్రేష్ఠ'మని తెలిసి మాయానిద్రనుండి మేల్కొనుటకు గట్టి ప్రయత్న మొనర్చి రాజమార్గమున పయనించి రాజరాజేశ్వరునిపొంది నిత్యానందుడై స్వయంప్రకాశముతో వెలిగెడి వారే సుజ్ఞానులు. వీరినే శాస్త్రములందు బ్రాహ్మణులనిరి.

సద్గురువులందరు ప్రబోధముచేసిన దొకటే ధర్మసూత్రము. "సంసారము బంధహేతువు - సన్న్యాసము బంధమోక్షము."

సంసారమనగా నేమి - సన్న్యాసమనగా నేమి?

సతీసుతులు లేకపోయినను, బ్రహ్మచారినని ముద్ర వేసికొన్నను, నాశ్రమాదులు స్థాపించినను, నరణ్యము చేరినను, హరిభజన లొనర్చి నను, రాత్రింబవళ్ళు గీతాశాస్త్రాదులను పఠించినను, తీర్థయాత్రలు

సేవించినను, శిరోముండనము గావించినను, మహాక్షేత్రములలో కోటి బిల్వార్చనలు సహస్ర ఘటాభిషేకములు, యజ్ఞకర్మలు, నిత్యాన్న దానములు, కవిపండిత సత్కారములు, నోకళేమి, ప్రపంచమునగల సత్కార్యము లన్నియు సంపూర్తి గావించినను, వాని మనస్సు మాత్రము సదా యర్థమునకో యారోగ్యమునకో యశస్సునకో ప్రాకు లాడుచుండినచో సంసారియే యగును. ఇట్టి సంసారి హృదయము వినిర్మలముగా ప్రకాశింపదు. తన్ను తాను రక్షించుకొనలేని ఈకాంగ సన్యాసులు, సామాన్యులగు సంసారుల నేమి యుద్ధరించగలరు! ఇదంతయు పచ్చి మోసమని విజ్ఞులగు నాత్మసోదరులెల్లరు త్వరితగతిని గుర్తించగలరు.

భార్యా పుత్రుల గలిగి సంసార వ్యాసంగములతో 'ఉదరపోష ణార్థం – బహుకృతవేషం' అనెడి లోకోక్తి ననుసరించి వేషములు వేసినను, వ్యాపారోద్యోగము లొనర్చినను, తాను తానుగానుండి శరీరపోషణకొరకు జీవయాత్రసాగించుచు, నీమేనులోగల, తానెవరనెడి విచారణతో నైహికవిచారము నంతముచేసి, యాత్మానందముతో సర్వమానవసౌభ్రాతృత్వము గలిగి సర్వమతసమత్వదృష్టితో నందరిని ప్రేమించుచు కొందరిని పూజించుచు ననిత్యభోగములను త్యజించి, మితాహారియై మితభాషియై యాశలను పెంచుకొనక క్రమదాంపత్య ముతో, సంసారమును స్వర్గముగా మార్చి, దేహమునే యాలయము చేసికొని తన్ను తాను గుర్తించి యాదర్శభావముల నలవరచుకొని, స్మరణ ధ్యాన భజనాదులు క్రమశిక్షణతో నిర్వహింపుచు, నాడంబర రహితుడై జీవితము క్షణభంగురమని తీవ్రముముక్షుత్వమును పొంది, దైవీముహూర్తమున లేచి, పద్మాసనాసీనుడై వెన్నెముకను చక్కగా నిల్పి ప్రణవధ్యానములతో విషయేంద్రియ ప్రవృత్తులను నిరోధించి, మనస్సును భ్రుకుటియందు నిల్పి సంకల్పరహితుడై యాత్మానందుడై యోగానందుడైన వ్యక్తి సంసారమందున్నను సన్యాసియే!

# శ్రీ భక్త కవి రాజత్రయము

ప్రపంచోద్ధరణకై శ్రీకంచర్ల గోపరాజు, శ్రీకాకర్ల త్యాగరాజు, శ్రీ బమ్మెర పోతరాజు లెంతో కృషిచేసిరి.

శ్రీకంచర్ల గోపరాజు: భద్రాద్రిలో శ్రీరామాలయము కట్టించెను. ఆరామాలయమే గోపన్న హృదయము. రాత్రింబవళ్లు ప్రపంచ వ్యామోహములకు గురియై సంసారమనెడి యుచ్చుల కళ్ళెమున జిక్కి విడివడు శక్తిలేని ప్రజాసమూహము నుద్ధరించుటకు భద్రగిరిపైతమ్మల దమ్మక్క యారాధించెడి శ్రీసీతారామలక్ష్మణ విగ్రహముల కచ్చెరు వొంది శాశ్వతముగా ప్రజలందరు సగుణోపాసనతో నిర్గుణబ్రహ్మమును పొందుటకు సులువుగా మణిమయ ప్రాకారమంటప గోపురాదులను నిర్మించి మూర్తులను స్థాపించి వివిధోత్సవ సేవాకైంకర్యాదులు విధిగా జరుగునట్లొనర్చి, తనదేహము రామునిగేహముగా మార్చిరి. ఆత్మను పరమాత్మయం దంతర్లీనమొనర్చెడి స్థానమే యాలయము. గోపన్న గారి హృదయపీఠిపై శ్రీసీతారామలక్ష్మణ మూర్తులు స్థాపించి యారాధించి యాత్మానందముతో శ్రీహరిసాయుజ్యమును పొందిరి.

శ్రీ రామదాసుగారి యాత్మదృష్టికి రాము డనగా, అయోధ్యలో రాజైన దశరథునకు జన్మించిన బిడ్డడు కాదు. రాము డనగా స్వప్రకాశముతో వెలింగెడి యా పరతత్త్వ స్వరూపము. లక్ష్మణు డనగా నారామబ్రహ్మను పొందుటకు, శక్తిలేక దూరముగా నుండి యావేదనతో పరితపించెడి జీవుడే లక్ష్మణుడు. సీత యన యెవరను కున్నారో !

సంసారారణ్యమున పర్యటనము చేసెడి పరమాత్మ జీవాత్మల మధ్యనున్న మహామాయయే సీత.

ఇందుకు ప్రమాణముగా, రామాయణమున నరణ్యసంచార సమయమున రాముడు, రాముని వెంట సీత, సీత వెనుక లక్ష్మణుడు

వెళ్ళుచుండిరి. లక్ష్మణస్వామి శ్రీరామదర్శనమును పొందలేక "అన్నా శ్రీరామా! నీ దర్శనము నాకెంతో దూరమైన" దనిరి. వెంటనే శ్రీరామచంద్రమూర్తి "ఓయీ లక్ష్మణా! పొరబడుచున్నావా, నీ కతి సమీపమందే యుంటిని. ఐనను నన్ను దర్శింపవైతివి. నా – నీ మధ్య సీతయున్నది. ఆ సీతను ప్రక్కకు తొలగమని ప్రార్థింపు" మని చెప్పిరి. తక్షణమే లక్ష్మణస్వామి "ఓ అమ్మా! సీతమ్మా! ప్రక్కకు తొలుగు" మని ప్రార్థించెను. లక్ష్మణుని ప్రార్థన నాలించి వెంటనే పాలించెను. మధ్యనున్న సీత ప్రక్కకు తొలగగనే లక్ష్మణుడు డపరిమితానందముతో శ్రీరామ సాక్షాత్కారమును పొందెను.

ఈ రామాయణ కర్తయగు శ్రీ వాల్మీకిమహర్షి యీ చిన్న విషయము నెందులకు చెప్పిరో విజ్ఞులకెరుక.

మానవ దేహారణ్యమున చరించెడి దేవునిదర్శనము కావలె నన్నచో, జీవుడు మాయను దాటి సహస్రారమున ప్రకాశించెడి యాత్మ జ్యోతిని గాంచవలెను. మాయను దాటుటకై యత్నింపక దాని కను గుణముగా తిరిగెడు మానవు డనేకజన్మము లెత్తుచు గర్భనరకము ననుభవించి దరిలేని సంసారజలధిలో కొట్టుకొనిపోవును.

ఈ పవిత్రాశయ సిద్ధికొరకే గోపన్న, భక్తరామదాసుగా మారి భవబంధమును త్రెంచి జీవితాంతమువరకు రామనామస్మరణ లతో భజనలతో ధ్యానముచేసి, గానముచేసి, నిర్యాణసమయ మందైనను రాముని మరువక 'కరిమ్రింగిన వెలగపండువలె' సంసారచింత యణువైనను లేక శ్రీరామపరబ్రహ్మమును పొందిరి.

సీతవంటి భార్య లభించుట దుర్లభము. కైకవంటి భార్య దొరకుట సులభము.

శ్రీ కాకర్ల త్యాగరాజు: ఈ మహనీయమూర్తి శ్రీరామ పరబ్రహ్మ యదార్థస్వరూపమును రాగతాళ లయాదులతో వేలకొలది

కీర్తనలను రచించిరి. తాను రచించిన కీర్తనలను తానే గానమొనర్చి, తనలోనున్న తానే యానందమును చెందిరి. తనలోనున్న తానానందించినతఱి ఈ ప్రపంచపు బాధలన్నియు గుమిగూడి యాహ్వానములు చేసినను భయపడక వానిని గేలిసేయుచు 'రండి! రండీ!' యని యాహ్వానించుచు భక్తితో దరిద్రదామోదరుడయ్యు నఖండానందముతో బాష్పపూరిత లోచనుడై తంబురశ్రుతిని మేళవించుచు శ్రీరామునిముందు నృత్యమొనర్చి తన్మయులై మేను మరచెదరు.

తిరువయ్యార్ గ్రామవీధులలో శ్రీరామకథారచన గేయ గానముతో భిక్షాటనసేయుచు నెవ్వరి నడుగక తెచ్చి యిచ్చెడి భిక్షను స్వీకరించుచు సదా శ్రీరామ స్వరూపమునే వీక్షించుచు సర్వమానవ హృదయములయందు శ్రీరామజ్యోతిని దర్శించుచు మహారాజుల యాహ్వానపత్రికలను తృణములని భావించి తన వేలాది కీర్తనలను భగవదంకితమొనర్చి జీవయాత్ర సాగించిరి.

సదా ప్రతిధ్వనించెడి యా శబ్దబ్రహ్మము నేనే! నాదమే పరబ్రహ్మ స్వరూపము. నాదబ్రహ్మమునందు మనస్సును లయమొందించవలెను. సర్వభూతాంతరాత్మయగు పరమాత్మను పొందవలెను.

ప్రపంచరాగములను పోనాడి భవరోగమును నశింపచేయుటకై యనురాగముతో రాగాలాపనచేసిరి. ఆ రాగాలాపనయే ప్రాకృత రోగాలను నశింపచేయును. మేను మరచి మనస్సును భ్రుకుటియందు చేర్చి ప్రణవనాదానందుడై వెలసిననాడే సంగీతమును తెలిసినవాడగును. ఇట్టి సంగీతామృతమును పానముచేసి కటిక దారిద్ర్యముతో శ్రీరామనామజపము తొంబదియారుకోట్లు జపించిన భక్తమూర్తి, విజ్ఞాననిధి త్యాగమూర్తి. త్యాగరాజస్వామి తమ నామమును సార్థకముచేసిరి. సర్వసంగపరిత్యాగముచేసిన త్యాగరాజులు వీరే. వీరికి వీరే సాటి. జీవితరథమున ధర్మపథమును నొడుదుడుకులు లేక నడిపించిన యమరమూర్తి.

శ్రీ బమ్మెర పోతరాజు : ఈ మహనీయమూర్తి 'ఒంటిమిట్ట'యం దవతరించి శ్రీరామచంద్రుని చరణారవిందములను భక్తితో పూజించుచు గృహస్థ జీవనముతో పగలంతయు క్షేత్రములను దున్ని రాత్రియంతయు భక్తి జ్ఞాన వైరాగ్యతత్త్వముతో ముక్తిని బడయ వచ్చు ననెడి పరమసత్యమును గద్యపద్యములతో కూర్చి, పేర్చి లోకమునకు మహోపకార మొనర్చిన త్యాగమూర్తి. కలము - హలము వీరి కత్యంత ప్రియమైనవి. వీరి మధురమోహన మంజుల ముగ్ధశైలిని చవిచూడనివారుండరు. ఇట్టి మహనీయుని దారిద్ర్యదేవత వరించినది. వరించి తరించినది. జీవితమంతయు కృషిచేసి, యొక్కొక రక్తపు బొట్టుగ నొక్కొక్క పద్యమును రచించి మానవులకు మహోపకారము చేసిరి. రత్నపురాసులను చూపిన మహారాజులకు పాత్రము నంకిత మివ్వక యా పంటపొలంతి యల్లునకే భాగవతము నంకితమిచ్చి వీరి జీవితమును సార్థకమునొందించిరి. గోపరాజు - త్యాగరాజు - పోతరాజై వెలసినది యా మహాశక్తి స్వరూపిణియగు పరతత్త్వమే !

ఆ పరతత్త్వమును పొందునంతవరకు మానవులు జరామరణ భయములను పొందవలసినదే !

ఇంట్లో బలము ఒంట్లో బలము జారిపోయినతరి, మానవుడు సోలిపోయి తూలిపోయి కూలిపోయి చివరకు కాలిపోవును. ఈ వాక్యముల సారము గ్రహించి, క్రమబద్ధమైన జీవితమును నడుపుకొనుటే మానవత్వము. ప్రకృతిని నమ్మి మోసపోయెదవు. పరమాత్మను నమ్మక నాశనమయ్యెదవు. జీవితమున నెన్నియో పెనుతుపాను లెదుర్కొనును. సుడిగుండములు సంభవించును. ఎన్ని సంభవించినను భారము భగవానునిపై నిడి పురోగమించుటే మానవకర్తవ్యము.

'ఆలసించిన నాశాభంగము' 'మంచి తరుణము మించిపోవును' నాటిమాటికీ నీ నరజన్మ లభించునదికాదు. బహుజన్మ సుకృతఫల

ముచే లభించినది. త్వరగలో సద్గురువుల పంచ జేరి, యీ మాయనిద్ర నుండి మేల్కొని జగన్నాధునియం దేకీభవించుటకై ప్రయత్నింపుము. మహర్షుల వాక్యములను శిరసావహించి, నిన్ను, నీవు తెలిసికొనుటకై యత్నింపుము. సద్గ్రంథములను మహనీయుల జీవితచరిత్రలు నహరహము పఠింపుము. సద్గ్రంథాదేశములను సద్గురువుల సత్యప్రబోధములను శక్తివంచనలేక యాచరణలో నుంచుము. సత్యసూక్తులను నిత్యము పఠింపుచు నాచరించి యనుభూతి నొందిననాడు జానివయ్యెదవు. అంతవరకు నజ్ఞానివే !

అజ్ఞాని సుజ్ఞానమును గ్రహించలేడు. సరసమార్గము ననుసరింపక, విరసమగు వక్రమార్గమున పరుగులు తీయసాగును. ఆచరణ వేదాంతమును వీడి, వాచావేదాంతములతో తాత్కాలిక గౌరవములను పొందుచు నంత్యమున, నశాంతిని పొందును.

వేదవేదాంగములు చదివినను, ధనకనకవస్తువాహనము లార్జించినను, పుత్రపౌత్ర దాసనాసీజనంబు లున్నను నాత్మకు ప్రశాంతి లభింపదు.

ఆత్మశాంతిని పొంది యానందమయుడవై విలసిల్లవలయు ననిన నివిమాత్రము తప్పక తనలో ప్రకాశింపవలెను. 1. సత్ప్రవర్తనము 2. సదాచారము 3. సజ్జనమైత్రి 4. సద్గ్రంథపఠనము 5. సత్యదృష్టి 6. సాధుపూజ 7. సత్పాత్రదానము 8. సర్వేశ్వరభక్తి యనెడి నవ రత్నములను పొందినవ్యక్తి శక్తి, రక్తి, ముక్తి యందర కాసక్తియై వెలుగొందును.

ఆనందదూరుడవై యహంభావముతో, నన్యాయముతో నక్రమముతో, నసత్యము లాడుచు పోమరివై నిన్ను నీవే పొగడుకొనుచు, బలహీనులపై కురుకుచు, కారుకూతలు గూయుచు, చేయరాని కార్యములు చేయుచు నవరాని వినరాని మాటలతో తిరిగెడి పరమ నీచుల ప్రభావము గాలిలో దీపమువలె, నేనాడో యొకనాడంతరించును.

రంకెలు వేసెడి ఓ మూఢ మానవుడా ! దైవదూరుడవై యీ ప్రపంచమున నెన్నాళ్లు మనగలవు. దైవవాణిని ద్రోసిపుచ్చి యేమి సౌఖ్యమును పొందగలవు. వృథాభ్రాంతులు వీడి సరియైన మార్గమునే పురోగమింపుము. సచ్చిదానందమగు పరతత్త్వమును పొందుము. ఇంద్రియ కింకరుడవై పరిభ్రమణము చేయుటకంటే, ఈశ్వర కింకరుడవై విషయేంద్రియ ప్రవృత్తులను జయింపుము. అహంకార మమకారముల నావలను గెంటి ఇంద్రియాశ్వముల పగ్గాలను నీ హృదయేశ్వరుడైన హృషీకేశున కప్పజెప్పుము. నిస్సంగుడవై నిర్భయుడవై జీవిత సంగ్రామములో నిలిచి విజయుడవు కమ్ము.

మానవ జీవితము గాలిలోని దీపమువంటిది. మెరపుకాంతివలె జలబుద్బుదము రీతి, యన్యాయార్జితమువలె, కులమత తత్త్వములతో పెనుగులాడెడి పండితప్రకాండుల యశస్సులవలె మనకు చెప్పకయే యింటనో బయటనో నేడో రేపో కాలగర్భమున విలీనము కాగలదు. పనికిమాలిన యీ పాడుదేహములో నెందరో శత్రువులు మకాము చేసినారు. ఆర్గురు రాడించెడివారు. ముప్వురు ముంచెడివారు. ఏడ్గురు రేడ్పించెడివారు. ఎనిమిదిమంది వెతలు బెట్టెడివారు. పదుగురు ప్రక్కకీడ్చెడివారు. ఐదుగురు కావలివారు. ఇర్వురు వచ్చిపోయెడి వారు. ఒకడు బిక్కుబిక్కు మనువాడు. ఈ వక్కటిని తెలిసికొనుటకే యీ గ్రంథమంతయు వ్రాసినది. విజ్ఞులైన వారెల్లరును గ్రంథవిషయములను పఠించి, యందలి సారమును గ్రహించి ప్రయత్నముతో శ్రీ సద్గురు ప్రబోధామృతమును పానమొనరించి సర్వబంధములను వీడి ప్రశాంతచిత్తులై, యాత్మసాక్షాత్కారమును పొంది దైవస్వరూపులై ప్రకాశించెదరు గాక !

— o —



# తాత - మనుమడు

గుంటూరుజిల్లా వినుకొండ తాలూకలోగల పెద్దకొండాయపాలెము గ్రామము నందు నివసించుచు స్వయంకృషితో, శక్తితో, భక్తితో, ధైర్యోత్సాహపూరిత హృదయులై, గ్రామపౌరులైన రైతునాయకుల యాదరాభిమానములకు పాత్రులై, చిన్నవ్యాపారముతోడనే దైవకృపతో ధనవంతులై పరిసరప్రాంతములందుగల వైశ్య పెద్దలకు ఋణములొసంగి ధీరతతో రావలసిన ధనమును సేకరించుచు శ్రీ రామనామ ధ్యానపరాయణులై సుఖజీవనులై శ్రీ కోట రామయ్య శ్రేష్ఠిగారు వెలుగొందసాగిరి

సాత్త్విక తాత్త్విక మూర్తియైన కోట లక్ష్మీనారాయణ శ్రేష్ఠిగారిని దత్తతగా తీసికొని కాకుమాను వంశ సంజాతయగు శ్రీ వేంకమ్మ యను బాలకామణిని వివాహము చేయించి ఆనందహృదయులైరి.

ఈ పుణ్యదంపతులకు ఈగ్రంథరచయిత తొలికానపుడ్డడై పెరిగిపెద్దయైవిద్యాబుద్ధులను వడసి గురువులకృపకు శ్రీ సద్గురు కృపాశక్తికి, తాతగారి శుభాశీర్వాదములకు వెల లేనిప్రేమకు పాత్రులై కథకుడై కవియై మహాకవులాశీర్వాద సహిత సన్మానములను పొందిరి. అఖండ తపోనిధులైన శ్రీ శ్రీ శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామి వారి కరుణాశీర్వాద మహామంత్ర దీక్షనుపొంది శ్రీ నృహరి పాదసేవ భక్తిపరా యణులై ఈ గ్రంథరచనమును పూర్తిచేసి భక్తమూర్తుల విరాళద్రవ్య సేకరణముతో తెనాలిలో శ్రీ సప్తగిరి ఆర్ట్ ప్రింటర్స్ వారిచే సుందరముగ ముద్రణచేయించి విరాళ దాతలందరికీ పొత్తములను సమర్పించ సంసిద్ధులైరి

తాత :- శ్రీ కోట రామయ్య శ్రేష్ఠి గారు

మనుమడు :- కోట సుబ్బారాయ గుప్త (భాగవతార్)

# "దానము - ధర్మము"

అనెడి పదముల యర్థములు వేఱు.

ఆకలిచే నకనకలాడువాని కింత సాదమును ప్రసాదించుట, ధరించుటకు వస్త్రములులేక యెండకు వానకు చలికి తట్టుకొనలేక పరితాపము నొందెడి నిరుపేదలకు వస్త్రము లొసంగుట, అగ్నికాహుతియైన గృహములను నిలబెట్టుకొనుటకు శక్తిలేని బీదప్రజలకు ధనమొసంగుట, చదువుటకు కావలసిన గ్రంథములు, పాఠశాల ప్రవేశమునకు చెల్లించవలసిన ధనము లేక విద్య విరమించుకొనెడి బీదవిద్యార్థులకు ధనసహాయము చేయుట, జీర్ణములైన దేవాలయ సత్ర మఠ కూపాదులను పునరుద్ధరణ మొనర్చుటకు ధనమర్పించుట, నూతన నిర్మాణములొనర్చెడి గుడులకు, సత్రములకు, గోపురములకు తదితర కట్టడములకు విరాళము లర్పించుట. విద్వత్కవి గాయకాది పెద్దల సన్మాన గౌరవ కార్యక్రమనిర్వహణములకై కార్యకర్తలకు ధనము సమర్పించుట, ఏకాహసప్తాహాది దైవకార్యములు సంపూర్తి నొందుటకై, నరులు త్యాగహృదయులై భక్తితో ధనమును కార్యనిర్వాహకులను పలుసార్లు త్రిప్పక వెంటనే సమర్పించుట, విద్యాసంస్థలకు, గొప్పచదువు లధ్యయనము చేయుటకు కావలసిన కట్టడములకు ధనమొసంగుట, "దానము" అని తెలియవలెను.

దాన కర్మములకన్న మిన్నయై ధర్మకర్మ వెలుగొందుచున్నది. ఐనను ధర్మకర్మయొనర్చెడి నరులు చాల తక్కువసంఖ్యలో గలరు. ఈ లోకమునందుగల నరులు వారి వారి శక్తుల కనువైన కర్మముల నెన్నింటినో యొనర్చి ధనార్జనముచేసి ధనవంతులై నూతన భవన నిర్మాణములొనర్చి సుఖములను చూరగొనుచున్నారు.

నరుని పూరిపాక-సావిడియై, సావిడి-మిద్దెయై, మిద్దె-మేడయై, మేడ-మహేంద్రమందిరమై పరిణామమెందుచున్నది. ఇది నరుని తెలివి యుక్తి ధీశక్తి భక్తి పలుకుబడి పరపతి యోర్పు నేర్పు వాక్పటుత్వము, ధైర్యము కాజాలవు. నరుడొనర్చిన సత్కర్మల ఫలము. సత్పాత్రదానమహిమ. నీతినిజాయతీలశక్తి, శ్రీ గురుహరిహరబాబా నరహరి శక్తి మూర్తులను నియమబద్ధముగా పూజించి సేవించిన ప్రభావము, గతమునందొనర్చిన పుణ్యకర్మల ఫలానుభవము, మహాత్ముల లాశీర్వాదముల బలము కలసి యొక్కటియై వెల్గొందుటయే పూరిపాక మహేంద్రమందిరమై భాసిల్లుటకు కారణమై కన్పించుచున్నది.

ఈ లోకమునందు ధనముగల మానవులలో, ఆస్తికబుద్ధి దైవభక్తి త్యాగహృదయము దూరదృష్టి చిన్నపెద్దల తారతమ్యము, సత్యాసత్యకర్మముల వివరణము తెలిసికొనెడి సూక్ష్మబుద్ధి, సాహిత్యపు లోతులను, వానియందుగల గంభీరభావములను, గుర్తించి యానందమనుభవించెడి సుసంస్కార సంపత్తి బహు కొద్దిమందికి మాత్రమే గలదు. ఆ కొద్దిమందిలో మూడు భాగములు దానము చేయువారే. "ధర్మము" అనుష్ఠించెడి నరులు నూటికి పదిమంది గలరు.

"దానము" ! నరులు తమకుగల వస్తుసంపదలో తమతోడి నరులకు వొసంగునది. "ధర్మము !" నరులు తమతోడివారికి వొసంగునది కాదు. ఒసంగుటకు వీలులేదు. ధర్మము యెవ్వరికివారే తెలిసి తామొనర్చెడి నిత్యజీవిత జీవనకర్మములలో మేళవింపచేయునది.

దానముకంటె ధర్మమే గొప్పదని చెప్పక తప్పదు. నరుని ధర్మానుష్ఠానమునకే దానాది కర్మములన్నియు పెద్దలచే నిర్ణయింపబడినవి. ఆలయ ప్రాకారగోపుర మంటపాదులందు, యజ్ఞయాగములందు, పవిత్ర తీర్థయాత్రనదీస్నానాది సంకల్పములయందు నిత్యము

యాస్తిక నరులొనర్చెడి కర్మములలోని రహస్యము, ప్రధానధ్యేయము, ధర్మానుష్ఠానమే యని పెద్దలెల్లరకు తెలిసినదే !

ధర్మమునగా నేమి ? అర్థ, కామ, ములందుగల యాసక్తిని క్రమబద్ధమొనర్చి, నరు డెక్కడనుండి యిక్కడకు దిగివచ్చెనో ? ఇక్కడనుండి యెక్కడ కేగుచున్నాడో ? ఈ రెంటి రహస్యమును యథాతథముగా తెలిసికొనుట తెలిసి తగిన కర్మాచరణ మొనర్చుట, కర్మలలోని మూలరహస్యములను నరుల హృదయముల కవగత మొనర్చుటాదిగాగల కర్మములన్నియు ధర్మకార్యములే ! పుణ్యకార్య ములే ! దైవకార్యములే !

నరుల స్థితిమతి గతుల స్వరూప రహస్యములను తెలియజేసి వారి మనస్సులను కర్తవ్య కర్మల వైపునకు మరలింపజేసి పురోగతులను కల్పించి పురాణపురుషుని చైతన్యశక్తితత్త్వము నందు తాదాత్మ్యమొందుటకు 'కర్మసిద్ధాంత రహస్యము'లను బోధించెడి వ్యాససముదాయమును భయముతోకూడిన భక్తితో చలనములేని మనస్సుతో క్రమశిక్షణతో నిత్యము పారాయణ మొనర్చి యందుగల భావములను జీవితాచరణములం దుంచి సత్యశిఖరము చేరుటయే ప్రతి నరుని ప్రధానకర్తవ్యము. స్త్రీ, ధన, సంతతిపై గల వ్యామోహమే నరుని ధర్మమునుండి దైవమునుండి దూరముగా గెంటివేయబడుచున్నది.

ఉపాస్యదైవశక్తితో కవులు యఖండకృషితో లోకోపకారము లైన గద్య పద్య రచనములను సంపూర్తినొందించినను తద్రచనములు ముద్రితములై ప్రజాహృదయముల కానంద రససిద్ధిని వైరాగ్యశక్తిని చేకూర్చుటకు త్యాగమూర్తులైన భక్తజనుల ధనమే మూలము

సమాజక్షేమంకరములై ముముక్షు జనసంసేవ్యములై భాసిల్లెడి ఆధ్యాత్మిక రచనముల ముద్రణములకై ధనమర్పించెడి ముముక్షువులైన భక్తమూర్తులనే ధర్మకార్యనిర్వాహకులని పెద్దలెల్లరు పేర్కొనిరి.

జూద చౌర్య వ్యభిచార సురాపాన అసత్యాది నింద్యకర్మలను చేయుటకు ధనమును దుర్వినియోగ మొనర్చు నరులెల్లరు తామశిక హృదయులు.

బాహ్యాడంబరముగా భౌతికరూపముతో వివిధభోగ కైంకర్య నైవేద్యమంగళనీరాజనములతో, 'నిత్యసత్యసనాతన శక్తియందు నరుడు చేరుటకే విగ్రహారాధన యనెడి రహస్యము విజ్ఞులకు తెలిసెడి రీతి, కన్పించుచు తాత్కాలిక మానసికానంద మొనగూర్చెడి దేవాలయనిర్మాణములకు, తదితరములైన సత్ర కూప తటాక వన మఠ నిర్మాణాది కార్యములకు, గంగమ్మ, యల్లమ్మ, గౌరి, నాంచారమ్మ, పోలేరమ్మ, మరిడమ్మ, అంకమ్మ, మహాంకాళి, ఆదిగాగల దేవతల పేర్లతో జంతుబలులొనర్చుచు మధుపానమాంసాది భక్షణలతో క్షుద్రగుణవికారప్రవృత్తితో దేవతారాధనము లొనర్చుచు ధనమును వ్యయమొనర్చెడి నరులెల్లరు రాజశికహృదయులు

సర్వజీవులు సర్వేశ్వరుని సంతానము. ఏప్రాణి కపకారము చేయరాదు. యెవ్వరిని ద్వేషించరాదు. దయ, అహింస, పరోపకారము, సత్యము, ధర్మము, దానము, స్వపరభేదములేని జీవనము. నామరూప భేదరహితదృష్టి, ప్రార్థన, ధ్యానము, నిష్ఠ, ముక్తికి సోపానము లనెడి సత్యసిద్ధాంత రహస్య విశేషవివరములతో తీవ్ర కృషితో లోకోద్ధరణ ధ్యేయముతో రచనము లొనర్చి ముద్రణ భాగ్యమునకు తగిన ధనములేక దేవుని ధ్యానించెడి కవుల రచనా ముద్రణ మహాకార్యమునకై విరాళము లర్పించెడి నరులు, సర్వసంగ పరిత్యాగహృదయముతో, సంయోగ వియోగ సుఖదుఃఖాది ద్వంద్వ సంకులసమరమైన సంసారమునకు, సంసారముపై గల వ్యామోహమునకు, ధనాకాంక్షకు పూర్తిగా తిలోదకము లిచ్చిన సాధుస్వాముల పోషణము లకై భక్తితో ధనమర్పించెడి నరులు, మాయానిద్రనుండి నరులను

జాగృతినొందించెడి భక్తి వేదాంతవిషయ వివరణములు గల పత్రికా సంపాదకులకు, చేయూతిగ ధనమొసంగెడి నరులు, ఆదర్శ భక్తి ప్రచారకులై స్వార్థరహితులై సంగీత సాహిత్య విశారదులై భగవద్గుణ గానమొనర్చెడి భాగవతులచే కథాగానములు చేయించి వారి శక్తికి తగినరీతిలో ప్రేమ భక్తివిశ్వాసములతో విరాళము లర్పించెడి నరులు, ఇట్టి సుసంస్కార సంపత్తితో మెలగెడివారు సాత్త్వికహృదయులు. ఈ సాత్త్విక హృదయులే ధర్మదైవ పుణ్యకార్య దురంధరులు. ఇట్టి పుణ్యహృదయులే సమాజమున కాదర్శమూర్తులు

తుష్టిగా పుష్టిగా ధనసంపత్తి యుండియు. విరాళము లర్పించెడి శక్తిగలిగియు కాదని నయోక్తిగ కుయుక్తితో సంభాషణములు సాగించి యర్థించవచ్చినవారిని వట్టిచేతులతో బంపించెడి నరులు లౌకిక హృదయులు.

ఇట్టి లౌకికజనులు భగవత్కర్మలకు, మహాత్ములకు, కవి కథక గాయకమణులకు, నామసప్తాహాది కార్యక్రమనిర్వాహకులకు బహు దూరముగ మసలుచు పైసలనే ప్రాణమని దలంచుచు సదా కాపలా గాయుచు సత్కర్మములకు దివ్యగానభజనాది కథాకాలక్షేపము లొనర్చెడి పరమభాగవతులకు ధనమును సమర్పించుటకు మనస్సొప్పక చింతలతో వంతలతో క్రుంగుచుందురు.

జనులు, లౌకికమైన బుద్ధితో దైవమును దలంచక యుక్తి శక్తుల బలముతో ధనమును దైవధర్మపుణ్యకార్యములకు సద్వినియోగ మొనర్చక దాచినను యా ధనమువలన వారికేవిధమైన సుఖశాంత్యా నందములు గలుగవు.

ఇట్టి లౌకికజనులకు మించిన మోసగాండ్రు కొందరున్నారు. పెద్దలు విరాళములకై తమ తమ గృహములకు విచ్చేసిన సమయము లందు విరాళములు వాగ్దానములొనర్చి గడువుసమయమునకు పెద్దలు

వచ్చిన వెంటనే వారితో "గురుభక్తులు గురుశిష్యులు మాత్రమే యిట్టి గ్రంథముద్రణలకై విరాళము లర్పించవలెను. గురుభక్తులుగాని వారివ్వరాదని తెలిసినది. యిచ్చే శక్తిలేక కాదని" దురూక్తులాడి నోటాడిన నుడికి తిలోదకము లొసంగి భాగవతాపరాధకులై ధనము మిగిలినదని సంతోషించెదరు.

భగవదపరాధకులనైన భగవానుడు క్షమించగలడు. భాగవతాపరాధకులను క్షమించడు. భగవద్భాగవతాపరాధకులైన నరుల యన్యాయార్జిత విత్తము సత్కర్మలకు సద్వినియోగము గాజాలదు. భోగాలులేని రోగములకు, కోర్టులకు, న్యాయవాదులకు, వైద్యులకు, వైద్యాలయ నివాసములకు, దుష్టసంతానము లొనర్చెడి దుందుడుకు కర్మలకు, దురాశతో సాగించెడి పెద్ద పెద్ద వ్యాపారనష్టములకు, ప్రభుత్వోద్యోగుల ఘనమైన పారితోషికములకు, కారణములేని కర్మ ప్రమాదములకు దుర్వ్యయమగుట తథ్యము.

ఈ చరాచర సృష్టిస్థితిలయ కర్తలకు కర్తయైన శ్రీ నృసింహ భగవానుని దివ్యకళావతారమూర్తి శ్రీ సద్గురు యోగానందనరసింహ స్వామివారి పరమపవిత్రాదేశ సందేశ మహామంత్రోపదేశములకు పాత్రుడై శ్రీ లక్ష్మీనృసింహభగవానుని మహాబలశక్తితో యీ రచనను సంపూర్తి నొందించిన కోట సుబ్బారాయగుప్త భాగవతుడు ఈ కర్మసిద్ధాంతరహస్య గ్రంథముద్రణార్థమై కర్తృత్వాకర్మనిర్వాహణముతో యీవేదనతో స్వయముగ దైవప్రేరణతో యాత్మనిశ్చయ జ్ఞానముతో శ్రీ సద్గురు కృపాబలముతో శ్రీ అష్టాక్షరీ మహామంత్ర జపానుష్ఠాన దీక్షాదక్షతతో తెలిసిన పెద్దల గేహములకు జని విషయము వినయముతో వారికి విన్నవించగనే వారి హృదయాంతర సీమలందు మహాప్రేరణ గలిగి ప్రేమ భక్తివిశ్వాసములతో విరాళములు యర్పించిన పెద్దలెల్లరు సాత్త్విక తాత్త్విక సంస్కార హృదయులు.

ఇట్టి సాత్త్విక తాత్త్విక సంస్కారహృదయులే భగవత్కృపా పాత్రులు. సాత్త్విక తాత్త్విక సంస్కారహృదయులైన నరులకు లక్షలు లేకపోయినను తోడివారిపై కక్షలులేక ధర్మస్వరూపుడైన దైవమొక్కడే సర్వసంరక్షకుడని ధర్మకర్మపరాయణులై లోకవ్యవహారములందు మెలగుచుందురు.

ఈ పుణ్యహృదయులు భక్తితో సమర్పించిన ధనవ్యయముతో నా యీ రచనమునకు ముద్రణభాగ్యము చేకూరినది. నా యావేదన శాంతించినది. నా కృషి ఫలించినది.

ఈ రచనాముద్రణాది ఖర్చులకై విరాళములను ప్రేమతో సర్పించిన భక్తమూర్తులు, త్యాగహృదయులు, ధర్మకర్మనిర్వాహకులైన పెద్దలకు, వీరి కుటుంబములకు రవి శశితారకముగ శ్రీ లక్ష్మీనృసింహభగవానుడు ఆయురారోగ్య భోగభాగ్య భక్తి జ్ఞాన వైరాగ్య తత్త్వముక్తుల నొసంగి సదా సంరక్షించుగాత !



399
48
447



# శ్రీ లక్ష్మీనృసింహ ప్రార్థన పద్యరత్న త్రయము

* శ్రీరమా హృదయేశు సర్వముని సంసేవ్యాంఘ్రి నీరేజునిన్
ఘోరాకార మహోగ్రహాక్షుభిత రక్షోరాజ-హృద్భాగునిన్
వీరున్ విష్ణు జ్వలంతు నుగ్రు నతిగంభీరున్-సభాస్తంభజున్
శ్రీరాజిల్లెడి మట్టపల్లి నృహరిన్ చింతింతు నశ్రాంతమున్ ....

* శ్రీలక్ష్మీరమణా! నిజాశ్రిత హృదార్తిధ్వంస దీవ్యద్గుణా!
బాలాత్యద్భుత భక్త దానవ సుత ప్రాణావనా! పావనా!
ఆలింపంగదె నాదుప్రార్థన మదాత్మానంత సింహాసనా!
పాలింపంగదె మట్టపల్లి నరసింహా భక్తరక్షాచణా!!

* శ్రీదేవీ హృదయాధినాథుని జగక్షేమాపహోదగ్ర, దైత్యా
ధీశాంతక చండభండన మహోద్యత్తాండవీ శోభితున్
వేదాద్రీనిలయున్ నృసింహుని జనాభీష్టప్రదాతన్
ఇదే చేదోడ్డై నిలువంగ మట్టపలివాసిన్ భక్తినర్చించెదన్.

రచన : పూజ్యశ్రీ శ్రీ కేశవతీర్థ స్వామివారు
శ్రీరామతీర్థ సేవాశ్రమము-పిడుగురాళ్ళ.





శ్రీ కటకము ఆంజనేయులు గుప్తాగారు
వీరిధర్మపత్ని శ్రీమతి వేంకాయమ్మగారు
ఆరేపల్లి ముప్పాళ్ళ

# మహారాజపోషకులు

గుంటూరు జిల్లా ఈపూరు తాలూకా ఆరేపల్లి ముప్పాళ్ళ గ్రామమున శ్రీ ఆర్యవైశ్యాన్వయమునందు శ్రీ ఐనకులగోత్రోద్భవులు శ్రీ కలకము బుర్రయ్యశ్రేష్టిగారు వీరి ధర్మపత్ని శ్రీమతి నాగమ్మగార్లకు శ్రీ వేంకటసుబ్బమ్మ, వేంకటసుబ్బయ్య, వేంకటేశ్వర్లు, లక్ష్మీనారాయణ, ఆంజనేయులు, వేంకటరామమ్మ యనెడు వారుద్భవమొందిరి.

శ్రీ ఆంజనేయులుగుప్తాగారు, శ్రీమతి వేంకాయమ్మగారు గత కాలమునందొనర్చిన పుణ్యకర్మలఫలప్రభావముతో సంసారమునందు సుఖ సంతోషధనకీర్తులను పొందుచు భక్తిగలిగి వర్తింపసాగిరి.

ఈ పుణ్యదంపతులు గ్రంథకర్తగారి రచనముసువిని ఆనందరస హృదయులైరి. శ్రీ సద్గురు యోగానంద నరసింహస్వామివారి మహా ప్రేరణతో శ్రీ ఆంజనేయులుగుప్తాగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకాయమ్మగార్లు ఆసక్తితో భక్తితో శక్తికి తగినరీతిగ రు. 516-00 లు. గ్రంథకర్తగారికి సమర్పించి జోహారులొనర్చిరి.

ఇట్టి త్యాగమూర్తులైన వీరికి, వీరి కుటుంబమునకు, వీరి బంధు కోటికి శ్రీ లక్ష్మీనృసింహస్వామివారు ఆయురారోగ్య, భోగభాగ్యములు భక్తి, జ్ఞానవైరాగ్యతత్త్వముక్తులనొసంగి సదారక్షించుగాత !

ఇట్లు

రచయిత

జయ జయ శ్రీ సద్గురు నృసింహాః

శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారి కళావతారమూర్తి, దివ్యతప స్సంపన్నులు, నిత్య సత్యసనాతన తత్త్వజ్ఞులు, బ్రహ్మచర్య దీక్షాధురంధరులు. నిరాడంబర నిష్కల్మష నిర్విచారహృదయులు, శ్రీ ప్రహ్లాద భక్తిశక్తిని ప్రచారమొనర్చిన కరుణామూర్తులు, విమలోర్ధ్వ పుండ్రనామధారులై సర్వమతసమత్వదృష్టితో వేదవిజ్ఞాన రహస్యములను స్వానుభవముల సమ్మేళనముతో భక్తిగల శిష్యులకు ముముక్షువులకు ప్రబోధమొనర్చి సర్వసంశయ రహితులనొనర్చి ముక్తిని చేకూర్చెడి దేశికేంద్రులు, ప్రకాశముజిల్లా మార్కాపురమునకు మైలున్నర దూరమునందు వెలుగొందెడి శ్రీ కపిలగిరి సన్నిధిలో దివ్యతపోయోగ సమాధినిపొంది నమ్మి భజించెడి శిష్యభక్త సేవక జనుల నెందరినో రక్షించుచు జ్యోతిశక్తి జ్ఞానస్వరూపులై సర్వకాలములందు వెలిగెడి శ్రీ శ్రీ శ్రీ సద్గురు **యోగానంద** నరసింహస్వామివారి దివ్యావ్యయ భవ్యనవ్య కరుణాశక్తి ప్రసార ప్రసాదమహిమాబలముతో తెలిసిన పెద్దలను బంధువులను మిత్రులను వివిధ స్థలములందు శ్రీహరికథా గానములకు వెళ్ళిన సుసమయములందు సమాగమమైన సజ్జనమూర్తులను, గ్రంథముద్రణవ్యయమునకై విరాళములనుకోరి రచనమును చదివి విన్పించగ విని యానందించి భక్తితో త్యాగహృదయులై లోకోపకార దృష్టితో విరాళములను గ్రంథకర్తకు సమర్పించిన భక్తమూర్తుల పూర్తి **వివరములు.**

ఇట్లు

కోట సుబ్బరాయ గుప్తా

భాగవతార్

# మహారాజపోషకులు

పేరునకు ముందు "శ్రీ" అనియు చివర "గారు" అనియు చదువుకొన ప్రార్థన.

గుంటూరుజిల్లా నర్సరావుపేట తాలూకా అలవాల గ్రామ వాస్తవ్యులు, శ్రీ కాకుమాను వేంకటకోటయ్య వీరి ధర్మపత్ని వేంకటసుబ్బమ్మగార్ల కుమారుడు శ్రీ డాక్టర్ హనుమంతురావు గుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి రామలక్ష్మమ్మగార్లు — రు 116-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ చేవూరి కోటయ్య వీరి ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగార్ల యేకైక పుత్రుడు, "యలక్ట్రికల్ అసిస్టెంట్ యింజనీర్" రాధాకృష్ణ గుప్తాగారు వీరి ధర్మపత్ని శ్రీమతి పద్మావతిగార్ల వివాహ శుభసమయ సందర్భమున — రు 116-00

గుంటూరుజిల్లా వినుకొండ వాస్తవ్యులు శ్రీ కోట కోటయ్య వీరి ధర్మపత్ని శ్రీమతి కోటమ్మగార్ల యేకైక పుత్రుడు, శ్రీ సత్యనారాణగుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి రోశెమ్మగార్లు — రు 116-00

వినుకొండ తాలూకా కొచ్చర్లగ్రామ వాస్తవ్యులు శ్రీ కారంశెట్టి త్రిపురయ్య వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటరత్నమ్మగార్ల కుమారులు శ్రీ వేంకట హరిగోపాలకృష్ణమూర్తి, వేంకటహర రాధాకృష్ణ మూర్తిగుప్తా గార్లు — రు 116-00

ఈపూరు తాలూకా ఆరేపల్లి ముప్పాళ వాస్తవ్యులు శ్రీ పొత్తూరి వీర రాఘవయ్య వీరి ధర్మపత్ని శ్రీమతి అన్నపూర్ణమ్మగార్ల కుమారులు శ్రీ వేంకట వీరరాఘవయ్య, వేంకటేశ్వర్లు, పూర్ణచంద్రరావు గుప్తాగార్లు — రు 116-00

పేరునకు ముందు "శ్రీ" అనియు చివర "గారు" అనియు చదువుకొన ప్రార్థన

నర్సారావుపేట తాలూకా కుంకలగుంట వాస్తవ్యులు శ్రీ అర్వపల్లి వేంకటశేషాద్రి వీరి ధర్మపత్ని వెంకమ్మగార్ల జ్ఞాపకార్థము, వీరి యేకైక పుత్రుడు శ్రీ వేంకటసత్యనారాయణగుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటరమణ సుశీలాదేవిగార్లు రు 116-00

గుంటూరుజిల్లా నరసరావుపేట వాస్తవ్యులు శ్రీయేలూరి నరసింహయ్యా వీరి ధర్మపత్ని శ్రీమతి మహాలక్ష్మమ్మగార్ల కుమారులు శ్రీ కోటేశ్వరరావు, సూర్యప్రకాశరావు, గురవయ్యా, హనుమంతురావు గుప్తాగార్లు రు 116-00

నరసరావుపేట వాస్తవ్యులు శ్రీకూనిశెట్టి లక్షుమయ్యా వీరి ధర్మపత్ని కోటమ్మగార్ల దత్తుకుమారుడు శ్రీ శివలక్ష్మణమహానంది గుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటసుబ్బమ్మగార్లు రు 116-00

విజయవాడ వాస్తవ్యులు శ్రీ కనమర్లపూడి రోశయ్యా వీరి ధర్మపత్ని శ్రీ పేరమ్మగార్ల కుమారుడు శ్రీ సత్యనారాయణగుప్తా వీరిధర్మపత్ని శ్రీమతి బాలరత్నమ్మగార్లు రు 116-00

విజయవాడ వాస్తవ్యులు శ్రీ పొట్టి వేంకటసుబ్బారావు వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటరత్నమ్మగార్ల కుమారులు శ్రీ వేంకటనాగేశ్వరరావు, శ్రీనివాసరావు, కృష్ణకిశోర్ గుప్తాగార్లు రు 116-00

విజయవాడ వాస్తవ్యులు శ్రీపులిపాటి గురునాథము వీరి ధర్మపత్ని శ్రీమతినారాయణమ్మగార్ల కుమారులు

శ్రీ సుబ్బారావు, చిన్న సుబ్బారావు గుప్తాగార్లు
(శ్రీ జయలక్ష్మి స్టేషనరీ మార్టు) రు 116-00

గుంటూరుజిల్లా నరసరావుపేట వాస్తవ్యులు శ్రీ కాకు
మాను రామేశ్వరము వీరిధర్మపత్ని ధనలక్ష్మమ్మ
గార్ల కుమారులు శ్రీరామమూర్తి శ్రీనివాసరావు
గుప్తాగార్లు రు 116-00

గుంటూరుజిల్లా చిలుకలూరిపేట వాస్తవ్యులు
శ్రీ రావిక్రింది వేంకటచలము వీరి ధర్మపత్ని
శ్రీ బాపమ్మగార్ల కుమారులు శ్రీ అప్పయ్య
ఆంజనేయులు శ్రేష్ఠిగార్లు రు 116-00

చిలుకలూరిపేట వాస్తవ్యులు శ్రీ సామారంగయ్య వీరి
ధర్మపత్ని శ్రీ కోటిరత్నమ్మగార్ల కుమారుడు
శ్రీ మల్లిఖార్జునరావుగుప్తా వీరి ధర్మపత్ని
శ్రీమతి సంపూర్ణమ్మగార్లు రు 116-00

గుంటూరుజిల్లా వినుకొండ వాస్తవ్యులు శ్రీ సన్నిధి
వేంకటప్పయ్య వీరి ధర్మపత్ని శ్రీఈశ్వరమ్మగార్ల
కుమారుడు ఆధ్యాత్మిక చింతనాపరులు
శ్రీ వేంకటశేషగిరిరావు శ్రేష్ఠి రు 116-00

(శ్రీసాయిబాబా భక్త సమాజము ప్రసిడెంట్) విను
కొండ వాస్తవ్యులు శ్రీ దేవకి రామారావు గుప్త
వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మగార్ల
కుమారులు శ్రీవేంకటరామ శంకరరావు. బాబాజీ
రావు గుప్తాగార్లు రు 116-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ శేగు వెంకటస్వామి వీరి
ధర్మపత్ని ఈశ్వరమ్మగార్ల కుమారుడు నరసింహా

రావు గుప్త వీరి ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మ గార్లు రు 116-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ నూతికట్టు రామయ్య వీరి ధర్మపత్ని గురమ్మ కుమారుడు ఆంజనేయులు శ్రేష్ఠి వీరి ధర్మపత్ని శ్రీమతి హనుమాయమ్మ రు 116-00

(గోసంరక్షకులు)గుంటూరుజిల్లా సత్తెనపల్లి వాస్తవ్యులు శ్రీ దేవరశెట్టి కోటయ్య వీరి ధర్మపత్ని వేంకట రామమ్మ వేంకటసుబ్బారావుగుప్త సర్పంచ్) వీరి ధర్మపత్ని శ్రీమతి ధనలక్ష్మమ్మ రు 116-00

గుంటూరుజిల్లా గురజాల తాలూక కారంపూడి వాస్తవ్యులు గజవెల్లి పుల్లయ్య వీరి ధర్మపత్ని కోటమ్మగార్ల కుమారుడు రామయ్య శ్రేష్ఠి వీరి ధర్మపత్ని శ్రీమతి మల్లమ్మ రు 116 00

విశ్వకల్యాణ రాజరాజేశ్వరి సేవారాధన సమాజం శ్రీ రాజరాజేశ్వరీ దివ్యవాణి (పీఠస్థానం) శ్రీదేవి ఉపాసకులు-విజయశ్రీ కాళిదాస్ రాజయోగీంద్ర శ్రీ రామపురం, భీమవరం (534 202) రు 116-00

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా పెదపారుపూడి వాస్తవ్యులు కోనా శోభనాద్రి కుమారుడు రామాంజయ్య శ్రేష్ఠి వీరి భార్య కనకమ్మగార్ల కుమారులు శోభనాద్రి,రాధాకృష్ణమూర్తి,విఠల్ రావు గుప్తాగార్లు (శ్రీరాధాకృష్ణలైటింగ్ అండ్ సౌండ్ సర్వీస్) కొత్తపేట—తెనాలి రు 116-00

# రాజపోషకులు

పేరునకు ముందు "శ్రీ" అనియు చివర "గారు" అనియు చదువకొన ప్రార్థన.

వినుకొండ వాస్తవ్యులు పోటుపోతుల వెంకటస్వామి వీరి సతీమణి లక్ష్మమ్మగార్ల వెంకటేశ్వర్లు శ్రేష్ఠి (ఆర్యవైశ్య సంఘాధ్యక్షులు) వీరి సతీమణి శ్రీమతి లక్ష్మమ్మగార్లు — రు 58-00

గుంటూరుజిల్లా వినుకొండ వాస్తవ్యులు గోనుగుంట్ల రామనాధముభార్య శ్రీమతి లక్ష్మీకాంతమ్మగార్ల కుమార్లు హనుమంతురావు, వేంకటగురునాధ రావు, మల్లికార్జునరావు, తులసిబాబు, నరేంద్రబాబు గుప్తాగార్లు — రు 58-00

గుంటూరుజిల్లా వినుకొండ వాస్తవ్యులు, శ్రీభవనాశి హనుమయ్యా వీరి ధర్మపత్ని వేంకటకోటమ్మగార్ల పుత్రుడు, శ్రీ నరసయ్యగుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటరత్నమ్మ గార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ ఖజ్జాయము గురునాధము వీరి ధర్మపత్ని శ్రీమతి పుల్లమ్మగార్ల పుత్రుడు, పాండురంగారావు గుప్తాగారు వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటసుబ్బమ్మగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ దోగిపర్తి నరసింహము వీరి ధర్మపత్ని వేంకమ్మ దత్తు కుమారుడు శ్రీరామమూర్తి గుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మమ్మగార్లు — రు 58-00

పేరునకు ముందు "శ్రీ" అనియు చివర "గారు" అనియు చదువకొన ప్రార్థన.

వినుకొండ వాస్తవ్యులు శ్రీ సనిశెట్టి చిన్నకోటయ్య వీరి ధర్మపత్ని శ్రీమతి కోటమ్మగార్ల కుమారులు శ్రీపూర్ణచంద్రరావుగుప్తా వీరి సతీమణి శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ ఖజ్జాయము గురునాథము వీరి ధర్మపత్ని పుల్లమ్మగార్ల కుమారుడు చిన్న వేంకటేశ్వర్లు గుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ కొత్తమాసు గాలెయ్య వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటసుబ్బమ్మగార్ల కుమారులు శ్రీ రామయ్యగుప్తా శ్రీమతి అనసూయమ్మగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ నల్లూరి సత్యనారాయణ వీరి ధర్మపత్ని వేంకటసుబ్బాయమ్మ గార్ల కుమారులు శ్రీ లక్ష్మణప్రసాదరావు, శ్రీకృష్ణాంజనేయులు గుప్తాగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు అర్వపల్లి చిన్న నాసరయ్య వీరిసతీమణి శేషమ్మగార్ల, పుత్రుడు వేంకటనరసింహారావుగుప్తా వీరి సతీమణి రమాదేవిగార్లు — రు 58-00

వినుకొండ తాలూకా (కొత్తజడ్డావారి పాలెము శ్రీ గురునాథాశ్రమ ధర్మకర్తలు) శ్రీ పువ్వాడ పెద్ద గురవయ్య వీరి సతీమణి సుబ్బమాంబ గార్ల కుమారుడు శ్రీ వేంకటేశ్వర్లు గుప్తాగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ పొత్తూరు వేంకటసుబ్బయ్య
వీరి ధర్మపత్ని వేంకటసుబ్బమ్మ గార్ల కుమారుడు
వేంకటేశ్వర్లు శ్రేష్ఠి వీరి ధర్మపత్ని శ్రీమతి అన
సూయమ్మగార్లు (వెండి, బంగారు వ్యాపారము) రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ యక్కల వేంకటేశ్వరసుబ్బా
రావు వీరి ధర్మపత్ని మహాలక్ష్మగార్ల కుమారులు
శివన్నారాయణ, వేంకటసుబ్బారావు, రామ
మోహనరావు పూర్ణచంద్రరావు గుప్తాగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ మురారిశెట్టి అప్పయ్య వీరి
సతీమణి శ్రీ హనుమాయమ్మగార్ల పుత్రుడు
పుల్లారావుగుప్తా వీరి సతీమణి శ్రీమతి సత్యవతి
గార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు రెడ్డి లక్ష్మీనారాయణ వీరి
ధర్మపత్ని అన్నపూర్ణమ్మగార్ల పుత్రుడు
గురవయ్యగుప్తా వీరి ధర్మపత్ని శ్రీమతి
వెంకటరమణేశ్వరిగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు కొల్లిపర నరసింహాము వీరి
ధర్మపత్ని శ్రీమతి పేరంటాలమ్మగార్ల పుత్రుడు
రామారావుగుప్తా వీరి సతీమణి శ్రీమతి కోటి
రత్నమ్మగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ సన్నిధి వేంకటరత్నము వీరి
ధర్మపత్ని శాయమ్మగార్ల కుమారుడు వేంకట
సుబ్బారావుగుప్తా వీరి ధర్మపత్ని శ్రీ మతి
పద్మావతిగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ మాఘం అంకాళీయ్యగారు వీరి ధర్మపత్ని శ్రీలక్ష్మీదేవమ్మగార్ల కుమారుడు శ్రీ కోటయ్యగారు వీరి ధర్మపత్ని శ్రీమతి చుక్కమ్మగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ దేవరశెట్టి వేంకయ్యశ్రేష్ఠి గారు వీరి ధర్మపత్ని సుబ్బమ్మగార్ల కుమారుడు శ్రీ నాసరయ్యశ్రేష్ఠిగారు వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకట రత్నమ్మగార్లు రు 58 00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ తాతా కోటయ్యగుప్తాగారు వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీదేవమ్మగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ మారం హనుమయ్యశ్రేష్ఠి గారు వీరి ధర్మపత్ని లక్ష్మమ్మగార్ల కుమారుడు శ్రీ వేంకటేశ్వర్లుగుప్తాగారు వీరి ధర్మపత్ని శ్రీమతి రామలక్ష్మమ్మ గార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ కొల్లిపర వేంకటసుబ్బారావు శ్రేష్ఠిగారు వీరి ధర్మపత్ని సీతారామమ్మ గార్ల కుమారులు శ్రీ రాధకృష్ణమూర్తి, ప్రకాశరావు గుప్తాగార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ చీదెళ్ళ సుబ్బరామయ్య శ్రేష్ఠిగారు వీరి ధర్మపత్ని జానకమ్మ గార్ల కుమారుడు శ్రీ హనుమంతరావు గుప్తాగారు వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటసీతాలక్ష్మమ్మ గార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ మాదాల సత్యనారాయణ శ్రేష్టిగారు వీరి ధర్మపత్ని శ్రీమతి మన్నె రత్నమ్మ గార్లు రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ మాలేపాటి చెంచయ్య శ్రేష్టి గారు వీరి ధర్మపత్ని వేంకటసుబ్బమ్మ గార్ల కుమారుడు శ్రీ వేంకటసుబ్బయ్య శ్రేష్టిగారు వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మమ్మ గార్లు — రు 58 00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ సన్నిధి వేంకటనారాయణ శ్రేష్టిగారు వీరి ధర్మపత్ని శ్రీ వేంకట మహాలక్ష్మమ్మ గార్ల కుమారులు శ్రీ పెద్ద వేంకట సుబ్బారావు, చిన్న వేంకటసుబ్బారావు గుప్తా గార్లు — రు 58 00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ సన్నిధి వేంకటనారాయణ శ్రేష్టిగారు వీరి ధర్మపత్ని శ్రీ వేంకటమహాలక్ష్మమ్మ గార్ల కుమారులు శ్రీ పెద్ద వేంకటసుబ్బారావు, చిన్న వేంకటసుబ్బారావు గుప్తాగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ సన్నిధి వేంకటరత్నము గారి జ్ఞాపకార్థము వీరిధర్మపత్ని సుబ్బరత్నమ్మ కుమారుడు శ్రీ వేంకటేశ్వరావు గుప్తగార్లు వీరి ధర్మపత్ని శ్రీమతి కుసుమాంబగార్లు — రు 58–00

వినుకొండ వాస్తవ్యులు శ్రీ చందలూరు పెద్ద వెలుగొండయ్య శ్రేష్టిగారు వీరి ధర్మపత్ని రామలక్ష్మమ్మగార్ల కుమారుడు శ్రీ వెంకట గురునాథముగుప్తాగారు వీరి ధర్మపత్ని శ్రీమతి జయలక్ష్మమ్మగార్లు — రు 58-00

వినుకొండ వాస్తవ్యులు శ్రీచలవాది నరసింహము శ్రేష్టి గారు వీరి ధర్మపత్ని మహాలక్ష్మమ్మ గార్ల కుమారుడు శ్రీ నాగేశ్వరరావు గుప్తాగారు వీరి

